# తులసీ రామాయణం

అరణ్య, కిష్కింధ, సుందర లంకా కాండము (యుద్ధ)

ఉత్తర, (లవకుశ) కాండములు




## శ్రీ బోడాల రామకోటయ్య

ఎం.ఎ(హిందీ) ఎం.ఎ. (తెలుగు)



## క్వాలిటీ పబ్లిషర్స్

రామమందిరం వీధి. విజయవాడ 2

క్వాలిటీ ప్రచురణ
ప్రథమ ముద్రణ
ఏప్రియల్-95
వెల : 75-00

రచన
శ్రీ బోడాల రామకోటయ్య,
రిటైర్డ్ లెక్చరర్
గోపాలస్వామి గుడి వద్ద,
కారంచేడు,
ప్రకాశం జిల్లా.

ముద్రణ :
రామా ప్రింటింగ్ ప్రెస్,
వెరుకువల్లివారి వీధి,
విజయవాడ-2.



# అంకితం

మహా భక్తుడు, మహాకవి,

శ్రీ తులసీ దాసు గోస్వామికి,

# మా ఇతర రచనలు

1 అంతరార్థ రామాయణం. వేదుల సూర్యనారాయణశర్మ 45-00

2. అంతరార్థ భారతం ” 50-00

3. అంతరార్థ భాగవతం ” 50-00

4. అంతరార్థ శ్రీదేవీ భాగవతం ” 30-00

5. ముక్తికి మెట్లు ” 25-00

6. శ్రీ భగవద్గీత శ్రీవెంపటి లక్ష్మీనారాయణశాస్త్రి 15-00

7. సూక్తులు హితోక్తులు 1 to 3 భాగాలు 86-00

శ్రీ కప్పగంతుల మురళీకృష్ణ

8. మహా పురుషులు 1 to 4 ” 27-00

(75 మంది ప్రసిద్ధుల జీవిత చరిత్రలు)

9. ప్రతిభావంతులు 1 t, 12 భాగాలు ” 71-00

(225 మంది జీవిత చరిత్రలు)

10. ప్రళయం ” 15-00

# తులసీ రామాయణము-2 వభాగం

# అరణ్యకాండము-మంగళాచరణం

ధర్మరూపమైన వృక్షానికి వేరులాంటివాడు, వివేకరూపమైన సముద్రానికి ఆనందం కలిగించే పూర్ణచంద్రునిలాంటివాడు, వైరాగ్య రూపమైన కమలాన్ని వికసింపజేసే సూర్యునిలాంటివాడు, పాపరూప మైన అంధకారాన్ని పోగొట్టేవాడు, మోహరూపాలైన మేఘాలసమూ హాన్ని చెల్లాచెదరుచేసే నియమంతో ఆకాశంనుండి పుట్టుకవచ్చిన గాలి లాంటివాడు, బ్రహ్మస్వరూపుడు, కల్మషాలను దూరంచేసేవాడు, రామచంద్రునకు ప్రియతము డయిన శంకరునకు (తులసీదాసు) నేను నమస్కరిస్తున్నాను.

ఆనందరూపుడు, జలంతో కూడియున్న మేఘాలతో సమాన మైన అందంగల శ్యామవర్ణుడు అందమైన పీతాంబరాలను ధరించిన వాడు, చేతులలో ధనస్సు, బాణాలు కలిగియున్నవాడు, నడుముకు అంబులపొదిని కట్టుకొని వున్నవాడు, నీలకమలాల్లాంటి నేత్రాలవాడు, తలమీద జటాజూటాలతో వెలిగిపోతున్నవాడు, సీతాలక్ష్మణులతో కలసి వెళ్తూ, మార్గంలో వున్న ప్రజలకు పరమానందాన్ని కలిగించే వాడు, అయిన శ్రీరామచంద్రుని నేను భక్తితో పూజిస్తున్నాను.

"పార్వతీ! శ్రీరామచంద్రుని గుణాలు అంతుతెలిసేవికావు. ఆయన గుణాలను విన్నమునులందరు వైరాగ్యం పొందుతుంటే భగ వానునకు వ్యతిరేకులయినవారు, ధర్మమునందు ప్రేమలేనివారు

అయిన మూర్ఖులు మోహంలో పడిపోతున్నారు.

నేను నా శక్తి మేరకు భరతునిలో, పురప్రజలలో వున్న విలక్షణమైన ప్రేమను గానం చేశాను. ఒకసారి శ్రీరామచంద్రుడు చక్కని పూలను ఏరి, తన చేతులతో పుష్పాలను భూషణాలుగా ఏర్పరచి, స్ఫటికశిలమీద కూర్చున్న సీతను ప్రభువు ఆదరంగా అలంకరించాడు. దేవతలకు ప్రభువైన ఇంద్రుని మూర్ఖపుత్రుడు, కాకిరూపం దాల్చి, రఘునాథుని బలాన్ని పరీక్షించాలని అనుకున్నాడు. ఇతను అనుకున్నపని, బుద్ధిలేని చీమ సముద్రపు లోతును పరీక్షించాలనుకున్నట్లుగా వుంది.

ఆ మూర్ఖమైన కాకి, బుద్ధిలేనిదయినందున, సీతపాదాలను ముక్కుతో పొడచి పారిపోయింది. శ్రీరాముడు, రక్తం కారుతున్నట్లు చూచి, ధనసుమీద, ఈనె బాణాన్ని ఎక్కుపెట్టాడు.

శ్రీరామచంద్రుడు చాలా దయగలవాడు, ఆయనకు ఎల్లప్పుడు దీనులయందు ప్రేమ వుంటుంది. అలాంటి ఆయనను కూడా చెడ్డ గుణాలన్నింటికి నెలవైన జయంతుడు చేసిన పనికి ఆగ్రహం వచ్చింది.

మంత్రంతో ప్రేరేపించబడిన ఆ బ్రహ్మబాణం రివ్వున వెళ్ళింది. కాకి భయపడి పారిపోయింది. ఆ తరువాత అది తన అసలు రూపం మార్చుకొని, తన తండ్రి ఇంద్రుని వద్దకు వెళ్ళింది. కాని శ్రీరామునకు వ్యతిరేకి అయిన అతనిని తన దగ్గర ఉండనివ్వలేదు.

అతను నిరాశపడ్డాడు. చక్రాన్ని చూచిన దుర్వాసమహామునికి భయమేసినట్లుగా, అతనికి ఎంతో భయమేసింది. అతను బ్రహ్మలోకం శివలోకం మొదలైన లోకాలలో తిరిగి అలసిపోతూ భయదుఃఖాలతో పరుగులుతీస్తూ తిరుగుతున్నాడు. అతన్ని కూచోమని కూడా ఎవ్వరూ అనలేదు. శ్రీరామచంద్రుని శత్రువును ఎవరు దగ్గరకు రానిస్తారు?

గరుత్మంతుడా! విను, రామునకు ద్రోహం చేసినవానికి తల్లిపాపుతో సమానంగాను, తండ్రియమునిలాగా, అమృతం విషంలాగా అయిపో తాయి. అతని మిత్రులు కూడా అతనిని శత్రువుల్లాగా చూస్తుంటారు. గంగానది అతనికి వైతరణీనదితో సమానమైపోతుంది. సోదరా! శ్రీరామునకు వ్యతిరేకి అయిన వానికి ఈ జగత్తు అగ్నికంటె ఎక్కువ వేడిగా వుంటుంది.

జయంతుడు అమిత భీతితో వ్యాకులంగా ఉండటం నార దుడు చూచాడు. ఆయనకెంతో దయకలిగింది. భక్తుల మనస్సులు ఎప్పుడూ సున్నితంగా వుంటాయి. ఆయన అతనిని వెంటనే శ్రీరామ చంద్రుని వద్దకు పంపాడు. అతను కేకలువేస్తూ— "శరణాగతులను కాపాడు శ్రీరామచంద్రా! నన్ను రక్షించు" అంటూ శ్రీరామచంద్రుని కాళ్ళుపట్టుకొని— "దయగల రఘునాథా! రక్షించు, రక్షించు. నేను బుద్ధిలేనివాడనయి మీ అంతుతెలియని బలాన్ని, మహిమను తెలిసి కోలేక పోయాను. నేను చేసుకున్న కర్మకు ఫలితాన్ని పొందాను. ఇప్పుడు, ప్రభూ! నన్ను రక్షించండి. నేను అలసిపోయి నీశరణు జొచ్చాను" అన్నాడు.

అంతట! అతి దీనమైన అతని పలుకులు విని దయగల ప్రభువు ఒక కన్నును పోగొట్టి వదిలేశాడు. అతను మోహవశాన ద్రోహం చేశాడు, అందుకు అతనిని వధించవలసివుంది. అయినా ప్రభువుదయతో వదలి వేశాడు. శ్రీరామునితో సమానమైన కృపాళువుఎవరుంటారు?

శ్రీరాముడు చిత్రకూటంలో నివసించి చెవులకు అమృత సమా నంగా వుండే అనేక చరిత్రలను వినిపించాడు. అక్కడ చాలామంది పోగవుతున్నారు. అందువలన మునులందరి వద్ద అనుమతి తీసికొని సీతా సహితంగా ఇద్దరన్నదమ్ములు ముందుకు సాగారు. ప్రభువు అత్రి ముని ఆశ్రమానికి వచ్చాడనగానే అత్రిముని లేచి ఎదురు

వచ్చాడు. ఆయనను చూచి శ్రీరామచంద్రుడు కూడా తొందరగా ముందు కొచ్చాడు. ముని నమస్కారం చేస్తూ రాముని కౌగలించు కుని, ఇద్దరన్నదమ్ములను తన కన్నీళ్ళతో స్నానం చేయించాడు. శ్రీరాముని అందాన్ని చూచి అత్రి నేత్రాలు సంతసించాయి. ఆయన ఆదరంగా వారిని తన ఆశ్రమంలోకి తీసుకొచ్చి, మధుర వచనాలు పలికి, మనస్సుకు నచ్చిన పండ్లు, పూలు ఇచ్చాడు. ఆసనం మీాద కూచున్న ప్రభు శ్రీరామచంద్రుని అందాన్ని చూచి పరమ ప్రవీణుడు ముని శ్రేష్ఠుడయిన అత్రి చేతులు జోడించి స్తుతించాడు.

"భక్త వత్సలా! కృపాళూ! కోమలస్వభావా! నేను మీకు నమస్కరిస్తున్నాను. ఏ కోరికలు లేని వారికి మీావద్ద స్థానమిస్తావు. మీాపాద కమలాలను నేను పూజిస్తున్నాను, మీారు ఎంతో అంద మైనవారు, మీాది శ్యామవర్ణం, సంసార రూపమైన సముద్రాన్ని చిలుకు మందరాచల రూపం మీాది వికసించిన కమలాలతో సమాన మైన, విశాలమైన కండ్లుమీావి మీారు మదము మొదలైన దోషాల నుండి ఒడ్డున వేసేవారు.

మీా విశాలమైన భుజాల పరాక్రమం, ఐశ్వర్యం అంతులేనిది. స్వామీ! మీారు అంబులపొది, ధనస్సు, బాణాలు ధరించి మూడు లోకాలకు అధిపతులు. సూర్యవంశ శిరోమణీ! మహాదేవుని ధనస్సును త్రుంచి, మునిజనుల, భక్తుల మనస్సులను సంతోష పెట్టినవారు.

మీారు మహాదేవునిద్వారా వందనాలందుకుంటున్నారు. బ్రహ్మ మొదలైన దేవతల ద్వారా సేవలు పొందుతున్నారు. మీారు పరిశుద్ధ జ్ఞానస్వరూపులు, దోషాల్నంటిని పోగొట్టేవారు. లక్ష్మీపతీ! సుఖాలనిధీ! సత్పురుషులకు ఒకే ఒక ఆధారమైన మీాకు నమస్కరి స్తున్నాను. ఇంద్రుని తమ్ముడవైన వామనా! స్వరూపాశక్తి జానకిని, సోదరుడైన లక్ష్మణునితో మిమ్ము ధ్యానిస్తున్నాను.

ఈర్ష్యలు వదలి మీ పాదాలను పూజించినవారు, సంసార సాగరంలో పడిపోరు. ఏకాంతంగా వుండి, తన మోక్షం కొరకు మిమ్మే పూజించినవారు మిమ్ము తప్పక పొందుతారు.

మీరు అద్వితీయులు, అద్భుతస్వరూపులు, సమర్థులు, కోరికలు లేనివారు, ఈశ్వరులు, అంతటా వ్యాపించి ఉన్నవారు, జగద్గురువులు, సనాతనులు, తురీయావస్థులు, మీరుతప్ప మరొకరెవ్వరూ లేరు.

యోగ భ్రష్టులకు మీ భావాలు తలకెక్కవు, భక్తులకు మీరు కల్పవృక్షంతో సమానులు, సుఖంగా సేవచేయడానికి తగిన వారు, అలాంటి వారి పూజలు ఎల్లప్పుడు నేను చేస్తాను.

సాటిలేని రూపంగల రాజా! జానకీనాథా! నేను మీకు నమస్కరిస్తున్నాను, నాయందు దయచూపండి, నాకు మీపాద కమలాల యందు భక్తి ఉండునట్లు చెయ్యి. ఈస్తుతిని ఆదరంగా చదివే మానవులు, మీభక్తిలోమునిగి మీపాదాలను పొందగలుగుతారనడంలో సందేహం లేదు" అని స్తుతిస్తూ తలవంచి అత్రిముని చేతులు జోడించి "నాథా! నాబుద్ధి, మీపాదకమలాలను ఎన్నడూ వదలకుండా ఉండుగాక" అన్నాడు.

సీత, పరమ శీలవతిఅయిన అత్రిముని భార్య అనసూయాదేవి పాదాలను తాకింది. ఋషిభార్య మనస్సు ఎంతో ఆనందించింది. ఆమె ఆశీర్వదించి, సీతను దగ్గర కూచోబెట్టుకొని, దివ్యమైన వస్త్రాలు భూషణాలు ధరింపజేసి, అందంగా ఉంచింది. తరువాత ఋషి భార్య, సాధు భాషలో, స్త్రీ ధర్మాలను చెప్పింది.

"రాకుమారీ! విను, తల్లి, దండ్రి, సోదరులందరు మేలును కోరేవారైనప్పటికీ, వారు కొంతకాలం వరకే సుఖపెట్టగల్గుతారు, భర్త అపారమైన సుఖాన్ని కలిగిస్తాడు; పతిసేవ స్త్రీకి పరమావధి

ధైర్యం, ధర్మం, మిత్రుల, స్త్రీల విషయం కష్టకాలంలో తెలుస్తవి. ముసలివాడైనా, రోగి, మూర్ఖుడు, సంపదలేమీలేనివాడు; గ్రుడ్డివాడు, చెవిటివాడు, కోపిష్ఠి, దుఃఖితుడు, మరే విధమైనవాడైనా కూడా భర్తను అవమానించిన భార్య యమలోకంలో బాధలు పడుతుంది. మనసా, వాచా, కర్మణా, భర్త పాదాలయందు ప్రేమ వుంచడమే, స్త్రీ ధర్మం, వ్రతం, నియమం అయివుండాలి.

ప్రపంచంలో పతివ్రతలు నాలుగు విధాల వారున్నారు, ఉత్తమురాలైన పతివ్రత, స్వప్నంలో కూడా ప్రపంచంలో భర్త తప్ప మరొక పురుషుడు లేడనుకుంటుంది, మధ్యతరగతి పతివ్రత ఇతర పురుషులను తన సోదరుల, తండ్రుల, పుత్రుల్లాగా చూచుకుంటుంది. ఆమె ధర్మాన్ని వదలకుండా, తన కులమర్యాదలను తెలిసికొని, అంటీ అంటకుండా, పతివ్రత ధర్మంయందు స్థిరంగా వుంటుంది. అటువంటి వారిని వేదాలు, శ్రేష్ఠమైన పతివ్రతలంటున్నాయి.

సమయం కలసిరాకనో, భయంతోనో ధర్మాన్ని అంటిపెట్టుకునే స్త్రీలను అధములు అనుకోవాలి, భర్తను మోసపుచ్చి, ఇతరులతో పొందుకలిపిన స్త్రీలు వంద కల్పాలవరకు రౌరవనరకంలో పడిపోతారు.

క్షణం సుఖంకొరకు, వందకోట్ల జనాలదుఃఖాలను అనుభవించే స్త్రీలు, తెలివిలేని దుష్టులుకాక ఏమవుతారు? మోసాలను వదలి పతివ్రతా ధర్మం మీద స్థిరంగా ఉండే స్త్రీలకు ఏశ్రమా లేకుండా ముక్తి లభిస్తుంది. భర్తకు వ్యతిరేకంగా నడచుకునే స్త్రీలు చిన్నతనంలోనే ముండమోపులవుతారు.

స్త్రీ పుట్టుకతోనే అపవిత్రురాలు, కాని భర్త సేవలుచేసినందున ఆమె ఉత్తమస్థితి నందుకొంటుంది. ఇప్పటికీ ఎప్పటికీ

గూడా "తులసి భగవంతునకు చాలా యిష్టం, అని వేదాలు దానిని కీర్తిస్తున్నాయి.

జానకీ! విను, నీ నామాన్ని స్మరించి, స్త్రీలుపతివ్రతా ధర్మాన్ని పాటిస్తారు. నీవు శ్రీరామచంద్రునకు ప్రాణంతో సమానమైన దానవు నేను నీకీ కథ ప్రపంచం సుఖసంతోషాలతో ఉండాలని చెప్పాను."

జానకి ఈ మాటలను విని ఎంతో ఆనందించి, ఆదరంగా ఆమె పాదాలకు నమస్కరించింది. అప్పుడు కృపానిధి శ్రీరాముడు మునితో-"మీరు ఆజ్ఞ ఇస్తే మరొక వనానికి వెళ్తాం. నా మీద ఎల్లప్పుడు దయవుంచండి. మీ సేవకునిగా తలంచి నా మీదనున్న ప్రేమను వదలకండి" అన్నాడు.

ధర్మం తప్పని ప్రభువు పలుకులు విని, జ్ఞాని ముని ప్రేమతో "దేవతలందరిని కాదని, మిమ్ము భజించిన లక్ష్మి యొక్క తెలివితేటలను నేనిప్పుడు అర్థం చేసికొన్నాను. మీ కంటే మించిన గొప్పవాడు మరొకడెవ్వడూ లేడు. అలాంటి మీరు మంచి శీలవంతులుగాక మరేమవుతారు? మీ శీలమే మిమ్ము మంచివానిగా మలుస్తుంది. బ్రహ్మ. శివ, సనకాదులు మోక్షాన్ని కోరువారందరు మీ దయను కోరుకుంటున్నారు. రామా! మీరు దీనబంధువులు, కోర్కెలులేని భక్తులకు ప్రియులు. అందుచేతనే ఇంత వినయంగా, సున్నితంగా మాట్లాడుతున్నారు.

స్వామీ! మీరు వెళ్ళండని నేనెలా చెప్పేది? మీరు అంతటా నిండియున్నవారుగనుక మీరే చెప్పండి" అని ప్రభువు వైపుచూచాడు నేత్రాల వెంట కన్నీళ్ళు కారుతూ ఉన్నాయి. శరీరం పులకితమైవుంది,

"మనస్సుకు, బుద్ధికి, గుణాలకు, ఇంద్రియాలకు కూడా అందని ప్రభుదర్శనం నాకీనాడు లభించింది. నా జప, తపాలు సఫలమైనాయి. జపాలవలన, యోగ, ధర్మాలవలన మానవుడు భక్తుడవగల్గుతాడు."

అని ముని మనస్సులో అనుకున్నాడు. శ్రీరాముని పవిత్ర చరిత్రను తులసీదాసు రాత్రింబవళ్ళు గానం చేస్తూనేవున్నాడు.

శ్రీరాముని చక్కని కీర్తి చరిత్ర కలియుగ పాపాలన్నింటిని నాశనం చేస్తుంది; మనస్సును అదుపులో పెడ్తుంది, సుఖాలకు మూలము. దీనిని ఆదరంతో విన్నవారి మీద శ్రీరామచంద్రుడు యిష్టంగా వుంటాడు.

ఈ కఠిన కలికాలం పాపాలకుప్పలతో నిండివుంది. దీనిలో ధర్మం, జ్ఞానం, యోగం, జపాలు లేవు. అందువలన, ఇతర అండ అను వదలి, శ్రీరాముని అండచేరిన వారు చాలా తెలివిగలవారు.

అత్రిమునికి తలవంచి, దేవతలు, మానవులు, మునులస్వామి శ్రీరామచంద్రుడు వనానికి వెళ్ళారు. ముందురాముడు, వెనుకలక్ష్మణుడు, ఇద్దరూ శ్రేష్ఠమైన మునుల వేషంలో అతి సుందరంగా వున్నారు. ఇద్దరి మధ్యసీత, బ్రహ్మ, జీవుల మధ్య మాయవున్నట్లుగా, శోభాయమానంగా వుంది. నదులు, పర్వతాలు. లోయలన్నీ, ప్రభువును గుర్తించి చక్కని మార్గాలు చూపుతున్నాయి.

శ్రీరాముడు వెళ్ళినచోట్లల్లో మేఘాలు నీడలనిస్తున్నాయి. త్రోవలో విరాధరాక్షసుడు కలిశాడు. ఎదురుపడగానే ప్రభువు అతనిని చంపేశాడు. వెంటనే అతను దివ్యరూపం పొందాడు. అతను దుఃఖంతో ఉన్నట్లు గ్రహించి అతనిని అతనిలోకానికి పంపించాడు. తరువాత రాముడు సీతాలక్ష్మణులతో కలసి శరభంగముని ఉన్న ఆశ్రమానికి వెళ్ళాడు.

శ్రీరామచంద్రుని ముఖకమలాన్ని చూచి, మునీశ్వరుని నేత్ర రూపాలైన తుమ్మెదలు ఎంతో ఆనందంగా, మకరందరసాన్ని త్రాగాయి శరభంగముని జన్మ ధన్యమైపోయింది.

అప్పుడు ముని అన్నాడు- "రామచంద్రా! శంకరుని మనస్సు

రూపమైన మాన సరోవర హంసా! వినండి. నేను బ్రహ్మలోకానికి వెళ్తున్నాను. ఇంతలో శ్రీరామచంద్రుడు వనంలోకి వస్తున్నాడని విన్నాను, అప్పటి నుండి రాత్రింబవళ్ళు ఎదురుచూస్తున్నాను. ఈ రోజు ప్రభువును చూచిన తరువాత నా హృదయం పల్లవిడిపోయింది. ప్రభూ! నేను ఏమీ లేనివాడను. నన్ను దీనజనులలో, ఒకడినను కొని మీరు వచ్చారు.

భక్తజనుల మనస్సులను, దోచుకొను దేవా! ఇందులో నా మీద ప్రత్యేకమైన దృష్టి ఏమీలేదు. మీరు మీ ప్రతిజ్ఞను నెర వేర్చుకున్నారు. నేను నా శరీరాన్ని వదలి మీలో కలసి పోవునంత వరకు మీరు ఈ దీనుని కొరకు ఇక్కడే ఉండిపొండి."

ముని చేసిన యోగం, యజ్ఞాలు, జపతపాలు, వ్రతాలు, ప్రభు వైన రామునకు అర్పణచేసి, భక్తియొక్క వరదానం పుచ్చుకొని హృదయం నుండి మోహాలన్నీ వదలివేసి చితిని ఏర్పరచుకొని కూర్చున్నాడు.

"నీల వర్ణంలోవున్న శ్యామ శరీరంగల శ్రీరామా! మీరు సీతాలక్ష్మణ సహితంగా,ఎల్లప్పుడు సగుణ రూపంలోనాహృదయంలో నివసించండి" అని యోగాగ్నితో తన శరీరాన్ని భస్మం చేసు కున్నాడు. శ్రీరాముని కృపతో వైకుంఠానికి వెళ్ళాడు. ప్రభువువద్ద మొదటి నుండే భేదభక్తి వరాన్ని పొందియున్నాడు గాన ముని ప్రభువులో లీనమవలేదు.

ఋషులందరు మునిశ్రేష్ఠుడయిన శరభంగుని పరిస్థితి చూచి, తమ హృదయాల్లో చాలా సంతోషించారు. "దీనుల మేలుకోరువాడు కరుణానిధి అయిన ప్రభువుకు జయమగుగాక" అని మునులందరు స్తుతించారు.

శ్రీరామచంద్రుడు వనంలో ముందునడచాడు. శ్రేష్ఠులైన మునులు ఆయన వెంట వెళ్ళారు. ఒకచోట ఎముకల గుట్టలు చూచి శ్రీరాముడు మునులనడిగాడు "స్వామీ! మీకు అన్నీ తెలిసుండి కూడా మమ్మడుగుతున్నారు. మీకు అందరు సమానులు, మీరులేని చోటంటూలేదు. రాక్షస సమూహం,ఇక్కడున్న మునులందరిని తినేశారు" అనేటప్పటికి శ్రీరామచంద్రుని కళ్ళంట నీళ్ళొచ్చాయి. శ్రీరాముడు చేతులెత్తి "భూమిమీద రాక్షసులు లేకుండా చేస్తాను" అంటూ ప్రతిజ్ఞచేశాడు.

మునుల ఆశ్రమాలన్నింటిలోకి వెళ్ళి వారిని దర్శనం చేసుకుని, మంచిమాటలతో తృప్తి పరచాడు. అగస్త్యఋషి శిష్యుడొకడున్నారు. అతని పేరు సుతీక్ష్ణుడు. అతనికి భగవంతునియందు ఎంతో ప్రేమ. మనసా, వాచా, కర్మణా ఆయన శ్రీరామచంద్రుని పాదదాసుడు. స్వప్నంలో కూడా మరొక దేవతను నమ్మడు, సేవించడు. ఆయన ప్రభువురాక సంగతి వినగానే. అనేక రకాల కోర్కెలతో, ఆమర్గాగాలేచి పరుగెత్తుతూ- "బ్రహ్మదేవా! దీనబంధు శ్రీరామచంద్రుడు నాలాంటి మూర్ఖులయందు దయవుంచుతాడా? రామచంద్రుడు లక్ష్మణునితోసహా, తన సేవకునిగా భావించి కలుస్తాడా? నాకుమాత్రం నమ్మకంలేదు. ఎందుకంటే నా మనస్సులో భక్తి, విశేషమైన ప్రేమ, జ్ఞానాలులేవు.

నేను మంచివారి స్నేహాలు చేయలేదు. యోగ, జప, యజ్ఞాలు చేయలేదు. శ్రీరాముని పాదాలయందు నాకుగట్టి నమ్మకంలేదు. కాని ఇతరుల అండ ఏమీలేని వారికి తానే అండనవుతానని, ప్రభువంటే నాకు ప్రభువు కటాక్షం వున్నటే.

ఈనాడు సంసార బంధనాలను వదలించుకుని ప్రభువు యొక్క ముఖ కమలాన్ని దర్శించుకొని కృతకృత్యుడనయి పోతాను.

మునికి ఏ దిక్కుకు వెళ్ళాల్సింది తెలియడంలేదు. తానెవరయినదీ, తానెటుపోతున్నది, తాను వెళ్ళేమార్గ మెక్కడికి? అనే విషయాలేమీ తెలియడం లేదు. అటు వెళ్తాడు, ఇటు వెళ్తాడు ప్రక్కకు పోతాడు భక్తితో నాట్యం చేస్తాడు.

సతీక్ష్ణుడు ప్రభువుయొక్క ప్రేమను భక్తిని పొందాడు, శ్రీరామ చంద్రుడు చెట్టుచాటునవుండి సుతీక్ష్ణుని అమిత ప్రేమనుచూచి, ముని ముందు ప్రత్యక్షమయాడు.

ముని మధ్య త్రోవలో నిశ్చలంగా కూచున్నాడు. శరీరం పులకించి, పనస పండులాగా అయిపోయింది. రాముడు తన భక్తుని పరిస్థితిచూచి, మనస్సులో చాలా సంతోషించాడు. మునిని మేల్కొల్పాలని ఎంతో ప్రయత్నించాడు. ఆయనెంతకూ లేవలేదు. మునికి ధ్యాన సుఖం ప్రాప్తిస్తూవుంది. శ్రీరాముడు తన స్వరూపాన్ని దాచి మునిహృదయంలో తన చతుర్భుజ రూపాన్ని చూపాడు.

మునికి ప్రభువు కనపడకుండా పోయే సరికి గాబరాపడి లేచాడు. ఆసమయంలో తన యెదుటనున్న సీతారామలక్ష్మణులను చూచి ఎంతో అదృష్టవంతుడైన ముని కర్రలాగా శ్రీరాముని పాదాల మీద పడ్డాడు. శ్రీరాముడు తన విశాలమైన చేతులతో ఆయనను లేపి కౌగలించుకున్నాడు.

మునిని కలసినప్పుడు కృపాళువయిన రామచంద్రుడు,బంగారు వృక్షాన్ని కలిసి కొన్నట్లుగా, వెలిగిపోయాడు. రామచంద్రునిముఖం చూచి, చిత్రంలో వ్రాసిన బొమ్మల్లాగా నిలబడి పోయాడు. ముని ధైర్యం చేసి మాటి మాటికి కాళ్ళుతాకి, ఆశ్రమానికి తీసుకొచ్చి పూజించాడు.

సుతీక్ష్ణుడు అన్నాడు- ప్రభూ! నా మనవి వినండి, నేను మిమ్మ ఎలా స్తుతించాలో చెప్పండి. మీమహిమ అంతు తెలియనిది, నా

బద్ధాకురువది, నాస్థితి సూర్యునియందు మిణుగురు పురుగు కాంతి లాంటిది.

నీలకమలముల మాలలాంటి శరీరం గలవానికి తలమీద జడలు పెంచుకొనివున్న వానికి, ధనస్సు బాణాలు చేతిలో వుంచు కున్న వానికి, నడుమున అంబులపొది వుంచుకొన్న రఘునాధునకు నేను ఎల్లప్పుడు నమస్కారం చేస్తూనే వున్నాను.

మోహరూపమైన వనాన్ని తగులబెట్టు అగ్నిలాంటి, భక్త రూపమైన కమలవనాన్ని వికసింపజేసే సూర్యునిలాంటి, రాక్షస రూపాలైన ఏనుగుల సమూహాన్ని నాశనం చేసే సింహంలాంటి, చావు పుట్టుకల రూపమైన పక్షిని నాశనం చేయు డేగలాంటి, భగ వంతుడు ఎల్లప్పుడు నన్ను రక్షించుగాక!

ఎర్రని కమలాలలాంటి నేత్రాలు, అందమైన వేషంలోవున్న, చంద్రునివంటివాడా! శివుని హృదయ రూపమైన మానసరోవంలోని హంసా! విశాల హృదయం, చేతులు గల రామా! నేను మీకు నమ స్కరిస్తున్నాను.

సంశయ రూపాలైన సర్పాలకు గరుడా! కఠోరమైన తర్కం ద్వారా ఏర్పడిన విషాదాన్ని నాశనం చేయువాడా! సంసారచిక్కుల నుండి విడదీయువాడా! దేవతల సమూహానికి ఆనందాన్నిచ్చేకృపా నిధి నన్ను రక్షించుగాక!

ఓ నిర్గుణ, సగుణ, వ్యతిరేక, అనుకూలమైన రూపీ! వాక్కు లకు, ఇంద్రియాలకు అందనివాడా! సాటిలేని, అఖండమైన, దోషం లేని, అంతంలేని, భూభారాన్నితగ్గించే మీకునమస్కారంచేస్తున్నాను.

మీరు భక్తులకు కల్పవృక్షపు తోటలు, కామ, క్రోధ, లోభ. బేధాలను భయపెట్టేవారు, ఎంతో చతురులు, సంసార రూపమైన సాగరాన్ని దాటిపోవానికి వంతెన రూపమైన సూర్యవంశానికి జండా

లాంటి రాముడు నన్ను రక్షించుగాక!

ఎంతో ప్రతాపం గల భుజములవాడు, బలానికి నిధి, కలియుగంలోని పాపాలను పోగొట్టు నామంకల వాడు, ధర్మాన్ని రక్షించగల గుణాలు గల మేలు చేయు, ఆ శ్రీరామచంద్రుడు ఎల్లప్పుడు నాకు మేలు చేయుగాక!

మీరు నిష్కల్మషులు, అంతటా వున్నవారు, నాశనంలేనివారు అందరి హృదయాల్లో నివసించువారు, అయినా ఖరుని శత్రువయిన మీరు, సీతాలక్ష్మణులతో కలసి వనంలో తిరుగుతున్నారు. ఆ మీరు నా మనస్సులో నివసించండి.

స్వామీ! మిమ్మ సగుణ, నిర్గుణ, అంతటా వున్న వారని అనుకుంటే అను కుంటారు. కాని నా హృదయంలో అయోధ్యాపతి, కమలనయనుడు శ్రీరాముడు మాత్రమే. నివసించుగాక.

మీరు ప్రభువులని, నేను మీ సేవకుడనను అభిమానం ఎప్పుడు నాలోనుంచి దూరమవకుండా ఉండుగాక!"

సుతీక్ష ముని మాటలు విని శ్రీరామచంద్రుడు సంతోషంతో ముని శ్రేష్ఠుని కౌగలించుకొని- "మునీశ్వరా! నేను సంతోషంగా వున్నానని తెలిసికొని మీకు కావలసిన వరాన్ని కోరుకొండి, ఇస్తాను" అన్నాడు ముని– "నేను వరదాన మెన్నడూ కోరలేదు. ఏది సత్యమో ఏది అసత్యమో, నాకు అర్థం కావడంలేదు. అందుచేత భక్తులకు సుఖాన్నిచ్చు శ్రీరామా! మీకు యిష్టమయినది నాకివ్వండి"అన్నాడు.

"నీవు నిశ్చలమైన భక్తి, వైరాగ్యం, విజ్ఞానం, సమస్త గుణాలతో, జ్ఞానంతో పరిపూర్ణుడవు కమ్ము" అన్నాడు రాముడు.

"ప్రభూ! మీరు ఇచ్చిన వరాన్ని నేను పుచ్చుకున్నాను. ఇక ఇప్పుడు నాకు యిష్టమయిన వరాన్నివ్వండి.ప్రభూ! శ్రీరామచంద్రా! మీ సాదరుడయిన లక్ష్మణుడు, సీతతో కలసి, ధనస్సు, బాణాలు

ధరించి, మీరు స్థిరంగా, నా హృదయ రూపమైన ఆకాశంలోని చంద్రునిలాగా ఎల్లప్పుడు నివసించండి" అన్నాడు ముని.

శ్రీరామచంద్రుడు "అలాగే" నంటూ, సంతోషంగా అగస్త్య ఋషి వద్దకు బయల్దేరాడు. అప్పుడు సుతీక్ష్ణుడు "గురుదేవుని దర్శనం చేసికొని వచ్చి చాలా రోజులయింది. ఇప్పుడు ప్రభువుతో కలసి గురు దేవునివద్దకు వస్తాను. ఇలా వస్తున్నందుకు, ప్రభూ! మీకు నేనేదో మేలు చేస్తున్నట్లుకాదు" అన్నాడు. కృపానిధి శ్రీరామచంద్రుడు ముని మాటల తీరుచూచి, తన వెంట తీసికొని పోతూన్న సమయంలో ఇద్దరన్నదమ్ములు ఆయన వాక్చాతుర్యానికి నవ్వుకున్నారు.

ముని మార్గంలో తనభక్తిని చెప్తూ, అగస్త్యముని ఆశ్రమానికి చేరుకున్నారు. సుతీక్ష్ణుడు వెంటనే గురువువద్దకు వెళ్ళాడు.

"మహామునీ కోసలాధీశ రాజ కుమారుడు, జగత్తుకు ఆధార మైనవాడు, తమ్ముడు లక్ష్మణుడు, భార్య సీతతో కలసి, మీరు రాత్రింబవళ్ళు జపిస్తున్న శ్రీరాముడు మిమ్ముకలసికోడానికి వచ్చాడు." అని సుతీక్ష్ణుడనగానే, అగస్త్యుడు వెంటనే లేచి వస్తూన్న ప్రభువును చూచి కళ్ళంట నీళ్ళు పెట్టుకున్నాడు. ముని పాదాలమీద ఇద్దరన్న దమ్ములు పడ్డారు. ఋషి ఎంతో ప్రేమతో లేపి వారిని కౌగలించు కుని, ఆదరంగా క్షేమసమాచారాలడిగాడు. ఆసనం తెచ్చి కూచో బెట్టాడు. మరల అనేక రకాలుగ ప్రభువును సత్కరించి, నాయంత అదృష్టవంతుడు మరొకడులేడు" అన్నాడు అగస్త్యుడు. అక్కడున్న మునులందరు సుఖాలకు మూలమైన శ్రీరాముని దర్శించుకొని సంతోషించారు.

మునుల సమూహంలో శ్రీరాముడు అందరి ఎదురుగా కన్పిస్తూ కూచున్నాడు. మునులందరు ఆయనవైపు కన్నార్పకుండా చూస్తు న్నారు. అప్పుడు శ్రీరామచంద్రుడు అగస్త్యమునితో- "మీ దగ్గర

దాపరికమేమీలేదు. నేను ఏ కారణంచేత వచ్చినదీ, మీకు తెలుసు మునీశ్వరా! అందుకే మీకు తెలియజెప్పలేదు. మహర్షీ మునుల శత్రువులను చంపుటకు వీలుగా, మీరు తగిన సలహానివ్వండినాకు."

శ్రీరాముని మాటలు విని ఋషి నవ్వుకొని- "ప్రభూ! మీరు నన్ను ఎటువంటి వాడనని సలహా అడుగుతున్నారు? పాపాలను నాశనం చేయు శ్రీరామా! మీయందు భక్తివలన, మీమహిమను కొంచెం తెలిసికోగలిగాను. మీమాయ మేడిచెట్టువంటి విశాలమైనది. అనేక బ్రహ్మాండ సమూహాలు దానిపండ్లు, చరాచరాలన్నీ ఆపండ్ల లోని పురుగుల్లాంటివి, వాటికి బయటి సంగతులేమీ తెలియవు. ఈ ఫలాలను తిను, భయంకరమైన కాలం కూడా మీరంటే ఎల్లప్పుడు భయపడుతూ ఉంటుంది.

సంపూర్ణ లోకపాలకులకు స్వామీ! మీరు నన్ను మామూలు మనిషిలాగా అడిగారు. కృపానిధీ! సీతా లక్ష్మణులతో కలసి మీరు నా హృదయంలో నివసించండి, అని మిమ్ము వరమిమ్మని కోరుకుంటున్నాను. నాకు మీయందు నిలకడగల భక్తి ఉండునట్లుగాను, వైరాగ్యం, సత్సాంగత్యం, మీ చరణ కమలాలయందు ఎడతెగని ప్రేమ ఉండేటట్లు చేయండి. మీరు అఖండమైనవారు, అనంతమైన, వారు. అనుభవంద్వారా తెలిసికోదగినవారు, మిమ్ము భక్తులు పూజిస్తూనే వుంటారు, అలాంటి మీ రూపాన్ని నేనెరుగుదును, వర్ణిస్తున్నాను. అయినా నేను మాటి మాటికి సగుణ బ్రహ్మనే ప్రేమిస్తున్నాను. రామా! మీరు మీదాసులైన భక్తులను గొప్పగా చెప్పుతూ వుంటారు. అందుకనే మీరు నన్నడుగుతున్నారు. మునుల, శత్రువులను చంపు మార్గమేమిట"ని, మీరడిగారు గనుక చెప్తున్నాను.

ప్రభూ! ఒక పరమ పావనమైన స్థానమున్నది, దానిపేరు పంచవటి. మీరుదండకారణ్యాన్ని పవిత్రం చేసి, మునిశ్రేష్ఠుడయిన

గౌతముని కఠిన శాపం దూరం చేయండి.

రఘుకులస్వామీ! మీరక్కడకు వెళ్ళి నివసించి, మునులందరి యందు దయచూపండి."

అగస్త్యముని ఆజ్ఞ ప్రకారం శ్రీరామచంద్రుడు, వెంటనే పంచవటిని సమీపించాడు. అక్కడ గరుడరాజు జటాయుతో కలయిక జరిగింది. అతని ప్రేమను గట్టిపరచుకొని, రామచంద్రుడు గోదావరి గట్టున పర్ణశాల నిర్మించుకొని వుంటున్నాడు.

శ్రీరాముడు అక్కడ నివసించడం మొదలుపెట్టినప్పటినుండి మునులు సుఖంగా ఉన్నారు. వారి భయాలు దూరమయిపోయాయి. పర్వతాలు, వనాలు, నదులు, చెరువులు, శోభాయమానంగా ఉన్నాయి. రోజు రోజుకు అవి ఎంతో అందంగా ఉంటున్నాయి. పశుపక్షులన్నీ ఆనందంగా ఉంటున్నాయి. తుమ్మెదలు మధురంగా రొదలు చేస్తున్నాయి. ఆ వనాన్నిప్పుడు శేషుడు కూడా వర్ణించలేడు, అక్కడ స్వయంగా రాముడున్నాడుగాన అవన్నీ అందంగా మారిపోయాయి.

ఒకసారి శ్రీరాముడు సుఖంగా కూచుని ఉన్నాడు. ఆసమయంలో లక్ష్మణుడు కపటం లేకుండా అడిగాడు- "దేవా! నేనన్నీ వదలి మీపాద ధూళికి సేవచేసే విధం తెలియజెప్పండి. జ్ఞాన, వైరాగ్య, మాయలను గురించి నిరూపించండి. మీరు భక్తులయందు దయచూపు ఆ భక్తిని గురించి చెప్పండి. ప్రభూ! ఈశ్వర, జీవుల భేదాలు కూడా చెప్పండి. మీ చరణాలయందు నాకు ప్రేమ వుండుటకు, నా దుఃఖం, మోహం, భ్రమ,దూరం కావడానికి వీలుగా తెలియజెప్పండి."

"సోదరా! నేను క్లుప్తంగా నీకు తెలియచెప్తాను. నీవు మనస్సును చిత్తాన్ని స్థిరంగా వుంచుకొని విను. నేను, నాది, నీవు, నీది

అనుకోవడమేమాయ. అది ప్రాణులన్నింటిని వశపరచుకొంటుంది. ఇంద్రియ విషయాలకు మనస్సు లోబడునదంతా మాయయే అనుకో! దానిలో కూడా రెండు భేదాలున్నాయి. మొదటిది విద్య, రెండవది అవిద్య.

అవిద్య దుష్టమయినది, దుఃఖదాయకమైనది. దీని వశమయి జీవులు సంసార రూపమైన గోతిలో పడిపోతున్నారు. మరొకటి విద్య ఇది జగత్తును ఏర్పరచుతున్నది. గుణాలు దానివశంలో ఉన్నాయి. అవి ప్రభువుద్వారా ప్రేరేపించబడేవి. వాటిలో తమ స్వంతబల మేమీ లేదు.

అందరిలో బ్రహ్మను సమానంగా చూచేది, మానవావమానాలు అనుదోషాలు ఏమాత్రంలేనిది జ్ఞానం. సోదరా, దానినే పరమ వైరాగ్య వంతమైనదనాలి. అది సిద్ధులను, త్రిగుణాలను గడ్డిపోచ లాగా త్యజిస్తుంది.

మాయను, ఈశ్వరుని, స్వయంగా తనను తెలిసికోలేని వానినే జీవుడనాలి. కర్మాను సారంగా బంధనాలు, మోక్షాలు ఇచ్చువాడు, అన్నింటికీ దూరంగా ఉండేవాడు, మాయను రెచ్చగొట్టేవాడు, ఈశ్వరుడే.

ధర్మం వలన వైరాగ్యం, యోగం వలన జ్ఞానం ప్రాప్తిస్తుంది. జ్ఞానం మోక్షాన్ని ఇస్తుంది అని వేదాలు వర్ణించాయి. సోదరా! నేను తొందరగా సంతోషించునట్లు చేసేది భక్తి, అది భక్తులకు సుఖాలను కలిగిస్తుంది.

ఈ భక్తి స్వతంత్రమైనది, దానికి ఇతరుల అండ అక్కర్లేదు. జ్ఞాన విజ్ఞానాలు దాని అధీనంలోనే వుంటాయి, భక్తి చాలా గొప్పది, సుఖాలకు మూలం. అది భక్తులు అనుకూలమయినప్పుడే లభిస్తుంది.

ఇప్పుడిక, ప్రాణికోటి నన్ను సహజంగానే పొందగలుగు భక్తిని, దాని సాధనాలను వర్ణిస్తాను. మొదట బ్రాహ్మణుల పాదాల యందు అధికమైన ప్రేమ ఉండాలి. వేదరీతుల ననుసరించి ధర్మంగా నడుచుకోవాలి, ఇలా చేసినందువలన కోర్కెలయందు ఆసక్తి నశి స్తుంది. అప్పుడు నా ధర్మమందు ప్రేమ ఏర్పడుతుంది. శ్రవణము వలన కూడా భక్తి కలుగుతుంది. మనస్సులో నా సాటిలేని లీలల యందు ఉత్కృష్టమైన ప్రేమ ఏర్పడుతుంది.

భక్తులయందు ప్రేమవున్నవారు, మనసా, వాచా కర్మణా పూజలు చేయుటయందు గట్టి నియమమున్నవారు, గురువు, తల్లి, తండ్రి, సోదరులు, స్వామి, దేవతలను నేనే (భగవంతుడే) అను కునేవారు, నియమంగా నాసేవలు చేయాలి.

నా గుణాలను గానం చేయునప్పుడు శరీరాలు పులకించిపోయే వారు వాక్కు గద్గదమయి పోయేవారు కన్నీంట నీష్కకార్చేవారు, కామము, మదము, మోసము మొదలైనవి మనస్సులో లేనివారికి సోదరా! వశమైపోతాను నేను.

మనసా, వాచా, కర్మణా నాశరణు కోరువారిని, ఏ కోరికలూ లేకుండా నాకు పూజలుచేసే వాడిని, వారి హృదయ కమలాల్లో, నేను ఎల్లప్పుడు విశ్రాంతి తీసుకుంటూంటాను."

లక్ష్మణుడు ఈ భక్తి యోగాన్ని విని, కైవాలా సంతోషించి, ప్రభు శ్రీరామచంద్రుని పాదాలవద్ద తలవుంచి నమస్కారం చేశాడు. ఇలా వైరాగ్యం, జ్ఞానం, నీతి, గుణాల చర్చలతో కొన్ని రోజులు గడచిపోయాయి

రావణుని సోదరి ఒకర్తె, శూర్పణఖ పేరుగలది, నాగిని లాగా దుష్టస్వభావము గలది, భయంకర రూపిణి వుంది. ఒకసారి అది రామలక్ష్మణులున్న చోటయిన పంచవటికి వచ్చింది. వారిని చూడ

గానే దానికి కామం పెరిగి వ్యాకుల పడిపోయింది.

కాగభుశుండి చెబుతున్నాడు- "గరుడా! సోదరులైనా, తండ్ర యినా, పుత్రులయినా, మరెవరైనాసరే అందమైన పురుషులను చూస్తే శూర్పణఖలాంటి ధర్మ జ్ఞానం లేనివారు, కామంతో గ్రుడ్డి వారైన స్త్రీలు, మరులు గొలుపుతూ వుంటారు, తమ మనస్సులను అదుపులో పెట్టుకోలేరు. సూర్యకాంతమణి సూర్యుని చూచి కరగి పోయినట్లుగా, అలాంటి మనస్సులు చంచలమై పోతాయి.

అది చాలా అందమైన రూపంతో మారిపోయి,శ్రీరామచంద్రుని వద్దకు వచ్చి, చాలా పెద్దగానవ్వి- "మీతో సమానమైన పురుష డెక్కడాలేడు. నాలాంటి అందమైన సుందరి ఉండదు, బ్రహ్మ బాగా ఆలోచించి మనిద్దరము జంటగా ఉండడానికి నిర్ణయించాడు.

నేను మూడు లోకాల్లో గాలించి చూచినా, ఇంతవరకూ నాకు తగిన పురుషుని ప్రపంచంలో చూడలేక పోయాను. అందుకనే నేనింతవరకు పెండ్లిచేసుకోకుండా వున్నాను. ఇప్పుడు మిమ్మ చూచిన తరువాత నా మనస్సు కుదుట పడింది.

సీతవైపు చూస్తూ ప్రభువు "నా తమ్ముడు ఉన్నాడని చెప్పాడు. శూర్పణఖ లక్ష్మణుని వద్దకు వెళ్ళింది. ఆమెను శత్రువుని సోదరి అని గుర్తించిన లక్ష్మణుడు రామచంద్రునివైపు చూచి అన్నాడు- "సుందరీ! నేనాయన సేవకుడను. పరాధీనునివద్ద నీవు సుఖపడలేవు. ప్రభువు సమర్థులు, అయోధ్యకురాజు, ఆయనేమి చేసినా లోకం మెచ్చుతుంది.

సేవకుడు సుఖాన్ని కోరినా, బిచ్చగాడు మర్యాదలు కోరినా, దుర్మార్గుడు సంపదలు కోరినా, వ్యభిచారి గౌరవంగా బ్రతకాలన్నా, లోభి కీర్తి కావాలనుకున్నా, గర్వపోతు నాలుగు పురుషార్థాలు కావా లనుకున్నా ఆ కోర్కెలు, ఆకాశం నుండి పాలు పిదుకతంభాగా

తీరేవికావు."

ఆమె తిరిగి రాముని వద్దకు వస్తే తిరిగి లక్ష్మణుని వద్దకే పంపాడు రాముడు. అప్పుడు లక్ష్మణుడు-"సుందరీ! సిగ్గును గడ్డిపోచలలాగా భావించేవాడు మాత్రమే నిన్ను పెండ్లాడాలి." అనేసరికి అది మరల రామచంద్రుని వద్దకు వెళ్ళి, భయంకరరూపందాల్చింది. సీత భయపడిపోయింది. ఆమె భయాన్ని చూచిన రాముడు లక్ష్మణుని వైపు చూచి సైగచేశాడు లక్ష్మణుడు ఆమె ముక్కు చెవులు కోశాడు.

శూర్పణఖ ముక్కుచెవులు తెగిపోయి, చాలా భయంకరంగా వుంది. ఆమెను చూస్తే కొండనుండి ఎర్రని రంగు ప్రవహిస్తున్నదా అన్నట్లుంది. ఆమె ఏడుస్తూ, మొత్తుకొంటూ ఖరదూషణుల వద్దకు వెళ్ళి- "సోదరులారా! మీ బల పౌరుషాలు ఎందుకు పనికిరానివి" అంది. వారు "అసలు సంగతేమి"టని అడిగినప్పుడు, ఆమె విషయమంతా చెప్పింది, ఆమెమాటలు విని సైన్యాన్ని సిద్ధంచేశారు. చాలామంది రాక్షసుల గుంపులు, రెక్కలులేని కాటుక కొండల సమూహమా. అన్నట్లుగా పరుగులు తీశాయి.

అనేకమంది వాహనాలలో, రకరకాల భయంకరరూపాలు దాల్చిన రాక్షసులు, అనేకరకాలైన అస్త్రశస్త్రాలతో బయలుదేరారు. వారిముందు ముక్కుచెవులు లేనిది, అశుభరూపంలో వున్నది, అయిన శూర్పణఖను, పెట్టుకున్నారు. అనేక రకాలైన అపశకునాలెదురౌతున్నాయి. వారందరికి కాలము దగ్గరకు వచ్చినందున, అశకునాలేమీ అర్థం కాలేదు. వారు కేకలుపెడుతూ, గంతులువేస్తూ, దూకుతూ ఆకాశంలోకి ఎగురుతూ, సైన్యాన్ని చూచుకొని ఉబ్బిపోతున్నారు.

"ఇద్దరన్నదమ్ములను ప్రాణాలతో పట్టుకురండని కొందరు, పట్టుకొని చంపివేయండ'ని కొందరు, ఆయన భార్యను లాక్కురండ'ని కొందరు అంటున్నారు. ఆకాశంలో దుమ్ము కమ్మిపోయింది.

అప్పుడు రాముడు లక్ష్మణుని పిలిచి-"నీవు జానకిని తీసుకొని కొండ గుహలలోకి వెళ్ళు. రాక్షసుల భయంకరసైన్యంవస్తున్నది. జాగ్రత్తగా ఉండు" అన్నాడు. రాముని పలుకులు విని, లక్ష్మణుడు చేతులలో ధనస్సు బాణాలుంచుకొని, సీతను వెంటబెట్టుకొని వెళ్ళాడు. రాముడు నవ్వుకొని ధనస్సు బాణాలను సిద్ధంచేసుకున్నాడు.

అనేక మంది రాక్షస యోధులు ప్రోగయివచ్చి-"పట్టుకోండి, పట్టుకోండి" అంటూ, ఉదయపు సూర్యుని ఒంటరిగా చూచి మదము గల రాక్షసులు చుట్టు ముట్టుచున్నారా, అన్నట్లుగా పరుగులెత్తారు.

ప్రభు శ్రీరామచంద్రుని అందమైన స్వరూపాన్ని చూచిన రాక్షసులు ఆయన మీదకు బాణాలను వదలలేకపోతున్నారు. రాక్షసులందరు స్తబ్ధులైపోయారు. అప్పుడు ఖరదూషణులు మంత్రినిపిలచి-"ఈ రాజపుత్రులు మానవులలో శ్రేష్ఠులు. మేము దేవతలను, మానవులను, నాగులను, అసురులను, మునులను చూచాము, ఎంతోమందిని మాచేతులతో చంపాం"కాని మేము ఈ నాటివరకు ఇంత అందగాడిని చూడలేదు. ఈయన మా సోదరిని కురూపిణిగా చేయడం చేశారు గాని, ఈ సాటిలేని మానవోత్తముడయిన ఇతను చంపదగిన వాడు కాడు. ఇతను దాచియుంచిన ఇతని భార్యను తొందరగా మాకు ఒప్పగించి, అన్నదమ్ములిద్దరిని ప్రాణాలతో తిరిగి వెళ్ళమని మేము చెప్పమన్నామని చెప్పి వెంటనే తిరిగిరండి. దూతలు వెళ్ళి శ్రీరామునితో చెప్పగానే రాముడు చిరునవ్వునవ్వి-"మేము క్షత్రియులము, వనంలో వేటాడుతున్నాము, మీలాంటి దుర్మార్గులైన పశువుల కొరకే వెదకుతున్నాము. మేము బలవంతులైన శత్రువులను చూచినా భయపడము ఒక్కొసారి యమునితో కూడా పోట్లాడగలము.

మేము, రాక్షసకులాన్ని నాశనం చేసి, మునులను రక్షించే మానవులము. మేము దుష్టులకు తగినబుద్ధి చెప్పి, శిక్షించడానికివచ్చిన

బాలకులము. మాకు దమ్ములులేకపోతే తిరిగి, వెళ్ళిపొండి, రణానికి సిద్ధం కాని వారి జోలికి మేము పోము, చంపము.

యుద్ధంవేయడంలో బూటకమైన మోసాలుచేయడం, శత్రువు యందు దయచూపడం చాలాపిరికి తనము." అని దూతలు వచ్చి ఖర దూషణులకు చెప్పారు. వారు చెప్పిన మాటలు విన్నాకవారి హృదయా లలో మంటలు లేచాయి. వారు-"పట్టుకోండి" అంటూ, ఆ భయం కరులైన రాక్షసులు బాణాలు, బరిసెలు, ఈటెలు, పదునైన కత్తులు, గండ్రగొడ్డళ్ళు తీసుకొని పరుగులెత్తారు. రామచంద్రుడు ధనస్సు యొక్క కఠోరమైన, గొప్పభయంకరమైన వింటినారి మ్రోతమ్రోగిం చాడు. ఆ మ్రోతను విని రాక్షసులకు చెవుడు వచ్చినట్లయిపోయి బెంబే లెత్తారు. ఆ సమయంలో వారి బుద్ధులు పనిచేయలేదు.

వారు, శత్రువులు బలమైనవారని తెలిసికొని పరుగెత్తిరాముని మీద అనేక రకాల అస్త్రశస్త్రాలు ప్రయోగించారు. వారి ఆయుధా లను రాముడు గడ్డిపోచల్లాగా ముక్కలు ముక్కలుచేసేశాడు. తరు వాత చెవులవరకు ధనస్సును లాగి రాముడు తన బాణాలను వద లాడు.

రాక్షసులు భయంకరమైన బాణాలను వేస్తున్నారు. ఆ బాణాలు సర్పాలు బుసగొట్టుచూవున్నట్లు, వస్తున్నాయి. శ్రీరామచంద్రుడు కోపంతో అనేకమైన పదునైన బాణాలు వదలాడు. ఎంతో తీక్ష్ణమైన బాణాలు రావడం చూచి, రాక్షసులు వెన్నులుచూపి పారిపోయారు. అప్పుడు, ఖరదూషణాదులు-"యుద్ధం నుండి పారిపోయేవారిని,మేము మా చేతులతో స్వయంగా చంపేస్తాము" అని క్రోధంతో అన్నారు. వారు మనస్సులలో తమ చావులు తప్పవని నిర్ణయించుకొని తిరిగివచ్చి అనేక బాణాలను, ఆయుధాలను ఎదురుగావుండి ప్రయోగించారు.

శత్రువులు చాలా కోపంలో వున్నారని గ్రహించిన శ్రీరామ

చంద్రుడు ధనస్సును ఎక్కుబెట్టి బాణాలు వదలి అనేక మంది భయంకరమైన రాక్షసులను చంపేశాడు. వారి తల, చేతులు, కాళ్ళు ఇటు అటు భూమిమీద వెల్లావెదురుగా పడిపోతూవున్నాయి. బాణాలు తగిలినప్పుడు వారు కేకలు, బొబ్బలుపెడుతున్నారు. వారి కొండల్లాంటి శరీరాలు, మొండాలు తెగిపడిపోతున్నాయి. వారి శరీరాలు వందల ముక్కలయిపోతున్నాయి. తలలులేని మొండాలు పరుగెత్తుతున్నాయి

వాటిని నక్కలు పటపట కొరుక్కుతింటున్నాయి. భూత పిశాచాలు వారి వారి పుర్రెలు మీద జాగ్రత్త వేసుకొంటున్నాయి. భేతాళులు వీరుల పుర్రెలమీద తాళపులయలు చూస్తున్నాయి, యోగినులు నాట్యాలు చేస్తున్నారు, రామచంద్రుని పదునైన బాణాలు, రాక్షసుల భుజాలను, రొమ్ములను, తలలను తెగగొట్టేస్తున్నాయి. గ్రద్దలు ప్రేవులను తీసుకొని ఆకాశానికి ఎగురుతున్నాయి. పిశాచాలు వారినే పట్టుకొని పరుగెత్తుతున్నాయి. ఆ సమయంలో చూస్తుంటే, యుద్ధభూమిలో వుండే చాలామంది బాలకులు గాలిపటాలు ఎగురవేస్సి కొంటున్నారా, అన్నట్లుగావుంది. అనేకమంది యోధులు చావడమో, మూర్ఛపోవడమో జరిగింది. తమ సేనలు వ్యాకులంగా వుండడం చూచి. ఖరదూషణులు త్రిశిర మొదలైన యోధులు శ్రీరామునివైపుకు త్రోసికొని వచ్చారు.

లెక్కలేనంతమంది రాక్షసులు క్రోధంతో, శ్రీరామచంద్రుని మీద బాణాలు, ఈటెలు, బరిసెలు, గండ్రగొడ్డళ్ళు, త్రిశూలాలు కత్తులు ఒకేసారి వేయసాగారు. ప్రభువు క్షణంలో శత్రువుల బాణాలను విరుగగొట్టి, రాక్షససేనాపతుల గుండెల్లో పది-పది బాణాలు వేశాడు.

యోధులు భూమిమీద పడిపోతున్నారు, మరలలేచి యుద్ధం చేస్తున్నారు. కాని చావడంలేదు, ఎన్నోమాయలు చేస్తున్నారు.

పద్నాలుగు వేలమంది రాక్షసులు ఒకవైపు, మరొకవైపు రాముడొక్కడుండడం చూచిన దేవతలు భయపడిపోయారు. అప్పుడు మాయకు ప్రభువైన శ్రీరామచంద్రుడు దేవతలను, మునులను, భయపడిపోతున్నట్లుగా చూచి, రాక్షసులందరు ఒండొరులను శ్రీరామునిగా చూచుకొని ఒండొరులు కొట్టుకొని చచ్చేటట్లుగా మాయను వ్యాపింపజేశాడు.

అందరు, "రామ-రామ" అంటూ శరీరాలు వదలివేస్తున్నారు, మోక్షానికి పోతూవున్నారు. ఈ ఉపాయంతో శ్రీరామచంద్రుడు క్షణంలో శత్రువులందరిని చంపివేశాడు. దేవతలు సంతోషించి పూలవర్షం కురిపించారు, ఆకాశంలో మేఘాలు మ్రోగాయి, తరువాత దేవతలందరు స్తోత్రం చేస్తూ వెళ్ళిపోయారు.

శ్రీరామచంద్రుడు యుద్ధంలో శత్రువులందరిని చంపేసినప్పుడు, దేవతలు, మానవులు, మునులు సంతోషపడ్డారు, ధైర్యం వచ్చింది. అప్పుడు లక్ష్మణుడు సీతను తీసుకొచ్చాడు. పాదాలమీద పడుతున్న ఆమెను ప్రభువు సంతోషంగా హృదయానికి హత్తుకున్నాడు.

శ్రీరాముని చామన ఛాయ, కోమలమైన శరీరాన్ని చూస్తున్నప్పుడు సీత కండ్లకు, ఎంతచూచినా తృప్తి కలుగడంలేదు. పంచవటిలో వుండి రాముడు దేవతలకు, మునులకు సుఖాన్నిచ్చు పనులు చేస్తున్నాడు.

ఖరదూషణులు చచ్చారని తెలిసికొన్న శూర్పణఖ, తాను కన్నారా చూచిన వింతలన్నీ రావణునకు చెప్పి రెచ్చగొట్టింది. ఆమె చాలా క్రోధంతో-"నీకు దేశమూ, సంపదలు పట్టలేదు, మద్యం త్రాగి వుంటున్నావు, శత్రువులు వచ్చి తలమీద పొంచువేసికొని కూర్చున్నట్లు నీకు తెలియడం లేదు.

నీతి లేకుండా రాజ్యాన్ని, ధర్మంలేకుండా ధనాన్ని, హరికి

అర్పించకుండా శుభకర్మలు చేయడాన్ని, తెలివిలేకుండా చదువుకోడాన్ని, శ్రమమాత్ర మనడానికి వీలుంటుందిగాని ఫలితమేమీ వుండదు.

చెడు స్నేహం వలన సన్యాసి, పెద్దసలహాలవల్ల రాజు, గర్వం వలన జ్ఞానం, మధ్యపానం వలన సిగ్గు, వినయంలేని ప్రేమ, అహంకార గుణాలు వెంటనే నాశనమవుతాయను నీతి నేను విన్నాను.

శత్రువు, రోగము, అగ్ని, పాపము, స్వామి, పామును ఎన్నడూ తమకంటె చిన్నవారని అలక్ష్యము చేయకూడదు" అంటూ తెచ్చిపెట్టుకున్న దుఃఖంతో విలవిలలాడుతూ-"రావణా! నీవు బ్రతికి వుండగానే నాకీగతి పట్టాలా?" అంది.

ఈమె మాటలు విని సభలోని వారందరు ఖంగారు పడ్డారు. అప్పుడు రావణుడు-"అసలు, నీ చెవులు, ముక్కుకోసిన వారెవరో, చెప్పు" అన్నాడు.

"అయోధ్యరాజయిన దశరథునిపుత్రులు, దండకారణ్యంలో వేటకోసం వచ్చారు. వారు పురుషులలో సింహాలలాంటివారు. వాళ్ళ చేష్టలను చూస్తే నాకు, వాళ్ళు రాక్షసులందరిని సర్వనాశనం చేయడానికి వచ్చినట్లనిపించింది.

రావణా! వారి భుజబలాన్ని చూచుకొని మునులు నిర్భయంగా వనాల్లో తిరుగుతున్నారు, చూడ్డానికి వారు బాలకుల్లా ఉన్నారు, కాని వారు యమునితోసమానులు. వారు శ్రేష్ఠమైన,ధనస్సు. బాణాలు ధరించి వున్నారు. వారు ధీర, వీర శ్రేష్ఠుల్లాగా నాకనిపించింది. అయిద్దరన్నదమ్ములు అంతు తెలియని పరాక్రమవంతులు, ప్రతాపవంతులూ వారు దుర్మార్గులను చంపే కార్యక్రమంలో వున్నారు. దేవతలకు, మునులకు సుఖాలను కలిగిస్తున్నారు. వారు చాలా

అందంగాను, గుణవంతులుగాను ఉన్నారు. పెద్దవాని పేరు "రాము డట. ఆయనతోపాటు ఒక చక్కని చుక్కలాంటి ఆడదుంది, ఆమె ఎంత అందమయిందంటే, వందకోట్ల రతీదేవిలు ఆమెముందు బలా దూరన్నట్లు వుంటుంది. ఆయన తమ్ముని పేరు లక్ష్మణుడు. నీవెల్లెల నని తెలిసి, నవ్వులాటగా నా ముక్కు చెవులు కోసి వేశాడితడు.

నేను కేకలు పెడుతూంటే, ఖరదూషణులు వచ్చి వారితో యుద్ధం చేశారు. వారు సైన్యంతోసహా క్షణంలో అందరినీ చంపే శారు" అంది శూర్పణఖ.

ఖర దూషణులు, త్రిశిర చచ్చిపోయారన్న విషయం తెలియ గానే రావణుని అంగాలన్నీ పనిచేయకుండా పోయినవి. శూర్పణకు అనేక విధాలనచ్చజెప్పి, తన బలాన్ని గురించి గొప్పగా చెప్పుకొని తన భవనానికి వెళ్ళాడు కాని, మనస్సులోని చింత అతన్ని మాడి స్తున్నది, రాత్రంతా నిద్రపట్టలేదు.

"దేవతలు, మానవులు, రాక్షసులు, నాగులు,పక్షులు, ఎవ్వరూ మా సేవకులకు సాటి వచ్చు వారు లేరు. ఖరదూషణులు నాతో సమా నమైన బలవంతులు, వారిని భగవంతుడు తప్ప మరెవ్వరుచంపలేరు.

దేవతలకు ఆనందాన్నిచ్చేవాడు, భూమి భారాన్ని తగ్గించ డానికి భగవంతుడు అవతారమెత్తి వుంటే, నేను వెళ్ళి తప్పకుండా అతనితో వైరం పెట్టుకొని, ప్రభువు బాణాలతో ప్రాణాలను వదలి భవసాగరాన్నుండి ఒడ్డున పడిపోతాను.

ఈ తామస శరీరంతో భగవంతుని సేవలు సాధ్యంకావు, అంచేత, మనసా, వాచా, కర్మణా ఈ నిశ్చయమే చాలా మంచిది. వారు మానవ రూపంలోవున్న రాజకుమారులెవరైనా అయివుంటే, ఇద్దరిని జయించి, వారి స్త్రీని అపహరించుకొని వస్తాను." అని రావ ణుడు రథం మీద ఒంటరిగానే ఎక్కి, సముద్రపు టొడ్డున మారీచు

డున్న చోటుకు వెళ్ళాడు.

"పార్వతీ! ఇక్కడ రాముడు పన్నిన పన్నాగము చెప్తాను. అది ఎంత మనోహరంగా ఉంటుందో, విను. లక్ష్మణుడు కంద, మూల, ఫలాలు తేవడానికి వనానికి వెళ్ళినప్పుడు, కృపానిధి,సుఖాలకు మూలమయిన శ్రీరామచంద్రుడు నవ్వుతూ జానకితో– "ప్రియా! పతివ్రతా ధర్మాన్ని చక్కగా పాటించు శీలవంతురాలా! నేనిప్పుడు కొన్ని మానవలీలలు చేస్తాను. అందువలన, నేను రాక్షసులను నాశనం చేయునందాకనీవు అగ్నిలో నివసించి వుండు" అని శ్రీరామచంద్రుడు తెలియజెప్పగానే, ప్రభువు పాదాలను హృదయంలో చేర్చుకొని జానకి అగ్నిలో ఇమిడి పోయింది. అక్కడ అలాంటి శీలస్వరూపమైన, వినయ శీలిఅయిన ప్రతిబింబాన్ని వుంచారు.

శ్రీరామచంద్రుడు చేసిన ఈ కిటుకు లక్ష్మణునకు కూడా తెలియదు. స్వార్ధపరుడైన రావణాసురుడు మారీచుడున్న చోటుకు వెళ్ళి తలవంచి నమస్కారం చేశాడు.

నీచుడు వంగి వంగి నమస్కారాలు చేసినా బాధగానే వుంటుంది. వీడు వంగడానికి, కొక్కెము, ధనస్సు, పాము, పిల్లి, లొంగివుండడానికి తేడా ఏమీవుండదు. పార్వతీ! ఋతువుకాని కాలంలో పూలలాగా, దుష్టుని ప్రియవచనాలు కూడా భయంకరంగా ఉంటాయి.

అప్పుడు, మారీచుడు రావణునకు మర్యాదలుచేసి, సాదరంగా "సోదరా! నీవింత చింతతో ఎందుకున్నావు? ఒంటరిగా ఎందుకొచ్చావు?" అన్నాడు. దురదృష్టవంతుడైన రావణుడు గర్వంతో కథంతా ఆయనకు వినిపించి– "రాజకుమారిని ఎత్తుకొని రావడానికి వీలుగా నీవు మాయలేడిగా మారిపో" అన్నాడు రావణుడు.

ఆ మాటలు విని మారీచుడు– "రావణా! విను నామాటలు,

ఆయన మనుష్య రూపంలోవున్న దేవుడు. సోదరా! ఆయనతో పగ పెట్టుకోవద్దు. ఆయన చంపితే చావడం, బ్రతుకనిస్తే బ్రతుకడం మంచిది. విశ్వామిత్రుని యజ్ఞాన్ని కాపాడ్డానికి వెళ్ళిన ఈ శ్రీరామ చంద్రుడే ములుకులు లేని బాణంతో నన్ను కొడితే, క్షణంలో నేను వంద ఆమడల దూరాన పడిపోయాను. అటువంటి ఆయనతో వైరం పెట్టుకోవడం క్షేమంకాదు.

నా పరిస్థితి తుమ్మెదలు పట్టుకొన్న పురుగుల లాగావుంది. నాకు ఎక్కడ చూచినా వారిద్దరన్నదమ్ములే కనిపిస్తున్నారు. సోదరా వీరిని మనుష్యులను కుందామనుకున్నా శూరవీరులు, వారితో విరోధం పెట్టుకున్నా నీవనుకున్నట్లు జరుగదు.

అయన తాటకిని, సుబాహును చంపి, శివధనస్సునుత్రుంచేశాడు. ఖరదూషణులను, త్రిశిరను చంపాడు. అలాంటి ప్రచండుడైనవాడు ఎక్కడైనా, ఎప్పుడైనా మానవుడవడానికి వీలుందా? నీవు నీవంశ క్షేమాన్ని తలచుకొని తిరిగి వెళ్ళు" అన్నాడు.

ఈ మాటలు విన్న రావణుడు మండిపడి, మారీచుని చెడతిట్టి "అరే, మూఢా! నీవు గురువులాగా నా కుపదేశాలిస్తున్నావు, ప్రపంచంలో నాకంటే మించినవాడున్నట్లుగా, ఏశాస్త్రం, వేదం,చెబుతుందో నాకు చెప్పు" అన్నాడు,

మారీచుడు ఆలోచనలో పడ్డాడు, తనకు ఎలాగూ చావు తప్ప దని నిర్ణయించుకున్నాడు "శస్త్రాలు చేతిలోవున్న వానితో, గూఢ చారితో, అధికారితో, మూర్ఖునితో, ధనవంతునితో, వైద్యునితో, భట్రాజుతో, కవితో, పండితునితో ఈ తొమ్మిదిమందితో వైరం తెచ్చుకున్న వానికి కీడుతప్ప మేలు జరుగదు" అని మనసులో అను కున్నాడు, ఆయనకు రెండువైపుల చావు సిద్ధంగా వున్నట్లనిపించింది. అప్పుడు రామచంద్రుని శరణుకు చేరుకోడానికి నిశ్చయించుకొని-

"రావణుడు చెప్పినట్లు చేయనని అనగానే, చంపేస్తాడు, ఆ స్థితిలో వీడి చేతిలో చచ్చేకంటే, రాముని చేతిలో చావడం మేల"నుకొని శ్రీరాముని పాదాలయందు పూర్తి ప్రేమనుంచి, వెళ్ళిపోయాడు. ఈ రోజు "శ్రీరామచంద్రుని కళ్ళారా చూస్తాను; అని మనస్సులో చాలా ఆనందపడు తున్నాడు, ఈమాట రావణునితో అనలేదు.

# 21

"నా ప్రియతముడైన శ్రీరామచంద్రుని కళ్ళారా దర్శనంచేసి కొని సుఖపడుతాను. సీతాలక్ష్మణుల సహితంగా కృపానిధి శ్రీరాముని పాదాల యందు నా మనస్సు ఉంచుకుంటాను, ఆయన క్రోధంకూడా మోక్షానిస్తుంది. భక్తి, భగవానుని వశపరచుకొంటుంది. ఆ సుఖ సముద్రుడైన శ్రీహరి తన చేతులతో స్వయంగా, బాణాలు ఎక్కు పెట్టినన్ను చంపుతాడు. ధనస్సు, బాణాలు పుచ్చుకొని, భూమిమీద నా వెంట పరుగెత్తే సమయంలో నేను ప్రభువును తనవి దీర చూస్తా ను. నాలాంటి పుణ్యాత్ముడు మరొకడుండడని భావించాడు మారీచుడు.

రావణుడు పర్ణశాల దగ్గరకు చేరగానే, మారీచుడు మాయలేడి అయాడు. మణులతో పొదిగి వున్నదాని బంగారపు శరీరపు అందాన్ని వివరించి చెప్పడం సాధ్యంకాదు.

ఈ అందమైన లేడిని సీతచూచింది. దాని అంగాలన్నీ పరమా నందంగావున్నాయి. "దేవా! రామచంద్రా! ఈ మృగం యొక్క చర్మము చాలా అందంగా ఉండవచ్చు. ప్రభూ! దీనిని వధించి దీని చర్మం తెచ్చి యివ్వండి" అంది సీత. రామునకు అన్ని విషయాలు తెలిసీ కూడా సంతోషంగా దేవతల కార్యాలను దృష్టిలో ఉంచుకొని

లేచి, లేడిని చూచి నడుముకు అంబులపొది కట్టుకున్నాడు, చేతిలోకి ధనస్సు, బాణాలు తీసికొని ఎక్కుపెట్టి, లక్ష్మణునితో శ్రీరాముడు అన్నాడు-"సోదరా! వనంలో ఎంతోమంది రాక్షసులు తిరుగుతూ ఉంటారు. నీవు నీ బుద్ధిని, వివేకాన్ని, బల, సమయాలను బట్టి సీతను జాగ్రత్తగా కాపాడుతూ ఉండు."

ప్రభువు లక్ష్మణునితో సీతను గురించి చెప్పి, మృగం వైపు వెళ్ళాడు. ఆ లేడి శ్రీరామచంద్రుని చూడగానే పరుగులు తీసింది. ఆయన ధనస్సు చక్కచేసికొని దాని వెంట పరుగెత్తాడు.

ప్రభువును, వేదాలు 'నేతినేతి' (లేదు,లేదు) అంటున్నాయి. శివుడు ధ్యానంలో కూడా ఆ ప్రభువును తెలిసికోలేకపోతున్నాడు. అలాంటి అన్నీ తెలిసిన వాడు, లోకానికి అంతుపట్టనివాడు, మాయ లేడి వెంట పరుగెత్తాడు. ఆ లేడి ఒకప్పుడు దగ్గరలో వున్నట్లు కన్పిస్తున్నది, అంతలోనే దూరంగా పారిపోతున్నది. ఒకప్పుడు కనబడుతున్నది, మరొకప్పుడు కనుపించడం లేదు. ఈ విధంగా, కన్పించీ, కన్పించకుండా, మోసగిస్తూ, ప్రభువును చాలా దూరం తీసుకెళ్ళింది. అప్పుడు శ్రీరామచంద్రుడు అలసిపోయి, దానిని పదునైన బాణంతో కొట్టాడు. ఆ బాణం తగులగానే, పెద్దగా అరచినేలమీదపడిపోతూ మొదట లక్ష్మణుని పేరును పిలిచింది, తరువాత మనస్సులో రాముని తలచుకొని ప్రాణాలు వదలేసమయంలో మారీచుడు, తన రాక్షస శరీరాన్నిదాల్చి, ప్రేమతో రాముని స్మరించుకున్నాడు వాని హృదయంలోని ప్రేమను చూచి ప్రభువైన శ్రీరామచంద్రుడు వానికి మునులకు కూడా లభించని ముక్తిని ప్రసాదించాడు. దేవతలు పూలవర్షం కురిపించి, ప్రభువైన రామచంద్రుడు రాక్షసునకు కూడా తన వద్ద స్థానమిచ్చాడని, ఆయన గుణాలను స్తుతించారు.

ఇక్కడ సీత దుఃఖంతో కూడిన హా లక్ష్మణా అన్న పలు

కులు వినగానే గాబరాపడి లక్ష్మణునితో-"లక్ష్మణా! తొందరగా వెళ్ళు మీ అన్నయ్య చాలా చిక్కుల్లో వున్నట్లున్నాడు." అంది.

"మాతా! విను. శ్రీరాముడు కన్నెత్తి చూచినా, ఆయన తలచు కొన్నా సృష్టియే నాశమయిపోతుంది, అలాంటి అన్నయ్యకు కలలో నైనా సంకటాలు సంభవిస్తాయా" అన్నాడు లక్ష్మణుడు.

సీత లక్ష్మణుని మాటలు విని అనరాని మాటలంది. అప్పుడు భగవంతుని ప్రేరణతో ఆయన మనస్సు కూడా చలించింది, సీతను వనానికి, దిక్పాలకులకు ఒప్పగించి, చంద్రుని రూపంలో వున్న రావణుని మ్రింగివేయడానికి రాహువు రూపంలోవున్న శ్రీరామచంద్రుని వద్దకు వెళ్ళాడు.

రావణుడు, ఎవ్వరూ సీతవద్ద లేరని తెలిసికొని సన్యాసివేషం లో వచ్చాడు. ఆయనంటే దేవతలు వణికిపోతున్నారు, వారికిరాత్రిప్పు నిద్రపట్టడంలేదు, అన్నం సయించడంలేదు. అలాంటి రావణుడు ఇటు అటు చూస్తూ. దొంగతనం చేయడానికి వెళ్ళే, వాని మాదిరిగా వెళ్ళాడు.

కాగభుషుండి గరుడునితో చెబుతున్నాడు-"గరుడా! ఇలా చెడ్డ మార్గంలో పయినించదలచిన వారికి, అడుగువేయగానే శరీరంలోని తేజస్సు, బుద్ధి ఏ మాత్రం పని చేయకుండాపోతాయి.

రావణుడు రకరకాల కథలు చక్కగా చెప్పి, సీతకు రాజ నీతి, భయం, ప్రేమలు చూపించాడు. సీత అంది-"స్వామీ! మీరు దుర్మార్గుడు మాట్లాడవలసిన మాటలు మాట్లాడుతున్నారు."

రావణుడు తన అసలు రూపం చూపి, పేరు చెప్పగానే సీత భయపడి పోయింది. కాని ధైర్యంగా-"దుష్టుడా! నిలబడుచూద్దాం, ప్రభువు వస్తున్నాడు, రాక్షసరాజా! సింహాన్ని తుచ్ఛమైన నక్కతీసు కెళ్ళటకు సిద్ధమయినట్లుగా, నీకు పోయేకాలందాపురించి, ఏవేవో

మాట్లాడుతున్నావు." అంది.

ఈమె మాటలు విన్న రావణునకు అమితమైన కోపం వచ్చింది. కాని, మనస్సులో సీత పాదాలకు నమస్కరించి సుఖాన్ని పొందాడు. మళ్ళా క్రోధమభినయించి సీతను రథంలో ఎక్కించుకుని వేగంగా, ఆకాశమార్గాన వెళ్ళిపోయాడు. కాని భయంచేత అతను రథాన్ని తోలలేక పోతున్నాడు.

ఆసమయంలో సీత ఏడుస్తూ- "జగత్తులో ఒకే ఒక వీరుడవైన రఘునాథా! నేనేమి అపరాధం చేశానని, నాయందు దయచూపడం మాని వేశావు? దుఃఖాలను దూరం చేసేవాడా! సుఖాలను ప్రసాదించు ప్రభూ! రఘుకుల రూపమైన కమలాలకు సూర్యునివంటిరామా! లక్ష్మణా! నీతప్పేమీలేదు. నేను కోపగించుకున్నాను, అందుకు ఫలం ఇప్పుడే దక్కింది." ప్రభువుకు నా మీద దయ ఉన్నా. ఆ ప్రభువు దూరంలో వున్నాడు. నాయీ ఆపదను ప్రభువుకు చెప్పే దెవరు? యజ్ఞ భాగాన్ని గాడిద తినాలనుకుంటున్నది." అని పరి పరి విధాల అనుకుంటూవుంది.

సీత ఏడ్పులు విని చరాచర ప్రాణులు దుఃఖపడుతున్నాయి. పక్షిజాతిలో శ్రేష్ఠుడయిన జటాయువు, ఈ ఏడ్పు విని రఘువంశ భూషణుడయిన రాముని భార్య సీతను కటిక వాని చేతిలో చిక్కిన కామధేనువు లాగా, నీచుడైన రాక్షసుడు తీసుకొని వెళ్ళడం చూచి "బిడ్డా, సీతా! భయపడవద్దు, నేనీ రాక్షసుని నాశనం చేస్తాను." అంటూ క్రోధంతో జటాయువు,పర్వతం వైపుకు వజ్రం పడిపోతున్న ట్లుగా, పైకురికి "అరే, దుర్మార్గుడా! నిలబడరా, నిర్భయంగా వెళ్ళు తున్నావు, నన్నెరుగవా?" అంటూ కాలునితో సమానమైన జటా యువు రావడంచూచి రావణుడు- "ఇది మైనాక పర్వతమయినా కావాలి, లేదా గరుడు డయినా అయివుండాలి. కాని అతను తన

ప్రభువు హరి సహితంగా నాబలాన్ని ఎరుగు" అని ముందు ఊహించి తరువాత మరల- "ఇతను ముసలి జటాయువు, ఇతను నాచేతి రూప మైన తీర్థంలో శరీరాన్ని వదలి వేస్తాడులే" అనుకున్నాడు.

ఇతని మాటలు వినగానే, జటాయువు క్రోధంతో పరుగెత్తి- "రావణా! నా ఉపదేశం విను. జానకిని ఇక్కడ వదలి క్షేమంగా తిరిగి వెళ్ళు, లేకపోతే, ఎక్కువ చేతులున్నవాడా! శ్రీరాముని క్రోధ రూపమైన మహాప్రచండమైన అగ్నితో నీ వంశమంతా దీపపు పురుగులాగా భస్మమయి పోతుంది" అన్నాడు.

యోధుడైన రావణుడు ఏమీ జవాబివ్వలేదు, జటాయువు క్రోధంతో పరుగెత్తి, రావణుని జుట్టు పట్టుకొని రథంమీదనుండి పడలాగాడు. అతను నేలమీద పడిపోయాడు. జటాయువు సీతను కొంచెం దూరాన కూచోపెట్టి మరల తిరిగివచ్చి, తన ముక్కుతో అతని శరీరమంతా పొడిచాడు రావణునికి ఒక్క ఘడియ మతి పని చేయకుండా పోయింది.

రావణుడు తెప్పరిల్లి, పదునైన కత్తిని తీసి, జటాయువు రెక్కలు నరికేశాడు. పక్షిరాజు జటాయువు శ్రీరాముని స్మరించు కుంటూ భూమిమీదపడి పోయాడు.

రావణుడు సీతను మళ్ళీ రథం మీద ఎక్కించుకొని పోతు న్నాడు కాని అతనికి లోపల భయములేకుండాలేదు. ఆకాశమార్గంలో విలపిస్తున్న సీత, వేటగాని చేతిలో చిక్కనలేడి భయపడుతూ అతని వెంట వెళుతున్నట్లుగా, వెళ్ళుతున్నది.

పర్వతాలమీద వానరులు కూచుని యున్నారు. సీత వారిని చూచి, తన వద్ద వస్త్రాలు, రాముని పేరు ఉచ్ఛరిస్తూ, క్రిందపడ వేసింది. రావణుడు ఆమెను ఇలాగా తీసుకెళ్ళి, అశోక వాటికలో

ఉంచాడు. తరువాత, అదుష్టరావణుడు సీతను అనేక రకాలుగా భయపెట్టి, ప్రేమ ఒలకపోసి, ఏమీ చేయడానికి తోచక అశోక వృక్షం క్రిందనే ఆమె నుంచి, ఎన్నో ప్రయత్నాలయినాక, ఆమెవద్ద కొందరిని కాపలాగావుంచి, వారితో ఆమె మనస్సు నెలాగైనా మార్చమని చెప్పి వెళ్ళాడు. శ్రీరాముడు మాయలేడితో పరుగెత్తి నప్పుడు ఉన్న ఆనందంతో సీత హృదయంలో హరి నామాన్ని స్మరించు కుంటూవుంది.

శ్రీరాముడు లక్ష్మణుడు తనవద్దకు రావడం చూచి, చాలా! చింతించి- "సోదరా! జానకిని ఒంటరిగా వదలి, నేను నీతో చెప్పినట్లు నడుచుకొనక, నావద్దకు వచ్చావన్నమాట! రాక్షసులు గుంపులు గుంపులుగా తిరుగుతున్నారు. సీత ఆశ్రమంలో లేదనిపిస్తున్నది నాకు" అన్నాడు. అప్పుడు లక్ష్మణుడు చేతులు జోడించి- "ప్రభూ ఈ రావడంలో నాతప్పేమీ లేదు" అన్నాడు.

శ్రీరామచంద్రుడు లక్ష్మణునితో కలసి, గోదావరి ఒడ్డున ఆశ్రమమున్న చోటుకు వెళ్ళారు. సీతలేని ఆశ్రమాన్ని చూచి. రామ చంద్రుడు, సాధారణ మానవుడు దీనుడై పోయినట్లుగా, వ్యాకుల పడి పోయాడు. ఆయన దుఃఖమాగలేదు.

"అయ్యో! గుణాలకు గని అయిన జానకీ! రూప, శీల, వ్రత, నియమాలలో పవిత్రురాలవయిన సీతా!" అంటూ విలపించాడు శ్రీరామచంద్రుడు.

లక్ష్మణుడు ఎన్నో విధాల ఓదార్చ ప్రయత్నించాడు. కాని లతలను చెట్లను అడుగుతూ రాముడు వెళ్ళుతున్నాడు.

"ఓ పక్షులారా! ఓ మృగములారా! మీరెక్కడయినా లేడి కన్నులతో సమానమైన కళ్ళుగల మా సీతను చూచారా! కాటుక పిట్టలారా! చిలుకలారా! పావురములారా! లేళ్ళు! చేపల! తుమ్మెదల

గుంపులారా! కోకిలలారా! మీరేమైనా మా సీతను చూచారా?

తామర పూవులారా! దానిమ్మపూవులారా! కమలములారా, శరత్పూర్ణిమ చంద్రుడా! నాగదాములారా! కామధేనువా, హంసా! ఏనుగులారా! సింహములారా! మీలో ఎవరైనా మా సీతను చూచారా!

పనసలు, బంగారం. అరటి, ఇవన్నీ సుఖంగా వున్నాయి. వీటికి ఏ దుఃఖాలు, తమ మనస్సులలో లేవు. జానకీ విను. నీవు లేకుండా, వీటివే రాజ్యమంతా అనుకొని సంతోషిస్తున్నాయి."

ప్రియురాలా! జానకీ వీటి ఆనందాలను చూచి నీవు ఎలా సహించగల్గుతున్నావు? నీవు ఎక్కడా కనపడవు?" అంటూ శ్రీరామ చంద్రుడు సీతను వెదకుచూ, మహావిరహంలో వున్న వానిలాగా, మహాకామ కోర్కెలలో మునిగియున్న వానిలాగా, విలపిస్తూన్నాడు.

శ్రీరాముడు పూర్ణకాముడు, సుఖాలకు నిలయమైనవాడు అయనకు జన్మలేదు, నాశనంలేని భగవంతుడు, మనుష్య లీలలు చేస్తున్నాడు. కొంచెంముందు కెళ్ళి గరుడరాజు పడియున్నట్లు చూచాడు. అతను ప్రభువు పాదాలను స్మరించుకుంటూ వున్నాడు. అతని వంటిమీద గాయాలున్నాయి.

దయాసాగరుడయిన శ్రీరామచంద్రుడు జటాయువు తలమీద చేయిపెట్టి నిమిరాడు. శోభలన్నింటికి నిలయమైన శ్రీరామచంద్రుని ముఖాన్ని చూడగానే అతని బాధలన్నీ మటుమాయమై పోయాయి. అప్పుడు జటాయువు ధైర్యంగా—

"ప్రపంచపు దుఃఖాలన్నింటిని దూరంచేసే శ్రీరామచంద్రా! విను, రావణుడు నన్నీదశలో ఉంచి వెళ్ళాడు. అతనే, దుర్మార్గంగా జానకిని తీసికొనివెళ్ళాడు. స్వామి! కీచుపిట్టలాగా అరుస్తూ, విలపిస్తూ వున్న సీతను దక్షిణ దిక్కుగా తీసుకెళ్ళి పోయాడు. నేను మీ దర్శనం చేసి కోవాలను ఆశతో ప్రాణాలు పోకుండా ఆపుకున్నాను.కృపా

నిధీ! ఇప్పుడే ప్రాణాలు పోబోతున్నాయి." అన్నాడు.

"సోదరా! నీ శరీరాన్ని ఉంచు" అన్నాడు రాముడు.

మృత్యుసమయంలో మీనామమును స్మరించినంతమాత్రాన దుర్మార్గుడు కూడా ముక్తిని పొందుతాడని, వేదాలు చెప్తున్నాయి. అలాంటి మీరు కళ్ళెదుట దర్శనమిస్తున్నారు. ప్రభూ! ఇక ఇప్పుడు ఎవరి కోసం, ఎందుకు ఈ దేహాన్నుంచాలి?" అన్నాడు జటాయువు.

రామచంద్రుడు కళ్ళంట నీళ్ళు పెట్టుకొని-"సోదరా! నీవు చేసిన కర్మల వలన ఉత్తమస్థితిని పొందావు. ఇతరులకు మంచిచేయా లనుకున్నవారికి ప్రపంచంలో దుర్లభమేమీలేదు. అయ్యా! ఇప్పుడు శరీరాన్ని వదలి నా వదకు రమ్ము. నీకు నేనేమి ఇచ్చేది? నీవే పరి పూర్ణుడవు. నీకు కావలసినదేమీ మిగిలిలేదు.

అయ్యా! వైకుంఠానికి వెళ్ళినప్పుడు, నాన్నగారితో సీత అప హరణ సంగతి ఆయనతో చెప్పబోకు. నేనే రాముడనయితే, అతను కులసహితంగా అక్కడికి వెళ్ళి మా తండ్రితో అన్ని విషయాలు చెప్తాడు." అన్నాడు.

జటాయువు శరీరాన్ని వదలి భగవంతుని రూపాన్ని పొందాడు. అనేకమైన భూషణాలు, అందమైన పీతాంబరాలు ధరించినవాడు, శ్యామవర్ణ శరీరంగలవాడు. విశాలమైన నాలుగు భుజములవాడు, కళ్ళంట నీళ్ళు పెట్టుకొని వున్న వాడయిన శ్రీరామచంద్రుని స్తుతించ సాగాడు.

"రామా! మీకు జయమగుగాక! మీ రూపమువారు మరొక రుండడానికి వీలులేదు. మీరు నిర్గుణులు, సగుణులు, గుణాలను ప్రేరేపించేవారు కూడాను. పది తలలుగల రావణుని బలమైన భుజా లను నరికి వేయడానికి అవతరించారు. మీరు ప్రచండమైన బాణా లను ధరించియున్నవారు, భూమికి భూషణరూపమైనవాడవు, మేఘ

వర్ణపుఛాయగల వాడవు, కమలముతో సమానమైన ముఖంసీది, నీల కమలాలలాంటి విశాలమైన నేత్రాలు కలవాడవు, దయగలవాడవు, సంసార భయాలను దూరం చేసే కృపాళువు నీవు, నీకు నమస్కారం చేస్తున్నాను రామచంద్రా!

మీ బలము అంతు తెలియనిది, మీరు ఈ నాటి వారు కారు, మొదటినుండి వున్నవారు, మీకు పుట్టుకలేదు, మీరు కనిపించరు, మీరు అర్థం కారు, గోవుల కాపరులు, ఏకైక రూపులు, మీకు తెలియని విషయాలంటూ లేనివారు, భూమిని అంటిపెట్టుకొని వున్నారు.

అంతటానిండియున్నరామా! మీరు మీ 'రామ' నామాన్ని జపించిన భక్తులకు ఆనందాన్ని కలిగిస్తూ ఉంటారు. ఏ కోర్కెలు లేకుండా మీ యందు భక్తివుంచి, మీ నామస్మరణ చేస్తున్న వారి కామ, క్రోధ, లోభ మోహాములు నాశనం చేస్తారు. రామచంద్రా! మీకు నేను ఎల్లప్పుడు నమస్కరిస్తూ ఉంటాను.

మిమ్ము, అనేకమంది మునులు ధ్యాన, జ్ఞాన, యోగాలు మొదలైన వాటితో పొందగల్గుతున్నారు. మీరే, కరుణాసాగరులయి, శోభలను ప్రకటించి, జడచేతన ప్రాణులకు మోహం కల్గిస్తున్నారు. అనేకమంది మన్మథులకంటే అందమైన మీరు నా హృదయకమలంలో తుమ్మెదలాగా శోభాయమానంగా ఉండిపొమ్మని కోరుకుంటున్నాను.

మీరు అంతుపట్టేవారికి అంతుదొరుకుతారు, అంతుపట్టనివారికి ఎప్పటికీ అంతు దొరకరు. మిమ్ము తెలసికొనగోరువారు మీరు చెప్పిన మార్గాన నడచుకొంటే, మీరు వెంటనే దర్శనమిచ్చివారికి ముక్తినిస్తారు. మీరు చెప్పినట్లు నడచుకొనని వారికి మీరు ఎన్నడూ కనిపించరు. మీరు చెప్పిన విషయాలన్నీ వేద, వేదంగాలలో పరిపూర్ణంగా ఉన్నాయి.

మీ స్వభావం నిర్మలమైనది. మీ స్వభావంలో మంచికి మంచీ

వుంది, వెడుకు వెడూవుంది. మీరెల్లప్పుడు నిమ్మకు నీరెత్తినట్లు శాంతంగా ఉంటారు. మనస్సును, ఇంద్రియాలను అదుపులో పెట్ట గలిగినప్పుడు యోగులు మిమ్మ చూడగల్గుతున్నారు. ఆ మీరు పర మాత్మ స్వరూపులైన రామచంద్రుడు, లక్ష్మీనివాసులు, ఎల్లప్పుడు భక్తజనుల హృదయాల్లో నివసించే త్రిలోకాలకు నాధులు. మీ పవి త్రమైన కీర్తి, చావు పుట్టుకలు లేకుండా చేస్తుంది. అలా మీరు నా హృదయంలో నివసించమని కోరుచున్నాను."

ఇలా జటాయువు అంతులేని భక్తి వరాన్ని కోరుకొని వైకుం ఠానికి వెళ్ళిపోయాడు. అప్పుడు రామచంద్రుడు తన చేతులతో ఆయ నకు అంతిమసంస్కారాలు, నియమపూర్వకంగా చేశాడు.

శ్రీరామచంద్రుడు చాలా సున్నితమైన మనస్సుగలవాడు, దీనుల యందు దయ చూపువాడు. ఆయన కారణం లేకుండానే దయ చూపుతూ ఉంటాడు. జటాయువు పక్షిజాతి వాడు, మాంసము తినే వాడు, అతనికి యోగులు కోరే కోర్కెలను తీర్చి, తృప్తి పరచాడు.

"పార్వతీ! విను, హరిని వదలి సాంసారిక విషయాల్లో తలలు దూర్చేవారు దురదృష్ట వంతులు. తరువాత అన్నదమ్ములిద్దరు సీతను వెదుక్కుంటూ దట్టమైన అరణ్యాల్లోకి వెళ్ళారు.

## 22

నాకు దుర్వాసుడు శాపమిచ్చాడు. అది ఈ రోజు ప్రభు దర్శ నంతో విమోచనమయిపోయింది. ఈ మాట విని శ్రీరామచంద్రుడు- "కబంధా నేను చెబుతున్నాను విను, నాకు బ్రాహ్మణులకు ద్రోహం చేసే వాడు నచ్చడు. మనసా, వాచా, కర్మణా, కపటం లేకుండాలి బ్రాహ్మణుల సేవలు చేసిన వారి వశంలో, నేనూ, బ్రహ్మ, శివుడు

మొదలైన వారందరం, వుంటాం.

"శాపమిచ్చినా, చంపినా, కొట్టినా, కఠినంగా మాట్లాడినాకూడా విప్రులు పూజనీయులే అని భక్తులు, సాధువులు అంటున్నారు. బ్రాహ్మణులు శీలములేని వారైనా పూజ్యులే, గుణవంతులు, జ్ఞానులు అయిన శూద్రులు మాత్రం పూజనీయులు కారు."

శ్రీరాముడు భక్తుల ధర్మం అతనికి తెలియజెప్పి, తనపాదాల వద్ద కబంధునకున్న ప్రేమను తెలిసికొనిన పిదప కబంధునకు సన్నిహితమైననాడు, అతను శ్రీరామచంద్రుని పాదాలకు వంగి నమస్కరించి తనకు ముక్తి లభించినదని తెలిసికొని ఆకాశమార్గాన గంధర్వ లోకానికి వెళ్ళిపోయాడు.

ఉదారుడైన రాముడు అతనికి ముక్తిని ప్రసాదించి శబరి ఆశ్రమానికి వెళ్ళాడు. శ్రీరాముడు వచ్చిన సంగతి తెలిసి శబరికి మతంగ ముని అన్నమాటలు జ్ఞప్తికి వచ్చి, హృదయంలో ఎంతో సంతోషం కలిగింది.

కమలాల్లాంటి కన్నులు గలవానిని, విశాలమైన భుజాల వానిని తనమీద జడలముడులున్న వానిని, హృదయాన వనమాల ధరించియున్న వానిని, వామనచాయ, ఎర్రనిరంగు శరీరాలు గల ఇద్దరన్నదమ్ములను చూచి శబరి వారి పాదాలమీద పడింది. ఆమె ప్రేమకు అంతులేకుండావుంది. ఆమె ప్రేమలో మాట్లాడలేక పోయింది, మాటి మాటికి వారి పాదాలమీద తలవంచుతున్నది. నీళ్ళుతెచ్చి ఆదరంగా కాళ్ళు కడిగింది, ఆసనాలమీద కూర్చోబెట్టింది.

శబరి ఎన్నోరకాల, రుచికరమైన కంద, మూల, ఫలాలు తెచ్చి శ్రీరామునికిచ్చింది. ప్రభు రామచంద్రుడు ప్రేమగా తిని. వాటి రుచులను ఎంతగానో పొగడాడు.

ఆమె చేతులు జోడించి ప్రభువుకు ఎదురుగా నిలుచుంది.

ప్రభువును చూడగానే ఆమె హృదయంలో ప్రేమపొంగులు వారింది. "ప్రభూ! నేను మిమ్ము ఎలాస్తుతించేది? నేను ఆటవికజాతిరాలను, నాబుద్ధి చాలా స్వల్పమైనది. నేను అతి మూర్ఖురాలను అంది శబరి.

"సోదరీ! నేను కేవలం భక్తిని మాత్రం చూస్తాను. జాతి, మత, కుల, ధర్మాలు, గొప్పతనం, ధనబలాలు, కుటుంబ గుణాలు, తెలివి చాతుర్యం మొదలైనవి ఉన్నప్పటికీ భక్తిలేని మనిషి. నీళ్ళు లేని మేఘాల్లాగా కనిపిస్తాడు, అనిపిస్తాడు నాకు-ఇప్పుడు నీకు నేను తొమ్మిది విధాల భక్తులను (భజనలను) చెపుతున్నాను. జాగ్రత్తగా విను మనస్సులో స్మరించుకో.

మొదటి భక్తి మంచివారితో కలసి ఉండడం, రెండవది నా కథా ప్రసంగాలను వినుటయందు శ్రద్ధకలిగి ఉండడం, మూడవ భక్తి, అభిమానాన్ని వదలివేసి గురువు పాదకమలాలకు సేవలు చేయడం, నాల్గవది కపటము వదలి నాగుణాలను గానం చేయడం, అయిదవది నాయందు గట్టినమ్మకముంచి, మంత్రాలుజపిస్తూ, పూజలు చేస్తూ ఉండడం, ఇవి వేదాలలో ప్రసిద్ధమైనవిగా ఉండాలి. ఆరవ భక్తి, ఇంద్రియాలను అదుపులో నుంచుకొని, అనేక కోర్కెలనుండి విరక్తిచెంది, సజ్జనుల ఆచార ధర్మాలయందు ప్రేమవుంచడం, ఏడవ భక్తి చరచరాలన్నింటియందు రాముడునిండి ఉన్నాడను కోవడం, భక్తులను నాకంటే శ్రేష్ఠులని తలచడం. ఎనిమిదవ భక్తి, లభించిన దానితో తృప్తిపడడం, కలలో కూడా ఇతరుల దోషాలను ఏ కరువు పెట్టకుండా వుండడం, తొమ్మిదవ భక్తి, అందరితో మంచి భావాల తోను, పక్షపాతం లేకుండాను మెలగడం. హృదయంలో నామీద నమ్మకం ఉంచి, మరేవిధమైన ఆనందాలకు, వినయాలకు లోను గాకుండా ఉండడం, ఈ తొమ్మిది రకాల భక్తి భావాలలో ఏ ఒక రకమైన భక్తి ఉన్నా, వారు స్త్రీ పురుషులుగాని, చరాచర ప్రాణులు

గాని, నాకు ఎంతో ప్రియులు.

నీ భక్తి అన్నివిధాల శ్రేష్ఠమైనది. యోగులకు కూడా లభింపని ముక్తిని ఈ రోజు నీకు సహజంగానే ప్రాప్తించింది. నాదర్శనమయినంత మాత్రాన జీవులు తమ సహజరూపాలను పొందుతారు, నీకు మందగమని అయిన జానకి జాడ ఏమయినా తెలిసివుంటేచెప్పు.

"రఘునాథా! మీరు పంపాసరోవరానికి వెళ్ళండి. మీకక్కడ సుగ్రీవునితో స్నేహం కుదురుతుంది. దేవా! మీకు సమాచారమంతా ఆయన చెప్తాడు. మీకు తెలియని విషయాలేమీ లేకపోయినా, మీరు నన్నడుగు తున్నారు." అంటూ మాటి మాటికీ ప్రభు రామచంద్రుని పాదాలయందు తలవంచింది.

భగవానుని దర్శించుకొని, ఆయన పాదాలను తన హృదయంలో ఉంచుకొని, యోగులు అగ్నిద్వారా దేహాన్ని వదలివేసి జన్మసాఫల్యం చేసుకొనునట్లుగా, ఆమె మళ్ళీ జన్మలేకుండా ఉండు విధంగా, హరిపాదాలలో కలసిపోయింది.

తులసీదాసు అంటున్నాడు- "మానవులారా! మీరు అనేక రకాలైన పాపకర్మలు, దుంఖాలను కలిగించు అనేక మత, కుల, తగాదాలను వదలి పెట్టండి. నమ్మకంతో శ్రీరామచంద్రుని పాదాలయందు ప్రేమ వుంచండి. అరే, మూర్ఖుడా! ఆటవిక జాతిలోపుట్టి, పాపాలకు పుట్టినిల్లయిన స్త్రీని ముక్తురాలను చేసిన ప్రభువును మరచి, నీవు ఇంకెక్కడ సుఖం పొందగల్గుతావు?"

ఆ ప్రదేశాన్ని వదలిశ్రీరామచంద్రుడుముందుకుసాగి వెళ్ళాడు. ఇద్దరు, అంతులేని బలవంతులైన వారిలో సింహాలలాంటి వారు, ప్రభువు విరహునిలాగా దుఃఖపడుతూనే అనేకానేక కథలు చెప్తూ-

"లక్ష్మణా! కొంచెం ఈ వనం యొక్క సొగసును చూడు.

దీనిని చూడగానే ఎవరి మనస్సు అతా కుతలం కాదు? ఇక్కడ పశు పక్ష్యాదులన్నీ కలసి, నన్ను నిందుస్తున్నవా, అన్నట్లు స్త్రీ పురుషుల జంటలుగా ఉన్నాయి.

మనలను చూచి లేళ్ళ గుంపులు పారిపోతున్నాయి, అప్పుడు ఆడలేళ్ళు వీరిని చూచి మీరు భయపడ నక్కరలేదు, మీరు సాధారణమైన లేళ్ళు, అనందంగా మీరుండవచ్చు, వీరు బంగారు లేళ్ళను వెదుకడానికి వచ్చారులే అంటున్నాయి.

ఆడఏనుగులు, మగఏనుగులు జంటలుగా వుండి, స్త్రీని వదలి వుండకూడదని, నాకు బుద్ధి చెప్పుతున్నట్లుగాను, రకరకాల ఆలోచనలు చేస్తూ, శాస్త్రాలను కూడా మాటిమాటికి చూస్తూ ఉండాలని, ఉత్తమ పద్ధతిలో సేవలు చేసిన రాజును కూడా తమ వశంలో వున్నాడనుకోకూడదనియు, స్త్రీని హృదయానికి హత్తుకొని ప్రేమలు ఒలకపోసినా, స్త్రీ, రాజు ఎవరి వశంలో ఉండరని, అంటున్నట్లుగావున్నాయి ఈ జంటలు.

సోదరా! వసంత ఋతువు ఎంత హాయిగా ఉందో చూడు. కాని ప్రియమైన జానకి లేని లోటు నాకు మాత్రము భయంకరంగా వుంది. నా విరహవేదనను, నా బలహీనాన్ని, ఒంటరిగా వుండడం గమనించిన వనంలోని తుమ్మెదలను, పక్షులను వెంట తీసికొని వచ్చి మన్మధుడు నాకు పిచ్చెత్తెక్కిస్తున్నాడు, కాని, ఆయన దూత, నేను ఒంటరిగాలేను, సోదరునితో కలసియున్నాను' అని చెప్పిన మీదట మన్మధుడు అతని పరివారంతో సహా తమ నివాసాలకు వెళ్ళిపోయారు.

విశాలమైన వృక్షాలు వున్నాయి. వాటిమీద తీగలు అనేక రకాలైన గుడారాలు ఏర్పరబాయన్నట్లుగా ఉన్నాయి, అరటితోటలు, తాటిచెట్లు అందమైన జండాల్లాగా ఉన్నాయి. వీటిని చూచిన తరువాత కూడా, మోహం చెందని వాడే ధైర్యవంతుడను కోవాలి

అనేక వృక్షాలు అనేక రకాలుగా పూచివున్నాయి. వాటిని చూడగానే, అనేక పద్ధతుల్లో విలుకాడు హెంచివున్నాడా, అనిపిస్తు న్నాయి. కొన్నిచోట్ల, యోధులు డేరాలు నిర్మించుకొని వున్నారా, అన్నట్లుగా అందమైన చెట్లు ఆకర్షవంతంగా ఉన్నాయి.

కోయిలలు కూస్తున్నాయి, వాటికూతలు వింటుంటే, ఏనుగులు ఘీంకరిస్తున్నాయా,అన్నట్లుగావుంది. కోకిలలు గోరువంకలు, ఒంటెలు కంచరగాడిదలు కావు గదా యను అనుమానమొస్తున్నది. నెమళ్ళు, చకోరాలు, చిలుకలు, పావురాలు, హంసలు, మదించిన గుఱ్ఱాలా అన్నట్లుగా వున్నాయి.

పర్వతాలరాళ్ళు, సెలయేళ్ళ వాయిద్యాల్లాగా వున్నాయి. బాతక పక్షులు గుణాలను పొగడుతూ ఉండు వందిమాగధుల్లాగా ఉన్నాయి,

తుమ్మెదలు రొదలే సన్నాయిమేళం. మూడు రకాలయిన గాలులు దూతలయి వచ్చినట్లుగా ఉన్నాయి ఈ విధంగా కామదేవుడు తన చతురంగ సైన్యాన్ని వెంటబెట్టుకొని, అందరిని రెచ్చగొడ్తూ తిరుగు తూ ఉన్నాడు.

లక్ష్మణా! మన్మధుని చూచి కూడా, ధైర్యంగా ఉండగలిగే వారు మాత్రమే శ్రేష్ఠులు. కామదేవుని బలమంతా స్త్రీయే. అక్కడ తట్టుకోగల్గిన వారందరు ధీరులే.

సోదరా! కామ, క్రోధ, లోభాలు మూడు మనిషిని, అతి దుర్మా ర్గంలోకి దించేస్తాయి. ఇవి నిష్ఠాపరులైన జ్ఞానులను, మునులకు కూడా బోల్తా కొట్టిస్తాయి క్షణంలో, లోభానికి బలం కోరికలు, గర్వమూ కామానికి బలం నిచ్చేది, కేవలం స్త్రీయే. క్రోధానికి బలం కఠోర వచ నాలు పలుకడం అని ఋషులు బాగా కాచి వడపోసి తెలిసికొని అన్న మాటలివి "

"పార్వతీ! గుణాలకు కూడా అందని, చరాచరులకు ప్రభువైన

శ్రీరామచంద్రుడు అంతటా నిండియున్నాడు. ఆయన కోర్కెలున్న వారిని దీనులుగా చేశాడు, ధైర్యవంతులకు వైరాగ్యాన్ని ధృఢపర వాడు. కామ, క్రోధ, లోభ, మద, మాయలన్నీ రామచంద్రుని దయ వుంటే దగ్గరకు రాలేవు. ఆయన దయకు పాత్రులయినవారు మాయకు చిక్కరు.

పార్వతీ! నేను నా అనుభవాన్ని చెబుతున్నాను విను, భగ వంతుని పూజలు, కీర్తనలు నిజం, ప్రపంచమంతా కలలాగా మాయ" అన్నాడు శివుడు.

శ్రీరామచంద్రుడు అందమైన, లోతైన పంపాసరోవరం ఒడ్డు కుచేరుకున్నాడు. అక్కడి నీళ్ళు భక్తుల హృదయాల్లాగా నిర్మలంగా ఉన్నాయి. మనస్సు నాకర్షించు నాలుగు రేవులున్నాయి. దాతయింటి వద్ద యాచకుల గుంపులున్నట్లుగా, లేళ్ళు నీళ్ళు త్రాగుతూ ఉన్నాయి.

తామర కమలపు టాకులు దట్టంగా ఉన్నందున, నీళ్ళు తొం దరగా కనిపించడంలేదు. ఆ నీళ్ళు మాయకమ్మియున్నవారికి నిర్గుణ బ్రహ్మ కనబడనట్లుగా ఉన్నాయి. ఆ సరోవరంలో చేపలన్నీ లోతైన నీళ్ళలో ఒకేలాగా కన్పిస్తుంటాయి. ధర్మాత్ముడైన మానవుని రోజులు సుఖంగా గడచిపోయినట్లుగా ఆ చేపల జీవితాలు ఉన్నాయి.

ఆ సరోవరంలో అనేక రకాలయిన కమలాలు వికసిస్తున్నాయి. తియ్యని స్వరాలతో తుమ్మెదలు రొదలు చేస్తున్నాయి. నీటికోళ్ళు, హంసలు, ప్రభువును చూచి,ఆయనను పొగడుతున్నాయా, అన్నట్లుగా కూస్తున్నాయి.

చక్రవాకాలను, కొంగలను చూస్తేబాలు, తనవి తీరిపోతుంది. అందమైన పక్షులు, బాటసారులను పిలుస్తున్నాయా, అన్నట్లుగా అం దంగా పలుకుతున్నాయి.

సరోవరానికి దగ్గర్లో మునుల ఆశ్రమాలున్నాయి. వాటికి

నాల్గువైపులా వనాలు, చెట్లు క్రిక్కిరిసి ఉన్నాయి. సంపెంగ, పొగడ, కడిమి, వీకటిమ్రాను, తమలపాకు, పనస, మామిడి మొదలైన అనేక చెట్లల్లో క్రొత్త క్రొత్త ఆకులు, పూలు వికసిస్తున్నాయి. తుమ్మెదల గుంపులు రొదలు చేస్తున్నాయి. అక్కడ సహజంగా మనస్సును ఆకట్టుకొను శీతల, మంద, సుగంధితవాయువులు వీస్తున్నాయి. కోయిలలు కుహూ-కుహూ అని ధ్వనులు చేస్తున్నాయి. ఆ రసవంతమైన శబ్దాలను విన్న మునుల ధ్యానాలు కూడా నిలకడగా ఉండడంలేదు. పండ్ల బరువువల్ల చెట్లన్నీ నేలమీదకు వంగి ఉన్నాయి. వాటి వాల కంచూస్తే, పరోపకారము చేసిన పురుషుడు, ఎక్కువ సంపదలు లభించినప్పుడు వంగి వినయంగా వుండునట్లుగా ఉన్నాయి.

శ్రీరామచంద్రుడు ఆ సరోవరంలో స్నానంచేసి ఒక శ్రేష్ఠమైన చెట్టునీడన లక్ష్మణునితోసహా, కూచున్నాడు. అక్కడకు దేవతలు, మునులు వచ్చి స్తుతించి తమ తమ నివాసాలకు వెళ్ళిపోయారు. కృపాళువయిన శ్రీరామచంద్రుడు, అతి సంతోషంగా కూచుని లక్ష్మణునకు రసవంతమైన కథలు చెబుతున్నాడు.

భగవానుడయిన శ్రీరాముడు విరక్తుడయి వున్నట్లుగా గమనించిన నారదునకు చాలా విచారం కల్గింది. నాశాపాన్ని అంగీకరించి ప్రభువు అనేక రకాల దుఃఖాలను సహిస్తున్నాడనుకొని, దీన దయాళువయిన శ్రీరామచంద్రుని చూద్దాం, మరల ఇటువంటి అవకాశం దొరకదనుకొని, చేతిలోవీణనుంచుకొని నారదుడు, శ్రీరామచంద్రుడు సుఖంగా కూచునియున్న చోటుకు వచ్చాడు.

ఆయన శ్రీరాముని లీలలను ప్రేమతో మధురవాక్కులతో అనేక రకాలుగా వర్ణిస్తూ, పాడుకుంటూ వచ్చి, పాదాలకు నమస్కరించేటప్పటికి శ్రీరాముడు ఆయనను లేపి, చాలాసేపటివరకు హృదయానికి హత్తుకొని, తరువాత క్షేమ సమాచారాలు అడిగి దగ్గర

కూచో బెట్టుకున్నాడు. లక్ష్మణుడు సాదరంగా ఆయన కాళ్ళకడిగాడు.

నారదుడు హరినామ సంకీర్తన చేస్తూ ప్రభువు సంతోషంగా ఉన్నాడని గ్రహించి, కమలాలలాంటి చేతులను జోడించి— "పరమ ఉదారబుద్ధిగల రఘురామా! మీరు ఆకర్షవంతమైన వరాలు ఇచ్చే వారు. మీవరాలు ,అంతువిక్కేవి, అంతువిక్కనివిగా వుంటాయి. స్వామీ! మీరు అంతటా వుండేవారని, అందరూ ఎరిగియున్నా, నేను మాత్రం ఒక వరం కోరుకుంటున్నాను. దయచేసి ఆ వరమివ్వండి."

"నారద మునీశ్వరా! మీరు నాస్వభావాన్ని ఎరుగుదురు. నేనెన్నడైనా నా భక్తులకు తెలియకుండా ఏవిషయాలైనా దాచానా? మీరు నన్నడిగితే, నేను మీకు ఇవ్వదలచని వస్తువు ఏముంటుంది? భక్తులకు ఇవ్వదగనిది నా వద్ద ఏమీ ఉండదు. మీరు నన్నుగురించి అనుమానించవద్దు" అన్నాడు శ్రీరాముడు.

"నేను అతిరహస్యమైన మీలీలావిలాసాన్ని అడగబోతున్నాను. మీకెన్నో నామాలున్నాయని, ఆ నామాలు ఒకదానిని మించి మరొ కటి శ్రేష్ఠమైనదని వేదాలు చెబుతున్నాయి. అయినా 'రామ' నామం అన్ని నామాలకు మించినది. అది పాపరూపాలైన పక్షులను వేటాడు వేటగాని లాంటిది. మీభక్తి రూపమైన పూర్ణిమ రాత్రిలో "రామ" నామ రూపమైన పూర్ణచంద్రుడు. ఇతర నామాల రూపాలలోవున్న నక్షత్రాల సహితంగా భక్తుల హృదయ రూపమైన ఆకాశంలో నివ సించాలి, అని నా కోరిక అన్నాడు నారదుడు.

"అలాగే" అని రాముడన్నాడు" నారదుడు చాలా సంతోష మనస్కుడై, ప్రభువు పాదాలవద్ద తలవంచి, "రామా! మీరు మీమా యను పంపి నన్ను మోహితుని చేసినప్పుడు, నేను పెండ్లాడాలను కున్నాను. మీరు ఏకారణంచేత నా పెండ్లి జరుగనివ్వలేదు?" అన్నాడు నారదుడు.

"మునీశ్వరా! విను, అన్ని ఆధారాలు వదలి సర్వము నేనే అని నమ్మి భజించే వారికి సంతోషంగా అన్ని విషయాలు చెబుతుంటాను. తల్లి తన బిడ్డలను కాపాడుతున్నట్లుగా, నేను వారిని ఎల్లప్పుడు కాపాడుతూ ఉంటాను. చిన్నపిల్లవాడు అగ్నిని ముట్టుకోబోయినా, పామును పట్టుకోబోయినా, తల్లి అతన్ని వేగంగా లాగి రక్షిస్తుంది.

పిల్లవాడు పెద్దవాడైన తరువాత ఆ తల్లియే ఆ పెరిగిన బిడ్డను కూడా ప్రేమగా చూచుకుంటుంది. గాని, వెనుకటి అమాయక బిడ్డను చూచినంత బాధ్యతతో ఇప్పుడు చూడనవసరం లేకపోయినా సరే చూస్తూనే వుంటుంది. జ్ఞానులు నాకు పెద్ద బిడ్డలతోనూ, ఏ కోరికలులేని భక్తులు నాకు చిన్నబిడ్డలతో సమానము.

సేవకులకు నా బలము అండగా వుంటుంది, జ్ఞానులకు వారి బలమే వారిని కాపాడుతుంది. కాని కామ, క్రోధాలు వారిద్దరికి శత్రువులే? ఈ విషయాలన్ని ఆలోచించి పండితులు నన్ను పూజిస్తూ వుంటారు. వారే జ్ఞానులయిన తరువాత కూడా నాయందు ఉన్న భక్తిని వదలరు.

కామ, క్రోధ, లోభ, మోహాలు అజ్ఞానానికి సైనికులు, వీటిలో అన్నిటికంటే ఎక్కువ భయంకరమైన దుఃఖాలు తెచ్చి పెట్టేది స్త్రీయే.

మునీశ్వరా! మోహ రూపమైన వనానికి స్త్రీ, వసంత ఋతువని పురాణాలు, వేదాలు, భక్తులు చెబుతున్నాయి, చెబుతున్నారు. ఆ స్త్రీయే గ్రీష్మఋతువయి జపాలను, తపస్సులను, నియమాలను రూపాలలోవున్న జలాశయాల మొత్తాన్ని ఎండిపోవునట్లు చేస్తుంది.

కామ క్రోధ, మద, ఈర్ష్యల రూపాల్లోవున్న కప్పలకు, వర్ష ఋతువులాగా ఆనందాన్ని కలిగించేది స్త్రీయే! చెడు కోరికలు, కమలాల సమూహాల లాంటివి, వాటిని సుఖపెట్టే శరదృతువు స్త్రీ.

ధర్మాలన్నీ కమలాల గుంపులు, వాటిని స్త్రీ, హేమంత ఋతువయి తగులబెట్టి, సర్వనాశనం చేస్తుంది. ఇక ప్రేమ రూపమైన వనం, స్త్రీ రూపమైన శిశిరఋతువు అండతో పచ్చ పచ్చగా మారిపోతుంది.

పాపరూపాలైన గుడ్లగూబల గుంపుకు సుఖాన్ని కలిగించడానికి దట్టమైన చీకటి రాత్రితో సమానమైనది స్త్రీ. బుద్ధి, బలం, శీలం, సత్యం, ఇవన్నీ చేపలు. వాటికొరకు స్త్రీ గాలములాంటిదని పెద్దలంటున్నారు.

స్త్రీ, అన్ని చెడ్డ గుణాలకు మూలము, కష్టాలు తెచ్చిపెట్టేది, అన్ని దుఃఖాలు ఆమెద్వారానే సంక్రమిస్తుంటాయి. ఆమెవద్ద దుఃఖాలన్నీ ప్రోగయి గనిలాగా వుంటాయి. ఆ దుఃఖాలు అవసరాన్నిబట్టి, కోరికలనుబట్టి బయటికి అవసరమనుకొన్నన్ని వచ్చి బాధలకు గురిచేస్తుంటాయి. అందుచేత, నారదమునీశ్వరా! ఈ విషయాలన్నీ నా మనస్సులో ఉన్నందున నేను మీ పెండ్లి ఆపివేయించాను." అన్నాడు రామచంద్రుడు.

శ్రీరాముని చక్కని మాటలు వినేటప్పటికి ముని శరీరం పులకించి పోయింది, కళ్ళవెంట నీళ్ళు జలజల రాలాయి. "తన సేవకుని మీద ఇంత దయ, మమకారాలున్న స్వామి ఎవరుంటారు? ఇలాంటి ప్రభువును భజించని మానవుడు, జ్ఞానదరిద్రుడు, మహామూర్ఖుడు, దురదృష్టవంతుడనుకోవాలి." అనిఅనుకొని నారదుడు ఆదరంగా— "ప్రభూ! దయచేసి భక్తుల లక్షణాలను వివరించండి" మీరు పరిపూర్ణ జ్ఞానులు, సంసారంలోని దుఃఖాలను దూరంచేసే వారు అన్నాడు.

"మునీశ్వరా! ఏలక్షణాలున్నందు వలన నేను భక్తుల వశమై ఉంటున్నానో, చెప్తావిను. భక్తులు ఆరు వికారాలను జయించి, పాపాలు కోరికలులేనివారయి, నిశ్చలంగాను, దరిద్రులు కాకుండానూ

పవిత్రులు, సుఖాలకు స్థానులు, ఎంతో జ్ఞానవంతులు, కోరికలు లేని వారు, అల్పాహారంతో ఉండేవారు, సత్య ప్రతిజ్ఞులు, కవులు, పండితులు, యోగులు, జాగ్రత్తపరులు, అందరిని గౌరవించేవారు, గర్వం లేనివారు, ధైర్యవంతులు, ధర్మాచరణలో ప్రవీణులు, గుణాలకు నిలయాలు, సంసార దుఃఖాలు అంటనివారు, సుఖసందేహాలకు దూరులుగా ఉంటారు.

వారికి నాపాద కమలాలు తప్ప, తమ దేహమందుగాని, ఇల్లు వాకిళ్ళయందుగాని ప్రేమ వుండదు. వారు తమ గుణాలను గురించి ఎవరైనా గొప్పలుచేసి చెప్తే, కుంచుకు పోతారు, ఇతరుల గుణాలను విన్నప్పుడు ఎంతో ఆనందిస్తారు. వారు అన్ని విషయాల్లో సమాన దృష్టితోనూ, శాంత స్వభావంతోనూ ఉంటారు. న్యాయాన్ని వదలరు, సహజంగానే మంచి స్వభావంతోవుండి, అందరిని ప్రేమగా చూచుకుంటూంటారు.

వారు జప, తప, వ్రతాలలో, యమ, నియమాలలో నిమగ్నులయి ఉంటారు. గురువు, గోవింద, బ్రాహ్మణుల పాదాలయందు ప్రేమగా వుంటారు. వారిలో శ్రద్ధ, క్షమ, స్నేహం, దయ, సంతోషం, నాపాదాలయందు నిష్కపటమైన ప్రేమా ఉంటుంది.

వారికి, వైరాగ్య, జ్ఞాన, వినయ, విజ్ఞాన, వేదపురాణాలు బాగా తెలిసి వుంటాయి. మూర్ఖత్వం, అభిమానము, మదము వారియందు ఉండవు. పొరపాటున కూడా తప్పుతోవలు తొక్కరు,

వారెల్లప్పుడు నా లీలలను గానంచేస్తూ, వింటూ ఉంటారు. స్వార్థం లేకుండా ఇతరులకు మేలుచేయాలను ఉద్దేశ్యంతోఉంటారు. భక్తులలోవున్న గుణాలను, సరస్వతి, వేదాలు శేషుడు కూడా, వర్ణించి చెప్పలేవు.''

7)

సరస్వతి, వేదాలు, శేషుడు కూడా వర్ణించలేవని నారదుడు వినగానే శ్రీరాముని పాదకమలాలను పట్టుకున్నాడు. "దీనబంధు, కృపాళువు, తననోటితోనే తాను భక్తుల గుణాలను వర్ణించాడు" అనుకుంటూ, నారదుడు ప్రభువు పాదాలకు నమస్కరించి, బ్రహ్మలోకానికి వెళ్ళాడు.

తులసీదాసంటున్నాడు- "అన్ని ఆశలు వదలి శ్రీహరిలో కలసిపోయేవారు ధన్యులు. రావణునికి శత్రువులయి, శ్రీరామచంద్రుని పవిత్రమైన కీర్తిని గానం చేసినవారు, విన్నవారు, వైరాగ్య జపయోగాలు లేకుండానే రామభక్తిని పొందగల్గుతారు.

యువతులయిన స్త్రీల శరీరాలు దీపపు కాంతులలాంటివి. ఓ మనసా, వాటిలోని పురుగులు కాకండి. కామ, క్రోధ, మదాలనువదలి శ్రీరాముని భజనలు చేస్తూ, ఎల్లప్పుడు మంచివారి సాంగత్యంలో ఉండండి.

[అరణ్యకాండం సమాప్తం]

# 4. కిష్కింధా కాండము

## మంగళా చరణము

## 23

తామరపూవు, నీలకమలములాంటి అందమైనవారు, ఎర్రగాను శ్యామవర్ణంలోను ఉండేవారు, మహాబలవంతులు, విజ్ఞానగనులు, శోభలతో నిండినవారు, ఉత్తములు, ధర్మాన్నిపాటించేవారు, వేదాలద్వారా స్తుతించబడేవారు, బ్రాహ్మణ సమాజమంటే ప్రేమవున్న వారు, మాయవలన మనుష్యరూపాలు దాల్చినవారు, శ్రేష్ఠమైన ధర్మానికి కవచాల్లాంటి వారు, అందరికి మేలు చేకూర్చేవారు, సీతను వెదకడంలో నిమగ్నులై ఉన్నవారు, రఘుకులంలో శ్రేష్ఠులు, అయిన శ్రీరామలక్ష్మణులు తప్పకుండా నా భక్తిని స్వీకరించుదురుగాక!

వేదరూపమైన సముద్రమునుంచి అవతరించినవాడు, కలియుగ పాపాలను దూరం చేసేవాడు, శాశ్వతంగా ఉండు భగవంతుడు, శంకరుని పరమ సుందరమైన చంద్రముఖంలో ఎల్లప్పుడు శోభాయ మానంగా ఉండేవాడు, సాంసారిక రోగాలకు తియ్యని మందులాంటివాడు, అందరికీ సుఖాలను కలిగించేవాడు, జానకి జీవితానికి మూలపురుషుడు, అయిన శ్రీరామచంద్రుని "రామ నామ" రూపమైన అమృతాన్ని ఎల్లప్పుడు త్రాగేవారు పుణ్యాత్ములు, ధన్యులు.

మోక్షానిచ్చు భూమి, జ్ఞానానికి గని, పాపాలను నాశనం చేసేది అని తెలిసికొని శివపార్వతులు నివసిస్తున్న ఆకాశపురిని,

ఎందుకు సేవించకూడదు? హాలాహల విషంతో దేవతలందరు మండి పోతూవున్నప్పుడు, 'శంకరుడు స్వయంగా తానుత్రాగేశాడు. ఓబుద్ధిలేని మనసా! నీవు ఆశివుని ఎందుకు భజించవు? పూజించవు? శంకరునితో సమానమైన దయగలవాడెవరున్నారు.

శ్రీరామచంద్రుడు ముందుకుసాగి పోయాడు. ఋష్యమూక పర్వతం దగ్గరకు వచ్చింది. అక్కడ మంత్రులతో కలసి సుగ్రీవు డున్నాడు. అంతులేని బలోపేతులైన శ్రీరామలక్ష్మణులు వస్తూ ఉండడం చూచి సుగ్రీవుడు ఎంతో భయంతో— "హనుమంతా! ఈ యిద్దరు పురుషులు బల, రూపాల్లో సాటిలేనివారు. నీవు బ్రహ్మ వారి వేషంతో వెళ్ళిచూచి, వారి హృదయాలలోని విషయాన్ని తెలిసి కొని, సైగలతోనే పనిపూర్తిచెయ్యి, లేకపోతే నీమాటలనుబట్టి వారు నీ వెవరో తెలుసుకొంటారు.

కుటిల బుద్ధి అయిన వాలి వీరిని పంపివుంటే, నేనీ పర్వ తాన్ని విడచి పారిపోతాను" అన్నాడు,

బ్రాహ్మణ వేషంతో హనుమంతుడక్కడికి వెళ్ళి నమస్కరించి "వీరులారా! మీరు క్షత్రియుల రూపంలో వనంలో తిరుగుతున్నారు. మీలో చామన చాయలోవున్న వారెవరు? ఎర్రని శరీరం గల వ్యక్తి ఎవరు? స్వామీ! ఈకఠినమైన భూమిమీద, సున్నితమైన పాదాలతో మీ యిద్దరు ఏకారణంచేత తిరుగుతున్నారు?

మీ అంగాలన్నీమనస్సులను ఆకర్షిస్తాయి, ఆరణ్యంలో మండు టెండలను, ఎముకలను కొరికే గాలులను సహిస్తున్నారు. బ్రహ్మ, విష్ణు, మహేశులలో ఎవరో ఒకరుకాదుగదా? లేక మీ యిద్దరు నర నారాయణులా? లేదా భూమిమీదనున్న దుఃఖాలను, భారాన్ని తగ్గించడానికి మనుష్య రూపంలో అవతరించిన, సంపూర్ణ లోకస్వా ములా? లేక సంసారానికి కారణరూపులైన భగవంతులా?" అన్నాడు.

"మేము కోసలాధీశులైన దశరథ మహారాజు పుత్రులము, తండ్రి ఆజ్ఞ ప్రకారం వనవాసానికి వచ్చాము. మాపేర్లు రామలక్ష్మణులు, మేమిద్దర మన్నదమ్ములము. మాతోపాటు ఒకఅందమైన స్త్రీ ఉండేది. ఈ వనంలో మా సీతను రాక్షసులు ఎత్తుకు పోయారు. బ్రాహ్మణోత్తమా! మేమామెను వెదకుతూ తిరుగుతున్నాము. మా విషయాలు మేము చెప్పాము. ఇకమీరు మీ విషయాన్ని చెప్పండి. ప్రభువును గుర్తించి హనుమంతుడు వారి పాదాలమీద పడ్డాడు.

శివుడంటున్నాడు— "పార్వతీ! ఆ సుఖాన్ని వర్ణించలేము. శరీరం పులకితమయి పోయింది. నోటినుండి మాట పెగలలేదు. ఆయన ప్రభువు స్వరూపాన్ని, అందాన్ని చూస్తూ అలాగే ఉండి పోయాడు. తరువాత స్వామిని గుర్తించి ధైర్యం తెచ్చుకొని సంతోషంగా.

"స్వామీ! నేనడిగినది న్యాయసమ్మతమైనదే, మరిమీరు మనిషిలాగా ఎలా మాట్లాడ గల్గుతున్నారు? నేను మీ మాయా వశమయిపోయి మతిలేని విధంగా తిరుగుతున్నాను. ఇందుచేత స్వామి అయిన మిమ్ము గుర్తుపట్టలేక పోయాను.

నేను వానరుడను, దానికితోడుమోహాధీనమై పోయాను. కఠోర హృదయుడను, తెలివిలేని వాడను. కాని దీన బంధువయిన భగవానులు, మీరు కూడా నన్ను మరచిపోయారు.

ప్రభూ! నాలో చెడ్డగుణాలెన్నో వున్నాయి. కాని ప్రభువు తమ సేవకులను ఎన్నడూ మరచిపోడు. జీవుడు మీమాయవలన మాయలో పడిపోతున్నాడు. అతను మీదవృయుంటేగాని ఒడ్డున పడలేడు,

రఘువీరా! నేను, భజనలను, పూజలను ఎరుగనని, మీమీద ఒట్టుపెట్టుకొని చెప్తున్నాను. సేవకుడను అని తన అసలు రూపాన్ని

చూపి ప్రభువు పాదాలమీద పడ్డాడు. హనుమంతుడు ప్రేమవలన హృదయం తృప్తిపడింది. అప్పుడు ప్రభువు, అతనిని హృదయానికి హత్తుకొని చల్లబరచాడు.

"కపీ! మనస్సులో ఏమీ కొరత పెట్టుకోకు, నీవు నాకు లక్ష్మణునికంటే ప్రియుడవు, నన్నందరు అందరిని సమంగా చూచుకొనే వాడనని అంటూ వుంటారు. కాని సేవకులు నాకు మరీ ప్రియులు. వారికి నేనే రక్షకుడను.

హనుమా!" నేను భగవంతుని సేవకుడనని, ఈ చరాచర జగత్తంతా నా స్వామి అయిన భగవంతుని రూపమే అనుకొని, తమ బుద్ధిని నిలకడగా వుంచుకొనువారే నాకు సాటిలేని భక్తులు."

స్వామి తనకు అనుకూలంగా వున్నాడని తెలిసికొనిన హనుమంతునకు ఎంతో సంతోషంగా వుంది. దుఃఖాలన్నీ దూరమయిపోయాయి. "ప్రభూ! ఈ పర్వతం మీద వానరరాజు సుగ్రీవుడున్నాడు ఆయన మీ దాసుడు. ఆయనతో మీరు స్నేహం చేయండి, దీనునిగా తలంచి ఆయన భయాన్ని పోగొట్టండి. ఆయన సీతమ్మను వెదకిస్తాడు, కోట్లమంది వానరులను ఇటు అటు పంపుతాడు." అని కథంతా వినిపించి ఇద్దరన్నదమ్ములను భుజాలమీద ఎక్కించుకొన్నాడు. సుగ్రీవుడు శ్రీరాముడు వస్తున్నట్లు చూచి తన జన్మ సఫలమయిందని అనుకున్నాడు.

వారికి సుగ్రీవుడు, పాదాభివందనం చేశాడు, అయితే ఆయన మనస్సులో "ఈయన నన్ను ప్రేమగా చూచుకుంటాడా?" అని సందేహం కలిగింది.

హనుమంతుడు రెండువైపుల కథనంతనూ వినిపించి, అగ్నిసాక్షిగా ప్రతిజ్ఞ చేయించి ఇరువైపుల స్నేహం కుదిర్చాడు.

ఇరువైపులవారు మైత్రికి సమ్మతించారు. తేడాలు ఏమీలేవు.

లక్ష్మణుడు రాముని విషయమంతా చెప్పాడు. సుగ్రీవుడు ఆయన మాటలను విని కళ్ళల్లో నీళ్ళతో-"ప్రభూ! జానకి కనిపిస్తుంది. ఒక సారి నేను ఇక్కడనే మంత్రులతో కలసి కూర్చొని ఏవో మాట్లాడుతు న్నాను. ఆ సమయంలో నేను, ఆకాశమార్గంలో, ఇతరుల చేతికిచిక్కి, ఎంతో విలపిస్తున్న జానకిని చూచాను. ఆమె మమ్మే చూచి 'రామా, రామా! హా రామా!" అంటూ కేకలు పెడ్తూ వస్త్రాలు పడవేసింది." అన్నాడు. ఆ వస్త్రాలను శ్రీరాముడడిగితే సుగ్రీవుడిచ్చాడు. ఆ వస్త్రా లను హృదయానికి ఆనించుకొని రాముడు ఎంతో చింతించాడు.

అప్పుడు సుగ్రీవుడు-"రఘువీరా! చింతించకండి, ధైర్యంగా ఉండండి. నేనన్ని విధాలా, జానకీ మాతను మీకు ఒప్పజెప్పుటకు సేవలు చేస్తాను." అన్నాడు.

కృపాసింధువు, బలానికి హద్దయిన రూపుడు శ్రీరామచంద్రుడు సుగ్రీవుని మాటలు విని సంతోషంతో- "సుగ్రీవా! నీ వెందుకి వనం లో వుంటున్నావు, నాకు చెప్పు" అన్నాడు.

"ప్రభూ! నేను వాలి అన్నదమ్ములము. మేమిద్దరం ఎంతో అన్యోన్యంగా ఉండేవారము. ఒకసారి మయదానవుని పుత్రుడు మాయవీ, మాగ్రామానికి వచ్చి అర్థరాత్రి సమయంలో తలుపు తట్టి పిలచి మా అన్నను రెచ్చగొట్టాడు. వాలి శత్రువు బలాన్ని సహించ లేకపోయాడు. ఆ మాయావి వెంట వాలి, పరుగెత్తడం చూచి మాయవీ కూడా పరుగెత్తాడు, నేను కూడా నా సోదరునితో పాటు పరుగెత్తాను.

ఆ రాక్షసుడు ఒక కొండ గుహలోకి జొరబడ్డాడు. అప్పుడు వాలినాతో- "నీ విక్కడనా కొరకు పదిహేనురోజుల వరకు వేచి వుండు. అప్పటికీ నేను రాకపోతే, నేను మరణించాననుకో"అన్నాడు.

ఖరుని శత్రువా! నేను ఒక్కనెలవరకు అక్కడే ఉన్నాను. ఆ సమయంలో ఆ గుహనుండి చాలా పెద్ద రక్తప్రవాహము వచ్చింది.

వాలిని ఆ రాక్షసుడు చంపేవేసిపుంటాడు, వాడు బయటికి వస్తేనన్ను కూడా చంపుతాడని భయపడి నేను ఒక పెద్ద బండను, గుహద్వారానికి అడ్డుపుంచి పారిపోయి ఇంటికి తిరిగివచ్చాను.

మంత్రులు, నగరంలో రాజు లేకుండా ఉండడం మంచిది కాదని తలంచి, బలవంతాన నన్ను రాజును చేశారు. వాలి ఆ రాక్షసుని చంపి తిరిగి వచ్చాడు. ఆయన నన్ను చూడగానే, నేనాయనకు విరోధి ననుకున్నాడు.

అతను నన్ను శత్రువునని భావించి బాదకొట్టాడు. నాకున్న సొత్తును, నా భార్యనులో బరచుకున్నాడు. నేను ఆయన భయంతో, అన్ని లోకాల్లో వ్యాకులంతో తిరుగుతూ ఉన్నాను. అతను శాప భయంతో ఇక్కడకు రాడు. అయినా భయభయంగానే ఇక్కడుంటున్నాను" అని సుగ్రీవుడు తన కథంతా చెప్పాడు.

తన సేవకుని దయనీయ స్థితిని చూచి, దీనదయాళువయిన శ్రీరామచంద్రుని భుజాలు కోపంతో కదలాయి. "సుగ్రీవా! నేను వాలిని ఒకే ఒక్కబాణంతో చంపేస్తాను. బ్రహ్మ, శివుల అండనచేరినా అతనిని బ్రతుకనివ్వను.

మిత్రుని దుఃఖాన్ని చూచి కూడా దుఃఖం రానివారు చాలా పాపాత్ములు. తన కొండలాంటి దుఃఖాన్ని దుమ్ములాగా చూచేవాడు, మిత్రుని దుఃఖము దుమ్ములాంటిదయినా పర్వతంలాగా చూచేవాడు సమానులు, తమ దుఃఖాలను ఖాతరుచేయకుండా, ఇతరుల దుఃఖాలను పట్టించుకునేవాడు ఉత్తముడు అనుకో, ఇలాంటి స్వభావం లేని మూర్ఖులు పట్టుదలతో ఎందుకు స్నేహం చేస్తారు? తన మిత్రుని చెడు మార్గాన్నుండి మంచి మార్గానికి మార్చాలి, అతని లోపాలను దాచి గుణాలను బయటపెట్టాలి.

ఇచ్చి పుచ్చుకోవడాల్లో ఎప్పుడూ అనుమానించకూడదు. తన

బలాన్ని బట్టి ఎల్లప్పుడు మేలు చేస్తూ వుండాలి. ఆపదల సమయాల్లో వందలరెట్లు ప్రేమగా చూడాలి. సజ్జనులైన శ్రేష్ఠమిత్రుల గుణాలివియని వేదాలు చెబుతున్నాయి.

ఎదురుగా మంచిగా మాట్లాడి, వెనుకనిందించేవారి స్నేహాన్ని పాము మనస్సులాంటి మనస్సు గలవారి స్నేహాన్ని వదలేయడమెంతో మేలు, వారు ఎప్పుడూ కపటమిత్రులు.

మూర్ఖసేవకుడు, లోభి అయిన రాజు, చెడిపోయిన భార్య మోసకారి అయిన మిత్రుడు ఈ నలుగురు శూలాల్లాగా బాధలు పెట్టేవారు. మిత్రమా! నీవు నా బలాన్ని చూచుకొని చింతవదలి పెట్టు. నేనన్ని విధాల నీకు సహాయ పడ్తాను." అని రాముడన్నాడు.

"ప్రభూ! వాలి బాలా బలవంతుడు, యుద్ధమంటే భయం లేనివాడు-" అంటూ సుగ్రీవుడు దుందుభి రాక్షసుని ఎముకలు,తాటి చెట్లను చూపాడు. రామచంద్రుడు వాటిని తేలిగ్గా పడగొట్టాడు.

శ్రీరాముని అంతులేని బలాన్ని చూడగానే సుగ్రీవునికు ప్రేమ అధికమైంది. ఈయన వాలిని తప్పకుండా కడతేర్చగలడను నమ్మకం కలిగింది. మాటి మాటికి తలవంచి నమస్కరించాడు. ప్రభువు శక్తిని గుర్తించి మనస్సులో ఎంతో సంతోషించాడు.

"ప్రభూ! మీదయవలన, నా మనస్సు స్థిమితపడింది. నేను సుఖాలను, సంపదలను, కుటుంబాన్ని, గొప్పతనాన్ని వదలి మీ సేవలు చేస్తాను. ఇవన్నీ రామభక్తులకు విరోధులని, మీ పాదాలకు సేవలు చేసే భక్తులంటూ వుంటారు. జగత్తులో, శత్రుమిత్రులు, సుఖ దుఃఖాలు అన్నీ మాయాసృష్టి, ఇవి వాస్తవానికిలేవు.

ప్రభూ! వాలి నాకు ఎంతో కీడు చేసినవాడయినందునా, నామీద దయవలనా, దుఃఖాలను దూరం చేసే మీదర్శనమయింది.

స్వప్నంలో ఎవరితోనైనా యుద్ధం జరిగినా, మెళకువ వచ్చినప్పుడు కూడా మనస్సులో సంకోచంగానే వుంటుంది.

ప్రభూ! నేను అన్నింటిని వదలేసి మీ సేవలు, చేయడానికి అనుమతి యివ్వండి" అన్నాడు.

సుగ్రీవుని, వైరాగ్యంతో కూడిన మాటలు విని, ధనస్సును ధరించివున్న శ్రీరామచంద్రుడు నవ్వి- "మిత్రమా! నీవు చెప్పిన దంతా నిజం, కాని నామాట ఎన్నడూ అబద్ధం కావడానికి వీలులేదు" అని సుగ్రీవుని వాలి వద్దకు పంపాడు. శ్రీరాముని బలం చూచుకొని సుగ్రీవుడు వాలివద్దకు వెళ్ళి కేకలు వేశాడు. వాలి అతని కేకలు విన గానే కోపంతో పరుగెత్తుకు వచ్చాడు. ఆయన భార్య తార ఆయన కాళ్ళు పట్టుకొని- "నాథా! సుగ్రీవుడు కలసికొన్న అన్నదమ్ములిద్దరు చాలా బలవంతులు, వారిద్దరు కోసలాధీశులైన దశరథ మహారాజు కుమారులు.వారిద్దరన్నదమ్ములు యుద్ధంలోయముడునయినాజయించ గల సమర్థులు" అంది.

"పిరికిదానా! రామచంద్రునకు ఒకరెక్కువ, మరొకరు తక్కువ, అను పక్షపాతంలేదు. ఆయన కందరు సమానులే. ఒక వేళ నన్నాయన చంపినా, నేను అదృష్టవంతుడననుకుంటాను-"అని మహా అభిమాని అయిన వాలి సుగ్రీవుని గడ్డిపోచ క్రింద లెక్కవేసు కొని వెళ్ళాడు. ఇద్దరు కలబడ్డారు. సుగ్రీవుని బలంగా గ్రుద్దాడు ఆగ్రుద్దు సుగ్రీవునకు వజ్రంలాగా అనిపించింది. అతను వ్యాకులంతో పారిపోయి, శ్రీరామునితో- "రఘువీరా! అతను నా సోదరుడుకాడు, నాకు యముడని మీకు ముందే చెప్పాను" అన్నాడు,

"మీరిద్దరు సోదరులు ఒకే రూపంలో వున్నారు. ఆభ్రమతో నేనతనిని చంపడానికి వీలుకుదురలేదు" అంటూ శ్రీరామచంద్రుడు సుగ్రీవుని శరీరాన్ని నిమిరాడు దాంతో అతని బాధలన్నీపోయి, శరీ

రం వజ్రంలాగా బలిష్ఠమయి పోయింది.

అప్పుడు ప్రభువు సుగ్రీవుని మెడలో పూలదండవేసి, మంచి బలమిచ్చి పంపాడు. ఇద్దరు అనేకరకాల యుద్ధాలు చేశారు. శ్రీరాముడు చెట్టుచాటున ఉండి చూస్తున్నాడు. సుగ్రీవుడు ఎంతోబలం చూపాడు ఎన్నో మోసాలు చేశాడు, అయినా భయం వలన నిరాశపడిపోయాడు. అప్పుడు శ్రీరాముడు వాలి గుండెల్లోకి బాణమేశాడు.

బాణం తగులగానే వాలి నేలమీద పడిపోయాడు. కాని భగవంతుని చూచి లేచి కూచున్నాడు. ఎదురుగా చామనఛాయ శరీరము, తలపైన జడలున్న, ధనస్సు బాణాలతోవున్న ప్రభువును వాలి చూచి ఆయన పాదాలయందు మనస్సుంచి, ప్రభువును గుర్తించి, తన జన్మ సఫలమయిందనుకున్నాడు. ఆయన హృదయంలో ప్రేమవుంది, కాని నోటిలో కఠోరమైన మాటలున్నాయి. ఆయన ప్రభువువైపుచూచి—

"ప్రభూ! మీరు ధర్మరక్షణ కొరకు అవతరించారు, కాని వేటగానివలె చెట్టుచాటున వుండి నన్ను కొట్టారు, నేను మీకు శత్రువునయి, సుగ్రీవుడు మిత్రుడైనాడా? మీరు నన్ను ఏమి తప్పచేశానని కొట్టారు?" అన్నాడు.

అప్పుడు రాముడు- "మూర్ఖుడా! తమ్ముని భార్య, సోదరి, కోడలు, కన్య ఈ నలుగురు సమానులు. వీరిని చెడ్డ బుద్ధితో చూచిన వారిని చంపినందున పాపమేమీ ఉండదు.

అయినా నీకు చాలా గర్వముంది. నీకు నీభార్య మంచిమాటలు చెవుల కెక్కలేదు. గర్వపోతూ! నీకు సుగ్రీవునికి నాభుజబల సహాయమున్నట్లు తెలిసి కూడా, చంపాలనుకున్నావు" అన్నాడు.

"రామా! స్వామిముందు నా ఆటలు సాగవు. మృత్యు సమయంలో మీ శరణుపొంది కూడా నేను పాపాత్మునిగానే మిగిలిపోయాను?" అన్నాడు వాలి.

ఇప్పుడు వాలి యొక్క కోమలమైన మాటలు విన్న శ్రీరామ చంద్రుడు అతని తలను నిమిరి— "నేను నీదేహాన్ని స్థిరంగావుంచు తాను, నీవు ప్రాణాలను నిలుపుకో" అన్నాడు.

"దయాసాగరా! ముని జనులు అనేక జన్మలవరకు ఎన్నో ప్రయత్నాలు చేస్తారు, కాని చివరి సమయంలో "రామా, రామా, అను మాటవారు పలుకలేని స్థితికి చేరుకుంటారు. మీ నామ బలంతో భగవంతుడైన శంకరుడు కాశీలో అందరికి సమానంగా శాశ్వతమైన ముక్తిని కలిగిస్తున్నాడు. ఆరాముడే, ఈనాడు నాకళ్ళ యెదుట ప్రత్యక్షంగా ఉన్నాడు. ప్రభూ! ఇలాంటి ఉత్తమ స్థితి నాకు ఎన్నడైనా లభిస్తుందా?

వేదాలు మిమ్మ ఎల్లప్పుడు 'నేతి నేతి' అని గానం చేస్తున్నాయి' ఆ ప్రభువైన మీరు నాకళ్ళెదుట నిలబడియున్నారు. యోగులు, మునులు. మనసా, వాచా, కర్మణా ఇంద్రియాలను వశపరచుకుని, ధ్యానించినా ప్రభువును చూడ గలిగితే చూడ గల్గుతున్నారు, లేక పోతే లేకుండానే దాటిపోతున్నారు. మీరు నన్ను అభిమానించి ప్రాణాన్ని ఆపుకోమంటున్నారు. కాని కల్పవృక్షాన్ని నరికి ఆకొమ్మ లతో కంచె వేసుకునే మూర్ఖుడుంటాడా.

ప్రభూ! మీరు నాయందు దయవుంచి నాకువరాన్ని యివ్వండి. నేను మళ్ళీ జన్మించవలసి వస్తే మీపాదాలయందు ప్రేమ వుండు వరాన్ని ఇవ్వండి. ఈనా పుత్రుడైన అంగదుడు వినయ సంపన్నుడు, బలంలో నాతో సమానుడు, ఇతనిని మీవానిగా చేసికోండి. స్వామీ. ఇతనికి మీరే అండగావుండండి.

శ్రీరామచంద్రుని పాదాలయందు నిశ్చలమైన ప్రేమనుంచి వాలి తన శరీరాన్ని, ఏనుగు తన మెడలో వున్న పూలమాలను వదలి వేసినట్లుగా, వదలి వేశాడు,

శ్రీరామచంద్రుడు వాలిని తన లోకానికి పంపాడు. నగరం లోని ప్రజలందరు వచ్చారు. వాలి భార్య తార ఎంతో విలపించింది. ఆమె తల వెంట్రుకలు పెల్లా చెదరై పోయాయి, శరీరం ఆమె ఆధీనంలో లేదు.

తార వ్యాకులంగా ఉండడం చూచి, శ్రీరామచంద్రుడు ఆమెకు జ్ఞానం కలిగించి, మాయను దూరం చేశాడు. తరువాత ప్రభువు—"భూమి, జలము, అగ్ని, ఆకాశం, వాయువులను అయిదు తత్త్వాలతో ఈ శరీరం ఏర్పడింది. ఆశరీరం నీయెదుట నిద్రిస్తున్నది· ఆత్మ నిత్యము, నాశనం కానిది, అలాంటిస్థితిలో నీవు ఎవరి కొరకు ఏడుస్తున్నావు? అన్నాడు. తార హృదయంలో జ్ఞానం ఉత్పన్నం కాగానే, ఆమె శ్రీరామచంద్రుని పాదాలమీదపడి, పరమ భక్తిని ప్రసాదించమను వరాన్ని కోరింది.

శివుడు అంటున్నాడు- "పార్వతీ! శ్రీరామచంద్రుడు ప్రపంచాన్ని తోలుబొమ్మలను ఆడించినట్లు ఆడిస్తున్నాడు.శ్రీరామచంద్రుడు సుగ్రీవునకు ఆజ్ఞయిచ్చాడు, ఆయన ఆచార ప్రకారం వాలి మృత శరీరానికి సంస్కారం చేశాడు.

తరువాత శ్రీరామచంద్రుడు,"నీవు వెళ్ళి సుగ్రీవునకు రాజ్యము ఒప్పగించి, రాజును చెయ్యమని లక్ష్మణునితో అన్నాడు. శ్రీరాముని ఆజ్ఞప్రకారము లక్ష్మణుడు ఆయన పాదాలయందు తలవంచి వెళ్ళి పోయాడు.

లక్ష్మణుడు వెంటనే పట్టణములోని ప్రజలను, బ్రాహ్మణులను పిలిపించి సుగ్రీవునకు రాజ్యమప్పగించి, అంగదుని యువరాజును చేశాడు.

పార్వతీ! శ్రీరామునితో సమానమైన వారు ప్రపంచంలోలేరు. ఆయనలాగా ప్రజలను సుఖపెట్టేవారు, గురువులు, తల్లిదండ్రులు,

సోదరులు, స్వాములలో కూడా ఎవ్వరూ లేరు. దేవతలు, మనుష్యులు, మునులు, స్వార్థం కొరకే ప్రేమలు చూపుతుంటారు.

అనుక్షణం దుఃఖంతో, భయంతో బ్రతుకుతున్న సుగ్రీవునిని క్షణకాలంలో రాజును చేశాడు. శ్రీరాముని స్వభావము చాలా సుకుమారమైనది. ఇలాంటి ప్రభువును గురించి అన్ని విషయాలు తెలిసిన వారు కూడా, ఆయనను తలచుకోకపోతే ఆపదల వలలలో పడక ఏమవుతారు?"

శ్రీరామచంద్రుడు సుగ్రీవునికి అనేక రకాలైన రాజనీతిని తెలియజెప్పి-"వానరరాజా! సుగ్రీవా! నేను పద్నాలుగు సంవత్సరాల వరకు నగరంలోకి వెళ్ళను. గ్రీష్మ ఋతువుదాటిపోయి, వర్షఋతువు వచ్చింది. నేను దగ్గరలో నున్న ఈ పర్వతంమీద బసచేస్తాను. నీవు అంగద సహితంగా రాజ్యం చేస్తూ నా పనిని జ్ఞాపకముంచుకో" అన్నాడు.

శ్రీరామచంద్రుడు లక్ష్మణునితో సహా ప్రవర్షణ పర్వతం వద్ద ఉంటున్నాడు. దేవతలు అంతకు ముందుగానే, ఆ పర్వతంలోని ఒక గుహను, అందంగా అలంకరణచేసి, వుంచారు. కృపానిధి అయిన శ్రీరామచంద్రుడు వచ్చి, ఇక్కడ కొన్నిరోజులు నివసిస్తాడని వారికి తెలుసు.

వనం వికసించిన పూలతో శోభాయమానంగావుంది. తుమ్మెదల గుంపులు మధు లోభంతో రొదలు చేస్తున్నాయి. ప్రభువువచ్చినప్పటి నుంచి కంద, మూల, ఫల, పూలతో వనమంతా నిండిపోయింది.

దేవతలు, తుమ్మెదలు, పక్షులు, పశువులు శరీరాలు ధరించి ప్రభువుకు సేవలు చేస్తున్నాయి.

శ్రీరామచంద్రుడు నివసించడం మొదలు పెట్టినప్పటినుంచి

ఆ వనం శోభాయమానమయిపోయింది. అక్కడ చలువరాతి పెద్ద బండొకటి చాలా అనుకూలంగావుంది. దానిమీద అన్నదమ్ములిద్దరు సుఖంగా కూచున్నారు.

శ్రీరామచంద్రుడు, లక్ష్మణునకు అనేక రకాల భక్తి, వైరాగ్య జ్ఞాన, నీతి కథలు చెబుతున్నాడు. వర్షఋతువులో, ఆకాశంలో వ్యాపించిన మేఘాలు గర్జిస్తూ చాలా అందంగా వున్నాయి. శ్రీరాముడప్పుడన్నాడు-"లక్ష్మణా! చూడు, తుమ్మెదల గుంపులు మేఘాలను చూచి నాట్యాలు చేస్తున్నాయి. వాటిని చూస్తుంటే, గృహస్థుడెవరో హరి భక్తుని చూచి వైరాగ్యంలో లీనమయిపోయి సంతోషిస్తున్నట్లుగా వుంది వాతావరణమంతా.

ఆకాశంలో మేఘాలు తిరుగుతూ గర్జిస్తున్నాయి. సీతలేని కారణాన నాకు భయమేస్తున్నది. దుష్టుని ప్రేమ నిలుకడగా వుండనట్లుగా, మెరుపుల వెలుగులు మేఘాల్లో నిలుకడగా వుండడంలేదు.

విద్వాంసులు విద్యనభ్యసించిన తరువాత వినయశీలురైనట్లుగా, మేఘాలు నేల సమీపానికి వచ్చి కురుస్తున్నాయి. దుష్టులు కొద్ది సంపదలు సమకూరగానే విర్రవీగుతూ, మర్యాదలను కూడా పాటించనట్లుగా, చిన్ననదులు వర్షపు నీరుతో నిండినందున పొంగి గట్లను కోసుకుంటూపోతున్నాయి. నేలమీద పడగానే నీళ్ళు మురికై పోతున్నాయి. ఆ నీళ్ళను చూస్తుంటే, జీవుడు మాయవలలో చిక్కుకొని మలినమయి పోయినట్లుగా, ఉన్నాయి.

మంచిగుణాలు గలవారి వద్దకు మంచి గుణాలుగలవారు వచ్చినట్లుగా, నీళ్ళు ఒకచోటకు చేరి చెరువులు నింపుతున్నాయి. జీవుడు హరిని పొంది నిశ్చలుడై పోయినట్లుగా, నీళ్ళుసముద్రంలోకి వెళ్ళి స్థిరపడిపోతున్నాయి.

భూమి పచ్చని గడ్డితో నిండిపోయింది. త్రోవలు కనిపించడం

లేదు. ఆ త్రోవలను చూస్తుంటే, మూర్ఖుల ప్రవాహాలవల్ల పవిత్రమైన గ్రంథాలు కనుమరుగయి పోయినట్లుగా, వుంది. బ్రహ్మచారులు వేదాలు చదువుతున్నట్లుగా, నాల్గువైపులా కప్పలఅరుపులు అకర్షవంతంగా ఉన్నాయి. అనేకమైన చెట్లు క్రొత్త ఆకులు తొడిగినందున, సాధకుని మనస్సు జ్ఞానం లభించిన తరువాత మార్పు చెందినట్లుగా, మార్పు చెంది అందంగా వున్నాయి.

మంచిరాజ్యంలో దుష్టుల ఆందోళనలు మటుమాయమై పోతున్నట్లుగా, జిల్లేడు, మామిడిచెట్ల ఆకులు రాలిపోతున్నాయి. క్రోధం తగ్గిపోయినట్లుగా, ఎక్కడ వెదకినా దుమ్ము కనిపించడంలేదు.

పరోపకార పురుషునకు సంపదలు లభించినట్లుగా, పంటలతో పొలాలన్నీ పచ్చపచ్చగా వెలిగిపోతున్నాయి. డాంబికులందరు ఒకచోట ప్రోగయినట్లుగా, చీకటిరాత్రిలో మిణుగురులు ఒకచోట చేరి మెరసిపోతున్నాయి.

పెత్తన మిచ్చిన తరువాత ఆడవారు చెడిపోనట్లుగా, ఎక్కువ వర్షం కురిసినందున పొలాల్లోని మన్ను కళకళలాడుతున్నాయి. సజ్జనులు మోహ, మద, అహంకారాలను దూరంచేసుకున్నట్లుగా, నేర్పరులైన రైతులు కలుపులను పీకి పారవేస్తున్నారు.

కలికాలంలో ధర్మందారి తప్పిపోతున్నట్లుగా, చక్రవాకాలు కనిపించడంలేదు. భక్తుల హృదయాల్లో కామకోర్కె లుత్పన్నం కానట్లుగా, చవిటినేలల్లో వర్షాలు కురిసినా మొక్కలు మొలవడంలేదు. అన్నీ వసతులున్న రాజ్యంలో ప్రజాభివృద్ధి జరుగునట్లుగా, నానా రకాల ప్రాణులతో, భూమినిండి వుంది. జ్ఞానోత్పన్నమైన తరువాత ఇంద్రియాలు అదుపులో ఉండునట్లుగా, అక్కడక్కడ బాటసారులు అలసి నిలచి వున్నారు

గాలి వేగంగా వీస్తున్నందువలన మేఘాలు అక్కడక్కడ కని

పించకుండాపోతున్నాయి. వాటిని చూస్తుంటే, దుష్టపుత్రుడు పుట్టినం
దున కులం యొక్క ధర్మాచరణాలన్నీ నష్టమయిపోయినట్లుగా వుంది.
మేఘాలస్థితి ఒక్కొక్కప్పుడు మేఘాలవల్ల పగలే చీకటిగావుంది, మరొ
కప్పుడు సూర్యుడు కనిపిస్తున్నాడు. ఈ మేఘాలను చూస్తుంటే,
చెడుసాంగత్యంవల్ల జ్ఞానం నష్టమై పోవటం,మంచిసాంగత్యవల్ల జ్ఞానం
పెరుగుతున్నట్లుగావుంది.

లక్ష్మణా! చూడు, వర్షాకాలం గడచి పోయింది. ఎంతో అంద
మైన శరదృతువు వచ్చింది. వర్షానికి, రెల్లు గడ్డియొక్క తెల్లని
కంకులరూపంలో ముసలితనం వచ్చినట్లుగా, వికసించిన రెల్లు గడ్డి
పూలు భూమంతా వ్యాపించి పోయాయి. లోభం సంతోషం లేకుండా
చేసినట్లుగా, అగస్త్య నక్షత్రం కనిపించి త్రోవల్లోని నీళ్ళను ఎండ
గట్టింది. మాయా మోహాలనుండి తప్పించుకొన్న భక్తుల్లాగా, నదులు,
చెరువులు నిర్మలమైన జలంతో అందంగా ఉన్నాయి.

అజ్ఞానపు పురుషుడు ప్రేమను వదిలేసినట్లుగానే, నదులు,
చెరువులలోని నీళ్ళ మెల్ల మెల్లగా ఎండిపోతున్నాయి. సమయాను
కూలంగా మంచి పనులు తట్టినట్లుగా, శరదృతువును తెలిసికొని
కాటుక పిట్టలు వస్తున్నాయి. నీతి నిపుణులైనరాజుల పనులలాగా,
దుమ్ము బురదలేకుండా భూమి శోభాయమానంగా వుంది. మూర్ఖుడైన
గృహస్థు ధనం లేకుండా పోయినప్పుడు దుఃఖించులాగా,అక్కడక్కడ
నీళ్ళు తగ్గిపోయినందున చేపలు చికాకు పడుతున్నాయి. ఆశలన్నీ
వదలి ఆనందంగావున్న భక్తుల్లాగా, మేఘాలులేని ఆకాశం శోభాయ
మానంగా వుంది. నాభక్తిని ఎవరో, ఎక్కడో ఎప్పుడో ఒకరు పొంద
గలిగినట్లుగా, అక్కడక్కడ, శరదృతువులో వర్షము కురుస్తున్నది.

హరిభక్తిని సాధించిన వారలను, ఆశ్రమాలవారు సాధన రూప
మైన శ్రమను వదలివేసినట్లుగా. రాజులు, తాపసులు, వ్యాపారులు,

బిచ్చగాండ్లు విజయము, తపస్సు, వ్యాపారము, భిక్షల కొరకు సంతో షంగా నగరాలు వదలి వెళ్ళిపోతున్నారు.

హరిశరణు జొచ్చిన వారి కే బాధలూ వుండనట్లుగా, లోతైన నీళ్ళల్లోవున్న చేపలు సుఖంగా వున్నాయి. నిర్గుణ బ్రహ్మసగుణుడయి శోభాయమానంగా ఉన్నట్లు, చెరువులలోని కమలాలు వికసించి వున్నాయి.

తుమ్మెదలు అందంగా రొదలు చేస్తున్నాయి. పక్షులు రకరకా లుగా పలుకుతున్నాయి. దుష్టుడు ఇతరుల సంపదలను చూచి ఈర్ష్య పడ్డట్లుగా, చక్రవాకాలు రాత్రిని చూచి బాధపడు తున్నాయి. మహా దేవుని శత్రువు ఎన్నడూ సుఖం పొందని విధంగా, చాతకపక్షులు దాహంతో అరుస్తున్నాయి. భక్తుల దర్శనంతో పాపాలు దూరమయి పోయినట్లుగా, ఋతు తాపాన్ని రాత్రి చంద్రుడు తగ్గిస్తున్నాడు.

భక్తులు భగవంతుని దర్శనము కొరకు వేచివుండి దర్శనము చేసికున్నట్లుగా, చకోర పక్షుల గుంపు చలికాలం కొరకు ఎదురు చూస్తూవున్నాయి. బ్రాహ్మణులను వ్యతిరేకం చేసుకున్నందున కుల మంతా నాశన మయిపోయినట్లుగా, దోమలు, ఈగలు చలి వలన నష్టమైపోతున్నాయి. సద్గురువుదొరకగానే సంశయాలు, భ్రష్టాచారాలు నష్టమైనట్లుగా, వర్ష ఋతువు రాగానే భూమిమీదవున్న క్రిమికీటకాలు నశించి పోయాయి.

వర్షాకాలం దాటిపోయింది. నిర్మలమైన శరదృతువు వచ్చింది. సోదరా! ఇప్పటికీ సీతజాడ తెలియిలేదు. ఒక్కసారి ఆమె జాడ కను క్కోగల్గితే, నేను కాలాన్నయినా, యమునినైనా జయించి క్షణంలో ఆమెను తీసుకువస్తాను.

సోదరా! ఆమె ఎక్కడున్నా, బ్రతికుంటే, నేనామెను తప్ప కుండా తీసుకువస్తాను, సుగ్రీవుడు కూడా నాకిచ్చినమాట మరచి

పోయాడు. అతనికి రాజ్యము, సంపదలు, భార్య లభించాయి. అందు వలన అతనికి మతిమరుపు రానేవచ్చింది. నేను వాలిని చంపిన బాణంతోనే అతనిని రేపు చంపుతాను.

పార్వతీ! రాముని దయవలన అహంకార, మోహాలు దూరమై పోతున్నాయి. అలాంటి ఆయనకు ఇప్పుడిలా కోపం రావడమేమిటి? ఆయనను గురించి, ఆయనయందు భక్తివున్న జ్ఞానులు, మునులకు మాత్రమే తెలుస్తుంది. శ్రీరామునకు కోపం రావడం చూచి, లక్ష్మణుడు ధనస్సు ఎక్కుపెట్టాడు.అప్పుడు కరుణాసాగరుడయిన శ్రీరామచంద్రుడు లక్ష్మణునితో- "సోదరా! మిత్రుడైన సుగ్రీవుని కేవలం భయపెట్టి ఇక్కడకు తీసుకురా, అతనిని ఏమీ అనవద్దు" అన్నాడు.

ఇక్కడ కిష్కింధలో, సుగ్రీవుడు రాముని పనిని మరచి పోయా'డని హనుమంతుడను కొని "సుగ్రీవుని వద్దకు వెళ్ళి,ఆయన ముందు శిరసువంచి, సామ, దాన, భేద, దండోపాయాలు తెలియ జెప్పాడు.

హనుమంతుని మాటలు విని సుగ్రీవుడు భయపడి-"కామంలో పడినందున నాబుద్ధి పనిచేయకుండా పోయింది. ఆంజనేయా! వానర సమూహాలున్న చోట్లన్నింటికి దూతలను పంపు, పదిహేను రోజుల లోపల వార్త తేలేకపోతే, వారు నాచేతిలో చస్తారని, కూడా చెప్పి పంపించు" అన్నాడు.

హనుమంతుడు దూతలను పిలిపించి, ఎంతో ఆదరంగానే వారిని భయపెట్టాడు, రాజనీతిని తెలియ పరచాడు. దూతలందరు నమస్కారాలుచేసి వెళ్ళారు.

ఆసమయంలోనే లక్ష్మణుడు నగరంలోకి వచ్చాడు. ఆయనను క్రోధంలో చూచి వానరులందరు ఇటు అటు పరుగులు తీశారు. లక్ష్మణుడు ధనస్సును ఎక్కుపెట్టి—" నగరాన్ని తగులబెట్టి ఇప్పుడే

బూడిద చేసేస్తాను" అన్నాడు. పట్టణ ప్రజలందరు వ్యాకులపడిపోయి నట్లు గ్రహించి వాలిపుత్రుడయిన అంగదుడు వచ్చి లక్ష్మణుని పాదా లకు నమస్కరించగా లక్ష్మణుడు వారికి అభయమిచ్చాడు. వానర రాజు, లక్ష్మణునకు కోపము వచ్చినట్లు తెలిసి చాలా భయపడి—

"ఆంజనేయా! నీవు తారను వెంటపెట్టుకొనిపోయి, వినయంగా అన్నదమ్ములిద్దరకు నచ్చజెప్పు." అన్నాడు.

హనుమంతుడు తారను వెంటబెట్టుకొని వెళ్ళి లక్ష్మణునికి నమస్కరించి, ప్రభువును కీర్తించాడు. వినయంగా లక్ష్మణుని భవనం లోకి తీసుకొచ్చి, ఆయన పాదాలను కడిగి ఆసనం మీద కూచోబెట్టా డు. సుగ్రీవుడు వచ్చి నమస్కరించాడు. లక్ష్మణుడు అతని భుజాలు పట్టుకొని, అతని కౌగలించుకొన్నాడు.

అప్పుడు సుగ్రీవుడు-"రాకుమారా! కామ వ్యామోహంతో సమా నమైన మదము మరొకటి ఉండదు, అది మునులను కూడా మోహం లోకి లాగి తల్లక్రిందులు చేస్తుంది." అన్నాడు.

లక్ష్మణుడు సుగ్రీవుని మాటలు విని చాలా సంతోషించి, ఆయ నకు అనేకరకాలుగా తెలియజెప్పాడు. తరువాత హనుమంతుడు, దూతల సమూహాలు వెళ్ళిన తీరును వివరించాడు. సుగ్రీవుడు చాలా ఆనందంతో అంగదుడు మొదలైన వారిని వెంట బెట్టుకొని, లక్ష్మ ణుడు ముందు నడుస్తుండగా, శ్రీరామచంద్రుడున్నచోటుకు వెళ్ళి, శ్రీరాముని పాదాలకు తలవంచి నమస్కరించి, చేతులు జోడించి-

"ప్రభూ! నేనింతవరకు చేసిన పనులకు సంబంధించి, నా దోష మేమీలేదు. దేవా! మీ మాయ చాలా గొప్పది. మీ దయ వుంటే తప్ప, ఆ మాయ మనుష్యులను వదలిపెట్టదు.

స్వామీ! సురలు, నరులు, మునులందరు కోర్కెలలో చిక్కు కొని వున్నారు. ఇకనేనంటారా, తెలివితక్కువవాడను, వానర జాతి

వాడను, అంతులేని కామంగలవాడను. స్త్రీ యొక్క నయన బాణా లకు తట్టుకోగలవాడే, క్రోధరూపమైన దట్టమైన చీకటిరాత్రిలో మే ల్కొని వుంటాడు, లోభరూపమైన ఉచ్చుకు తన కంఠాన్ని అందిం చనివాడు, మీతో సమానుడయిపోతాడు." అన్నాడు.

శ్రీరామచంద్రుడు నవ్వి-"సుగ్రీవా! నీవు నాకు భరతునితో సమానమైన ముఖ్యుడవు. ఇప్పుడు సీత వార్త తెలియడానికి వీలయిన ప్రయత్నం చెయ్యి" అన్నాడు.

ఇంతలో వానరుల సమూహము వచ్చింది, అనేక రకాల వాన రులు అన్ని దిక్కుల్లో కనిపిస్తున్నారు.

"పార్వతి! వానరసైన్యాన్ని నేను చూచాను. వారిని లెక్కించా లను కొనువాడు మూర్ఖుడు. వానరులందరు వచ్చి శ్రీరాముని పాదా లకు తలలు వంచి నమస్కరించి, ఆయన ముఖాన్ని చూచి కృతార్థులై పోతున్నారు. శ్రీరాముడు, క్షేమసమాచారాలు అడుగని వానరుడొ క్కడూ లేడు. ప్రభువు ప్రపంచరూపుడు, అంతటా వ్యాపించివున్న వాడు, అటువంటి ప్రభువు, ఇలా క్షేమ సమాచారాలు తెలిసికోవడంలో వింతేమీలేదు

ఆయన ఆజ్ఞప్రకారం అందరు అక్కడక్కడ నిలబడ్డారు. సుగ్రీ వుడు అందరితో- "సోదరులారా! ఈ చేయబోయే పని శ్రీరామచం ద్రునిది, అందుచేత, మీరందరు నలువైపులకు వెళ్ళాలని నా కోరిక సీతను వెదకండి. సోదరులారా! ఒక్కనెల లోపల తిరిగి రావాలి. ఏ కబురు లేకుండా తిరిగి వచ్చిన వానిని సహించము" అన్నాడు.

వానరులందరు, వేరువేరు దిక్కులకు వెళ్ళారు. సుగ్రీవుడు అంగద, హనుమాన, మొదలైన వానరులను పిలిచి-"నీల, అంగద, హనుమాన, జాంబవంతులారా! మీరందరు శ్రేష్ఠులైన యోధులు. మీరందరు కలసి దక్షిణ దిక్కుకు వెళ్ళి, సీత జాడ తెలిసికొనిరండి'

ఏ విధంగా నయినాసరే మనము శ్రీరామచంద్రుని పనిపూర్తి చేయాలి. సీతను వెదకి ఆయనకు ఒప్పగింపాల్సిన బాధ్యత మనకు వుంది. మీపు అయిన అగ్నిని, హృదయంతో ఉంచుకొని స్వామిని కపటము లన్నీ వదలి సేవింపాలి.

జన్మ మరణాలు లేకుండా పోవడానికి మాయనువదలి పరలోకాన్ని సేవింపాలి. అన్నీ వదలి శ్రీరామచంద్రునే సేవించడం వలన జన్మయెత్తినందుకు ప్రయోజనముంటుంది. శ్రీ రఘువీరుని పాదాల యందు ప్రేమ వుంచువారే ప్రపంచంలో గుణవంతులు, అదృష్ట వంతులు. వానరులందరు సుగ్రీవాజ్ఞను పొంది, హృదయాలలో ప్రభువును ధ్యానించుకుంటూ వెళ్ళిపోయారు.

అందరికంటే చివరన ఆంజనేయుడు నమస్కరించాడు. ప్రభువు తన కార్యాన్ని ఆలోచించి, ఆయనను దగ్గరకు పిలచి, తన భక్తుడని భావించి, అతని తలమీద తన చేతినుంచి, తనచేతినున్న ఉంగరము తీసి—

"నీవు సీతకు, ఈ ఉంగరాన్ని ఆనవాలుగా యిచ్చి, విషయమంతా తెలయజెప్పి, నా విరహబాధ, బలము ఆమెకు వివరించి తొందరగా తిరిగిరమ్ము" అన్నాడు.

హనుమంతుడు తన జన్మసఫలమయినదనుకొని, హృదయంలో శ్రీరాముని స్మరిస్తూ వెళ్ళిపోయాడు. రామునికి అన్ని విషయాలు తెలిసినప్పటికీ కూడా, దేవతలకు రక్షకుడయి రాజనీతిని పాటిస్తున్నాడు.

వానరులందరు వనాలు, నదులు, చెరువులు,పర్వతాలు, గుహలు వెదకుచూ వెళ్ళారు. శ్రీరాముని పనిలో మునిగి వున్నారు. వారు తమ శరీరాల యందున్న ప్రేమను కూడా వదలేశారు.

ఎక్కడైనా, ఎప్పుడైనా రాక్షసులు తటస్థపడితే, ఒకే ఒక్క దెబ్బతో ప్రాణాలు తీస్తున్నారు. అందరు, అన్ని రకాలుగా అడవులు,

కొండలు మొదలైన వాటన్నింటిని వెదకుతున్నారు. ఎవరైనా ముని కనిపించితే, వాలు అందరు ఆనందంగా ఆయన చుట్టూ చేరుతున్నారు.

హనుమంతుడు, ఒక కొండమీద ఎక్కి నలువైపుల పరికించి చూచేటప్పటికి, ఒక గుహలో ఆశ్చర్యాన్ని కలిగించే విషయం కని పించింది. అనేక చక్రవాకాలు, కొంగలు, హంసలు ఎగురుతున్నాయి. ఎన్నో పక్షులు అందులోకి దూరుతున్నాయి.

హనుమంతుడు పర్వత శిఖరాన్నుండి దిగి, అందరిని తీసు కొని వెళ్ళి ఆ గుహలో జొరబడిపోయారు. అక్కడ ఒక అందమైన తోట, చెరువున్నాయి. వాటిలో చాలా కమలాలు వికసించివున్నాయి. ఒక మందిరం కూడావుంది. అందులో తాపస స్త్రీ కూర్చుని వుంది. దూరం నుండే ఆమె కందరు తలలు వంచి నమస్కారాలు చేశారు. ఆమె అడిగిన మీదట తమ సమాచారమంతా చెప్పారు. అప్పుడామె- "మంచినీళ్ళుత్రాగి, రుచికరమైన పండ్లు తృప్తిగా తినండి" అంది.

అందరు సరోవరంలో స్నానాలు చేసి, తియ్యని పండ్లు తిని, మరల ఆమె వద్దకు వెళ్ళారు. స్త్రీ తన కథంతా చెప్పి-"ఇప్పుడు నేను రఘునాథుడున్న చోటుకు వెళ్తాను. మీరు మీ కళ్ళను మూసుకొని, ఈ గుహను వదలి బయటకు వెళ్ళిపోండి. మీకు సీత జాడ తెలుస్తుం ది. ఖంగారు పడనక్కర్లేదు. హరివీరులందరు, కళ్ళు తెరచి చూచే సరికి, సముద్రపు టొడ్డునవున్నట్లు తెలసికున్నారు.

ఆ స్త్రీ రాముడున్న చోటికి వెళ్ళి, ఆయన చరణ కమలాల యందు తలనుంచి, ప్రభువును అనేక రకాలుగా స్తుతించింది. ప్రభు ఆమెకు అనన్య భక్తి ప్రసాదించాడు. ఆ స్త్రీ, బ్రహ్మాది దేవతల నమస్కారా లందుకొను శ్రీరాముని పాదాలను హృదయంలో దాచుకొని. ప్రభు ఆజ్ఞలభించినట్లుగా భావించి, బదరికాశ్రమము వెళ్ళిపోయింది.

కాలం గడచిపోవడమేగాని, పని పూర్తి కావడంలేదని వానరు

లందరు వ్యాకుల పడుతున్నారు. "సోదరులారా! సీత జాడ తెలిసికోకుండా వెళ్ళి ఏమి ప్రయోజనమున్నదని అనుకుంటున్నారు. అప్పుడు అంగదుడు, "రెండు వైపులా మనకు మరణం తప్పదు, ఇక్కడమనకు సీత జాడ తెలియలేదు, అక్కడకు వెళ్ళితే వానరరాజు సుగ్రీవుడు చంపేస్తాడు, మా నాయన వాలి కొట్టాడని, నా మీద కోపంతో వున్నాడు. నన్ను తప్పకుండా చంపేస్తాడు. శ్రీరాముడు నన్ను రక్షింవాడు గాని ఇందులో సుగ్రీవుని జాలి, దయ లేమీ లేవు. ఇక చచ్చి పోయినట్లే, సంటూ అంగదుడు కళ్ళంట నీళ్ళు పెట్టుకున్నాడు.

వానర వీరులందరు, అంగదుని మాటలు విని ఏమీ మాట్లాడలేక పోయారు. వాళ్ళందరి కళ్ళంట నీళ్ళొచ్చాయి. ఒక్క క్షణంవరకు శోకమగ్నులయి, మరల అందరు "వాకచక్యంగల యువరాజా! విను మనము సీతను తెలిసికోకుండా వెళ్ళము" అని లవణసాగరము ఒడ్డున దర్భాసనాలు ఏర్పరచుకొని కూచున్నారు.

"అంగదా! శ్రీరామచంద్రుని మామూలు మానవుడని అనుకోబోకు, ఆయన నిరాకారుడు, ఎవరిచేత జయింపబడని పరబ్రహ్మ అని తెలిసికో, మనమందరం ఎంతో అదృష్టవంతులము గాబట్టే ఎల్లప్పుడు సగుణ బ్రహ్మ సేవచేయగల్గుతున్నాం.

ప్రభువు, తన యిష్టప్రకారం దేవతలను, గోవులను, బ్రాహ్మణులను కాపాడడానికి అవతారాలెత్తుతూ ఉన్నాడు. సగుణోపాసకులందరు, తమ ముక్తిమార్గాలను వదలి, ఆయనసేవలుచేస్తూ, ఆయన వద్దనే వుంటున్నారు" అని జాంబవంతుడు అంగదుని దుఃఖాన్ని చూచి విశేషమైన ఉపదేశాత్మక కథలు చెప్పాడు.

వారి మాటలు కొండ గుహలోనున్న సంపాతి విని, బయటకు వచ్చి వానరులను చూచి—"ఈరోజు భగవంతుడు, ఇక్కడినుండి కదలకుండానే మంచి ఆహారం పంపాడు. ఇవాళ అందరిని తినేస్తాను.

భోజనం లేక చాలా రోజులనుండి మలమల మాడి వస్తున్నాను. నాకు ఎన్నడూపొట్ట నిండాభోజనం దొరకడంలేదు. ఈరోజు పరమేశ్వరుడు ఒకేసారి ఎంతోఆహారాన్ని అందించాడు" అనుకున్నాడు.

సంపాతి గరుడుని మాటలు చెవుల బడగానే వానరులందరు, "ఇప్పుడు నిజంగానే మన చావులు తప్పవు," అనుకుని లేచి నిల బడ్డారు. కాని జాంబవంతుని మనస్సులో ప్రత్యేకమైన ఆలోచన ఏర్పడింది,అప్పుడంగదుడు,జటాయువుతో సమానమైన అదృష్టవంతు లెవ్వరూలేరు శ్రీరాముని కార్యం కోసం శరీరాన్ని త్యజించి, వైకుం ఠానికి వెళ్ళాడు. ఆయనెంతో అదృష్టవంతుడు" అన్నాడు.

వారి దైన్యదీ మాటలు విని దగ్గరకు వచ్చాడు సంపాతి. వానరు లంతా భయపడి పోయారు. ఆయన వారి భయాలను పోగొట్టి, వారి ద్వారా విషయం తెలుసుకుని నన్ను సముద్రపు ఒడ్డుకు తీసుకు వెళ్ళండి, నేను జటాయువుకు తిలాంజలి యివ్వాలి. నేను మీకు సహా యం చేస్తాను. మీరు సీతను వెదకుతున్నారు. ఆమె జాడ మీకు తెలిసిపోతుంది"అన్నాడు.

సంపాతి సోదరుడైన జటాయువుకు నూవుల నీళ్ళిచ్చి సము ద్రపు ఒడ్డున కూచుని కథచెప్పాడు- "వానరవీరులారా! మేము, అన్నదమ్ములిద్దరం, యౌవనంలో ఉండగా ఎగురుకుంటూ సూర్యునివద్దకు చేరుకున్నాము. జటాయువు ఆ తేజస్సుకు తట్టుకోలేక పోయాడు, అతను తిరిగి వచ్చాడు. కానిగర్విష్టినయిన నేను సూర్యుని వద్దకు పోతూనే వున్నాను. సూర్యుని తీవ్రమైన వేడిమికి నారెక్కలు రెండు మాడిపోయాయి. నేను పెద్దగా అరుస్తూనేలమీద పడిపోయాను.

అక్కడ చంద్రుడను ముని ఉన్నాడు, నన్ను చూచి చాలా దయకలిగిందాయనకు. నాకు ఎంతోజ్ఞానం కలిగించి, త్రేతాయుగంలో భగవంతుడు మనుష్య రూపమెత్తుతాడు. ఆయన భార్యను రాక్షస

రాజు తీసుకొని వెళ్తాడని, వారిని వెదకటానికి ప్రభువు దూతలను పంపుతాడని, వారిని కలుసుకున్నప్పుడు, నీవు పవిత్రుడయిపోతావని, నీ రెక్కలు మరల మొలుస్తాయని, నీవు చింతించవద్దని, ఆ దూతలకు నీవు సీత జాడను తెలుపమని చెప్పాడు.

ఈరోజు ఆ మహాముని చెప్పిన మాటలు నిజమైనాయి, ఇప్పుడు మీరు నా మాటలు విని మీస్వామి పనిచేయండి. త్రికూట పర్వతం సముద్రానికి ఆవలవైపునవుంది, దానిమీద లంకాపట్టణముంది. అక్కడ ఏభయమూలేని రావణుడుంటాడు. అక్కడ అశోక వాటి కను దొకటివుంది. అక్కడనే సీత, చింతామగ్నురాలై, కూచుని వుంటుంది.

నేను ఆమెను చూస్తున్నాను, కాని మీరు చూడలేరు. ఎందు కంటే గరుడుని దృష్టి అపారమైనది. ఇప్పుడు నేను ముసలివాడనై పోయాను. లేకపోతే మీకు కొంతైనా సహాయం చేసి ఉండేవాడను.

వందామడ సముద్రాన్ని దాటగలవాడే,శ్రీరాముని కార్యాన్ని సాధించగల్గుతాడు. నన్ను చూచి, మీరు ధైర్యం తెచ్చుకోండి. చూడండి, రాముని కృపవల్లనేకదా, నాకు రెక్కలు వచ్చి, నా ఈ శరీరం ఇంత అందంగా మారిపోయింది."

రాముని స్మరించుకున్నంత మాత్రాన పాపులు కూడా, అపార మైన భవసాగరాన్ని దాటగల్గుతున్నారు. మీరు ఆ శ్రీరామచంద్రుని దూతలయి కూడా పిరికితనాన్ని దగ్గరకు రానివ్వడం మంచిదికాదు, శ్రీరామచంద్రుని హృదయంలో తలచుకుంటూ మీపని మీరు చేయండి."

సంపాతి చెప్పి వెళ్ళాక వానరుల మనస్సులలో చాలా ఆశ్చ ర్యం వేసింది. అందరు తమ తమ బలాల్ని చెప్పారు, కాని దాటి పోడానికి ఎవరికీ ధైర్యం లేక సందేహించారు.

"నేనిప్పుడు ముసలి వాడనయిపోయాను, శరీరంలో వెనుకటి బలం ఏమాత్రం లేదు. భగవంతుడు వామనుడయిన రోజుల్లో నేను యువకుడను, అప్పుడు నేను చాలా బలవంతుడను" అన్నాడు జాంబవంతుడు.

అప్పుడందరు అంగదుని పట్టుకొని "ఏదో మార్గం చూడండి" అంటూ "సాగరాన్ని దాటగల యోధులెవరైనా ఉన్నారా?" అని అడిగారు.

ఒక వానరుడన్నాడు-"నే నివాళైనా ముప్పై ఆమడలు వెళ్ళగలను." "నేను నలభై ఆమడలు వెళ్ళగలను, అంతకుమించి పోలే నన్నాడు" నీలుడు.

నీలుని మాటలు విని దుర్ధరుడు- "నాశక్తి యాభై ఆమడలకు సరిపోతుంది" అనగానే, నలుడు చేతులెత్తి-"సోదరులారా! నాబలము అరవై ఆమడలవరకు సరిపోతుంది" అన్నాడు.

అందరి ముఖాలు చూచి, "వెనుకటిలాగా నాకు బలమేమాత్రమూలేదు. ముసలితనంలో కూడా క్షణంలో సాగరాన్ని పరుగెత్తిదాటగలను.

ఒకరోజు నేను బదరికాశ్రమం వెళ్ళాను. ఆ ఆశ్రమాన్ని చూచి నాకు చాలా ఆనందం కలిగింది. ఒక విద్వాంసుడు బ్రహ్మజ్ఞాని అయిన బ్రాహ్మణుడు భగవంతుని పూజిస్తున్నాడు. ఇంతలో ఆయనన్ను చంపడానికి ఒక రాక్షసుడు వచ్చాడు. అతనిని చూడగానే నా కమితంగా కోపం వచ్చింది. ముని భయపడడం చూచి నేనాయన ఎదుటికి వెళ్ళాను. వెంటనే ఆ రాక్షసుడు ముప్పై ఆమడల ఒక పర్వతాన్ని లేపి, దానితో నా మోకళ్ళమీద కొట్టాడు. ఆ దెబ్బ తగిలిన వెంటనే నేనా దెబ్బను సహించి, ఆతనిని నేలమీద పడగొట్టాను.

క్రోధంతో, ఆతని రెండుకాళ్ళు పట్టుకొని చీల్చేశాను అప్పుడు

ఆ బ్రాహ్మణోత్తముడు, సంతోషంగా నన్ను ఆశీర్వదించాడు. ఆ బలాన్ని మీతో చెప్పితే మీరాశ్చర్య పడతారు. అందుచేత మోకాలికి కొండదెబ్బ తగిలిందని మీతో చెప్పలేదు. కాని నేను తొంభై ఆయిదు ఆమడలు దూక గలను.

బలిని బంధించే సమయంలో, ప్రభువు పెరిగిన విధాన్ని వర్ణించడం చాలా కష్టం. కాని, రెండు ఘడియల్లోనే నేను ఆయన చుట్టు ఏడుసార్లు తిరిగాను" అన్నాడు జాంబవంతుడు.

"నేను దాటిపోవడమైతే పోగలను, కాని తిరిగి రావడంలో సందేహంగా వుంది." అన్నాడు అంగదుడు.

"నీవు అందుకు తగిన వాడవే. కాని నీవు మాకు ముఖ్యుడవు నిన్నెలా పంపగలము?" అని, జాంబవంతుడు హనుమంతునితో-బలవంతుడవైన హనుమంతా! నీవెందుకు మాట్లాడక కూర్చున్నావు? నీవు వాయుపుత్రుడవు, నీ బలము వాయువుతో సమానమైనది. నీవు బుద్ధి, వివేక, విజ్ఞానాలగనివి.

సోదరా! ప్రపంచంలో నీవు చేయలేని పనేముంది? శ్రీరాముని పని చేయడానికే నీ అవతారమేర్పడింది." అనగానే హనుమంతునకు శరీరమంతా పొంగింది.

"ఆంజనేయా! ఇప్పుడు నేను కారణసహితంగా నీ జన్మకథను చెప్తాను. అందరు ఇక్కడే కూచుని వినండి.

హిమాలయ పర్వతాలవద్ద తపస్సులో తేజశ్శాలి అయిన కశ్యపుడను ఋషివున్నాడు. కఠినమైన యమరాజులాగా, ఒక ఐరావతంలాంటి ఏనుగు ఋషికి ఎదురుగా వచ్చి నిలబడింది. దానిని చూచి ఋషులందరు భయపడి పోయారు. భయంచేత వారికాళ్ళు చచ్చుబడి పోయాయి. నడువలేక పోయారు. చాలా చురుకైన మహావాన్ని కేసరి, ఆ వనానికి రాజు, ఆ ఏనుగును చూచి మునులం

దరు అరచారు-

"వానరరాజా! మేమంతా మీ సహాయం కోరుతున్నాం." అని ఋషులు దుంఖించడం విని ఆయనకు దయకలిగి వెంటనే అక్కడకు వచ్చాడు.

కేసరి ఆ ఏనుగుతో కలబడి ఒక్క గ్రుద్దు గుద్దాడు, ఇద్దరు నేలమీద పడ్డారు. ఒక పెద్ద కేకపెట్టాడు మీనాన్న అప్పుడొక ముని సంతోషించి, మీనాన్నగారి అంతు తెలియని బలాన్ని చూచి, ఆశీర్వ దిస్తూ- "కపిరాజా! నీయిష్ట మొచ్చిన వరాన్ని కోరుకో" అన్నాడు.

ఋషి సంతోషంగా ఉన్నట్లు గ్రహించిన నీ తండ్రి కేసరి, రెండు చేతులు జోడించి-"భగవానుడా! మీరు నాయందు ప్రసన్ను లయినట్లయితే. గాలితో సమానమైన బలం గల పుత్రుని ప్రసాదిం చండి" అన్నాడు "అలాగే" అని ముని వెళ్ళిపోయాడు.

ఇక తరువాత వృత్తాంతం విను. మీతల్లి అంజని, ఆమె అందంముందు రతి అందం ఎందుకూ కొరగాదు. ఆమె పదహారు వన్నెల బంగారంగా పర్వత శిఖరంమీద కూర్చుంది. ఆ సమయాన శీతల, మంద, సుగంధిత వాయువులు వీస్తున్నాయి. ఆమె ఆ వన శోభను చూచి సంతోషిస్తూవుంది.

గాలి దేవుడు ఆమెను చూచి మోహితుడయి, గాలికి చీరలేపి శరీరాన్ని తాకాలని అనుకున్నాడు. ఈ ఘటనను చూచిన మీ తల్లికి కోపం వచ్చి, శాపం ఇవ్వబోయింది. అప్పుడు పవనుడు మధురంగా- "శాపమివ్వవద్దు, మొదట నా మాట విను. నీ భర్త ఋషిని పుత్రుడు కావాలని వరమడిగాడు. ఈ కారణంచేత నేను నీ శరీరాన్ని తాక బోతున్నాను.

నేను శారీరకంగా నిన్ను అంటుకోలేదు. అలాంటిస్థితిలో నీవు నన్ను ఎలా శపిస్తావు?" అని పవనదేవుడు కనపడకుండా వెళ్ళాడు.

నీ తల్లి ఈ విషయాలన్నీ మీ నాన్నగారితో చెప్పింది.

"ఇప్పుడు నేను ఆనందంగా నీకు నీ జన్మను గురించి చెప్తున్నాను. కులానికి వెలుగు రూపమనుకొని అంతా విను. శుభనక్షత్రం, శుభ ఘడియల్లో, దేవబలంతో నీవు పుట్టావు. నీ జన్మ తిథి కార్తీకమాసము. విదియ, సోమవారము.

పవనదేవుడు నిన్ను, చేతితో నిమిరి. నీవు నాతో సమానమైన బలవంతుడవవుతావని వరమిచ్చాడు. నీవు పుట్టినందున ఇద్దరు దంపతులు సంతోషించి, వనంలో ఇష్టం వచ్చినట్లు విహరిస్తున్నారు.

ఒక రోజు తల్లి ఒడిలో వుండి నీవు పాలు త్రాగుతూ, ఆడుకుంటూవున్నావు. ఉదయాన ఎర్రని రంగులో సూర్యకిరణాల అందాన్ని చూచి, గంతులు వేస్తూ, వేగంగా ఆకాశంలోకి ఎగిరావు. సూర్యుని పట్టుకుందామని చేతులు చాపి పరుగెత్తావు. అప్పుడింద్రుడు క్రోధంతో వజ్రాయుధాన్ని వేశాడు.

సోదరా! హనుమా! ఎంతో గట్టి వజ్రాయుధపు దెబ్బతో నీవు మూర్ఛపోయావు. అప్పుడు పవన దేవుడు క్రోధించి గాలిని ఆపాడు. మూడులోకాలు వెంటనే గగ్గోలెత్తిపోయాయి. దేవతలు తమ స్వార్థాన్ని ఒప్పుకొని బ్రతిమలాడారు. అప్పుడు గుణ, జ్ఞానాలనిధి అయిన శివుడు అన్నాడు-"ధైర్యం వహించండి,ఉన్మాదులు కావద్దు. అందరు కలసి పవనదేవుని వద్దకు వెళ్ళండి. శివుడు, బ్రహ్మ, ఇంద్రాదులు పవనుని వద్ద కెళ్ళారు.

"మీ పుత్రుడు ఆకాశంలో నున్న సూర్యుని పట్టుకోబోయాడు మీరేమో గాలిని ఆపి అందరికి బాధ కలిగించారు. సోదరా! గాలిని వదలు, లేకపోతే అందరి ప్రాణాలుపోతాయి. దీని వలన మీకుకూడా కీర్తి వస్తుంది. మీకు కోరుకొన్న వరం ఇస్తాం" అన్నారందరు.

దేవతల చక్కని పలుకులు విని పవనదేవుడు రెండు చేతులు

జోడించి-"దేవతలారా! నా పుత్రునకు, అమరుడు, అజేయుడు, బల సముద్రుడు, చతురుడు కావడానికి వీలైన, ఒక వరము, రాముని భక్తుడయి, ఆయన వెంతనే వుండునట్లు మరొక వరమివ్వండి" అన్నాడు"

దేవతలు-"అలాగే జరుగుతుంది" అన్నారు. అప్పుడు పవన దేవుడు గాలిని వదిలాడు. దేవతలందరు వరదానాలు చేసి వెళ్ళారు. బ్రహ్మాతన శక్తిని వరమిచ్చాడు. అగ్ని అగ్నివలన, ఇంద్రుడు వజ్రం వలన, శివుడు త్రిశూలం వలన, వరుణుడు జలంనుండి, సరస్వతీదేవి తన మాటలనుండి ఆయన నిర్భయంగా వుండు వరాలిచ్చారు.

హనుమంతుడు మునుల దగ్గరకు వెళ్ళినప్పుడల్లా, వారి కమండ లాలు పగులగొట్టి నీళ్ళు ఒలకపోస్తున్నాడు. వృక్షాలను పెకలించేస్తు న్నాడు, పర్వత శిఖరాలను క్రిందకు త్రోసేస్తున్నాడు. మహాబల మున్న కారణాన శరీరంతో రుద్దుతున్నాడు.

అప్పుడు మునులు ఆలోచించి-"నీకు అంతులేని బలముంది. ఆ బలాన్ని నీవు మరచిపోదువు గాక! ఎప్పుడైనా, ఎవరైనా నీకు నీ బలాన్ని జ్ఞప్తికి తెస్తే, నీకు నీబలం మామూలుగా సమకూరుతుంది" అని శాపమిచ్చారు.

నీవు నీ తల్లిదండ్రులకు వారి ప్రాణాలతో సమానమైన వాడవు. ఇంద్రుడు వజ్రాయుధంతో కొట్టినప్పుడు నీ గడ్డము వంకరపోయింది. అందుకే నీ పేరు, హనుమంతుడయింది. ఇది నీ కథ."

ఆయన కథంతా విన్న తరువాత హనుమంతుడు—"శోకించ నక్కర్లేదు. ధైర్యంగా ఉండండి. నేను నిశ్చయంగా శ్రీరాముని సేవకుడను" అన్నాడు. హనుమంతుడన్నమాటలు విని అందరు, జయజయకారాలు, వినిపించారు.

"ఇప్పుడిక శ్రీరాముని కార్యము పూర్తి అవుతుంద'ని అంగ దుడు ఎంతో ఆనందించాడు. బలవంతులైన జాంబవంతుడు, నలుడు నీలుడు, మిగతావారు, అంగదుడు మొదలైన వారందరు "రాముని

పని నీవు చేస్తావు, చేయగలవు" అని ఆంజనేయునితో అన్నారు.

"నేను నిశ్చయంగానే శ్రీరఘునాథుని పని పూర్తిచేస్తాను." అని హనుమంతుడు సముద్రంవైపు చూచి అన్నాడు.

ఆయన బంగారంలాంటి రంగుగల శరీరం, సుమేరు పర్వతమా అన్నట్లుగా వెలిగిపోతున్నది. మాటిమాటికి సింహనాదం చేసి- "చెప్పండి, మీరు సరేనంటే, ఆటగా ఈ సముద్రాన్ని దాటేస్తాను. సైన్య సహితంగా రావణుని చంపి, త్రికూట పర్వతాన్ని పెకలించుకొని ఇక్కడకు తెస్తాను. జాంబవంతా! నేను మిమ్మడుగుతున్నాను, నాకు సరియైన మార్గ తెలుపండి" అన్నాడు.

జాంబవంతుడు-"సోదరా! నీవు వెళ్ళి సీత సమాచారం తెలసికొని, ఇక్కడికి వచ్చి మా అందరికి చెప్పు, చాలు" అన్నాడు.

వానరుల సైన్యాన్ని వెంటబెట్టుకొనిపోయి, రాక్షసులను సంహరించి శ్రీరామచంద్రుడు సీతను తెస్తాడు. ఆ సమయంలో, మూడులోకాలను పవిత్రపరచు చక్కని కీర్తి కథను దేవతలు, నారదుడు మొదలైనవారు వర్ణిస్తారు. శ్రీరామచంద్రుని కీర్తిని విన్నవారు, గానం చేసినవారు, చెప్పినవారు, అర్థం చేసుకున్నవారు పరమపదాన్ని పొందుతారు. మోక్షాన్ని పొందుతారు. ఆ కీర్తినే, శ్రీరామచంద్రుని పాదకమలాలకు తుమ్మెద అయిన తులసీదాసు గానంచేస్తాడు.

శ్రీరాముని కీర్తి, సంసారరూపంలో వున్న జనన, మరణాదులకు మందు. ఈయన కథను విన్నవారి కోర్కెలన్నీ, మూడు పురాలకు శత్రువైన రాముడు, తీర్చేస్తారు.

శ్రీరామచంద్రుని శరీరం నీలకమలంలాగా శ్యామలం, ఆయన అందం కోట్లమన్మథుల అందాలకంటే మిన్న అయినది, ఆయన నామం పాపరూపాలైన పక్షులకు వేటగాడు, అందువలన ఆయన గుణాలను తప్పకుండా విని తీరాలి.

కిష్కింధా కాండము సమాప్తం

# సుందర కాండము

తులసీదాసుకు, తాను రామాయణంలో ఏ కాండము వ్రాయ మొదలిడినా, తనయిష్ట దైవాలను ముందుగా స్తుతించు కోవడం ఇష్టం.

శాంతవిత్తుడు, సర్వకాలములయందుండువాడు, వర్ణింప శక్యము కానివాడు, బ్రహ్మ. విష్ణు, మహేశ్వరి, ఆదిశేషులద్వారా నిత్యము సేవలందు కొనువాడు, దేవతలలోమేటి, మాయద్వారా మానవజన్మ యెత్తినవాడు దయాసాగరుడు, రఘువంశంలో శ్రేష్ఠుడు, రాజులలో తలమానికము, రాముడను పేరుగల పరమేశ్వరునకు నేను (తులసీ దాసు) నమస్కరిస్తున్నాను.

శ్రీరామచంద్రా! నీవు అంతటా ఉన్నవాడవు, నీవు లేని చోటంటూ లేదు. నాకు ఏకోరికలూలేవు. నాకు నీయందు పరిపూర్ణ మైన భక్తి ఉండటానికి అనుమతినివ్వు. నా మనస్సుకు ఏ విధమైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలుఅంటకుండునట్లుగా చూడు. నేను నిజముచెబుతున్నాను. నాకింతకంటె మరొక కోర్కెంటూ ఏదీలేదు.

నీకున్న బలానికి సాటివచ్చు బలవంతుడు సృష్టిలో మరొకడు లేడు. హిమాలయ పర్వతంలాగా వెలిగిపోతున్నశరీరం నీది, రాక్షస రూపంలో ఉన్న అరణ్యాన్ని సర్వనాశనం చేయడానికి అవతరించిన అగ్నితో సమానమైన వాడవు నీవు. జ్ఞానులలో నీకు సాటివచ్చు వారు లేరు. నీవు గుణాలకు గనివి. నీలోలేని మంచి గుణాలు మరెక్కడా

లేవు. నీవు వానరులకు నాయకుడవు. రామచంద్రునికి ప్రియమైన భక్తుడవు. వాయుదేవుని పుత్రుడవు అయిన హనుమంతా! నీకు నమస్కారం (తులసీదాసు) చేస్తున్నాను.

జాంబవంతుని సున్నితమైన, సుందరమైనమాటలు హనుమంతునకు నచ్చాయి. లంకలోనున్న సీతమ్మవారి జాడతెలిసికొని రావడానికి సిద్ధమయి వెళుతూ" సోదరులారా! మీరంతా నేను వచ్చే వరకు దుఃఖాలను దిగమింగుతూ కందమూల ఫలాలతో కాలం వెళ్ళబుచ్చుకుంటూ, నా కొరకు ఎదురు చూస్తూండండి. నేను సీతమ్మ తల్లిని చూచి మాట్లాడనిది మాత్రం తిరిగిరాను, నేను వెళ్ళేపని సానుకూలమవుతుందని నాకు బాగా నమ్మకమేర్పడినది. ఎందుకంటే, పని పూర్తికాని సందర్భంలో నాకింత ఆనందము కలుగుటకు వీలులేదు" అని తలవంచి సంతోషంగా శ్రీరాముని మనస్సులో ధ్యానించుకుంటూ వెళ్ళిపోయాడు హనుమంతుడు.

సముద్రపుటొడ్డున ఒక అందమైన పర్వతముంది. హనుమంతుడు దానిమీదకు ఆటలాడు కుంటున్నట్లుగా ఒక్క ఎగురు ఎగిరి ఎక్కాడు. (ఆపర్వతం పేరు సుందర పర్వతం. ముందుగా హనుమంతుడు ఆ పర్వతం ఎక్కి ప్రయాణం చేస్తున్నాడు గాన ఈ కాండను సుందరకాండ అన్నారు.) మహా బలవంతుడైన హనుమంతుడు తరచుగా శ్రీరామచంద్రుని తలచుకుంటూ వేగంగా వెళ్ళుతున్నాడు.

హనుమంతుడు దూకి ఎక్కిన ఆపర్వతం వెంటనే పాతాళంలోకి వెళ్ళింది. రామచంద్రుని అమోఘమైన బాణం ఏ విధంగా వేగంగా దూసుకు పోతుందో, ఆ విధంగా హనుమంతుడు వేగంగా వెళ్ళాడు. సముద్రుడు హనుమంతుడు శ్రీరామచంద్రుని దూతయని తెలిసికొని మైనాకునితో "మైనాకా! నీవు ఇతనికి వసతి కల్పించి, ఇతని

అలసటను తగ్గించడానికి ప్రయత్నం చెయ్యి. ఎందుకంటే, ఇంద్రుడు తన చేతిలోనున్న వజ్రాయుధంతో పర్వతాల రెక్కలు నరుకడానికి సిద్ధమైనప్పుడు వాయుదేవుడునీకు సహాయం చేశాడు. (అంటేనిన్ను తీసికొనివచ్చి ఇక్కడ నాలో దాచాడు). ఇప్పుడాయన పుత్రుడే లంకకువెళ్ళుతున్నాడు. అందుచేత ఆయనకు సహాయం చేయడం సబబు, అన్నాడు.

సాగరుని మాటలు మైనాకునికి నచ్చి, మైనాకుడు వెంటనే సముద్రంలోనుండి పైకి వచ్చి, హనుమంతునికి చేతులు జోడించి వినయంగా "విశ్రాంతి తీసికోండి" అన్నాడు.

మైనాకుని వినయానికి ఎంతో సంతోషించి, అతని శరీరాన్ని నిమిరి నమస్కారంచేసి "సోదరా? శ్రీరాముని పనిపూర్తగువరకు నాకు విశ్రాంతి ఏమిటి? ఒక విశిష్టమైన పనికి పూనుకున్నప్పుడు విశ్రాంతులకు, నిద్రాహారాలకు ప్రాధాన్య మివ్వకూడ"దన్నాడు హనుమంతుడు.

## 24

హనుమంతుడు వెళ్ళడం దేవతలు చూచారు. లంకలోఎందరో బలాఢ్యులు, బుద్ధి మంతులుండగా, వారిముందు ఇతని బలము, బుద్ధి చాలుతుందా, లేదాయను విషయం తెలిసికోవాలను ఉద్దేశ్యంతో సురసయను పేరుగల పాముల తల్లిని పంపారు. ఆమె హనుమంతుని దగ్గరకు వచ్చి- "ఈరోజు దేవతలు నాకు నిన్ను మంచి రుచిగల భోజనాన్ని సమకూర్చి పెట్టార"నగానే హనుమంతుడు నవ్వుతూ "నేను రాముని పనిమీద చాలా అవసరంగా వెళ్ళుతున్నాను. సీతమ్మ ఎక్కడున్నదో తెలిసికొని శ్రీరామచంద్రునికి తెలుపాలి. ఆ తరువాత వచ్చి తప్పకుండా నీకు భోజనమవుతాను, అప్పుడు నీవు శాంతంగా,

తృప్తిగా భోంచేయవచ్చు. నేనిప్పుడు నీతో చెప్పునవి పరమ సత్యము నన్నిప్పుడు పోనివ్వు" అని ఎంతో వినయంగా చెప్పాడు, కాని ఆమె ససేమిరా కాదన్నది. అప్పుడు హనుమంతునకు పట్టుదల హెచ్చి "ఇంకా ఆలశ్యమెందుకు? తినమని తన శరీరాన్ని పెంచేశాడు. సురస ఒక ఆమడ వెడల్పున నోరు తెరవి తినబోయింది. హనుమంతుడు తన శరీరాన్ని రెండామడల విశాలం చేశాడు. ఆమె పదహారామడల నోరు తెరవింది. హనుమంతుడప్పుడు చిన్న రూపంగా మారి సురసనోటిలోకి దూరి బయటికి వచ్చి తలవంచి నమస్కారం చేస్తూ క్షమించమని కోరాడు. అప్పుడు సురస" నన్ను దేవతలు నీబుద్ధి బలాన్ని, కండబలాన్ని పరీక్షించమని పంపారు. నీవు బుద్ధిలో బలంలోకూడా అనన్యమైనవాడవు. నీవు తప్పకుండా శ్రీరామచంద్రుని కార్యాన్ని సాధించుకు వచ్చి తిరులావు" అని ఆశీర్వదించి వెళ్ళి పోయింది. హనుమంతుడు అమిత సంతోషంతో ముందుకు సాగి పోయాడు.

సముద్రంలో ఒక రాక్షస స్త్రీ నివసిస్తూ వుంది. అది మాయతో ఆకాశంలో ఎగిరే పక్షుల నీడను గుర్తుబట్టి వాటన్నింటిని తింటూ వుంది. ఈ మోసమే హనుమంతుని కూడా చేయబోయింది. ఆయన దానికిటుకు తెలిసికొని, దానినిచంపి సముద్రాన్ని దాటివెళ్ళాడు. అక్కడకు వెళ్ళిన తరువాత ఆ వనం యొక్క అందాన్ని చూచాడు. తేనెత్రాగాలను ఆసక్తితోతుమ్మెదలురోద చేస్తున్నాయి. అనేక రకాల వృక్షాలు పండ్లు, పూలతో శోభాయమానంగా ఉన్నాయి. పశుపక్షుల గుంపులను చూచేటప్పటికి హానుమంతునకు అమితానందం కలిగింది. అటుచూస్తే ఎదురుగా పెద్ద పర్వతముంది. దాని మీదకు ఒక్క దూకు దూకి ఎక్కాడు. అప్పుడు పార్వతితో శివుడంటున్నాడు— "పార్వతీ! ఇంతవరకు హనుమంతుడు చేసిన పనుల్లోగాని, విష

యాల్లోగాని ఆతని గొప్పతనమేమీలేదు. ఈ గొప్పతనమంతా కాలాన్ని కూడా తన ఆజ్ఞతో నడుకొను శక్తిగల శ్రీరామచంద్రుని ప్రతాపమే."

సరే, హనుమంతుడు పర్వతంమీద ఎక్కిచూశాడు. బంగారు కోటలు, వాటి బురుజులు అందంగా వెలిగిపోతున్నాయి. ఆ పెద్ద కోటను వర్ణించడానికి మాటలుచాలవు. ఆ కోట చాలా ఎత్తైనది. దానికి నలువైపులా సముద్రముంది. రకరకాల మణులతో, పొదిగి బంగారు ప్రహరీగోడలు వున్నాయి. భవనాలు ఎంతో అందంగా ఉన్నాయి. నాలుగురోడ్లు కలిసిన కూడలి, వీధులు. మంచి మంచి బాటలుతో, వెలిగిపోతున్న ఆ పట్టణం చాలా గొప్పగా సమకూర్చబడి వుంది. ఏనుగులు, గుర్రాలు, కంచరగాడిదెలు గుంపులు, కాలిబంట్లు, రథాలు మొదలైనవాటిని గురించి చెప్పాలన్నా, వాటిలెఖ్ఖలు చెప్పా లన్నా సాధ్యమయ్యే పని కాదు. అంతేకాదు, అనేక రకాల మహాబల వంతులైన రాక్షస సేనలున్నాయి. వారిని గురించి చెప్పాలంటే, చిత్రగుప్తుడి వలనా కాదు. వనాలు, తోటలు, ఉపవనాలు,పూదోటలు, చెరువులు, బావులు, కొలనులువగైరాలను చూస్తుంటే కళ్ళు జిగేలు మంటున్నాయి. మనుష్యులు, నాగులు,దేవకన్యలు వారివారి అందాలు మునుల మనస్సులను సైతము మరులుగొలిపే విధంగా ఉన్నాయి. కొన్నిచోట్ల పర్వతాలలాంటి శరీరాలతో నున్న మహాబలవంతులైన మల్లయోధులున్నారు. వారు అనేక కుస్తీలు, మల్లయుద్ధాలు చేసిరాటు తేలి వున్నారు.

అతి భయంకరమైన శరీరాలుగల యోధుల గుంపులు చాలా జాగ్రత్తగా పట్టణపు నాలుగు దిక్కులలో కాపలాకాస్తున్నాయి. కొన్ని చోట్ల రాక్షసులు గేదెలను, మనుష్యులను, ఆవులను, గాడిదలను, మేకలను తింటున్నారు. తులసీదాసు వీళ్ళందరి కథ చాలా క్లుప్తంగా

చెప్పాడు. ఎందుకంటే, వీళ్ళందరు శ్రీరామచంద్రుని బాణరూపమైన తీర్థంలో శరీరాలను వదలి తప్పకుండా మోక్షాన్ని పొందబోతున్నారు.

ఆ పట్టణంలోని కాపలాదారులందరిని హనుమంతుడు చూచాడు. అసలురూపంతో పట్టణంలో ప్రవేశించడం కొంచెం యిబ్బందికరమైన విషయమని ఆలోచించి, చాలా చిన్నరూపంతో రాత్రివేళ నగరంలోకి ప్రవేశిద్దామని నిర్ణయించుకున్నాడు.

హనుమంతుడు రామప్రభువును తలచి దోమంత రూపంగా మారి, లంకలో ప్రవేశించాడు. అక్కడ లంకిణి అను పేరు గల రాక్షసి ఒకటుంది' అది "నన్ను లెక్కచేయకుండా ఎక్కడకు వెళ్ళుతున్నావు? అరే, మూర్ఖుడా' నీకు నా సంగతి తెలియనట్లుంది. దొంగలందరు నాకు ఆహారమైపోతున్నారు" అంది. హనుమంతుడు దానిని చూచి ఒక గుద్దు గుద్దాడు. దాంతో అది నెత్తురు కక్కుకుంటూ నేలమీదపడి దొర్లింది. అయితే కొంత సేపటికి లంకిణి తేరుకొని, చేతులు జోడించి "రావణునకు బ్రహ్మవరం యిచ్చి వెళ్తూ నాతో, నీవు వానరుని దెబ్బతో అచేతను రాలవైనప్పుడు, రాక్షసుల సర్వనాశనం అయ్యేకాలం దాపురిస్తుందని అనుకో అని చెప్పాడు. ఈ రోజు శ్రీరామచంద్రుని దూతవయిన నిన్ను చూడడం వలన ఎంతో అదృష్టవంతురాలనని ఉబ్బిపోతున్నాను.

ఆంజనేయా! సర్వమోక్షాలను సుఖాలను త్రాసులో ఒకవైపుంచి మరొక వేపు ఒక క్షణమైనా ఒక మంచి మిత్రునితో కలసి మాట్లాడిన కాలాన్ని వుంచి తూచిన, మంచివాని స్నేహంతో ఆ స్వర్గ మోక్షాల సుఖాలు సరితూగలేవు. నీ హృదయంలో అయోధ్యాపతి శ్రీరామచంద్రుని తలచుకొంటూ లంకలో ప్రవేశించి నీ యిష్టం వచ్చిన పనులు చెయ్యి. అన్ని పనులు శ్రీరామచంద్రుని చల్లని చూపువలన సానుకూలమైపోతాయి. ఆయన దయవున్నంతవరకు విషము అమృతం

గాను, శత్రువులు మిత్రులుగాను, సముద్రపు లోతు ఆవు గిట్టలోతులో నున్న నీరుగాను, అగ్ని చల్లగాను మారిపోతాయి.

వానరవీరా! శ్రీరాముని దయాదృష్టి ప్రసరించినంతకాలం పర్వతం, మట్టిగడ్డలాగా అయిపోతుంది. శ్రీరాముని దయతోనే హనుమంతుడు చాలా చిన్న రూపంగా మారి లంకా పట్టణంలోకి జొరబడి, ఇల్లిల్లు వెదకి చూచాడు. అక్కడవున్న లెక్కకు మించిన యోధులను చూచాడు. ఆ తరువాత రావణుని భవనంలోకి వెళ్ళాడు. ఆ భవనపు అందాన్ని గురించి వివరించడం చాలా కష్టం. ఆ భవనం వజ్ర, వైడూర్యాలతో పొదగబడి వెలిగిపోతూన్నది.

హనుమంతుడు రావణుని పడక గది చూచాడు. అక్కడ సీతాదేవి కనబడలేదు. ఆ తరువాత అందమైన మరొక భవనాన్ని చూచాడు. అక్కడ భగవంతుని మందిరమొకటి వేరేవుంది. శ్రీరాముని ధనస్సు, బాణాలను చిత్రించి వున్న ఆ అందమైన మందిరమును గురించి వర్ణించనలవికాదు. అక్కడ క్రొత్తగా వేసిన తులసిచెట్ల వనాన్ని చూచి హనుమంతుడు చాలా సంతోషించి" లంకలో రాక్షసులు నివసిస్తున్నారు. అయినా ఇక్కడ కూడా మంచి బుద్ధిగలవారు నివసిస్తున్నారా?" అని ఆశ్చర్యపడుతూ ఉన్న సమయంలోనే విభీషణుడు నిద్రనుండి లేచాడు. రామనామ స్మరణచేయడం విన్నహనుమంతుడు ఎంతో సంతోషించి" ఇతను మంచి బుద్ధిగలవాడులా ఉన్నాడు. ఇతనిని ఎలాగైనా పరిచయం చేసికోవాలి. మంచి బుద్ధిగలవారితో స్నేహం హాని జరుగనివ్వ"దని ఆలోచించి బ్రాహ్మణ రూపంలోకి మారి విభీషణుని పిలిచాడు. విభీషణుడు ఆయన పిలుపు వినగానే లేచి అక్కడకు వచ్చి, నమస్కారం చేసి, క్షేమ సమాచారాలడిగి తెలిసికొని "బ్రాహ్మణోత్తమా! మీరొచ్చిన విషయాన్ని గురించి,మీ గురించి తెలుపండి. మీరు హరిభక్తులలోవారా? ఎందుకలా అంటు

న్నానంటే, మిమ్మ చూడగానే నా హృదయం ద్రవించిపోయి, మీరంటే ఎంతో ప్రేమగావుంది. అసలు మీరు శ్రీరామచంద్రుని పాద పద్మాలను ప్రేమించే వ్యక్తులేమోనని, నన్ను ఉద్ధరించడానికి వచ్చారని. ఎందుకో నామనస్సులో ఉబలాటంగా వుంది అన్నాడు.

హనుమంతుడు తన కథనంతా చెప్పి, తనపేరు వెల్లడించాడు. ఇద్దరి శరీరాలు పులకించి పోయాయి. ఇద్దరూ రాముని గుణగణాలను స్మరించుకొని భక్తిలో మునిగి పోయారు.

విభీషణుడు హనుమంతుని చూచి, అతని విషయం తెలిసిన తరువాత ఆశ్చర్యానందాలతో "అయ్యా! హనుమంతా! నా శరీరం తమోగుణంతో కూడుకొని వున్నటువంటిది. మంచి విషయాలు సాధన చేయడానికి నేనున్న తావు అనుకూలమైనది కాదు. మనస్సులో శ్రీరామునియందు ప్రేమ కూడా నిలువ లేదు. కాని హనుమంతా! హరికృపలేనిది మీలాంటి సహృదయుల కలయిక, ప్రేమ, ఆప్యాయత లభించదు. శ్రీరాముని దయ నాయందు ఉండడంచేతనే మీరు పట్టుబట్టి, నేను కోరకుండానే దర్శన మిచ్చారు" అనగానే "విభీషణా! శ్రీరామచంద్రుడు భక్తులను ప్రేమించేరీతి ఇలాగే ఉంటుంది. మీరే చెప్పండి, నేను రాజవంశంలోగాని, సంపన్న కుటుంబంలోగాని పుట్టానా? నాజాతి చంచలమైన కోతిజాతి. అన్నిరకాలుగా హీనుడను. ప్రొద్దున నిద్రలేచి నాముఖం చూచిన వారికి, నాపేరు తలచినవారికి ఆనాడు అన్నం సున్నా అవుతుంది. మిత్రమా! విను, నేనలాంటి అధముడ నయినా శ్రీరామచంద్రుడు నాయందు దయవుంచి తనదగ్గర స్థానమిచ్చాడు. "అంటూండగానే హనుమంతుని కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. అన్ని తెలిసి కూడా స్వామిని మరచి ప్రవర్తించు వ్యక్తులు దుఃఖాలతో ఎందుకు అలమటించరు? అనుకుంటూ యిద్దరూ చెప్పలేనంత సుఖశాంతులను పొందారు.

ఇలా యిద్దరి మాటల్లో హనుమంతునికి లంకలో సీతమ్మ ఎలా గడుపుతున్నది విభీషణుడు చెప్పాడు. అప్పుడు హనుమంతుడు- "సోదరా! నేను సీతమ్మవారిని చూడాలని వచ్చానన్నాడు. విభీషణుడు సీతాదేవిని దర్శించుకొను మార్గాలను చెప్పాడు.

హనుమంతుడు విభీషణునివద్ద సెలవు తీసికొని, మరల చిన్న రూపంలోకి మారి, అశోకవనంలోవున్న సీతమ్మవున్నచోటుకువెళ్ళాడు సీతమ్మను చూచాడు. మనస్సులో ఆమెకు నమస్కారం చేసుకున్నాడు, సీత ఆ చెట్టు క్రిందనే రాత్రంతా గడుపుతున్నట్లు గమనించాడు. ఆమె శరీరం కృశించిపోయి, తలంతా జడలుకట్టి ఒకే జడగామారి పోయివుంది. మనస్సులో శ్రీరామచంద్రుని చరణ కమలాలను తలచు కుంటూ, జపించుకుంటూ కాలం గడుపుతూ ఉంది. తలపైకెత్తి చూడడంలేదు. తన కాళ్ళను తాను చూచుకుంటూ తన మానాన తాను కాలం గడుపుతూ ఉంది. సీతమ్మవారి ఈ దిక్కులేని స్థితిని కళ్ళారా చూడగానే, హనుమంతుని దుఃఖానికి హద్దులు లేకుండా పోయాయి. చెట్ల ఆకులమధ్యదాగి, ఈ సమయంలో తానేమిచేయ వలసి వుంటుందని ఆలోచిస్తూన్న సమయంలోనే రావణుడు బాగా ముస్తాబై, అందంగా తయారై సీతమ్మవున్న చోటికి అనేక మంది స్త్రీలను, ఇల్లాలయిన మండోదరిని వెంటబెట్టుకొని" సీతమ్మకు అనేక రకాలుగా నచ్చచెప్పి, తాను చెప్పినట్లు నడచుకొమ్మని చెప్పండి" అని "ఓ అందమైన కండ్లుగల సీతా! నేను చెప్పేమాటలు జాగ్రత్తగా విను. నామాట విన్నావంటే, మండోదరి మొదలైన రాణులందరిని ఇతర స్త్రీలను నీకు సేవచేయడానికి నియమిస్తాను. ఈ మాటలు కల్ల బొల్లివికావు. ఒట్టుపెట్టుకొని చెబుతున్నాను. మిగతా విషయాలు తరు వాత జరుగవలసినవి, ముందు కనీసం నావైపు కన్నెత్తి చూడు.

కొంత వరకయినా తృప్తిగా వుంటుంది" అని రావణుడనగానే సీతమ్మతల్లి, తనకు ప్రియాతిప్రియుడైన శ్రీరామచంద్రుని మనస్సులో తలుచుకొని, గడ్డిపోచను వాటుపెట్టుకొని రావణునికి నీతులు చెప్ప నారంభించింది. (గడ్డిపోచ అడ్డంపెట్టుకోవడంలో రెండర్ధాలున్నాయి. ఒకటి పరాయి పురుషునితో మాట్లాడుతున్నప్పుడు ఏదోయొక అడ్డు ఇద్దరిమధ్య ఉండాలను ధర్మాచారం; రెండవది, ఓయీ! రావణా! నీవు నాదృష్టిలో గడ్డిపోచకంటే విలువ తక్కువవాడని అర్థం.)

"ఓదశకంఠా! నీకు ఎన్నోసార్లు చెప్పాను. నేను నీకు చెప్పే మంచిమాటలు బూడిదలో పోసిన పన్నీరుచందమై పోతున్నాయి. నీవు మిణుగురు పురుగులాంటి వాడవు, నాభర్త సూర్యభగవానుని లాంటి తేజస్సు గలవాడు, కమలము ఎప్పుడూ సూర్య కిరణాలు పడ్డప్పుడు వికసిస్తుందిగాని మిణుగురు పురుగు వెలుతురుకు వికసించదు. అలాగే నా మనస్సును ఆకర్షించాలంటే శ్రీరామచంద్రుని తేజస్సు అవసరం, నీ తేజస్సు నాకు మిణుగురు పురుగు తేజస్సు కంటే నీచమైనది.

నీకు రాముడెవరో, నేనెవరో తెలియదు. నేనెవరో నాకూ, నాభర్త శ్రీరామచంద్రునికి తప్ప మరెవ్వరికి తెలియదు, నేను నీచేతికి చిక్కడం, ఇక్కడ ఈ విధంగాయమయాతనలు పడడం లోకం కొరకేనాని, మాకొరకు కాదని నీకు తెలియదు. ఆ సంగతులు మాయిద్దరికి తెలుసు.

మేము ఏయుగంలో ఎవరిమో, మాశక్తి ఏమిటో నీకు తెలియదు. మేమన్ని యుగాల్లో ఉంటూవస్తున్నాం. మేమెప్పుడు మార లేదు. ప్రజల రక్షణే ధ్యేయంగా పెట్టుకొని పుట్టుచూ, గిట్టుచూ ఉన్నట్లు నటనచేస్తుంటాము. మీబోటివారి నడ్డుబెట్టుకొని లోకులకు నీతి మార్గముపదేశించాలని మేము మానవజన్మ యెత్తుతుంటాం.

అయితే నిన్ను బ్రహ్మసిగ్గుమాలిన వానిగా, మంచి చెప్పినా వినని చెడ్డగా నడచువానిగా సృష్టించాడు. ఆయనలా సృష్టించినా నేనూ, నా భర్త నీలోని చెడ్డస్వభావాన్ని మార్చి, మంచిని లోకానికి చాటాలని ఆలోచించాం. అందుకే భార్యాభర్తలమయిన మేమిద్దరం కైక ద్వారా అడవులకు వెళ్ళ సందర్భం కల్పించాం. అడవులకు వచ్చాం. అంతమాత్రాన మేము తక్కువవారమని, నీవు రాజాధిరాజు వని విర్రవీగడం మంచిది కాదు. నీస్థితిగతులు చూస్తుంటే, చావొచ్చి వంకన చేరి సందుగొందులు వెదకుతుంటే మందులేమి పనిచేస్తాయన్నట్లుగా వుంది.

నీలాంటి రాక్షసులు ఈ యుగంలో వెనుకటి యుగంలో కూడా ఉన్నారు, హిరణ్యాక్షహిరణ్యకశిపులు నీ కోవకు చెందినవారే అయినా, వారు నీకంటే చాలా ఉత్తములు. వారు వైరభక్తులు, నీవు స్వైరభక్తుడవు. వారు చచ్చేవరకు, హరి ఎక్కడ? హరి ఎక్కడ? అంటూ హరి నామస్మరణచేస్తూనేచచ్చారు. ఆ తరువాత, విరోచనుడు బలిచక్రవర్తి, బాణాసురుడు మొదలైన రాక్షసులు పుట్టిగిట్టారు. కాని వారికి నీకున్న లక్షణాలు లేనేలేవు. వారెల్ల కాలం హరినామస్మరణ చేస్తే, నీవు రాత్రింబవళ్ళు నాతుల స్మరణ చేస్తున్నావు. నీవు ప్రతి రోజు కోటిలింగాలకు పూజచేసినా, ముప్పొద్దులా స్నాన సంధ్యాదులు జరుపుతున్నా నీ మనస్సులో మెదలేవారు పరాయి స్త్రీలు తప్ప హరిహరులు కాదనిపిస్తున్నది.

నా భర్త నా కోరికమీద బంగారు లేడికొరకు వెళ్ళడం, మారీచుడు అరవడం, లక్ష్మణుని నేను నిందించడం, ఆయనగిరిదాటి రావద్దని చెప్పడం, నేను గిరిదాటి వచ్చి భిక్షవేయడం, నీవు నన్ను లేవనెత్తుక పోవడంలాంటి విషయాలు మాకు తెలియక మోసపోయామని నీలాంటి వారనుకుంటూ ఉంటారు. మాకుతెలియని విషయాలు

ఏమీ లోకంలో ఉండవని నీకు తెలియదు. మేము లేకపోతే విష యాలకే విలువవుండదు. విషయాలు మారూపాలే. చరాచర ప్రపంచ మంతా మాతోనిండి వుందని నీకు చెప్పినా లాభంలేదు. నీ కెంత చెప్పినా అడవిగాచిన వెన్నెలచందంగా వృథా అవుతుంది. అందు చేత నీకు చెప్పేదేమంటే, పొరపాటున నిన్ను బ్రహ్మ మరీ నీచంగా సృష్టించాడు. ఇంత నీచమైన సృష్టి లోకానికి చేటుతెస్తుంది. నాభర్త బ్రహ్మ సృష్టించిన వారికి రక్షణ కల్పించవలసిన వ్యక్తి. శివుడుమాకు చాలా యిష్టుడే అయినా, ఆయన సమయం వచ్చినప్పుడు ప్రాణాలు తీయువాడేగాక మాకున్నంతబాధ, బాధ్యత ఆయన కుండదు, బ్రహ్మ మహేశ్వరుల పని తేలికయినది. అందువలన నిన్ను, నన్ను లేవ నెత్తుక వచ్చిన నెపంతో, సరిచేయాలని, అలా సరిచేయగలిగితే లోకంలోని ప్రజలలోని చెడ్డవారు కూడా మంచివారు చెప్పిన మాట లతో మంచివారుగా మారిపోవడానికి అవకాశముందని తెలిసి కొని, మిగతా చెడ్డవారు కూడా బాగుపడి, మా బాధలు కొంత వర కయినా తగ్గిస్తారనే ఉద్దేశ్యంతో నీ కారణంతో నాచేత నీకు మంచి బుద్ధులు నేర్పడానికి అవకాశం కల్పించాడు శ్రీరామచంద్రుడు.

నీ చెడుబుద్ధి, మంచిగా మారడానికి నీ మదమనే రోగం తగ్గ డానికి మెంతులు మ్రింగమని నేను చెబుతున్నాను. అవి నీ గొంతు దిగడంలేదు. ఆకలైన వారికి అన్నం మందయినట్లు, నీ బోటి నీచమైన నడవడిక గలవారికి చావేమందు. నీవు మంచివానిగా మారినా, చెడ్డ వానిగా చచ్చినా సమాజానికి మేలే జరుగుతుంది. ఈ రెంటిలో ఏదో ఒకదానిని ఎన్నుకోవలసిన వాడవు నీవే. ఒక్కటి మాత్రం చెబుతు న్నాను. నేను లంకలో నీయెదుట, నీ ప్రదేశంలోచావను.నీవునన్నేమి చేయలేవు. నా మరణం నాపతి దైవమైన శ్రీరాముని చెంత జరుగు తుంది.

మానవుల మాదిరిగా జన్మలెత్తి మానవుల నుద్ధరించాలని పుట్టాం గనుక మానవులు పడే బాధలు మేమూ పడుతున్నట్లున్నా, ఆ బాధలను పరిమార్చుకో గలిగామని సాధారణ మానవులకు తెలియ పరచి, వారిని సరియైన మార్గంలో పెట్టగలిగితే మేము బ్రతికి యున్నంత కాలం మాకర్తవ్యం నెరవేర్చి వెళ్ళిన వారమవుతామని మేమీ నటనలు చేస్తున్నాం. అంతేగాని, నీవు మొనగాడవని, మేము నీకు విధేయులమని అనుకుంటున్నట్లు అపోహపడకు. అర్థము చేసి కొను స్థితిలో నీవు లేవు. నిన్ను ఏనాడో గడ్డిపోచతో సమానంగా భావించి, ఆ భావం తెలియ పరుస్తూనే ఉన్నాను. నీచత్వంతో నీకడుపునిండి కడుపు నొప్పిపుట్టినా వాము తినమంటే, తినేస్థితిలో లేవు. అసలు నీవోటివారు వాము తిన్నా, అది ఉమ్మగా మారి, పోతుందిగాని మందుగా పనిచేయదు.



నేను మరొక విషయం చెబుతున్నా విను. లోకంలో స్త్రీ పురుషులకు ప్రత్యేకస్థానముంది. వారి మనస్సులను బట్టియే పాతాళా నికి పోవడమో, ఆకాశానికి ఎదగడమో జరుగుతుంది. అది దృష్టిలో పెట్టుకొని బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు కొన్ని మంచి నియమాలు పెట్టారు. ఆ నియమాలలో అతి ప్రధానమైన నియమం, మగవాడు తన భార్యను, స్త్రీ తన భర్తనుగాక ఇతరులను కన్నెత్తి చూడకూడ దని, పల్లెత్తి మాటాడకూడదని, మనస్సులో తలచరాదని, అయినా మానవజన్మలు కావడం వలన తప్పుత్రోవలు పడుతూనే ఉన్నారు. అందులో తప్పంతా మానవులదేనని అనుకోకూడదు. మన్మధుని, వసంతుని, రతిని వగైరాలను సృష్టించడంలో మా సృష్టికర్తలోపం కూడా వుంది. దానితోపాటు వారిని రక్షించడం నా భర్తలోపం, తొందరలో చంపక తారకాసురిని వధదాకా వారిని ఉంచడం మహే శ్వరుని లోపం. ఇప్పుడు నీవు మరొక ప్రశ్న వేయవచ్చు. మన్మ

ధుడు రూపం మారినా ప్రద్యుమ్నుడయి మరలా పుట్టాడు గదాయని, ప్రద్యుమ్నుడంత భయంకరుడు కాడు. అందువల్లనే నీ మాదిరిగా తాళిగట్టిన భార్యను, ఎంతో మంది స్త్రీ పురుషులను దగ్గర పెట్టుకొని, వారందరి యెదుట నన్ను ప్రేమించి, నీ కోర్కెలు తీర్చమని సిగ్గు యెగ్గులు లేకుండా అడుగుతున్నావు. నీ యెదుట మాట్లాడు స్థితిలో నీ భార్య, మిగతా ప్రజలు వుండకపోవచ్చు. అంతమాత్రాన వారందరు నీ నీచమైన పనులను, మాటలను సమ్మతిస్తున్నారనుకోబోకు. వారం దరు సమ్మతించే వుంటే నేనిలాగా లంకలో ఉండగలిగేదాననుకాను, లోకంలోని ప్రజలూ మనలేరు. నీవు నన్ను బట్టబయలుగా గొంతెమ్మ కోరికలు కోరుతున్నావు. నీ కంటే చిన్న భక్తులు, అసలు భక్తి అంటే తెలియనివారు, లోకజ్ఞానం లేనివారు కూడా పరాయిస్త్రీ మీద మోజు ఏర్పడినా చాటుగా భయభయంగా, రెండోకంటికి తెలియకుండా ప్రయ త్నించుకుంటూ ఉంటారు. త్రోవ తప్పినవారు తప్పుతున్నారు. బాధలు అనుభవిస్తున్నారు. మిగతావారు నయానో, భయానో ఆ ఘట నను పరిష్కారం చేసికొని ఎవరు బ్రతుకులు వారు బ్రతుకుతూ వుంటా రు. నీ వలా కాదు. నీవు నీచాతినీచుడవు,సిగ్గు బిడియం నీకు ఏ కోశానా లేవు. నీ పూర్వీకులయిన రాక్షసులలో కొంతయినా మంచి వున్నదని ముందు తరాలవారు చెప్పుకుంటారు. నిన్ను ఆ పాదమస్తకం చెడ్డ వానిగా చెప్పుకుంటారు. అందు వలన నీవు నా మాట విని నా భర్త వద్దకు నన్ను చేర్చి, కొంత చెడు నడత నడచినా. నామంచి మాటలు విని మంచివానిగా మారావని ప్రజలతో అనిపించుకో. అలా చేశా వంటే, ప్రజలలో కొందరయినా, మంచివారుగా మారాలని ప్రయత్ని స్తారు. అందువలన నా భర్త శ్రీరాముని బాధ్యత కొంత సుళువవు తుంది. నీ పేరు వెనుకటి యుగంలోని హిరణ్యాక్షహిరణ్య కశిపుల కోవలోనికి, ముందు యుగంలో రాబోతున్న శిశుపాల దంతవక్త్రుల

కోవలోకయినా చేరుకుంటుంది.

ఇంత చెప్పినా నీ మనస్సు, మారునది కాదని, నీ పుట్టుక అలాంటిది కాదని నాకు తెలుసు. నీవుగాని, నీ వారుగాని జీవితమంతా చెడు చేసి, మంచివారు చెప్పిన మాటలు వినక, వచ్చేసమయంలో రామఅన్నా, హరిఅన్నా ఒరిగేదేమీ ఉండదు. ఆ సమయంలో అను హరేరామ శబ్దానికి విలువ వుండదు. ఆ శబ్దం ఆ సమయంలో నీ చెవులకు వినిపించదు, వినిపించుకొనుస్థితిలో నీవుండవు. ఆ శబ్దాన్ని నీవు వినగలగే శక్తి ఉడిగిపోయినప్పుడు, ఆ శబ్దం వలన ఎవరికి ప్రయోజనం కలిగిస్తాడు నా భర్త! అందువలన బ్రతికియుండగానే, శరీరం ఆరోగ్య స్థితిలో వుండగానే, నీవు నేను చెప్పినట్లు మారితే నీ బ్రతుకు సార్థకమవుతుంది." అని క్లుప్తంగా సీతమ్మ తల్లి చెబుతూ ఉన్నప్పుడు ఆంజనేయుడు చిన్నరూపంలో చెట్టుమీద కూర్చొని వింటూనే వున్నాడు.

సీతాదేవి ఇన్ని మంచి మాటలు చెప్పినా, పోయేకాలం దాపు రించిన రావణుడు వీటిని పుక్కిట పట్టలేక, ఈ చెవినవిని, ఆ చెవున వదలి అతని ధోరణిలో అతను -"సీతా! నీవు అవమానంగా మాట్లాడి నన్ను నలుగురిలో కించపరుస్తున్నావు. నీవు ఎన్నన్నా నీ మీద ఉన్న మరులు నిన్ను మరువనీయడంలేదు, నిద్రాహారములకు కూడా నేనంటే విసుగెత్తిపోతున్నది. నా తిండి నేను తినకపోతే ఆహారానికి అజీర్తి ఏర్పడుతున్నది. నా నిద్ర నేను పోకపోతే నిద్రకు విసుగు పుట్టి నిద్రకు నిద్ర ముంచుకు వస్తున్నది. నా భార్యకు తగినన్యాయం జరుగకుండా పోతున్నది నీవు నా మాటలు విని నా దానవైతే, మీ యిద్దరికి సమానన్యాయం చేకూర్చుతూ ఉండగలిగేవాడను. రాత్రిం బవళ్ళు నీ ధ్యాసలో నిద్రాహారాలు మానడం వలన, నా భార్యధ్యాసకు ఆటంకం కలుగుతూ వుంది. అందుచేత నా మాట ప్రకారము నీవు,

నడచుకొనకపోతే. నా పదునైన కత్తితో నీ తలనరికేస్తాను. నీప్రాణా లుండవు. నీవు నాకూ నీ భర్త రామునకూ కాకుండా పోతా"వని మండి పడుతూ అనేటప్పటికి సీత-

"ఓరీ! మూర్ఖరావణా! నీకు మంచిమాటలు మనస్సున కెక్కవు. నీచులకు, దారి తప్పి నడచుకొను వారికి కోపతాపాలు తప్ప, శాంతి స్వాంతనాలుండవు. నీ కిన్ని సార్లు చెప్పవలసిన అగత్యం నాకులేదు. నీ మాటలకు జవాబు చెప్పనక్కర అసలే లేదు. అయినా లోకం కొరకు, నీవు వెంట తెచ్చుకొన్న ప్రజలు, భార్యవినుట కొరకు జవా బులు యిస్తూ వచ్చాను, నా గొంతుకు నా భర్త బాహువులయినా చుట్టుకోవాలి, లేదా నీ భయంకరమైన ఖడ్గమైనా నా గొంతుకును ఉత్తరించాలి. అంతేగాని నీ నీచపు ప్రవృత్తి సఫలం కావటం కల్ల. అలా జరిగితే లోకం నన్ను ఆదర్శంగా తీసికొని పాడయిపోతుంది నీ కత్తి నా మెడ నరికినట్లు చూపడం కూడా మా యిద్దరి నటనయే. మేమవరిమో, సరియైన సమయంలో నీకూ తెలుస్తుంది. మేము వచ్చిన పని పూర్తి చేయగలిగినంత చేసి వెళ్ళిపోతాం" అని రావణునితో అని "చంద్రహాసమా! నీకు ఇష్టమయితే నీవు స్వయంగా వచ్చి నా తల నరికి వేయుము. ఈ దుర్మార్గుని ఖడ్గము నా చెంతకు రానీయవద్దు. శ్రీరామచంద్రుని విరహబాధ కంటే, చావు చాలా సుఖకరమైనది. ప్రజా సుఖం కొరకు మేమెన్ని ఇడుములు పడుచున్నా, ప్రజలకు కూడా అర్థం కావడంలేదు. ఖడ్గమా! నీకు తెలుసు. ప్రజల కొరకు మేమెంత కాలం కలిసి వుంటున్నది, ఎడంగా ఎంతకాలం వుంటు న్నది" అని వికాకుగా అంది సీత.

సీత ఇలా ఎన్నో రకాల మంచిమాటలు మండోదరి సమక్షం లో చెప్పినా, రావణుడు మారకపోగా. తలనరికి వేస్తానని సీతవైపుకు రాబోయాడు, మండోదరి తాను చెప్పదలచిన నీతులన్నీ చెప్పింది.

అప్పటికి అలసిపోయాడో, సొలసిపోయాడో లేక మండోదరి మాటలు మన్నించాడో తెలియదు. నెమ్మదించి, సీతను అనేక విధాల భయ పెట్టి, రాక్షసులందరిని పిలిచి "ఈ సీత ఒక్క నెల లోపల నామాట ప్రకారం నడచుకొనకపోతే. ఖడ్గంతో నేను నరికి వేసేది ఖాయమని చెప్పండ"ని రాక్షసులతో చెప్పి వెళ్ళాడు. రాక్షసస్త్రీలు అనేక విధాల, భయంకర రూపాలు ధరించి సీతను భయపెట్టసాగారు.

ఆ రాక్షసులలో త్రిజట అను పేరు గల ఒక రాక్షస స్త్రీ వుంది. ఆమెలో రాక్షసలక్షణాలు లేవు శ్రీరామచంద్రుని పాదపద్మాలను తలచుకొని, మనస్సులో నమస్కారాలు చేసుకుంటూ వుంటుంది. ఆమె ఆ సమయంలో అందరిని చేరబిలిచి తనకు వచ్చిన కలనుచెప్పి, అందరితో సీతమ్మ సేవచేసి మీరు మంచి బ్రతుకులు బ్రతికి. మంచి పావులు పొవండి" అంటూ, తనకు వచ్చిన కలను గురించి వారితో చెప్పమొదలిడింది-

"ఒక వానరుడు లంకను తగులబెట్టాడు. రాక్షస సైన్యాన్ని చంపేశాడు. రావణుడు బట్టలు లేకుండా తలగుండు చేయబడి, గాడిద మీద కూర్చొనియున్నాడు, ఇరువది చేతులు నరికేసి ఉన్నాయి. ఈ స్థితిలో అతను దక్షిణ దిక్కుకు వెళ్ళుతూఉన్నాడు. విభీషణుడు లంకకు రాజయ్యాడు. పట్టణమంతా శ్రీరామచంద్రుని గుణగణాలను స్మరించుకొంటూ వుంది. ప్రభువు సీతామాతను పిలిపించుకున్నాడు. నేను నిజం చెపుతున్నాను. నాలుగు రోజులలో నా కల నిజమయి తీరుతుంద"ని చెప్పేటప్పటికి రాక్షస స్త్రీ లందరు భయపడి సీతమ్మ పాదాలమీదపడి, ఎటువారటు వెళ్ళిపోయారు.

"మాతా! త్రిజటా! నీవే ఆపదలో చిక్కుకొని యున్న నాకు అండగా ఉన్నావు. దయచేసి తొందరలో నా ఈ శరీరాన్ని వదలి

జీవితాన్ని తెగటార్చుకోడానికి ఏదైనా ఉపాయం చెప్పు. ఈ బాధ నేను భరించలేకుండా ఉన్నాను. నీవు కట్టెలు తెప్పించి చితి ఏర్పాటు చేయించి, అందులో నిప్పుపెట్టు. ఓ అమ్మా! నీవు నా యిష్టాన్ని సత్యం చెయ్యి. ఎంత కాలం ఈ రావణుని ములుకుల వంటి పలుకులు వింటూ ఉండగలను?" అని చేతులు జోడించి సీతమ్మవారు అనగానే త్రిజట సీతమ్మ పాదాలు పట్టుకొని శ్రీరాముని బల, ప్రతాప, కీర్తులను వినిపించి "రాజకుమారీ! రాత్రివేళ నిప్పుదొరక" దని చెప్పి వెళ్ళిపోయింది.

"భగవంతుడే నాకు వ్యతిరేకి అయినాడు. నాకు నిప్పుకూడా దొరకడంలేదు. దుఃఖం దూరం కావడంలేదు, ఆకాశంలో పెద్ద పెద్ద అగ్ని గోళాలగుపడుతున్నాయి. కానిఒక్కనక్షత్రమయినా నామీద పడడంలేదు. చంద్రుడు అగ్నిమయుమైవుండి కూడా నేను దురదృష్ట వంతురాలనని తెలిసికొని, అయన కూడా నామీద అగ్నిని కురిపించ డంలేదు. ఓ అశోక వృక్షమా! నావినయం చూడు, నాశోకాన్ని దూరం చేసి అశోకమను నీనామాన్ని సార్థకం చేసుకో. నీ క్రొత్త ఆకులు అగ్నితో సమానంగా ఎర్రగా ఉన్నాయి. నీవైనా అగ్నిని కురిపించి నా బాధను దూరం చెయ్యి" అని దుఃఖపడుతూ సీతమ్మ కష్టంతో ఎంతో వ్యాకులపడడాన్ని చూచేటప్పటికి హనుమంతునకు ఒకకల్పము గడచి పోయినట్లనిపించి, మనస్సులో దుఃఖించి తాను శ్రీరాముని వద్దనుండి తెచ్చిన ఉంగరాన్ని ఆమెముందు పడేశాడు. ఆ ఉంగరంపడ్డప్పుడు నిప్పురవ్వ పడ్డట్టనిపించిందామెకు. సీత సంతోషంగా ఆ అంగుళీయాన్ని చేతిలోకి తీసికొని చూచేటప్పటికి దాని మీద రామనామం ముద్రించి వుంది. దానిని చూచేసరికి సీతమ్మ ఆనందానికి అవధులు లేకుండా పోయాయి. ఉంగరాన్ని గుర్తించి ఆశ్చర్యంతో చూచింది. వెనువెంటనే దుంఖంతో వ్యాకులముతో

పాటు ఆలోచనలోపడి- "శ్రీరామునకు ఓటమిలేదు. ఎవరైనా ఆయనను జయించితేగదా ఉంగరం వారికి దక్కేది? మాయతో తయారు చేయవానికి ఈ ముద్రిక అలావీలగునది కాదు" అను కుంటూ సీత పరిపరి విధాల ఆలోచిస్తున్న సమయంలోహనుమంతుడు తియ్యని పలుకులు చెట్టుమీదనుండి పలికాడు. అతనినోటవిన్న మాటలతో సీతాదేవి దుఃఖం దూరమయిపోయింది. ఆమె కూడా మన సారా చెవులు నిక్కించి వింటూవుంది. హనుమంతుడు మొదటినుండి చివరిదాకా కథంతావినిపించాడు. అప్పుడు సీతమ్మ "ఈ అమృతపు పలుకులు నా చెవులకు వినిపించిన సోదరుడు నా ఎదుటకు ఎందుకు రాకూడదు" అంది. హనుమంతుడు ఆమె దగ్గరకు వచ్చాడు. ఆమె ముఖము ప్రక్కకు త్రిప్పుకుంది. ఎదుటకు రమ్మని ముఖం ఇలా త్రిప్పుకున్నందుకు ఆయన కాశ్చర్యమేసింది. అయినా తాను వచ్చిన పనిని పూర్తిచేసి కోవాలి, అందుకని తానామెతో చెప్పవలసిన విష యాలు పెడముఖంతోనే చెబుతున్నాడు-

"అమ్మా! సీతమ్మ తల్లీ! నీవు నీ భర్త ముఖము తప్ప పర పురుషుని, ముఖం చూడకపోవడమేకాదు, మనస్సులో కూడా తల చవని కూడానేనెరుగుదును. నేను బ్రహ్మచారిని, నేను కూడా పర స్త్రీని తల్లిగా భావించి ఏ స్త్రీవైపు కన్నెత్తి చూడనని, చెడుగా, ఆలోచించనని లోకాని కంతటికి తెలుసు, నేను శ్రీరామ చంద్రుని దాసుడను, ఆయన పంపితే దూతగా వచ్చాను. శ్రీరామ ప్రభువు మీద ఒట్టుపెట్టుకొని చెబుతున్నాను. ఈ ఉంగరం నిజంగా ఆయన ఆనవాలుగా నీ కిమ్మని ఇస్తే తెచ్చాను" అన్నాడు పెడ మొగంతోనే హనుమంతుడు.

"మానవులకు, వానరులకు స్నేహ మెలా కుదిరింది?అని సీతమ్మ అనగానే వారికి స్నేహం కుదిరిన కథంతా చెప్పి వినిపించాడు హను

మంతుడు.

సీతమ్మకు హనుమంతుడు హరిభక్తుడేనను విశ్వాసం కలిగి శరీరం పులకించి పోయింది. "అయ్యో! హనుమంతా! వియోగ రూప సాగరంలో మునకలిడుతున్న నాకు నీవు నావలాగా లభించావు, అందరికి సుఖాన్ని కలిగించు ప్రభువు శ్రీరామచంద్రుడు క్షేమంగా ఉన్నారా? నేను ఆయన కొరకు నా సర్వస్వాన్ని కోల్పోడానికి సిద్ధంగా వున్నదాసిని. ఖరుని శత్రువులయిన లక్ష్మణునితోపాటు శ్రీరామచంద్రుడు సుతిమెత్తనివారు, దయగలవారు కదా! అలాంటి కరుణామూర్తికి నేనేమి తప్పు చేశానని ఇంతదయా హీనురాలనయి పోయాను? తన సేవకులను సుఖపెట్టడం ఆయనకు పుట్టుకతో వచ్చిన సద్బుద్ధికదా! అసలు ఎప్పుడైనా నన్ను తలచుకుంటారా? అయ్యో! హనుమంతా నాకీజన్మలో ఎప్పుడైనా ఆయనను చూచే యోగం ఉన్నదా?" అంటూండగా కళ్ళవెంట కారు నీళ్ళు ఆగలేదు. మాటలలో స్పష్టత తగ్గింది. ఆతరువాత కొంత సర్దుకొని—"హానాథా! నన్ను పూర్తిగా మరచి పోయారు." అని బావురుమంది. అపుడు హనుమంతుడు సీత బాధను చూచి, వినయంతోకూడిన, వినసొంపైన మాటలు చెప్పాడు—

"అమ్మా! కృపాసాగరుడైన శ్రీరామ ప్రభువు లక్ష్మణునితో సహా క్షేమంగానే వున్నారు. కాని మీ వియోగంతో ఆయన దుఃఖానికి అంతూ పంతూ లేదు. సీతమ్మ తల్లీ! మీరు మీమనస్సులు చిన్న బుచ్చుకోకండి. ఆయన హృదయంలో మీరంటే ఉన్నప్రేమ ఇంతా, అంతాయని చెప్పడానికి మాటలు చాలవు. అంటూ హనుమంతుడు అమిత దుఃఖంతో మొదట మాట్లాడలేక పోయాడు. కొంచెంసేపు తరువాత సమాళించుకొని" "అమ్మా! శ్రీరామ ప్రభువు నాతో చెప్పి మీకు చెప్పమన్న మాటలు వినండి" అన్నాడు.

"సీతా! నీ వియోగంలో నాకు ప్రకృతిలోని వస్తువులన్నీ వ్యతిరేకంగా కనిపిస్తున్నాయి. క్రొత్త చిగురుటాకులు అగ్ని కణాల్లాగాను, రాత్రియముని లాగాను, చంద్రుడు సూర్యునిలాగాను, కమలవనాలు ఎలుగుబంట్లు వనంలాగాను, నాకు కనిపిస్తున్నాయి. ఇక మేఘాలు వేడినూనె కురిపిస్తున్నాయి. ఇంతకుముందు నామేలు కోరువారంతా నాకు వ్యతిరేకులై పోయారు. త్రివిధవాయువులు పాములు బుసగొట్టు చున్నట్లుగా ఉన్నాయి. ఈబాధలన్నీ ఆత్మీయులకుచెప్పుకుంటేతృప్తిగా ఉంటుందనుకుంటే, ఇక్కడ నాకు ఆత్మీయులెవరు ఉన్నారు? నా దుఃఖాన్ని పంచుకునేవారు, తెలుసుకునేవారు ఎవ్వరులేరు. ప్రియురాలా! మనయిద్దరి మధ్యనున్న ప్రేమతత్త్వం కేవలం నామనస్సుకు తప్ప ఇతరులకెవ్వరికీ తెలియదు. ఆ మనస్సుకాస్తా ఎల్లప్పుడు నీవద్ద ఉంటున్నది. ఇప్పుడు నేను చెప్పేదంతా అర్థం చేసుకో, నా స్థితి ఏమిటో తెలిసికో" అన్న మాటలన్నీ హనుమంతునిద్వారా విని సీతమ్మ ప్రేమలో మునిగిపోయింది. తన శరీరం తన అదుపులో లేని స్థితి ఏర్పడింది. సీతమ్మ తలవంచుకొనియే ఏం మాట్లాడుటకు తోచక కూర్చుంది. అప్పుడు హనుమంతుడు—

"అమ్మా! సేవకులకు సహితం సుఖం లభించాలని కోరుకునే శ్రీరామచంద్రుని తలచుకుంటూ ధైర్యంగా ఉండు. ఆయన గొప్పతనాన్ని, విశాలదృష్టిని తెలిసికొని, నా మాటలు విని వ్యాకులాన్ని వదలి నిశ్చింతగా ఉండు."

రాక్షస సమూహమంతా దీపపు పురుగులలాంటి వారయితే, శ్రీరామచంద్రుని బాణాలు అగ్ని రూపాలు, అమ్మా! రాక్షసులు సర్వనాశనమవుతారని మనస్సులో నిశ్చయ పరచుకొని ధైర్యంగా ఉండు.

సీతమ్మతల్లీ! ఆయనకు ఈ నీస్థితి తెలిసివుంటే, ఆయనింత

ఆలశ్యం చేసి ఉండేవారు కారు. రామబాణమను సూర్యోదయమయిన తరువాత రాక్షస స్వరూమను అంధకారమెలా ఉండగలుగుతుంది?

అమ్మా! నేను నిన్ను ఇప్పుడైనా తీసికొని పోగలను. కాని శ్రీరామచంద్రుని అనుమతి నాకు లభించలేదు. పైగా ఆయనరాక్షస సమూహాన్ని నాశనం చేస్తానని ప్రతిజ్ఞచేసి వున్నాడు. కొంతకాలం ధైర్యంగా ఉండమ్మా! వానరులతో కలసి శ్రీరామచంద్రుడు ఇక్కడకు వచ్చి రాక్షసులను హతమార్చి నిన్ను తీసికొని వెళ్తారు. అప్పడాయన కీర్తిని నారదుడు మొదలైన వారు మూడు లోకాల్లో కొనియాడుతారు."

హనుమంతుని చల్లనిమాటలు సంతోషంగా విన్న సీతమ్మ-"బిడ్డా! వానరులంతానీలాగా చిన్న రూపంలో వుంటారు , రాక్షసులాఎంతో బలవంతులు, అలాంటి స్థితిలోవానరులయిన మీరు వారి దెబ్బలకు తట్టుకోగలుగుతారా? అని నాకనుమానంగా వుంది." అనేటప్పటికి హనుమంతుడు తన శరీరాన్ని పెంచి చూపి,"అమ్మా! ఈనారూపము లాంటి వారెందరో వానరులు పర్వతాల్లాగా వుంటారు. వారు యుద్ధంలో ఎంతో భయంకరమైన శరీరాలు ధరిస్తూంటారు. అందు వలన వానరులమీద నమ్మకముంచు.

సీతమ్మ తల్లీ! వానరులలో ఎక్కువ బుద్ధిబలముండదు. కాని ప్రభువు దయవలన చిన్నపాము కూడా గరుత్మంతుని తినగల్గుతుంది. అలాగే నిర్బలుడు కూడా బలవంతుని చంపగల్గుతాడు."అంటూ హనుమంతుడు చిన్న రూపంలోకి మారిపోయాడు.

హనుమంతుని భక్తి, ప్రతాపం, తేజస్సు, బలముతో కూడిన విషయాలు విని సీతమ్మ తల్లి మనస్సులో సంతోషించింది, హనుమంతుని శ్రీరాముని ఇష్టుడుగా భావించి ఆశీర్వదిస్తూ- "నాయనా! నీవు బలము, బుద్ధిలో మేటివికమ్ము, నీకు ముసలితనం రాకుండా

ఉండుగాక, నీవు చిరంజీవివి, గుణాల గనివికమ్ము, శ్రీరాముని దయ నీయెడ ఎల్లకాలమూ ఉండుగాక" అనగానే విని హనుమంతుడు భక్తిలో పరవశుడైనాడు.

హనుమంతుడు మాటి మాటకి సీతమ్మ పాదములవద్ద తల వాన్చి, చేతులు జోడించి- "అమ్మా! నేనిప్పుడు కృతార్థుడనయ్యాను. మీ ఆశీర్వాదము కలకాలముంటుందను నమ్మకము లోకానికి తెలుసు అమ్మా! పండ్లతో కళకళలాడుతున్న వృక్షాలను చూడగానే నాకాకలి వేస్తున్నది. అనగానే సీతమ్మ- "బిడ్డా! ఈ పూల, ఫలాలతోటలను కాపలా కాస్తున్న వారు మహాబలవంతులైన రాక్షసులు. వారి ధాటికి తట్టుకోవడం నీకసాధ్యమేమో!" అంది.

"అమ్మా! నీకు నాబలంమీద నమ్మకముండి అనుమతినిస్తే నాకు ఆ రాక్షసుల భయమేమీలేదు. అన్నాడు హనుమంతుడు.

## 25

సీత హనుమంతుని బుద్ధిబలంలో ఆరితేరినవాడని గ్రహించి- "అయ్యా! వెళ్ళు, శ్రీరాముని చరణాలను మనస్సులో తలచుకొని తియ్యని పండ్లుతిను" అనగానే హనుమంతుడు తలవంచి నమస్కారం చేసి తోటలో జొరబడి పండ్లుబాగా తింటూ చెట్లన్నీ పెరికి వేయడం మొదలెట్టాడు. అక్కడ కాపలాకాస్తూన్న వారు ఎదిరించటంతో వారిని హనుమంతుడు చంపేశాడు. మిగిలినవారు పారిపోయి రావణునితో చెప్పుకోసాగారు—

మహారాజా! ఒక పెద్ద భయంకరమైన కోతి వచ్చి అశోకవనాన్ని ధ్వంసం చేసింది. పండ్లన్నీ తినడమేగాక చెట్లన్నింటిని పెరకి వేసింది. కాపలాదారులను నుగ్గునుగ్గు చేసి చంపేసింది".

ఈ మాటలు విన్న రావణునకు పట్టరానికోపం వచ్చింది.

ఎంతోమంది వీరులను పంపాడు. వారిని చూడగానే హనుమంతుడు గావుకేకలు వేసి అందరిని చంపాడు. దెబ్బలుతిన్న వారంతా పెద్దగా అరచుకొంటూ పారిపోయారు.

మరల రావణుడు అక్షయకుమారుని పంపాడు. అతను తన వెంట లెక్కకుమించిన యోధులను తీసికొని వెళ్ళాడు. అతను రావడం చూచి హనుమంతుడు వృక్షాన్ని పెరికి, అతనిమీదకురికి, అతనిని చంపి సంతోషంగా అరచాడు. మిగిలిన వీరులలో కొందరిని మట్టిలో కలిపేశాడు. కొందరు పారిపోయి రావణునితో-"రాజా! ఆ కోతిచాలా బలం కలది." అన్నమాట వినగానే రావణుడు మేఘనాథుని పంపిస్తూ- "బిడ్డా! ఆ కోతిని చంపవద్దు, కట్టి నా వద్దకు తీసుకురా, ఎందుకంటే, అది ఎక్కడి కోతియో చూడాలి" అన్నాడు.

ఇంద్రుని జయించగల మహావీరుడు మేఘనాథుడు వెళ్ళాడు. తమ్ముని చంపాడన్న విషయం విని అతని కెంతో కోపం వచ్చింది. ఈసారి భయంకరమైన వీరుడు వచ్చినట్లు హనుమంతుడు గ్రహించాడు. అతను చాలా బిగ్గరగా అరచి పరుగు తీశాడు. ఒక పెద్ద వృక్షాన్ని పెకలించి మేఘనాథుని మీద పడవేశాడు. వాని రథం గుల్లగుల్ల అయిపోయింది. అతనికి రథం లేకుండా చేశాడు. ఆ తరువాత మేఘనాథుని వెంట వచ్చిన గొప్పగొప్ప వీరులను పట్టుకొని హనుమంతుడు తన చేతులతో నలిపేశాడు. చివరకు మేఘనాథునితో తలపడ్డాడు. ఆ సమయంలో వారిద్దరు తలపడడం చూస్తుంటే, రెండు ఏనుగులు ఒండొరులతో ఢీకొంటున్నట్లున్నది. హనుమంతుడు మేఘనాథుని చాచి ఒక్క గుద్దు గుద్ది చెట్టు మీదకు వెళ్ళి కూర్చున్నాడు. మేఘనాథుడు దిమ్మదిరిగి పడిపోయాడు. క్షణమయిన తరువాత మేఘనాథుడు తెప్పరిల్లి ఎన్నో మాయలు పన్నాడు. కాని హనుమంతుని జయించలేకపోయాడు. ఇక లాభం లేదనుకొని బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు.

హనుమంతుడు ఆలోచనలో పడ్డాడు. "ఇప్పుడు నేను ఈ బ్రహ్మా స్త్రానికి విలువ యివ్వకపోతే, దీని మహిమకు లోటు వస్తుంది." అనుకున్నాడు. బ్రహ్మాస్త్రానికి మూర్ఛపోయాడని తెలిసికొని మేఘ నాథుడు, అతనిని నాగపాశంతో బంధించి తీసుకువెళ్ళాడు.

"ఓ పార్వతీ! విను, ఎవని పేరు స్మరించినంత మాత్రాన మాన వుని సంసార బంధనాలన్నీ విడివడిపోతాయో అతని దూత ఎక్కడనో బంధించబడడం విచిత్రంగా లేదూ? కాని స్వామి కార్యాన్ని సాధించ డం కోసం హనుమంతుడు కావాలని బంధితుడయినాడ'న్నాడు శివుడు.

కోతి బంధించబడినదన్న సంగతి విని రాక్షసులందరు పరు గెత్తుకొని వచ్చి ఆనందంగా సభలో ప్రవేశించారు. హనుమంతుడు వెళ్ళి రావణుని సభను చూచాడు. అతని వైభవాన్ని వర్ణించడం బ్రహ్మాతరం కూడా కాదు. దిక్పాలురు చేతులు జోడించి నిలబడి భయ భయంగా రావణుని వైపు చూస్తున్నారు. ఇంత వైభవం చూచి కూడా, పాముల మధ్య గరుత్మంతుడుండి భయపడనట్లుగా, హను మంతుడేమాత్రం భయపడలేదు. హనుమంతుని చూచి రావణుడు అతనిని అనరాని మాటలని పకపక నవ్వాడు. అంతలోనే పుత్రుని మరణం సంగతి జ్ఞప్తికి వచ్చి అతనికెంతో దుఃఖం కలిగింది. తరు వాత రావణుడు ఆ దుఃఖాన్ని దిగమ్రింగుకొని-"ఓరే, కోతీ! నీ వెవ డవు? ఎవని బలాన్ని చూచుకొని నీ వీతోటను నాశనం చేశావు? ఎప్పుడైనా నీవు నా పేరు నీ చెవులతో విన్నావా? ఒరే, శంఠా! నీవు నాకు చాలా నిర్భయుడవుగా కనిపిస్తున్నావు. ఏమి అపరాధం చేశా రని రాక్షసులను చంపావు? మూర్ఖుడా! నీకు ప్రాణభయంలేదా?" అనగానే హనుమంతుడు-"రావణా! విను, ఏ పరబ్రహ్మ బలంతో

మాయ అనేక బ్రహ్మాండాలను సృష్టిస్తుందో, ఎవని బలంతో బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సృష్టించటం, పోషించటం, చంపటం చేస్తున్నారో, ఎవరి బలంతో ఆదిశేషుడు నిన్ను, నన్ను, అడవులను, పర్వతాలను మొదలైన వాటన్నింటిని మోస్తున్నారో, ఏ సజ్జనుల రక్షణ కోసం, దుష్టులను సంహరించటం కోసం అనేక విధాలైన రూపాలుగా మారుతూ వస్తున్నారో, ఎవరు మహా పరాక్రమవంతుడైన శివుని ధనస్సును త్రుంచివేశారో, రాజులందరి గర్వాన్ని పటాపంచలెవరు చేశారో, ఖరదూషణ, త్రిశిర, వాలి మొదలైన గొప్ప యోధానయోధులను వధించివేశారో, ఎవ్వని రవ్వంత బలంతో నీవు చరాచరాలను జయించావో, ఎవని ప్రియమైన భార్యను కారణం లేకుండా ఎత్తుకొచ్చావో, ఆయన దూతను నేను నీ గొప్పతనం నేనెరుగుదును. నీవు వేయి చేతుల కార్తవీర్యార్జునితో పోట్లాడావు, వాలితో యుద్ధం చేసినందున నీ కెంతో కీర్తి వచ్చింది." అని రావణుని గొప్పతనాన్ని అతని ఎదురుగా చెప్పినప్పటికిన్నీ రావణుడు అతని మాటలను ఖాతరు చేయలేదు. తరువాత హనుమంతుడు తాను చెప్పదలచిన మిగతా విషయాలన్నీ చెప్పనారంభించాడు-

"స్వామీ! నాకు ఆకలయింది, పండ్లు తిన్నాను. వానరుల అలవాట్ల ప్రకారం అందులో వున్న చెట్లను పెరకివేశాను. ఓ రాక్షస రాజా! ఎవరి శరీరం వారికి ప్రియంగా వుంటుంది. బుద్ధిలేని రాక్షసులు నన్ను కొట్టనారంభించారు. నేను కూడా నన్ను కొట్టిన రాక్షసులనే కొట్టాను. దానిమీద నీ కొడుకు మేఘనాథుడు నన్ను బంధించి తెచ్చాడు. నన్ను బంధించినందుకు నేనెంత మాత్రం సిగ్గుపడడం లేదు. నేను నా స్వామి పని పూర్తి చేయాలనుకుంటున్నాను. రావణా! నేను చేతులు జోడించి, వినయంగా చెబుతున్నాను. అభిమానం వదలి నేను చెప్పేది విను. ఏ దేవత, రాక్షసులను, చరాచర

ములను తినేస్తుందో, ఆ యముడు కూడా ఎవరిని చూచి భయపడుతూ ఉంటాడో, అతనితో నీ వెన్నడు పగబెట్టుకోవద్దు. నేను చెప్పినట్లుగా జానకిని త్రిప్పి పంపించు. ఖరుని శత్రువు శ్రీ రఘునాథుడు తప్పులు చేసిన వారు కూడా, ఆయన దగ్గరకు వెళ్ళి తప్పు ఒప్పుకుంటే రక్షిస్తాడు. ఆయన దయాసముద్రుడు. ఆయన శరణన్న వారి అపరాధా లన్నీ మరచిపోయి, తన మిత్రునిగా చేసుకుంటాడు.

నీవు శ్రీరామచంద్రుని చరణకమలాలను మనస్సులో తలచు కొంటూ, లంకను ఆనందంగా పాలించుకో. పులస్త్యబ్రహ్మ కీర్తికి నీవు కళంకము తేవద్దు. అహంకార, అజ్ఞానాలను వదలి బాగా ఆలో చించుకో రామనామ స్మరణ చేయని వాని వాక్కుకు శోభ ఉండదు. ఓ దేవతల శత్రువా! అందమైన స్త్రీ అనేకనగలను ధరించినా బట్టలు లేకుండా అందగత్తె అనిపించుకో లేదు. అలాగే శ్రీరామచంద్రునికి వ్యతిరేకి అయిన వాని యొద్ద ఎంత ఐశ్వర్యం సంపదలున్నా అవి నిలువవు, అవి లేనట్లే లెఖ్ఖ. ప్రవాహం లేని నదిలోని నీళ్ళు, వర్షము తగ్గిపోయిన తరువాత ఎండిపోతాయి. అలాగే, ఓ రావణా! విను, రామచంద్రుని వ్యతిరేకించినవానిని రక్షించేవాడెవ్వడూ ఉండడు. వేలశంకరులు, విష్ణువులు, బ్రహ్మలు కలసి వచ్చినా, రామచంద్రుని శత్రువులను కాపాడలేరు. నేనీ విషయాలు ఊసుపోకనో, నిన్ను బెదరించడానికో చెప్పడంలేదు. ఇది జగమెరిగిన సత్యం. అందు చేతనే ఇంత గట్టిగా, నమ్మకంగా చెప్పగల్గుతున్నాను. నా మాట విని నీ మోహాన్ని, నీ మొండితనాన్ని వదలి వేయుము. అవి ఎన్నో దుఃఖా లకు ఆటపట్టులు. వాటిని వదలివెయ్. దయకు సముద్రము వంటి వాడు, రఘుకులానికి స్వామి అయిన శ్రీరామచంద్రుని గుణాలను గుర్తించి, ఆయనను స్తోత్రము చేయడానికి ఇకనైనా ఆరంభించు."
అంటూ హనుమంతుడు భక్తి, జ్ఞాన, వైరాగ్య, నీతులతో కూడినవి,

ఎన్నో మేలు కలుగజేయు విషయాలు చెప్పినా మద మెక్కివున్న రావణుడు నవ్వి-"ఈ వానరుడు నాకు పెద్ద ఉపదేశమిచ్చుగురువై నాడన్నమాట" అంటూ "అరే, దుర్మార్గుడా! నీ చావు దగ్గరికి వచ్చింది, నీవు నాకు ఉపదేశమిచ్చేటంతటివాడవా?"అని రావణుడనగానే హను మంతుడు-"ఇందుకు వ్యతిరేకంగా నీ చావు దగ్గరికి వచ్చిందని తెలి సికో. నీ మతి పని చేయడం లేదు. ఆ విషయం ప్రత్యక్షంగా తెలు స్తూనే వుంది" అన్నాడు.

హనుమంతుని మాటలు విన్న రావణునికి ఆపుకోలేని కోపం వచ్చి-"ఈ మూర్ఖుని ప్రాణాలు వెంటనే ఎందుకు తీయరు?" అని అనగానే, రాక్షసులందరు హనుమంతుని చంపడానికి పరుగెత్తుకొని వచ్చు సమయంలోనే మంత్రులతో కలసి విభీషణుడక్కడకు వచ్చా డు. తలవంచి ఎంతో వినయంగా అన్న రావణునితో- "మహారాజా! దూతను చంపడం రాజనీతికి విరుద్ధం, ఇతనికేదైనా వేరే దండన యిప్పించండి" అనగానే అందరు విభీషణుని సలహా బాగా వుందని వత్తాసు పలికారు. వీరి మాటలు విని నవ్వి రావణుడు-"ఇతని ఎము కలు ఊనం చేసి వెళ్ళగొట్టండన్నాడు ముందు, తరువాత బుద్ధి మార్చుకొని "నేను మీ యందరికి తెలియజేస్తున్నాను. వానరులకు ప్రేమంతా తోకమీద వుంటుంది. అందుచేత ఆ తోకకు గుడ్డలుచుట్టి నూనెతో తడపి, నిప్పంటించండి. ఈ తోక లేని వీరుడు, ఎవనిని మా గొప్ప స్వామి అని చెబుతున్నాడో ఆ స్వామిని తీసికొని వస్తాడు. అతని సామర్థ్యాన్ని నేను కొంచెం చూడాలనుకుంటున్నాను." అన గానే హనుమంతుడు మనస్సులో నవ్వుకొని-"సరస్వతి దేవతలకుసహా యం చేస్తున్నట్లున్నది. లేకపోతే ఈ రావణునికి యింత తల తిక్క ఇంతకాలం ఉండవలసిన అవసరం కనిపించదు." అనుకున్నాడు.

రావణుని మాటలను విన్న మూర్ఖులైన రాక్షసులు తోకకు

గుడ్డలు చుట్టి నూనెతో తడిపి, నిప్పంటించడానికి సిద్ధమయ్యారు. ఈ సమయంలో హనుమంతుడు తనతోకను పెంచడం మొదలుపెట్టాడు. దాంతో లంకలోని వస్త్రాలు, నెయ్యి, నూనెలు, గుడ్డలన్నీ ఏమీ మిగలకుండా అయిపోయాయి. నగరంలోని వారంతా ఈ తమాషా చూడ్డానికి వచ్చి, హనుమంతుని కొట్టడం తన్నడం, నవ్వుకోవడం మొదలుపెట్టారు, వాయిద్యాలు మోగిస్తున్నారు. చప్పట్టుకొట్టేవారు కొడుతున్నారు. హనుమంతుని లంకంతా త్రిప్పి తోకకు నిప్పంటించారు. నిప్పంటు కొన్నది తెలిసికొని హనుమంతుడు తన ఆకారాన్ని చిన్నదిగా చేశాడు. ఎగిరిబంగారు భవనాల మీద కెక్కాడు. అతనిని చూచి నగరంలోని స్త్రీలంతా భయపడిపోయారు. శ్రీరామచంద్రుని ప్రోత్సాహంతో గాలులన్నీ జోరుగా వీస్తున్నాయి. హనుమంతుడు పెద్దగా అరచి ఆకాశంవైపు వెళ్ళాడు. ఆయన దేహం పెద్దదయిందే గాని, చాలా తేలికగా వుంది. ఆయన ఒక ఇంటి నుండి మరొక ఇంటి మీదకు ఎగురుతున్నాడు. లంక తగలబడిపోతూవుంది. మంటలు భగ భగ మంటూ లేస్తూ ఉన్నాయి. ప్రజలంతా చేజారెత్తిపోయారు. అయ్యో, అమ్మో, అంటూ హాహా కారాలు చేస్తున్నారు. ఈ సమయంలో మాకు దిక్కెవ్వరు? ఇతడు వానరుడు కాదని మొదటే చెప్పాండేముడో, ఇతనెవడో దేవతయి ఉంటాడు, వానరరూపంతో వచ్చాడని మొత్తుకున్నాంబాబో" అని పెడబొబ్బలు పెట్టి ఏడుస్తూ- "మహాత్ములను అవమానిస్తే ఇట్లాంటి గతులే పడతాయి. దిక్కులేని నగరంలాగా తగులబడిపోతూ వుంది. పట్టణమంతా" అంటూ ఏడుస్తున్నారు ప్రజలు.

హనుమంతుడు ఒక్కక్షణంలో నగరమంతా బూడిద చేసేశాడు. కేవలం ఒక్క విభీషణుని ఇల్లు మాత్రం తగులబడకుండా మిగిలి వుంది.

"పార్వతీ! హనుమంతుడు అగ్నిని సృష్టించిన మహానుభావుని దూత. అందుచేత అతను అగ్నిలో కాలలేదు. లంకంతటిని ఏమీ మిగలకుండా తగలేసి వెళ్ళి నదిలో దూకాడు" అన్నాడు శివుడు.

హనుమంతుడు తోకను ఆర్పుకొని, అలసట తగ్గిన తర్వాత, మరల చిన్నరూపంగా మారి సీతమ్మ దగ్గరకు వెళ్ళి చేతులు జోడించి నిలబడి-"అమ్మా! శ్రీరామచంద్రుడు నీకు తన ఆనవాలుగా ఉంగరాన్ని నాకిచ్చి, నీకిమ్మని చెప్పాడు. దీనికి నేను ఇవ్వడం జరిగిపోయింది. ఇప్పుడు నిన్ను కలిసి, నీతో మాట్లాడినట్లుగా ఏదైనా వస్తువొకటి ఇవ్వు" అన్నాడు. సీతమ్మ తల బిళ్ళతీసి యిచ్చింది. హనుమంతుడు సంతోషంగా పుచ్చుకొన్నాడు.

హనుమంతుడు తిరిగి శ్రీరాముని వద్దకు వెళ్ళుటకు సిద్ధమయాడు. ఆ సమయంలో సీత తన మాటలుగా శ్రీరామునకు విన్నవించమని హనుమంతునితో ఇలా చెప్పనారంభించింది-

## 22

"అయ్యా! హనుమంతా! నేను చెప్పుమాటలు శ్రీరామునితో నా తరపున చెప్పు. ఆయన కేమీ బాధలేదు. ఆయన అన్ని విధాల సంతోషంగా వున్నారు. ఆయనకు దీనదయాళుడను కీర్తి దశ దిశల వ్యాపించి వుంది. దానిని జ్ఞప్తికి తెచ్చుకొని, నేను పడుతున్న అష్ట కష్టాలను గురించి ఆలోచించి, వాటిని తొందరగా దూరం చేయమన్నానని చెప్పు. ఇంద్రుని పుత్రుడైన జయంతుని కథ వినిపించి ప్రభువుకు వాని బాణాలలో ఉన్న బావను జ్ఞప్తికి తెచ్చుకోవడమవసరం. నాథుడు ఒక్క నెలలోపల వచ్చి తాడో, పేడో తేల్చుకొకపోతే నన్ను ప్రాణాలతో చూడడం కష్టం.

హనుమంతా! నీవే చెప్పు, నీవంతా ఇక్కడ చూచావుగదా?

ఇన్ని బాధలను అనుభవిస్తూ నేనెలా బ్రతకడం? నీవు కూడా నేను ఇక్కడనుండి వెళ్ళడం మంచిదను భావంలోనే ఉన్నావు. నిన్ను చూచిన తరువాత నా మనస్సు శాంతించి, హృదయం చల్లబడింది. ఇప్పుడు నీవు కూడా వెళ్ళి పోతున్నావు. నీవు వెళ్ళిన తరువాత మరల నాకు [illegible] ఏడ్పు తప్ప మరొకటి లేదు.

మణిలేకుండా సర్పం, నీరులేకుండా చేప ఉండలేక బాధలు పడ్డట్టుగా నేను రఘువంశ రాఘవుడు లేకుండా దీనపుబ్రతుకు బ్రతకడం కష్టం.

హనుమంతా! బ్రహ్మ నన్ను అయోధ్యకు ఎప్పుడు చేరుస్తాడో ఎప్పుడు అత్తలతోసహా లక్ష్మణ, భరత, శత్రుఘ్న ఇతర ప్రజలతో కలిసి ఆనందంగా ఉండడానికి అవకాశం కలిగిస్తాడో, తెలియకుండావుంది.

నాకు శుభకార్యాలన్నీ ఎప్పుడు సానుకూలమవుతాయి? యావ కుల కోర్కెలు ఎప్పుడు తీరుతాయి? నేను శ్రీరామచంద్రుని ఆపాద మస్తక అందాన్ని ఎప్పుడు చూడగలుగుతాను?

శ్రీరామచంద్రుడు మణులతో పొదిగిన కిరీటాన్ని తలకు పెట్టుకొని, చెవులకు అందమైనకుండలాలు ధరించి యుండగాను, విలువైనవి, వెలిగిపోతున్న ఆభరణాలను ధరించి యుండగాను, అత్తరులతో తడిసి చెంపలవద్ద వ్రేలాడుతున్న వెంద్రుకలను, ఆ వెంద్రుకలలో పెట్టుకొన్న పూలమొగ్గలను ఎప్పుడు చూడగల్గుతాను?

ఆయన నొసటి బొట్టును, ధనుస్సుతో సమానమైనవి, తుమ్మెదల బారులాగా ఉండే ఆయన కనుబొమలను చూచు అదృష్టం నాకుందా?

విశాలమైనవి, అందమైనవి, చంచలమైనవి, శుభాన్ని కలిగించేవి, అభిమాన ముట్టిపడుతూ నావైపు చూస్తూవుండే ప్రభునేత్రాలను

నేను ఎప్పుడు చూడగల్గుతాను?

చిలుకముక్కులాగా అందమైన ముక్కుగలవానిని, తల కట్టు అందంతో వెలిగిపోతూ ఉండే వానిని, చంద్రముఖాన్ని చూడడానికి తహతహలాడు చకోరపక్షిలాగా, గడ్డిపరక అడ్డం పెట్టుకొని బ్రతుకుతున్న నాకు, ఆగడ్డి పరకను అవతల పారేసి, ఆయన ముఖాన్ని చూడగలరోజు వస్తుందా?

హనుమా! శ్రీరామచంద్రుని పెదవులు ఎర్రగాను, దంతాలు దానిమ్మగింజల్లాగాను, వాక్కు వినసొంపుగాను, నవ్వు తెప్పించునదిగాను, కోమలంగాను ఉంటాయి. ఇన్ని మంచిగుణాలున్న చంద్రునితో సమానంగా వెలిగిపోతూ ఉండే స్వామిదర్శనం చేసికొను అదృష్టం నాకుందా?

భక్తుల మనస్సులను ఆకర్షించే ఆయన తియ్యని పలుకులు నాకు నా చెవులారా వినగలుగు భాగ్యముందా? ఆయన అందమైన గడ్డము, అమృతంతో సమానమైన ఆయన చూపులను చూడ్డానికి ఈనా కళ్ళు నోచుకున్నాయా?

శంఖంలాగా ఉండే కంఠాన్ని, ఆకంఠంలో ఉన్న తులసీ మణుల మాలను, విశాలమైన ఆయన వక్షస్థలాన్ని, సుఖానికి నిలయమైన ఆయన పొట్ట మీదనున్న మూడు మడుతలను చూచే యోగం నాకుందా?

ఏనుగు తొండాలలాగా ఉండే ఆయన విశాలమైన భుజాలను, కమలములలాంటి నగలతో అలంకరించబడియున్న అరచేతులలో ధనస్సు, బాణాలను ఉంచుకొని అందంగా కనిపించు, ఆశ్రీరామ చంద్రుని చూడడానికి ఇంకాఎంత కాలం వేచి ఉండవలసివుంటుంది.

అందమైన, సన్నని ధోవతి కట్టుకొని, పైన పీతాంబరం చక్కగా అమర్చుకొని, జందెము మెడలోపొట్టదాకా వ్రేలాడునట్లుగా

వేసికొని వుండు ఆ ప్రభువుపాట్టను నాకళ్ళారా చూడగల్గు జాతకం నాకుంటా?

అయ్యో! ఆఖరుగా ఒక్క విషయం నీకు క్లుప్తంగా చెప్ప దలచాను. విస్తరించి చెప్పడానికి నాకు ఓపికాలేదు, నీకు సమయమూ లేదు, స్థానమంతకంటే తగినదికాదు.

(నీవు చిరంజీవివి. ఎన్నో కృతయుగాలు, త్రేతాయుగాలు, ద్వాపరయుగాలు, కలియుగాలు చూచావు. మేము అన్ని యుగాలలో అవతారాలెత్తుతూనే ఉన్నాము. నీవు మమ్ము వదలకుండా మా వెంట ఉంటూనే వున్నావు. అందుచేత మా ప్రారబ్ధాన్ని గురించి నీకు తెలి యని విషయంలేదు. శ్రీరామచంద్రునకు తెలియని విషయాలుండ డానికి వీలేలేదు. ఆ పాత విషయాలన్నీ మీయిద్దరికీ జ్ఞప్తికి తెస్తే, నేను లోలోన ఎంత కుమిలిపోతూ కాలం గడుపుకు వచ్చానో. భర్త మాటను జవదాటకుండావచ్చానో, పతియే దైవస్వరూపుడనుభావాన్ని వదలలేదో, భార్య భగవంతునితో సమానమను విషయాన్ని ప్రభువు ఎలామరచాడో తెలియపరచాలను కోరిక ఈనాడు నాకుకల్గి నాలో పల దాగియున్న ప్రేమను ఆపుకోలేక ప్రభువుకు తెలియడానికి, ఆయన ఆలోచించడానికి అనువుగా నీతో చెబుతున్నాను.

ఈ సృష్టికి కారకుడు పరమేశ్వరుడు. పరంధాముడు, నిరా కారుడు, నిర్గుణుడు, నిరంజనుడు,అవాఙ్మానసగోచరుడు అని అంటు న్నారు. ఆయన పేర్లను ఏకరువు పెట్టలేము. ఆయన లోకంలోని ప్రాణికోటికి వారి వారి కనుకూలమైన పనులు కేటాయించాడు. వీరందరి పనులను చూచి ఒక క్రమంలో వుంచడానికి వారికంటే పెద్దవారిని నియమించాడు, వారే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు. ఈ విషయమంతా నీకు కూడాతెలుసు.

బ్రహ్మకు సృష్టించే పని, విష్ణువుకు పోషించేపని, ఈశ్వరునకు అంతం చేసే పని ఒప్పగించాడు. అంటే, ఈ ముగ్గురికి మూడు రకాలైన పనులను కేటాయించాడు. పరమేశ్వరుడు ఆ పనులను వేల కోట్ల సంవత్సరాల నుండి చేస్తూ వస్తున్నారుఈ ముగ్గురు. కాని ఆ పనులు ఎవరు ఎక్కువ చేస్తున్నారు, ఎవరు తక్కువ చేస్తున్నారు. ఎవరు బాధలు అనుభవిస్తున్నారు, ఎవరి బాధ్యత ఎంత, అను విషయాలను ఎన్నడూ ఈ ముగ్గురు లెక్కలు వేసికొని చూచుకున్నట్లు కనుపించదు. ఎన్నో బాధలు అనుభవిస్తూ వస్తున్న నాకు ఎవరికి ఎక్కువ బాధలో, ఎవరికి ఎక్కువ సుఖాలో అను విషయం బాగా తెలుసు.

బ్రహ్మగారు చరాచర ప్రపంచాన్ని సృష్టిస్తాడు. ఆ పనికి ఆయనకు బొమ్మలు తయారుచేసి, వాటన్నింటిలో ఊపిరి పోయుటకు కార్యకర్తలుంటారు. ఆయన చేసేపని, ఆ బొమ్మల ఆకారాలను నిర్ణయించడం మాత్రమే. ఆయనకు ఆయన భార్య సరస్వతీదేవికీ ఎన్నడూ ఎడబాటు జరుగలేదు. ఆమె వీణవాయిస్తూ వుంటే, ఈయన ఆనందంగా వింటూ నచ్చిన వారికి వరాలు, నచ్చనివారికి శాపాలు యిస్తూ వస్తున్నారు, ఏ యుగంలోనూ వారి భార్యా భర్తల పేర్లు మారలేదు. జీవన పరిస్థితులు మారలేదు. ఆయనకు మానసపుత్రులైన సనక సనందానాదులు, నారదుడు మొదలైనవారున్నారు. వారి పేర్లు ఆనాటి నుండి ఈనాటివరకున్న ప్రజలందరూ ఎంతో ప్రీతితో స్మరిస్తూనే వున్నారు.

శివుడు పార్వతితో కైలాస పర్వతం మీద డమరుకం వాయిస్తూ శివతాండవం, చేస్తూ, ఆనందోత్సాహాలతో గడుపుతూ ఆనాటి నుండి ఈనాటి వరకు జీవనం సాగించుకు వస్తూ ఉన్నాడు. ఆ భార్యాభర్తలకు ప్రాణికోటి గురించి ఎప్పుడూ ఎడబాటు జరగలేదు. ఎడబాటు ఎప్పుడైనా జరిగితే, వారి కుటుంబ విషయాలకు సంబంధించి

కొద్ది కాలం దూరంగా వున్నారు తప్ప, జీవితంలో విలువైన వయస్సంతా దూరంగా ఉండి ముసలివారై పోలేదు. వారి పేర్లు ఆనాటి నుండి ఈనాటి వరకు మారలేదు. అయినా, అడిగిన వారి కడిగినట్లు వరాలూ యిస్తూ వచ్చాడు, కోపమొస్తే శాపాలు యిస్తూ వచ్చాడు. బ్రహ్మగాని, శివుడుగాని వరాలు,శాపాలుయిస్తారే గాని, వాటిని పరిష్కరించువారుకారు. ఆ పని వారికిలేదు. శివునకు,వినాయకుడు వీరభద్రుడు అను ఇద్దరు బిడ్డలు వున్నారు. వారిని వారి పేర్లను ఇప్పటివరకు జ్ఞాపకంపెట్టుకొని ప్రజలు గొప్పగా కొలుచుకుంటూ వస్తున్నారు.

ఇక మిగిలినది మా ప్రారబ్ధం. మా వారికి లోకాన్ని రక్షించడం, వారి కొరకు యమయాతనలు పడడం, భార్యాభర్తల సుఖాలను నోచుకోకుండా, జీవితకాలంలో ఎక్కువభాగం ఎడబాటుతో గడపడం నీలాపనిందలు మోయడంలాంటి బాధ్యతలు ఒప్పజెప్పబడ్డాయి. మాకు ఏ యుగంలోను కడుపులోని చల్ల కదలకుండా బ్రతికే అదృష్టం లేకుండా పోయింది. అనేకసార్లు మా పేర్లు మార్చుకోవలసి వచ్చింది. ప్రజల కోర్కెల, అవకతవకల పరిష్కార సమయాలలో కొందరితో తిట్టించుకోవడాలు, కొందరితో, స్వార్ధంతోనయినా, పొగిడించుకోవడాలు జరుగుతూ వచ్చాయి. బ్రహ్మ, శివుడు అడిగిన వారికి అడిగినట్లు వరాలిచ్చి, వాటి పరిష్కారాలు మా మెడకు చుట్టుతూ వస్తున్నారు. వారు వరాలిచ్చి వుండకపోతే, మాకీ ఎడబాట్లు, ఈ బాధలు, నిందలూ ఉండేవికావు.

మాకు బాధ్యత, బరువులు తెలుసుగాన మేమెవ్వరికీ వెనుక ముందు లాలోచించకుండా వరాలివ్వలేదు. ఒకవేళ ఎక్కడైనా యిచ్చినా పేచీలు లేని తావులలో యిచ్చామేమో జ్ఞాపకం లేదు. అసలు అందరినీ సమానంగా చూచుకోవలసిన మేమే, కోర్కెలు పెంచుకొని, ఒకరికంటే మరొకరు మిన్నగా వుండాలనుకొని, భక్తులను పేర్లకో

వరాలు, శాపాలు యిచ్చి, వాటి పరిష్కారాలన్నీ మమ్మ చేయమన డం ఎంత వరకు సబబు?

కృతయుగాలలో నా భర్తా, నేను బ్రహ్మ, శివులలాగా శాంతం గా జీవనం గడుప లేదు. త్రేతాయుగంల్లో గడుపలేదు. ద్వాపర యుగాల్లో సుఖదుఃఖాలు మిళితంగా వున్నాయను కొన్నా, బాధ్యతలు తగ్గలేదు. కలియుగాలలో మాకు కష్టాలూలేవు, సుఖాలులేవు. ఆ యుగాలలో మేముండవలసినపని అంతగా రాలేదు. ఎందుకంటే ఆ యుగాలలోని వారు ఎవరి మాటా వినరు, వారిలో వారు కొట్టుకొని చస్తూ వుంటారు. వారు స్వార్థపరులయి, వారి ప్రయోజనాలను దృష్టి లో పెట్టుకొని మాకేదో గౌరవమిస్తున్నట్లు, మమ్మ అందల మెక్కిస్తు న్నట్లు, గుడులు, గోపురాలు కట్టిస్తున్నట్లు; మాన్యాలు, దానాలు చేస్తున్నట్లు, ఇలా ఎన్నో విధాలుగా మా మీద భక్తి వున్నట్లుగా చాలామంది నటనలు చేస్తుంటారు. వారు మా కొరకని చేయుపను లన్నీ; వారి కొరకే వారు చేసుకుంటున్నారని మాకు తెలుసుగాన, వారు తిట్టినా, నిందించినా, భూషించినా, దూషించినా, మేము పట్టించు కోవడం లేదు. వారు తమతప్పులు తమకు తెలిసినా తెలియనట్లు నటనలు చేసి, ఎదుటివారి తప్పులను వెదకుతూ ఉంటారు. కొందరు కొందరిని దొంగలని, మోసగాండ్రని అంటుంటారు. ఇలా అనుకో వడం ఇరువైపులా జరుగుతూనే వుంది. ఎవరిలోను త్యాగబుద్ధిలేదని మాకు తెలుసుగాబట్టి కలియుగాన్ని గురించి మేము పట్టించుకోవడం లేదు.

వారు చేయరాని పనులన్ని చేస్తుంటారు. ఆ పనులను బ్రహ్మ వ్రాతయని,పత్రం, పుష్పం, ఫలంతోయంతో తప్పులన్నీ ఒప్పులవుతా యని, హరేరామ హరేకృష్ణ అంటే చాలు, అనీ, అన్నీ మా వారు పరిష్కస్తారని తప్పులే ఎక్కువ చేస్తూ వుంటారు.

వారికి బ్రహ్మ, శివుడు సహాయపడరని తెలుసు. ఏ సహాయ మైనా మా వారు చేస్తారని అలవాటు పడిపోయారు,

ఒకటిమాత్రం నిజం. బ్రహ్మ వ్రాస్తాడు,మావారు ఆయనవ్రాసిన ప్రకారం తు.చ. తప్పకుండా లోకాన్ని సాగించుకుపోతారు. శివుడు మావారి అనుమతి లేనిది చంపలేడు, ఎన్నిరోగాలు వచ్చినా, ఎటు వంటి ప్రమాదాలు సంభవించినా మావారి అనుమతి లేనిది ఎవ్వరూ చావడానికి వీలులేదు. మావారి అనుమతి అయిన తరువాత ఎట్టి వారైనా, ఎట్టి పరిస్థితులలోనైనా బ్రతుకడానికి వీలులేదు. అలా చని పోయిన వారి పనులను శివుడు చూచుకోవాలి. అంతే ఆయన పని అందుచేత మాకు కలియుగం వలన, ఆ ప్రజలవలన ఏ విధమైన యిబ్బందీ లేదు.

మా కాపురానికి కష్టాలు మిగతాయుగాల వల్లే వస్తున్నాయి. ఈ రాక్షసుల, దేవతల వరాలవల్లా, శాపాల వల్లా మాదాంపత్య సుఖం, మా బిడ్డల పోషణ కుంటువడుతూ వచ్చింది. అందువల్లనే మా బిడ్డల పేర్లు గ్రంథాల్లో చదివినప్పుడు తప్ప ప్రజలకు జ్ఞాపకం రావడంలేదు. ఎందుకంటే మాబిడ్డలందరివీ అనాధశరణాలయాల బ్రతుకులయి పోయాయి. ఇక మాపేర్ల మార్పులకు అంతూ, పంతూ వుండదు. మేము దొంగయుద్ధాలు చేయాలి, చెట్లుచాటున, గుట్లచాటున ఉండి మాకేవిధమైవ హానిచేయని వారిని కూడా చంపాలి. ఆ తగాదాలలో మాతలలు బ్రద్దలు కొట్టించు కోవాలి. కోతులు, కొండముచ్చుల అండలకు అర్రులు చాచాలి. ఇలా మా బాధలు చెప్పుకుంటూ పోతే యుగాలు పడుతాయి.

ఈ బాధలలోని భాగమే ఈ రావణాసురుడు, ఆకైక మరి కొందరు కలిసి మాకు ఎడబాటు కల్పించడం. నిండా మునిగిన వారికి చలి ఏమిటన్నట్లు, లంకలో ఉండడం ఒక్కటే మాకు క్రొత్త విష

యం కాదు. ఇప్పుడెలాగో శ్రీరామచంద్రునితో నా కలయిక జరిగినా, మరొకరకంగా మా ఎడబాటు ఎదురు చూస్తూనే వుంటుంది. ఇంతే గాక మరొక అవతారం ఆయన ఎత్తకా తప్పదు, ఈ బాధలు మాకు రాకాపోవు. ఈ బాధలు తప్పాలంటే, కొన్నాళ్ళో, కొన్ని యుగాలో మా వారి బాధ్యతలను బ్రహ్మకో, శివునికో ఒప్పగించవీలుండి, ఒప్ప గించితే తప్ప. మాకీ ఎడబాట్లు, నిందలు వగైరాలు తప్పవన్నా"నని నా తరపున శ్రీరామచంద్రునికి చెప్పు, హనుమంతా! అని వెక్కి వెక్కి ఏడుస్తూ, ఇంతకన్నా పచ్చి (అన్యాయం) ఇంకొకటి చెప్తావిను అంది సీతమ్మ.

బ్రహ్మ, మహేశ్వరులు చేసిన పనులు తెలియక చేశారో, లేక కావాలని కక్ష పెట్టుకొని చేశారో తెలియదుగాని, వారు చేసిన పనులు ప్రజలకు, మాకు కంటకాలైపోయాయి.

సృష్టికర్త అయిన బ్రహ్మ రావణుడు మొదలైన రాక్షసులను బ్రాహ్మణవంశంలో సృష్టించాడు, అలా బ్రాహ్మణ జాతిలో పుట్టించిన వానిని బ్రాహ్మణుల లక్షణాలు ఏర్పరచక, లోకుల బాగుకొరకు ఇతర బ్రాహ్మణులు యజ్ఞయాగాలు చేస్తుంటే, వాటిలో రక్తము పోయించి, వాటిని సర్వనాశనం చేయునట్లుగా మలచాడు. అటు రాక్ష సులూ బ్రాహ్మణులే ఇటు దేవతలను తృప్తి పరచువారూ బ్రాహ్మ ణులే అయినారు. ఈ బ్రాహ్మణ జాతులయిన వారి మధ్య కక్షలు, కార్పణ్యాలు ఏర్పరచడం, ఒకవైపు బ్రాహ్మణులైన రాక్షసులకు వరాలివ్వడం, మరొక బ్రాహ్మణులకు శాపాలివ్వడం చేస్తూ ఉండమని వారి వారి నొసట వ్రాసి, వారందరు తన్నుకొని చస్తూ వుంటే, నీవు వెళ్ళి పరిష్కారం చేయమని నా భర్త ముఖాన వ్రాసి, నా భర్తకు ఆ బాధ్యత ఒప్పగించి, ఆయనచేత బ్రాహ్మణులయిన రాక్షసులను చంపించితే, ఆ పాతకము చంపిన మాకు చుట్టుకుందిగాని, మేము

చంపుటకు కారకులైన బ్రహ్మ, మహేశ్వరులను చుట్టుకోలేదు. వారు పెళ్ళాం బిడ్డలతో హాయిగా ఇళ్ళవద్ద కాపురాలు వేసికొంటూనే ఉన్నారు. ఇంత పచ్చిబూతు (అన్యాయం) లోకంలోని సాధారణ ప్రజలు కూడా చేయరు.

బ్రహ్మ, మహేశ్వరులు ఇలా చేస్తున్నప్పుడు, కుదుమిస్తే పండుగనుకొను నామగడు,చూచుకో నా ప్రతాపం అని మాకే మాత్రం హాని తలపెట్టని బ్రాహ్మణరాక్షసులు వానరులు వగైరాలను చంపడం మరీ బాగుందికదూ?

రాక్షసులైన బ్రాహ్మణులు, వారెటువంటి వారైనా, మాకేమి నష్టం వాటిల్లజేయని వారిని, మేము చంపడంవలన వారందరి ఉసురు తగిలి మా కుటుంబానికి, కుటుంబ సభ్యులకు యుగయుగాల నుండి ఎడబాట్లు. అవతారా లెత్తడం, ఏడ్పులు తప్పడంలేదు. ఆ బ్రాహ్మణులు ఏటువంటివారైనా మాకు వారితో విరోధంలేదు.బ్రహ్మ మహేశ్వరులను నమ్మి నా భర్త పనిగట్టుకొని చంపుతూ వచ్చాడు గనుక ఇలాంటి ఎడబాట్లు సంభవిస్తూ వచ్చాయి.

రావణుడు నన్ను తీసుకురావడానికి, అతని కోరరాని కోర్కెలు కోరడానికి మేము చేసిన పాపమే కారణంగాని, వానిపుట్టుక కాదని పిస్తుంది నాకు. అతనికి పుట్టుకతోనే చెడులక్షణాలుండి, పరాయి ఆడ వారి మీద మోజును బ్రహ్మ వ్రాసి పెట్టి ఉంటే, నావెంటనే యుగ యుగాలనుండి పడడమెందుకు? సరస్వతి. పార్వతి మొదలైన ఆడ వారు నా కోవకు చెందిన వారెందరో ఉన్నారే, వారిని ఎందుకు తీసుకుపోలేదు? ఇంకా కొందరు ఆడవాళ్ళను కూడా తీసుకొని వచ్చాడని నీ వనవచ్చు, కానినేనంటాను. ఆ ఆడవాళ్ళు కూడా నా భర్త లాంటి భర్తల భార్యలయి వుంటారు.

అంజనేయా! బ్రాహ్మణులను రాక్షసబ్రాహ్మణులుగా, వైదిక

బ్రాహ్మణులుగా విడదీసి వారిలో వారికి తంపులుపెట్టి తన్నుకొని చావడానికి బ్రహ్మచేసిన పని తప్ప, బ్రాహ్మణ జాతి, తమజాతి లక్షణా లను వదలకుండా ఉండాలనిగాని, వేదోపనిషత్తులు మొదలైనవాటిని పారాయణం చేసి లోకాన్ని ఉద్ధరించాలనిగాని. ఇలా తగాదాలు రేపి నట్లు నా కనిపించడం లేదు. అలాంటి ఉద్దేశ్యమే వుంటే బ్రాహ్మ ణులు పారాయణం చేసికొను వేదాలను బ్రాహ్మణుడైన హిరణ్యా క్షుడు తీసికొని పోయి సర్వనాశనం చేయడానికి వీలుగా అతని నొసట బ్రహ్మ వ్రాసి యుండడు. వారు వరాలిచ్చి బ్రాహ్మణ రాక్షసులను నా మగనిచేత చంపించడం ఎంతలోతైన కుత్సిత విషయం. ఇలా యుగాల విషయమంతా చెప్పాలంటే రోజులు చాలవు.

హనుమంతా! రావణుని రాక్షసరాజుగాను, దశకంఠుడు, ఇరు వది చేతుల వాని గాను బ్రాహ్మణ జాతిలో సృష్టించి బ్రహ్మ బ్రాహ్మణ జాతి గౌరవమర్యాదలను నాశనం చేశాడు. నా వద్దకు సన్న్యాసి వేషంలో పంపి, సన్న్యాసుల మీద నమ్మకం పోయేటట్లుచేశాడు. భిక్షుకరూపంలో పంపి భిక్షుకులనోటదుమ్ము కొట్టించినట్లయింది. ఎందు కంటే ఎవరు నిజమైన భిక్షకులో, ఎవరు మోసగాళ్ళోనను అనుమా నము ఆనాటినుండి ఈ నాటివరకు వస్తూనే వుంది. ఇక రావణుని బ్రాహ్మణునిగా సృష్టించి ఇలాంటి పనులు అతను చేయునట్లు అతని నొసట వ్రాశాడు గాన,బ్రాహ్మణులంతా రావణాసురుని లాంటి వారో, కొందరయినా అతనిలాంటి వారుండవచ్చునను అనుమానం ప్రజలలో కలుగునట్లు చేయడం చేత, బ్రాహ్మణ జాతికి తెలియకుండా అపకారం జరిగి, ఆ జాతి గౌరవము నానాటికి తగ్గుముఖం పట్టింది.

బ్రహ్మ రాక్షసులను బ్రాహ్మణులుగా పుట్టించడం, ఆ బ్రాహ్మ ణులను నా మగని చేత చంపించడం చేత, వారందరి ఉసురు మాకు తగిలి భార్యాభర్తలం, బిడ్డలం ఒకచోట ఉండని దుస్థితిలో పడుతూ

వచ్చాం. అటు ఆ బ్రాహ్మణుల, ఇటు ఈ బ్రాహ్మణులతో పాటు మా ఉసురు కొట్టినందున బ్రహ్మకు మందిరాలు, పూజలు, గౌరవాలు, స్మరణలు లేకుండా పోయాయి. శివునకు స్మశానంలో కాపురం, పుర్రెలో తిండి. బూడిద విభూతి, పాముల, అర్ధచంద్ర, నీళ్ళ(గంగ) అలంకారాలు ఒసగుతాయి. ఇలా నేనంటే, నీవు, శివుడు కైలాసంలో శివ తాండవం చేస్తూ ఆనందంగా భార్యతో కూడా ఉంటున్నాడని. ఆ కైలాసం కూడా కాశీకి దగ్గరలోని, హిమాలయ పర్వతాల వద్ద గల స్మశానమే అని నీవు గ్రహించాలి.

ఆంజనేయా! "ఇంత బాధాకరమైన విషయాలు కడుపులో ఇన్నాళ్ళు ఎలా దాచుకోగలిగావమ్మా? ఎన్నో యుగాల నుండి ఈ బాధలతో కాలక్షేపం చేశావంటే నాకు భక్తి, భయము కూడా కలుగుతున్నది. అని నీవనవచ్చు. అందుకు నా భర్తే కారణం. భార్యమెడలో తాళికట్టిన వెంటనే భర్త భరించేవాడయిపోతాడు. భరించడమంటే కూడు, గుడ్డ చూపడం కాదు. భరించడమంటే, తన బాధలు, భార్య బాధలు తాను భరిస్తూ, భార్యను కూడా అ బాధలను భరించుటకు యోగ్యురాలుగా మలచడమన్నమాట. పతి దైవ సమానుడు, భార్య భగవంతునితో సమానమనుకోవాలి. ఒకరి బాధలు మరొకరికి బాధలుగా భావించి ప్రవర్తించడం భార్యా భర్తలిద్దరి కర్తవ్యం. అందుచేత భర్త మాట జవదాట కూడదని, భర్తలు ఏవేవో బాధలను విధిలేక ఎన్నుకొనప్పుడు భార్య సుఖాలను కోరకూడదని, నాలుగురోజుల ముచ్చట కొరకు భర్తను బాధించి సుఖాలు కోరుకోకూడదని, నా సుఖాల కొరకు భర్తను బాధించడం, అదొక రకంగా భర్తకు నేను కూడా బాధలు కలిగిస్తున్న దాననవుతానని, ఇలా ఇల్లాలుగా నేనెన్నో విషయాలు ఆలోచించి, నా భర్త కిష్టమున్నా, లేకపోయినా బ్రహ్మ

నా నొసట నా భర్త వ్రాసిన వ్రాతల వలన, బ్రహ్మ శివుల చేష్టల వలన మాకు వచ్చిన బాధలు సహించినన్నాళ్ళు సహించిగిడుతున్నాం, పుడుతున్నాం. బ్రహ్మ శివుల జంటలకు చావు పుట్టుకలు లేవు. ఎందు కంటే మా పేర్లు కాలాన్ని బట్టి మారుతున్నాయిగాని, వారి పేర్లు మా రడం లేదు. వారికి సృష్టి ప్రారంభంలో నిరాకార పరబ్రహ్మ ఏ పేర్లు పెట్టాడో, ఆ పేర్లు మారకుండా సాగివస్తూనే వున్నాయి."

హనుమంతుడు ఇంతవరకు సీతమ్మ తల్లి చెప్పినదంతా జాగ్రత్త గా విని-"అమ్మా! సీతమ్మతల్లీ! సృష్టిలో ఇంత మర్మమున్నదని నా కింత వరకు తెలియదు తల్లీ! నాకు వీలుండి, నా ప్రభువు మనస్సు స్థిమితంగా ఉంటే నీవు నాతో చెప్పిన విషయాలన్నీ చెప్తాను. ఇప్పటి వరకు విషయాంతరంలోకి వెళ్ళి, రావణుని గొడవలు ప్రక్కన పెట్టే శాం." అంటూ నమస్కారం చేసి వెళ్ళాడు.

## 26

హనుమంతుడు సీతమ్మ వారి వద్ద సెలవు తీసికొని వెళ్ళిన ప్పుడు పెద్దగా అరచాడు. ఆ అరుపుకు కడుపులతో వున్న స్త్రీల పిండాలు నేలబడ్డాయి. సముద్రాన్ని దాటి వానర సైన్యమున్న వైపుకు వచ్చి, వారికి ఆనందకరమైన శబ్దాన్ని వినిపించాడు.

హనుమంతుని చూడగానే అందరు చాలా సంతోషించారు. అందరికీపోయిన ప్రాణాలు లేచి వచ్చినట్లనిపించింది. హనుమంతుని ముఖం సంతోషంగా ఉంది, శరీరం వెలిగిపోతూవుంది, శ్రీరాముని కార్యము సఫలము చేసుకువచ్చాడ'ని అందరు అనుకున్నారు.

అందరూ కేరింతలతో పయనమై మధ్యలో మధువనంలోకి వెళ్ళి,అంగదుని అనుమతితో తియ్యని పండ్లు తిననారంభించారు. కాప లావారు అడ్డువస్తే వారిని గుద్ది పారద్రోలారు. 'యువరాజు అంగ

డుడు వనా'న్నంతటిని ధ్వసం చేశాడ'ని చెప్పారు కాపలాదార్లు సుగ్రీవునితో, వీరి మాటలు వినగానే సుగ్రీవునకు వానరులు, ప్రభువు కార్యము పూర్తిచేసికొని వచ్చారను నమ్మకం కలిగింది. అమితంగా సంతోషపడ్డాడు. ఎందుకంటే, సీతమ్మ గారి కబురు తెలిసికొనలేక వచ్చిన వానరులు మధువనంలో పండ్లు తినలేరని ఆయనకు తెలుసు. సీతమ్మ కబురు తెలిసికోలేకపోతే వారసలు ఇక్కడకు రానే రారు" అని సుగ్రీవుడు ఆలోచించే సమయంలో వానరులంతా ఆయన దగ్గ రకు వచ్చారు.

సుగ్రీవుడు కళకళలాడుతూ కూర్చున్నాడు. వానరులంతా వచ్చి ఆయనకు పాదాభివందనం చేశారు. ఆయన అందరినీ క్షేమసమాచా రాలు అడిగాడు. "అయ్యా! మీ పాదములను దర్శనం చేసుకోగల్లు తున్నాం గనుక క్షేమంగా ఉన్నట్లే. శ్రీరాముని దయవలన పోయిన పని చక్కగా సానుకూలమయింద'ని జవాబిచ్చారు.

"మహారాజా! హనుమంతుడే ఈ పని పూర్తిచేసికొని వచ్చాడు. వానరుల ప్రాణాలు నిలిచాయి. అని వానరులంతా అనేటప్పటికి మరల సుగ్రీవుడు హనుమంతుని ప్రత్యేకంగా అభినందించాడు. వానరు లంతా కలసి శ్రీరామచంద్రుని వద్దకు వెళ్ళారు.

వానరులు రావడం శ్రీరామచంద్రుడు చూచాడు. పోయిన పని పూర్తి చేసికొని వచ్చినట్లు గ్రహించి చాలా సంతోషించాడు. సోదరు లిద్దరు రాతి అరుగుమీద కూర్చుని వున్నారు. వానరులంతా వచ్చి వారి పాదాలమీద పడ్డారు.

దయాసాగరుడు శ్రీరామచంద్రుడు వానరు లందరితో ప్రేమ పూర్వకంగా కలసి క్షేమసమచారాలడిగాడు. వానరులు-"హేప్రభూ! మీ చరణ కమలముల దర్శనం వలన అందరం క్షేమంగా వున్నా" మన్నారు.

ఆ తరువాత జాంబవంతుడు–రఘురామా! వినండి "మీ దయకు పాత్రులయిన వారికి ఎల్లవేళలమేలే జరుగుతుంది. అందరు సుఖ సంతోషాలతో జీవనం గడుపుతూంటారు. దేవతలు, మానవులు మునులు వారిని చూడగానే సంతోషిస్తారు. వారే విజయులవుతారు. వినయ సంపన్నులవుతారు. వారి కీర్తియే మూడులోకాల్లో ప్రసిద్ధమై పోతుంది. అయ్యా! మీ దయవల్లనే కావలసిన పనులన్నీ పూర్తయి పోయాయి. మా జన్మ సఫలమయింది.

అయ్యా! పవనసుతుడైన హనుమంతుడు వేసివచ్చిన పనినివేల నోళ్ళతో వర్ణించడానికి కూడా వీలుపడదు. అని హనుమంతుని, మనస్సున కానందం కలిగించు చరిత్రనంతా వినిపించారు వానరులు.

హనుమంతుని చరిత్ర రామునకు చాలా ప్రియంగా వుంది. ఆయన హనుమంతుని సంతోషంగా కౌగలించుకుని హనుమా! జానకి ఎలా వుంది? ఎలా ప్రాణాలను కాపాడుకుంటూవుంది? అని అడిగాడు.

"అయ్యా! మీ నామము రాత్రింబవళ్ళు ఆమెను రక్షిస్తూ వుంది. మిమ్ము ధ్యానించడమే ఆమెకు తలుపుగా పనిచేస్తున్నది. ఆమె కళ్ళలో మీ పాదాల రూపాలు తాళాలయినాయి. ఇలాంటి పరిస్థితిలో ఆమె ప్రాణాలు ఎలా బయటకు వెళ్ళగలుగుతాయి? ఇందుకు తోడుగా (రావణాసురుడు లోకులనుకుంటున్నంత, ఆఖరుకు మనమనుకుంటున్నంత నీచుడు, దుష్టుడు కాడని వాని మాటలతీరు,నడవడికల పొందిక వల్ల నా కనిపించింది" అనిహనుమంతుడనగానే శ్రీరామచంద్రుడు "రావణాసురుడు సీతను ఎత్తుకొనిపోయినా, అతనెలా మంచివాడని నీ కనిపించింది ఆంజనేయా?" అన్నాడు వెంటనే.

"శ్రీరామచంద్రా! వాల్మీకి, మీ పరివారం, రావణాసురుని పరివారం అంతా సమకాలికమైనది. రావణాసురుడు ఒకప్పుడు మీకు ప్రియుడు, మీరు అతనికి ఇష్టదైవము. ఈ విషయాలన్నీ ఈ యుగం

తరువాత యుగాల వారందరికి తెలిశాయి. మీ సమకాలికులు కాని అందరికి మీరెవరో, సీతమ్మ తల్లి ఎవరో, రావణ కుంభకర్ణులెవరో, హిరణ్యాక్షహిరణ్య కశిపులెవరో, ఆ తరువాత వారెవరెవరో తెలిసిన ప్పుడు, మీ సమకాలికుడైన రావణాసురునికి మిమ్మ గురించి, సీత మ్మ తల్లిని గురించి తెలియకుండా ఉండదు.

అతను బ్రాహ్మణ జన్మమెత్తినాడు. అందువలన వేదవేదాంగా లన్నీ చదివాడు, మహాపండితుడు, భక్తుడయాడు. ముప్పదికోట్ల లిం గాలకు రోజా పూజలు చేస్తున్నాడు. శివుని దర్శనం కోసం తన పది తలలు నరుక్కోడానికి కూడా వెనుకాడలేదు. అతని పూజలు, సంధ్యలు నియమాలు అతనికున్నాయి. అంత నిష్కల్మషమైన భక్తియే అతనిలో లేకపోతే యజ్ఞయాగాలు ధ్వంధం చేయడం తేలికయినపని కాదు. మీ అండవున్న దేవతలను ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు త్రాగించగలిగే వాడు కాదు యజ్ఞయాగాదులంతరించుకాలం ఆసన్నమైన సంగతి ఆయనకు తెలియకపోలేదు. ఎలాగైనా అంత రించి పోయేవాటిని తానుగా అంతరింపజేసినందువలన అతనికి నష్ట మేమీ లేదని తెలుసు. దేవతలు అతనికంటే గొప్పభక్తులేమీ కాదు, వారి చేష్టలు నికృష్టమైనవని కూడా ఆయనకు తెలుసు. తనతోయుగం మారిపోతుంది, తర్వాతి యుగంలో యజ్ఞయాగాదులు తిరుగు ముఖం పడుతాయని అతనికి తెలుసు. తాను జీవించునది కొంతకాలమేనని కూడా తెలుసు. ఇలా మీ కెన్ని విషయాలు తెలుసో, అన్ని విష యాలూ అతనికీ తెలుసు.

కృత యుగంలో హిరణ్యాక్ష హిరణ్య కశిపులు మీ చేతిలో చచ్చేరంటే, అది నాలుగు పాదాల ధర్మం నడుస్తున్న యుగం. అప్పుడు భ్రష్టులైనవారు ఉండరు గనుక అలాంటి వారు చావనవ సరంలేదు. భక్తులయి, భక్తిద్వారానే మీ చేతిలో చచ్చారు. ఇది

త్రేతాయుగం. ఇది ఒకపాదం ధర్మం తగ్గినయుగం. అందువలనభక్తి ద్వారా మీ చేతిలో చావడం సాధ్యంకాదని అతనికి తెలుసు. అందుచేత పెడమార్గం పట్టవలసి వచ్చింది. అదైనా బ్రాహ్మణ జన్మయెత్తాడు గనుక వా తప్పుగా ప్రవర్తించలేదు. బ్రాహ్మణ వేషంతోనే సీతమ్మవారి వద్దకు వచ్చాడు, భిక్షాందేహి' అనడం బ్రాహ్మణులకు నిషేధం కాదు, అందువలన ఆ శబ్దాన్నే వాడాడు. లక్ష్మణుడు గిరిగీసి పోయాడని, గిరిదాటకూడదని తెలుసుగాబట్టి అతను గిరిని దాటకుండా, అమ్మవారిని గిరిదాటింపజేశాడు. అప్పుడు సీతమ్మను గురించి ఏ కల్మషం మనస్సులో పెట్టుకోకుండా, ఆమెను తాకకుండా, భూమితోనే పెళ్ళగించుకొని లంకకు తీసుకొని వెళ్ళి, తనకు, తన పరివారానికి దూరంగా, ఇక్కడ మీరు పర్ణశాలలో వుంటున్నట్లుగానే అక్కడ అశోకవృక్షం క్రింద వనంలో ఉంచాడు. తన యింటికి తీసికొనిపోయి ఒక భవనం ఆమెకొరకు కేటాయించడమో, తన భవనంలోని కొంత భాగంలోనో ఆమెను ఉంచలేదు.

మీరు బంగారు లేడి కొరకు వెళ్ళినప్పుడు మాయలేడి మిమ్ము చాలా దూరం తీసుకెళ్ళింది. అంతదూరం లక్ష్మణునకు కూడా రాక తప్పని స్థితి ఏర్పడింది. ఆ సమయంలో రావణుడు సీతమ్మవారిని ఏమి చేసినా అక్కడ దిక్కూమొక్కూలేదు ఏమయినా చేస్తే చస్తానని భయపడ్డానుకొందామా, అలా అయితే ఆమెను లంకకు తీసుకొని పోవు తప్పు చేస్తేనే చస్తానని భయపడి ఆమెను లంకకు తీసికొని పోకుండా ఉండేవాడు. అతని జంకుకు కారణము, అతని నీతి నియమాలు, అతని చదువుసంస్కారం, అతని జాతిలక్షణం. అనుకోవాలి.

సరే, లంకకు తీసుకొని వెళ్ళి అశోకవృక్షం క్రింద ఉంచాడు. అమ్మవారిని, ఆమెను తనదానిని చేసికోవాలని, నిజంగా కోర్కెయే వుంటే, ఒంటరిగా పోతాడు గాని పెండ్లాం బిడ్డలను, మిగతా వారిని

వెంటబెట్టుకొనిపోడు. అంతమందితో కలసి వెళ్ళడానికి కారణం, మాన
వుని మనస్సు చంచలమైనది, ఒంటరిగాపోతే ఆ మనస్సు అదుపు
తప్పిపోతుందేమోనను జంకుతో ఇందరిని తనకు కావలాగా వెంట
తీసుకుపోతూ వచ్చాడు.

ఒక్క విషయం మీకు చెప్తాను. నేను లంకలోకి ప్రవేశించాను.
గందరగోళం చేశాను. రావణుని దగ్గరకు మేఘనాథుడు నన్ను తీసి
కొని వెళ్ళడానికి అవకాశం కల్పించాను, మాట్లాడాను, లంకను తగుల
బెట్టాను. ఇలా చేయవలసినవి, చేయాలనుకున్న వన్నీ చేశాను. నేను
బలపరాక్రమ వంతుడనని తెలిసిపోయిందందరికి! ఇంకా నేను లంకను
వదలి వెళ్ళలేదని, సీతమ్మ తల్లిని కలుసుకోకుండాపోనని, చిన్నరూపం
లో ఆ ప్రాంతంలోనే ఎక్కడో ఒకచోట ఉంటానని కూడా తెలుసు,
అయినా అతను అదేరోజు సీతమ్మవారి వద్దకు వచ్చాడు. ఆ రోజు గడి
స్తే నేను మీ సన్నిధికి చేరుకుంటానని అతనికి తెలుసు. అందుకని
నేనుండగానే,నా యెదుట అమ్మవారిని ఏవో కారుకూతలు కూయాలని
అవి నేను వినాలని, అవి మీకు విన్నవించాలని, వీలున్నంత తొంద
రలో మీరు వెళ్ళి అతనిని చంపాలని, అతను మీ చేతిలో చావాలని
అతని కోరికయినట్లు నా కనిపించింది.

నేను చెట్టు మీద ఉన్నాను. మండోదరితో సహా ఎంతోమం
దిని వెంటబెట్టుకొని సీతమ్మ వారి వదకు వచ్చాడు. అందరి ముందు
నా దానవుకా, మండోదరి, మిగతా స్త్రీలతో నీకు సేవలు చేయిస్తాన
న్నాడు. అమ్మవారు తన ధోరణిలో తాను సమాధానమిచ్చింది. నరుకు
తానని లేచాడు. మండోదరి అడ్డుపోయింది. మరల గడువుపెట్టి వెళ్ళి
పోయాడు.

రావణుడు మరులుగొన్నవాడయితే ఇంతమందిని తీసుకురాడు.
నేనున్నట్లు తెలిసికూడా ఇలాంటి మాటలు నా సమక్షంలో అమ్మగారి

ననడు. అందుచేత అతను మీ చేతిలో చావాలను కోరికతో, విధిలేక అమ్మవారిని తీసుకెళ్ళాడుగాని, ఆమె మీద మోజుతో గాని, మీతో శత్రుత్వం పెట్టుకోవాలని కాదు. ఆమె మోజుతోనే పర్ణశాల వద్దకు వచ్చి యుంటే లంకలోకి ప్రవేశించకముందే, ఈ మధ్యలోనే చావో, బ్రతుకో తేల్చుకొనేవాడు. లేదా లంకలోనయినా తేల్చుకునేవాడు. అతని ఉద్దేశ్యం అది కాదు. అమ్మవారిని తాకితే తగులబడిపోతాననే భయంతో ఆమె జోలికి పోలేదనవచ్చు. "కామాతు రాణాం నభయం, నలజ్జా" అన్నట్లుగా, ఆ సమయంలో అతనికి ఇలాంటి విషయాలు ఆలోచించుబుద్ధియే ఉండదు. కాలిపోతున్నా దీపపు పురుగు, ఆ మంటనే కోరుకుంటున్నది గదా!

ఆఖరుకు నాకు లంకలో రావణాసురుని చూచి మాట్లాడిన తరువాత అర్ధమయినదేమంటే, అతను పుట్టినది బ్రాహ్మణ వంశంలో, ప్రేమిస్తున్నది క్షత్రియ సంజాతను. బ్రాహ్మణుల సంఖ్య తక్కువ, నిష్టానియమములు వారి కెక్కువ. లోకనిందకువెరుస్తారు. పాపపుణ్యాల మీద, స్వర్గ నరకాలమీద, వేదవేదాంగాల మీద అనేక ధర్మ కార్యాలమీద ఎంతో మక్కువ వారికి వుంది. ఆ నమ్మకమే వారికి లేకపోతే, ప్రాతఃకాల సమయంలో అక్కడ ప్రతి యింట భగవత్స్మరణ జరుగుతూ ఉండదు. ప్రతి యింటా ఉదయ, సాయంకాలసంధ్యలలో జపాలు చెయ్యరు.

మద్యపాన మత్తులైన బ్రాహ్మణుడు, ఆ మత్తులో కూడా అలవాటు ప్రకారం కృష్ణా, రామా, అనుకొంటూనే మద్యం సేవిస్తాడు, అందుచేత రావణాసురునిలో బ్రాహ్మణ లక్షణాలు మస్తుగా ఉండబట్టే సీతమ్మ తల్లి జోలికి పోకుండా, మీరాక కెదురు చూస్తున్నాడు. బ్రాహ్మణులైనవారు బ్రాహ్మణులు చేయు యజ్ఞయాగాదులను ధ్వంసం చేయడమేమని అనవచ్చు. ఈయన రాక్షసబ్రాహ్మణుడు.

రామచంద్రా! వీలున్నంత తొందరలో మన మందరమక్కడకు వెళ్ళి, రావణాసురుని, వాని పరివారాన్ని చంపితే, రావణుడు, ఆతని అనుచరులు లేకుండాపోతారు. ఇక మిగిలినలంక, లంకలోని ప్రజలు, సిసలైన భక్తులు మాత్రం మిగులుతారు. ఇంతటితో సురాసురుల పరిష్కారాలు మీకు తప్పి, మీరు దైవనిర్ణయం ప్రకారం మీ పనులు మీరు చేసికోడానికి, భార్యాభర్తలు కడుపులో నీళ్ళు కదలకుండా చల్లగా, ఎడబాటులు లేకుండా కాపురం చేసుకుంటూ ఉండడానికి వీలుంటుంది.

హనుమంతుడు ఆనవాలుగా సీతమ్మవారిచ్చిన జడపిళ్ళను శ్రీరామచంద్రునకిచ్చాడు. శ్రీరాముడు దానిని ఆనందంగా హృదయానికి హత్తుకున్నాడు. అప్పుడు ఆంజనేయుడు–"ప్రభూ! లక్ష్మణుని సహితంగా నాథుని కాళ్ళు పట్టుకొని మీరు దీనబంధువులు, శరణాగత రక్షకులు, దుఃఖితుల దుఃఖాలను దూరం చేయువారు, నేను మనసా, వాచా, కర్మణా మీ చరణములందాసక్తిగల దానిని, నేనేమి అపరాధం చేశానని నన్ను వదలిపెట్టి ఉన్నారు. అయితే నా పొరపాటు కూడా లేకపోలేదు. అదేమంటే, మీ ఎడబాటు కాగానే, నా ప్రాణాలను వదలక పోవటమే. ప్రభూ! ఈ యపరాధము నాదికాదు, నా కళ్ళది. ప్రాణాలు పోకుండా అవి అపుతూన్నాయి. వాటికి మీ దర్శనమయిన తరువాత పోవనివ్వాలని ఉన్నట్లుంది.

మీ వియోగం అగ్నిలాగా, శరీరం దూదిలాగా, శ్వాసగాలిలాగా వుంది. క్షణంలో నా శరీరం మాడిపోవడానికి తగిన అగ్ని నా శరీరంలోనే వుంది, కాని నాకండ్లు, మీ దర్శనం చేసికోవాలనే ఆశతో తెంపులేకుండా నీళ్ళు కారుస్తున్నాయి. ఆ కన్నీళ్ళు నా శరీరాన్నంతటిని తగులబడిపోకుండా తడుపుతున్నాయి." అని సీతమ్మ అన్నమాట

లు చెప్పి, "దయానిధీ! ఇలా సీతమ్మ తల్లి మీకు చెప్పమంది. సీతమ్మకు ప్రతిక్షణం కల్పంతో సమానంగా గడచిపోతున్నది. ప్రభూ! మీరు తొందరగా వెళ్ళి మీ భుజబలంతో ఆ రాక్షసుల సమూహాన్ని నాశనం చేసి సీతమ్మను తీసికొని రండి." అన్నాడు హనుమంతుడు.

సీత దుఃఖాన్ని విని, శ్రీరాముని కన్నులనుండి కన్నీళ్ళు జల జల రాలాయి. "మనసా, వాచా, కర్మణా, నా ఆశ్రయమున్నవారికి స్వప్నంలోనయినా ఆపదలు వస్తాయా?" అన్నాడు శ్రీరాముడు.

"ప్రభూ! మిమ్మ స్మరించని సమయంలో ఆపదలు వస్తుంటాయి. ఆపదలనుకొన్న రాక్షసులకు చింతలేమిటి? మీకు శత్రువులుగా కాలం గడుపుతున్న రాక్షసులను జయించి సీతమ్మ వారిని తీసుకరండి."

"హనుమా! విను, నీలాంటి ఉపకారి, దేవతలలో మానవులలో మునులలో లేదా శరీరం దాల్చిన ఎవ్వరిలోనూ లేరు. నా మనస్సు కూడా నీ మనస్సుతో సమానమైనది కాదు."

"హనుమంతా! రావణుని ద్వారా రక్షించబడుతున్న లంక లోని ఆ బలవత్తరమైన కోటను నీ వెలా తగులబెట్ట గలిగావు" అని అడిగాడు శ్రీరామచంద్రుడు.

ప్రభువు సంతోషంగా ఉండడం గ్రహించిన హనుమంతుడు- "ప్రభూ! వానరులలో, ఒక కొమ్మమీద నుండి మరొక కొమ్మమీదకు దూకగల బలం మాత్రమే వుంటుంది. నేను సముద్రం దాటి వెళ్ళి, బంగారు నగరమైన లంకను తగులబెట్టినా, రాక్షసులందరిని చంపినా అశోకవనాన్ని ధ్వంసంచేసినా, ప్రభూ! ఆ పనులన్నీ నా బలంతో జరిగినవి కావు, మీ దయ, ప్రతాపాలవల్ల జరిగాయి. ఇందులో నా గొప్పతనమేమీ లేదు.

ప్రభూ! మీకు యిష్టమున్న పనులు చేయడంలో బాధలేమీ

అడ్డురావు. మీ ప్రతాపంవల్ల దూది అగ్నిని భస్మం చేయగలదు. కాదనుకున్న పని కూడా అయితీరుతుంది.

ప్రభూ! దయవేసి మీరు నాకు మీ యందు సంపూర్ణ సుఖాలను యిచ్చి, నిశ్చల భక్తిని ప్రసాదించండి." అని హనుమంతు డనగానే-"పరమేశ్వరుడు పార్వతీ! హనుమంతుని అమితమైన, సున్నితమైన పలుకులు విని శ్రీరామచంద్రుడు 'అలాగే' నన్నాడు.

"పార్వతీ! రామచంద్రుని స్వభావాన్ని ఎరిగున్న వానికి ఆయనను స్తుతించడం తప్ప మరొకటేదీ నచ్చదు. ఈ కథను మనస్సు కెక్కించుకున్న వానికి రామచంద్రుని చరణములయందు భక్తి ప్రాప్తిస్తుంద'న్నాడు శివుడు.

ప్రభువు మాటలు విని "దయగలవాడు, ఆనందాన్ని కలుగజేయువాడు అయిన శ్రీరామచంద్రుని జయమే జయముగుగాక" అన్నారు వానరులు.

రామచంద్రుడు సుగ్రీవుని పిలిపించి-"ఇప్పుడు లంకకు వెళ్ళడానికి ప్రయాణం సిద్ధం చేయించు, ఇంకా ఆలశ్యం చేయవలసినపని లేదు. తొందరగా వానరులకు ఆజ్ఞ యివ్వు అన్నాడు.

రాముడు, రావణుని వధించడానికి సిద్ధమయ్యాడన్న సంగతి తెలిసికొని దేవతలు తమతమలోకాలకు వెళ్ళిపోయారు. సుగ్రీవుడు వెంటనే వానరులను పిలిపించాడు. సేనాపతులందరు వచ్చారు. వారి బలాన్ని గురించి చెప్పపనిలేదు వారంతా వచ్చి శ్రీరామచంద్రుని చరణకమలముల వద్ద తలలు వంచుకున్నారు. మహాబలమున్న ఎలుగు బంట్లు, వానరులు బొబ్బలు పెడుతున్నారు. శ్రీరామచంద్రుడు వానరుల సైన్యాన్ని చూచి, వారి మీద కృపాదృష్టి ఉంచాడు.

శ్రీరామచంద్రుని కృపాబలమును పొంది, వానరులు రెక్కలు

న్న కొండలయిపోయూరా, అన్నట్లున్నారు. శ్రీరామచంద్రుడు సంతో షంగావెళ్ళాడు. ఆయన వెళ్ళినప్పుడు అనేకమైన శుభశకునాలయాయి.

శ్రీరామచంద్రుని కీర్తి, శుభాలు కలిగించేటటువంటివి. ఆయన ప్రయాణం చేయునపుడు శుభశకునాలు కావడం ఒక లీల మాత్రమే. ప్రభువు ప్రయాణ మవుతున్న విషయం సీతమ్మకు కూడా తెలిసింది. అక్కడెక్కడో వున్న సీతమ్మకు ఎలా తెలిసినదంటే, ప్రభువు వస్తు న్నందుకు ఆమె ఎడమ భాగం అదరటం మొదలిడింది.

సీతమ్మకు అయ్యే మంచి శకునాలన్నీ. రావణునకు చెడు శకు నాలుగా మారిపోతున్నాయి. సేనలు బయలుదేరాయి. ఆ సేనలను గురించి వర్ణించడం ఎవరి తరం కాదు. అంతుతేలని వానరులు, ఎలుగుబంట్లు పెద్దగా అరుస్తున్నారు.

గోళ్ళే వాళ్ళ ఆయుధాలు. కొందరు వృక్షాలు తీసికొని, మరి కొందరు పర్వతాలు పుచ్చుకొని, భూమిమీద, ఆకాశాన ఎవరి యిష్ట మొచ్చినట్లు వారు వెళుతున్నారు. వారు సింహనాదం వేస్తున్నారు. దిక్కులందున్న ఏనుగులు కంగారుగా ఘీంకరిస్తున్నాయి.

భూమి కంపించిపోతూవుంది, కొండలు వణికిపోతున్నాయి. సముద్ర మల్లకల్లోల మయిపోతూ వున్నది. ఇప్పుడన్ని కష్టాలూ ఈ డేరబోతున్నాయని, గంధర్వులు, దేవతలు, మునులు, నాగులు, కిన్నరులు ఎంతో ఆనందపడుతున్నారు. కోట్లమంది బలవంతులైన వానరులు అటుఇటు పరుగులు తీస్తూ అరుస్తున్నారు. "అమిత బల పరాక్రమములుగల అయోధ్యాపతికి శ్రీరామచంద్రునికి జై" అంటూ ఆయన గుణగణాలను పొగడుతూ ఉన్నారు.

ఆదిశేషుడు కూడా ఈ అంతు తెలియని సైన్యాన్ని, బరువు ఎక్కువయినందున మోయలేకపోతున్నాడు. మాటిమాటికి ఆ సైన్యా లను చూడాలని మోజుపడుతున్నాడు ఆదిశేషుడు, ఆ కారణంచేత

గట్టి వీపు గల తాబేటిని మాటి మాటికి తన దంతాలతో పట్టుకుంటు న్నాడు. ఆదిశేషుడిలా చేస్తున్నప్పుడు ఎంతో వెలిగిపోతున్నాడు. రాముని ప్రయాణం ఎంతో చక్కగా సాగిపోతున్నదన్న పవిత్రకథను ఆదిశేషుడు తాబేటి వీపు మీద తన దంతాలతో వ్రాస్తున్నాడా, అన్న ట్లున్నది.

ఈ విధంగా కృపకు ఆలవాలమైన శ్రీరామచంద్రుడు వెళ్ళి సముద్రపు టొడ్డున ఆగాడు. బలశాలురైన వానరులు, ఎలుగుబంట్లు అటుఇటు తిరిగి పండ్లు తింటున్నారు.

అక్కడ హనుమంతుడు లంకను తగులబెట్టి వచ్చినప్పటినుంచి లంకలోని రాక్షసమూక బెంబేలెత్తి పోతున్నది. ఇప్పుడిక రాక్షస కులాన్ని రక్షించే ఉపాయంలేదని తమతమ యిండ్లలో కూర్చొని, దూతను గురించి వర్ణించుటే శక్యముగానప్పుడు, స్వయంగా ఆదూత ప్రభువే వస్తున్నప్పుడు పట్టణానికి మేలెలాజరుగుతుంద'ని రాక్షసు లందరు అనుకుంటున్న విషయం మండోదరికి తెలిసి చాలా బాధ పడింది-

ఆమె ఏ కాంతంలో భర్తపాదాలను తాకి, చేతులు జోడించి- "నాథా! శ్రీరామునితో వైరము మాని, మనకు మేలు కలుగజేయు నేను చెప్పు విషయాలు విను. ఆనాడు శ్రీరాముని దూతచేసి వెళ్ళిన పనిని తలచుకుంటే, రాక్షసస్త్రీల గర్భాలలోని పిండాలు జారి క్రింద పడిపోతున్నాయి. నాథా! నీవు లంకకు, లంకలోని ప్రజలకు మేలు కలుగడానికి దయచేసి, ఏ మంత్రినయినా పిలిపించి, అతనితో ఆయన భార్యనిచ్చి ఆయన వద్దకు పంపించు.

"నాథా! నీ కమల వనరూపమైన కులానికి సీత దుఃఖకరమైన చలికాలపు రాత్రిలాంటి దయి కూచుని వుంది. నా మాట విను, సీతను పంపని యెడల బ్రహ్మ, ఈశ్వరులు కూడా నీకు మేలు చేయలేరు.

శ్రీరాముని బాణాలు పాములగుంపయితే, రాక్షసులు కప్పల మందలాంటివారు. ఆ పాములు ఈ కప్పలను మ్రింగివేయకముసుపే నీవు నీ మొండిపట్టు వదలి ఏదైనా ఉపాయమాలోచించు" అనిఎంతో వినయంగా చెప్పింది.

మండోదరి పలుకులు విని, ప్రపంచంలో పేరొందిన, గర్వపోతు అనిపించుకొన్న రావణుడు నవ్వి-"నిజంగా స్త్రీల స్వభావం చాలా పిరికిది. శుభం కలుగబోతున్నప్పుడు కూడా భయపడుతున్నావు. నీ మనస్సు చాలా బలహీనమైనది. ఒకవేళ వానరసైన్యం రావడమే నిజమైతే, రాక్షసులు వారిని తిని తమ జీవితాలు గడుపుకుంటారు. నన్ను చూచి దిక్పాలకులు కూడా వణికిపోతూ ఉంటే, నా భార్యవయిన నీవు భయపడుతున్నావు. నేనేమి చెప్పాలి? ఇది చాలా విచిత్రమైన విషయం-" అని ఆమెను నవ్వుతూ కౌగలించుకొని ఎంతో ప్రేమతో సభలోకి వెళ్ళాడు. తన భర్తకు బ్రహ్మ వ్యతిరేకమయినాడని మండోదరి మనస్సులో విచారించసాగింది.

రావణుడు సభలో కూర్చొనగానే వానరసైన్యం సముద్రపు టవతలి ఒడ్డుకు చేరుకున్నట్లు తెలుసుకున్నాడు. అప్పుడతను మంత్రులతో తగిన సలహాయివ్వ'మని కోరాడు. అప్పుడువారు నవ్వి-

"శాంతంగా ఉండండి. మీకు దేవతలను, రాక్షసులను జయించినప్పుడు కూడా పెద్దశ్రమ అనిపించలేదు. ఇప్పుడు ఈ మానవులు, వానరుల లెక్కేమిటి? మంత్రులు. వైద్యులు, గురువులు భయలోభాలతో అసలు సంగతులు చెప్పకుండా, దాచితే రాజ్యం, శరీరం, ధర్మం- ఈ మూడూత్వరగా నాశనమయిపోతాయి.

మంత్రులు ఎదురుగా పొగడుతున్నారు. ఆ సమయంలోనే విభీషణుడు "సోదరా! నాకు తోచినట్లుగా, నీ మేలును దృష్టిలో పెట్టుకొని మాట్లాడుతాను. నీకు మేలు జరుగాలని, నీవు కీర్తిని పొందాలని,

ప్రజలతో నీవు మంచి అనిపించుకోవాలని, సుఖంగా జీవించాలని అను కున్నట్లయితే, ప్రభూ! పరాయిస్త్రీ ముఖాన్ని పవిత్ర చంద్రునితో సమా నంగా చూడటం మానెయ్యి. పదునాలుగు లోకాలకు ప్రభువయినా, ప్రతిప్రాణితో వైరం పెట్టుకొని ఎంతో కాలం ఎవ్వడూ బ్రతుకలేడు. ఎంతో గుణవంతుడు. నేర్పరి అయినా కూడా కొంచెం లోభి అయితే అతనిని ఎవ్వరూ నమ్మరు, అతను ఎవ్వరికీ నచ్చడు.

ప్రభూ! కామ, క్రోధ, గర్వ, లోభాలన్నీ నరకానికి త్రోవలు. వీటిని వదలి శ్రీరామచంద్రుని చరణాలను స్తుతించండి. అలాగా భక్త శిరోమణులు చేస్తున్నారు.

ప్రభూ! రాముడు మానవులకు మాత్రమే రాజు కాడు, ఆయన ప్రపంచానికే రాజు, యమునకు యముడు, కాలానికి కాలుడు. ఆయన పరబ్రహ్మ, ఆయనకు రోగాలుండవు, జన్మమరణాలుండవు. అంతటా వ్యాపించివున్నవాడు, అపజయమెరుగనివాడు, ఆయనకు ఆది అంతాలు లేవు.

గోవులకు, బ్రాహ్మణులకు, దేవతలకు మేలు చేయాలను ఉద్దే శ్యంతో మానవుడుగా పుట్టాడు. ఆయన భక్తులకు ఆనందాన్నిచ్చి వాడు, దుర్మార్గుల గుంపును గుల్లచేయువాడు, వేదాలను, ధర్మాలను రక్షించేవాడు, అలాంటివానితో వైరముమాని ఆయనకు నమస్కారం చెయ్యి. ఆయన శరణన్న వారిని క్షమించి కాపాడుతాడు. ప్రభూ! ఆ ప్రభువుకు సీతమ్మను ఒప్పగించండి. కారణం లేకుండా కనికరించి దుఃఖాలను మాపి, సుఖాలను కలిగించు రాముని స్మరించండి.

ప్రపంచానికే శత్రువయినవాడు పాపాత్ముడు అయినా వచ్చి శరణన్నాడంటే, ప్రభువు శ్రీరామచంద్రుడు అతనిని వదలక తన సాన్నిధ్యంలో వుంచుకుంటాడు. ఆయన పేరే మూడు రకాల తాపా లను నాశనం చేస్తుంటుంది. సోదరా ఆ ప్రభువే మానవరూపంతో

ఉన్నాడని తెలిసికో.

దశకంఠా! నేను మరల మరల మీ పాదాలు పట్టుకొని విన యంగా బ్రతిమలాడుకుంటున్నాను, మాన, మోహ, అహంకారాలను వదలి అయోధ్యాపతి శ్రీరామచంద్రుని నామస్మరణ చెయ్యి" అని అన్నాడు.

ముని పులస్త్యుడు తన శిష్యుని ద్వారా విభీషణుడు చెప్పినట్లు చేయమని కబురంపాడు. మాల్యవంతుడను చాలా బుద్ధిగల మంత్రి విభీషణుడు చెప్పినది సబబుగా ఉందని అనడమేగాక-"మీ సోద రుడు విభీషణుడు నీతికి ఆలవాలము. అతను చెప్పినది నీ మన స్సులోకి ఎక్కించుకో"-అన్నాడు.

రావణుడు వీరందరి మాటలన్నీ ఇప్పటివరకు వింటూ కోప మంతా మనస్సులో దిగమ్రింగుకొని ఒక్కసారిగా మండిపడి-"ఈ మూర్ఖులిద్దరు శత్రువుగొప్పలు చెబుతున్నారు. ఎవరక్కడ? వీరిని అవతలకు పంపండి." అనేసరికి స్వాభిమాని అయిన మాల్యవంతుడు తన యింటికి వెళ్ళిపోయాడు, విభీషణుడు మళ్ళీ చేతులు జోడించి చెప్ప నారంభించాడు-

"అన్నయ్యా! మంచి గుణాలు, చెడ్డగుణాలు అందరిలోనూ ఉంటాయి. మంచి గుణాలున్నచోట అన్నివిధాలయిన సాధన సంప త్తులుంటాయి. చెడ్డ గుణాలున్న చోట, ఆపదలే వివరకు దాపురిస్తుం టాయి అని వేదాలు, పురాణాలు చెబుతున్నాయి. మీ హృదయంలో చెడ్డ గుణాలు మాత్రమే ఉన్నాయి. మీరు మంచిని చెడు అనుకుంటు న్నారు, శత్రువును మిత్రుడను కుంటున్నారు. సీత రాక్షసులకు కాళ రాత్రిలాంటిది. అలాంటి ఆమె యందు మీరు మరులుగొని వుం డడం మంచి కాదు.

అన్నయ్యా! నీ కాళ్ళు పట్టుకొని బ్రతిమలాడుకుంటున్నాను. నా

మాట విని సీతను శ్రీరామచంద్రుని కొప్పజెప్పండి. దాని వలన మీ కెంతో మేలు జరుగుతుంది." కాని ఆయన మాటలు వింటుంటే రావణాసురుని శరీరం కోపంతో ఊగిసలాడిపోతూంది. ఆఖరుకు కోపాన్ని అపుకోలేక. "ఓరీ, మూర్ఖుడా! నీ చావు దగ్గరకు వచ్చింది. నా తిండి తిని బ్రతికే నీకు శత్రు పక్షం యిష్టంగా వుందా? దుష్టుడా! నేను నా భుజబలంతో ప్రపంచంలో జయించని రాజ్యాలు, రాజులు లేరని ఎందుకు చెప్పవు? నీవు నా నగరంలో వుండి నా శత్రువుల యెడ ప్రేమ ఒలకబోస్తున్నావు. వాళ్ళ దగ్గరకే వెళ్ళి, వాళ్ళకే నీతులు నేర్పు-" అంటూ విభీషణుని కాలితో తన్నాడు. అంత జరిగినా విభీషణుడు మాటిమాటికి అతనికి హితవు చెప్పడం మానలేదు. అప్పుడు పార్వతితో శివుడన్నాడు-"పార్వతీ! బుద్ధిమంతులు చెడు చేసిన వారికి కూడా మంచే చేస్తూంటారు, అదే వారిలోని గొప్పతనం".

విభీషణుడు అన్న రావణుడు తన్నినా, పొమ్మన్నా కోపం తెచ్చుకోకుండా, శాంతంగా-"అన్నయ్యా! మీరు నాకు తండ్రితో సమానులు, మీరు నన్ను తన్నినా నాకేమీ బాధలేదు. పెద్దవారు చిన్నవారిని మందలించడం పొరపాటేమీకాదు, కాని ఆఖరిసారిగా చెబుతున్నాను. "శ్రీరాముని తలచుకున్నందువల్ల మీకు మేలు జరుగుతుంది"- అంటూ తన మంత్రితో సహా ఆకాశమార్గంలోకి వెళ్ళి అందరికీ వినబడేటట్లుగా "శ్రీరాముడు ప్రతిజ్ఞను సత్యము చేయు ప్రభువు. మీ సభ కాలగర్భంలో కలసిపోవడానికి సిద్ధంగా వుంది. నేను రాముని సన్నిధికి వెళ్ళుతున్నాను, ఇలా వెళ్ళుతున్న దోషాన్ని నాకు అంటగట్టవద్దు."

అంటూ విభీషణుడు వెళ్ళగానే రాక్షసులందరు ప్రాణహీనులయి, మృత్యుముఖము చూడనారంభించారు. "పార్వతీ! బుద్ధిమంతు

లను అమర్యాదగా చూపిన వారి మంచి అంతా నాశనమయిపోతుంది' అన్నాడు శివుడు.

విభీషణుడు రావణుని వదలి వెళ్ళిన క్షణంనుండీ, ఆ అభాగ్యుని ముఖంలో కళలేదు. విభీషణుడు కళకళలాడుతూ మనస్సులో అనేకమైన కోర్కెలు కోరుకుంటూ శ్రీరామచంద్రుని వద్దకు వెళ్తూ- "భక్తులకు సుఖాన్నిచ్చు వానిని, తనకాలి తాకిడివల్ల అహల్యను రాతి నుండి స్త్రీగా మార్చిన వానిని,దండక వనాన్ని పవిత్రం చేసిన వానిని, సీత హృదయంలో స్థిరంగా వున్న వానిని, కపటపు లేడి వెంట పరుగెత్తుకు పోయిన వానిని, శివుని హృదయ రూపమైన సరోవరంలోని కమలంలాంటి వానిని, భరతుడు మనసారా తలదాల్చిన పాదుకల వాని చరణకమలాలను నా అదృష్టంచే కన్నులారా చూస్తాను-"అని మనస్సులో అనుకోనారంభించాడు.

# 26

విభీషణుడు ఇలా అనుకుంటూ శీఘ్రంగా శ్రీరామచంద్రుని సేన ఉన్న చోటికి వచ్చాడు. అతనిని చూచి, ఇతను శత్రువుల దూత అయి వుంటాడని వానరులంతా అనుకుని, అతనిని అక్కడనే ఆపి, సుగ్రీవుని వద్దకు వెళ్ళి, సమాచారమంతా వినిపించారు. సుగ్రీవుడు రాముని వద్దకు వెళ్ళి-''రామచంద్రా! రావణుని తమ్ముడు మిమ్మ కలిసికోడానికి వచ్చాడు"-అన్నాడు. ప్రభువు-"మిత్రమా! నీ ఉద్దేశ్యమేమిటి?" అన్నాడు. సుగ్రీవుడు-''ప్రభూ! రాక్షసుల మాయ ఏమీ తెలపికోలేము. ఇష్టమొచ్చిన రూపాలు మార్చుకొనగలరు, ఇతనెందుకు వచ్చాడో? బహుశా మన రహస్యం తెలిసికోడానికి ఈ మూర్ఖుడు వచ్చాడేమో! ఇతనిని కట్టి పడవేసి ఉంచడం మంచిదేమోనని పిస్తున్నది నాకు" అనగానే, రాముడు-''మిత్రమా! నీవు ఆలోచించినటు

జరుగటలో సందేహ మిసుమంతయూలేదు. కాని శరణుజొచ్చినవారి దుఃఖాలను దూరం చేయాలను నిర్ణయమున్న వానిని నేను" అన్నాడు. ప్రభువు అన్నమాటలు విని-"భగవంతుడు ఎంత శరణాగతవత్సలుడు" అని హనుమంతుడు ఎంతో సంతోషించాడు.

అంతట శ్రీరామచంద్రుడు-"ఏ వ్యక్తి, తన మేలు కొరకు శరణుజొచ్చి వచ్చిన వ్యక్తికి రక్షణ కల్పించడో, అతను నీచుడు, పాపాత్ముడు, అతనిని చూచినా పాపం చుట్టుకొంటుంది. వేలహత్యలు చేసిన పాపం నాకు చుట్టుకున్నా, శరణన్నవానిని వదలలేను. కోట్ల జన్మలలో పాపాలు చేసిన వారయినా, నా వద్దకు వచ్చి రావడంతోనే, ఆ పాపాలన్నీ దూరమయిపోతాయి. నన్ను స్మరించకపోవడం పాపుల లక్షణం. వారికి నా, నామోచ్చారణచేయడం యిష్టముండదు. ఆ రావణుని తమ్ముడు దుర్మార్గుడయి వుంటే నా వద్దకు రానేలేడు. మంచి మనసుగలవారు, పరిశుద్ధ హృదయులు మాత్రమే నన్ను చూడ గలుగుతారు. నాకు కపటమూ, ద్వేషము నచ్చవు. "సుగ్రీవా! నిజం గా అతనిద్వారా మన రహస్యాలు తెలిసికొని రమ్మని రావణుడు పంపితే వచ్చినా, మనకేమీ భయమూ, బాధాలేదు. ఎందుకంటే ప్రపంచంలోని రాక్షసుల నందరిని లక్ష్మణుడు ఒక్క క్షణంలో మట్టుబెట్టగలడు. విభీషణుడు ఒకవేళ భయంతో. వచ్చి యుండి, నన్ను కాపాడమని కోరితే, తప్పకుండా అతని రక్షణ బాధ్యత నేను నా ప్రాణాలతో సమానంగా, వహిస్తాను. అతను ఏ స్థితిలోని వాడైనా నా వద్దకు తీసికొని రమ్ము. అని నవ్వుతూ అన్నాడు. అంగదుడు, హనుమంతుడు, మిగతా వానరులు. కృపాసింధు, శ్రీరామునికి జయము పలికి వెళ్ళిపోయారు.

వానరులందరు విభీషణుని మర్యాదగా దయాసాగరుడయిన శ్రీరాముడున్న తావుకు తీసుకెళ్ళారు. విభీషణుడు దూరాన్నుంచే

నేత్రాలకు ఆనందాన్ని కలిగించు సోదరులిద్దరిని చూచాడు. అందానికి ఉనికి అయిన శ్రీరామచంద్రుని చూచి ఖంగుతిన్నాడు. జంకుతో రెప్పార్పకుండా చూస్తూ ఉన్నాడు విభీషణుడు.

శ్రీరాముని భుజాలు పొడవుగా ఉన్నాయి. నేత్రాలు ఎర్రకమలాల్లాగా ఉన్నాయి. శరణుజొచ్చిన వాని భయాన్ని దూరం చేయు నీలవర్ణఛాయలో ఉన్నాడు.

సింహం భుజాలలాంటి భుజాలు కలవాడు, విశాలహృదయుడు వేల మన్మధులను ఆకర్షించగల అందం ఆయనకు వుంది. ఇలాంటి స్వరూపాన్ని చూచి విభీషణుడు పులకించిపోయాడు. నేత్రాల వెంట కన్నీళ్ళు జారాయి, కొంతసేపటికి ధైర్యం తెచ్చుకొని-"ఓ దేవతల రక్షకుడా! నేను రాక్షసవంశంలో పుట్టాను. రావణుని తమ్ముడను, నాది కొంచెం చెడు రక్తంతో కూడిన శరీరం, పాపాలు చేయడం నా పుట్టుక తీరు, ఆ పాపాలు చేయడం నా కెంత యిష్టమంటే, గుడ్లగూబకు అంధకార మిష్టమయినంత.

సంసారంలోని దుఃఖాలను దూరం చేయు ప్రభూ! మీ కీర్తి నా చెవులతో విని మీ వద్దకు వచ్చాను. శరణాగతులకు సుఖం కలిగించేవారు, దుఃఖపడుచున్న వారి దుఃఖాలను దూరం చేయువారు మీరు. నన్ను కూడా రక్షించండి ప్రభూ!-" అంటూ విభీషణుడు ఆయనకు సాష్టాంగ నమస్కారం చేస్తూ ఉండడం చూచి శ్రీరామచంద్రుడు ఎంతో సంతోషంగా అతనిని లేవదీశాడు. విభీషణుని దీనవచనాలు ఆయనకు బాగా నచ్చాయి. ఆయన తన విశాలమైన భుజాలతో అతనిని హృదయానికి హత్తుకున్నాడు, సోదరుడయిన లక్ష్మణునితో కూడి మరల కౌగలించుకొని, విభీషణుని దగ్గర కూచోబెట్టుకొని-

"లంకేశా! పరివారసహితంగా మీ క్షేమ సమాచారాలు చెప్పు,

నీ నివాసం చెడ్డస్థలంలో వుంది. మిత్రమా! నీవు దుష్టుల మధ్యలో నివసిస్తున్నావు గదా, నీ ధర్మాన్ని ఎలా నిర్వహించ గలుగుతున్నావు? నీవు నీతిమంతుడవని నేను ఎరుగుదును. నీవు నీతి శాస్త్ర కోవిదుడవు. మిత్రమా! నరకంలో ఉండడం కన్నా దుష్టుని స్నేహం భయంకర మైనది" అన్నాడు శ్రీరామచంద్రుడు.

"ప్రభూ! మీ చరణముల దర్శనంతో క్షేమంగానే ఉన్నా ము. మీరు నన్ను మీ దాసునిగా భావించి దయచూపారు.

శోకాలకు నిలయమైన కోరికల్ని వదలి శ్రీరామచంద్రుని స్మరణ చేయని వారికి స్వప్నంలో కూడా శాంతి లభించదు. లోభ, మోహ, అభిమాన గర్వాలు మొదలైన దుష్టభావాలు హృదయాన్ని వదలిపోనంతవరకు, మీరు ఎవరి హృదయంలోను కోదండ పాణియై నివాసం చేయరు.

మోహం అనేది అంధకారంతో కూడిన రాత్రిలాంటిది, అది రాగద్వేషరూపంలో వున్న గుడ్లగూబలకు సుఖానిస్తుంది. ఆ మోహ రూపమైన రాత్రి, మీ ప్రతాప రూపమైన సూర్యోదయించే వరకు హృదయంలో నివసించి వుంటుంది.

ప్రభూ! మీ కమలముల వంటి చరణాలను చూచిన తరువాత అంతా క్షేమమే. నా భయాలన్నీ దూరమయిపోయాయి. కృపానిధీ! మీరు అనుకూలంగా ఉన్నంతకాలం సంసారంలోని దేహ, దైవ; భూ సంబంధమైన పాపాలు ఏమీ చేయలేవు.

నేను రాక్షసుడను, నా స్వభావము చాలా నీచమైనది. నేనెన్న డూ మంచి పనులు చేసి ఎరుగను. కాని మునులకు ధ్యానంలోకూడా ప్రభువు రూపం లభించదు. అలాంటి ప్రభువు స్వయంగా నన్ను సం తోషంతో హృదయానికి హత్తుకొనడం నా యదృష్టమనుకుంటున్నా ను. కృపాసాగరా! సుఖాలగనీ! బ్రహ్మ, శివుల ద్వారా సేవించబడు

పన్న మీ రెండు పాదకమలాలను నా నేత్రాలతో చూడగలిగాను. ఇలాంటి అదృష్టం నాకు లభించడం నేను నా పూర్వజన్మలో చేసి కున్న పుణ్యమనుకుంటున్నాను." అన్నాడు విభీషణుడు.

"మిత్రమా! కాకభుశుండి, మహేశ్వరుడు, పార్వతి కూడా ఎరిగి యున్న నా స్వభావాన్ని నీకు చెబుతున్నాను విను. ప్రాణి అయిన ప్రతివానికి వ్యతిరేకి అయిన వానిని కూడా, నా కగ్గరకు వచ్చి రక్షించ మని కోరినప్పుడు, అతను మదం, మోహం, ఇతర విధములయిన మోస, కపటాలను వదలివేసి నట్లయితే, నేను అతనిని బుద్ధిమంతునిగా భావించి పరిశుద్ధుని చేస్తాను. తల్లి, తండ్రి, సోదరుడు, పుత్రుడు, భార్య శరీరము, ధనము, ఇల్లు, మిత్రుడు, పరివారము వీరి యందు గల మోహరూపమైన దారాన్ని త్రెంచుకుని నా యందు మనస్సునుంచాలి. లోభి హృదయంలో ధనాశ కాచుకొని కూర్చున్నట్లుగా, కోరికలు, సంతోషం, శోకం, భయం, మొదలైన వాటిని దగ్గరకు చేరనివ్వని బుద్ధిమంతుని హృదయంలో నేను తప్పక నివసిస్తూంటాను. నీలాంటి బుద్ధిమంతులంటే నాకు చాలా ఇష్టం. నేను ఎవరో మానవజన్మయెత్త మంటే ఎత్తిన వాడను కాను. నా కిష్టంలేని పని చేయమని చెప్పువారు సృష్టిలో లేరు. అలా అని లోకానికి, లోకులకు నష్టంవచ్చు పనులు నేను చేయువాడను కాను.

సగుణోపాసకులయిన దేవుళ్ళను పూజించేవారు, ఇతరులకు మేలు చేయాలనుకునేవారు, నీతిమంతులు, నియమం తప్పనివారు, బ్రాహ్మణుల పాదముల యందు ప్రేమ ఉన్నవారు, నాకు ప్రాణంతో సమానమైన వారు.

లంకాధిపతీ! నీలో ఈ గుణాలన్నీ ఉన్నాయి. అందువలన నీవు నాకు చాలా ఇష్టుడవు" అని రామచంద్రుడన్న మాటలను విని వానర సమూహమంతా. "కృపాసింధు, రామచంద్రునికి జయము"

అనసాగింది,

అమృతోపమానమైన ప్రభువు వాక్కులు చెవులతో విన్నా విభీషణునకు తృప్తినివ్వడం లేదు. ఆయన మాటిమాటికి శ్రీరామచంద్రుని చరణ కమలాలను పట్టుకొంటున్నాడు, ఆ సమయంలో ఆయన హృదయంలోని ప్రేమను ఇంతింతనడానికి సాధ్యపడదు.

కృపానిధీ! శివుని మనస్సుకు యిష్టమైన పవిత్రమైన భక్తిని నాకు ప్రసాదించండి అని విభీషణుడు అనగానే, రాముడు. "అలాగే" అంటూ వెంటనే సముద్ర జలాన్ని తెప్పించి విభీషణునితో-"మిత్రమా! నేను చేయబోవు పని నీకు యిష్టం లేకపోయినా, నా దర్శనం ప్రపంచంలో వృథా అయిపోదు." అంటూ శ్రీరామచంద్రుడు విభీషణుని లంకకు రాజును చేశాడు. అప్పుడు ఆకాశం నుండి దేవతలు ధారాపాతంగా పూలవర్షం కురిపించారు.

రావణ క్రోధరూపమైన అగ్నికి, ఆయన మాటలు గాలిరూపమై, అగ్నిలో ఆజ్యం పోసి మంటలు రేపినట్లయింది. ఆ మంటలు విభీషణుని కాపాడి అఖండమైన లంకారాజ్యాన్ని ఒప్పగించాయి. రావణుడు తన తలలను సమర్పించిన తర్వాతనే శివుని వద్ద తాను కోరిన వరాలను పొందగలిగాడు. ఆ సంపదను శ్రీరాముడు విభీషణునకు చాలా తక్కువ వరాన్నిస్తున్నానే అను సందేహంతో ఇచ్చాడు.

ఇలాంటి దయగల ప్రభువును వదలి ఇతరులను సేవించు మానవులు తోకలేని పశువులతో సమానం. విభీషణుని భక్తునిగా భావించి రాముడు తన ఆప్తునిగా చేసుకొన్నాడు. ప్రభువు స్వభావం వానరులకు ఎంతగానో నచ్చింది.

సర్వము తెలిసినవారు, చీమనుండి బ్రహ్మవరకు వున్న కదలని కదిలేరూపాలు తన రూపమయముయినవాడు, అందరిలో నివసించు

వాడు, అందరికి దూరంగా కూడా ఉండేవాడు, ఏమీ పట్టించుకోని వాడు, రాక్షసకులాన్ని నాశనం చేయడానికి నరరూపమెత్తినవాడు, నీతిగా పాలించుటకు విభీషణునకు ఉపాయాలు చెప్పాడు. తరువాత-

''సుగ్రీవా, విభీషణా! పాములు, మొసళ్ళు, అనేక రకాలయిన చేపలతో నిండియున్న ఈ లోతైన సముద్రాన్ని దాటడం, ఎలా చూచినా కష్టమనిపిస్తున్నది.'' అనగానే విభీషణుడు-"శ్రీరామచంద్రా మీ బాణాలు వేల సముద్రాలను ఎండగట్ట గలుగుతాయి, అయినా లాంఛనంగా సముద్రుని అడగడం మర్యాదగా వుంటుంది.

ప్రభూ! మరొక సంగతి, సముద్రుడు మీకుల గురువు, పూర్వీకుడు, ఆయనే అన్ని ఉపాయాలు తెలియ పరుస్తాడు. అప్పుడు ఏ బాధా లేకుండా ఎలుగుబంట్లు,వానర సైన్యమంతా సముద్రంలో దిగిపో గలుగుతుంది, అని విభీషణుడన్నాడు.

"మిత్రమా! నీవు చాలా మంచి ఉపాయం చెప్పావు. భగవంతుని దయ వుంటే ప్రతి పని సానుకూలమవుతుంది. కాని, ఈ సలహా మాత్రం లక్ష్మణునికి నచ్చడంలేదు. లక్ష్మణుడు రాముని మాటలువిని విచారంతో ''ప్రభూ! భగవంతుని ఎలా నమ్మడం? మనస్సులో క్రోధం తెచ్చుకొని సముద్రాన్ని ఎండ గట్టించండి, ఈశ్వరుడు పిరికి వారికి మాత్రం సహాయకారి. సోమరి ఎల్లప్పుడు అన్నిటికి దేవుడే ఉన్నాడని తప్పించుకో ప్రయత్నిస్తుంటాడు'' అన్నాడు.

లక్ష్మణుని ఈ మాటలు విని శ్రీరామచంద్రుడు నవ్వి-"అలాగే చేద్దాం, ధైర్యంగా ఉండు " అని లక్ష్మణునికి నచ్చచెప్పి శ్రీరామచంద్రుడు సముద్రుని దగ్గరకు వెళ్ళి నమస్కారం చేసి ఒడ్డున దర్భలు పరచుకొని కూర్చున్నాడు. శ్రీరామచంద్రుడు. అప్పుడే విభీషణుడు శ్రీరామచంద్రుని దగ్గరకు రావడం, రావణుడు పంపిన దూత కూడా రావడం ఒకేసారి జరిగింది.

రావణుని దూతకపట వానరరూపం ధరించి అక్కడి విషయా లన్నీ తెలుసుకొన్నాడు. శ్రీరాముడు శరణాగతులను ప్రేమించువాడని గ్రహించి శ్రీరాముని గుణగణాలను, గొప్పతనాన్ని మనస్సులో పొగడు కొంటున్నాడు. కొంచెం సేపు తరువాత అతను స్పష్టంగానే రాముని గుణాలను పొగడాడు. అతను తన కపట వేషం సంగతి మరచిపోయా డు. ఇతను శత్రువు దూతయని వానరులు గుర్తించి, వానిని బంధించి సుగ్రీవుని వద్దకు తీసుకువచ్చారు. అప్పుడు సుగ్రీవుడు–"వానరులారా! ఈ రాక్షసుని ఎముకలు విరుగగొట్టండి." అనేటప్పటికి వానరులు పరుగెత్తుకొచ్చి అతనిని బంధించి సేనకు నలువైపుల త్రిప్పి బాదవా డారు. అతను దీనుడై అరుస్తూ ఉన్నాడు, కాని వానరులు అతనిని వదలలేదు. చివరికి అతను "నా ముక్కు చెవులు కోయవద్దు, అలా చేస్తే రాముని మీద ఒట్టు" అన్నాడు.

లక్ష్మణుడు ఇదంతా విని అందరిని పిలవాడు. ఆయనకు దయ గలిగినది. అతనిని విడిపించి–"ఈ పత్రం రావణుని కిచ్చి, చదువు కొనమన్నానన్ని ఆ మూర్ఖునితో సీతమ్మను మర్యాదగా ఒప్పజెప్పి శ్రీరాముని శరణావేడమన్నానని, అలా జరుగకపోతే నీ చావు దగ్గ ర కువచ్చిందని అన్నానని కూడా చెప్పు." అని చెప్పాడు.

ఆ దూత వేగంగా లక్ష్మణుని పాదముల వద్ద తలవంచి, రామ చంద్రుని గుణాలను గానంచేస్తూ, ఆయన యశస్సును గొప్పగా చెప్పు కుంటూ లంకలోకి ప్రవేశించి రావణుని పాదాలకు నమస్కరించాడు.

రావణుడు నవ్వి-"అరే. శుంతా నీ క్షేమము సంగతి ఎందుకు చెప్పవు? విభీషణుని పరిస్థితులు చెప్పు, అతని మృత్యువు దగ్గర పడు తున్నదిగదా! ఆ మూర్ఖుడు లంకను వదలి వెళ్ళాడు. ఆ దురదృష్ట

వంతుడు ధాన్యపు పురుగయిపోతాడు. అక్కడి ఆ వానరు ఎలుగు బంట్లసైన్యం సంగతులు చెప్పు.

దయగల సముద్రము మధ్యలో లేకుండా ఉండి ఉన్నట్లయితే ఈ పాటికి మునులను రాక్షసులు సుఖంగా తిని వుండేవారు. వారికి నేనంటే వచ్చేభయం. ఆ మునుల సంగతులేమిటి?

అసలు వారు నీకు కనపడ్డారా? లేక నా కీర్తి ప్రతిష్ఠలు చెవులతో వినగానే తిరిగి వెళ్ళిపోయారా? శత్రుసేనల బలం, సాహసం చెప్పవెందుకు? నీ మనస్సు ఇంత గందరగోళంగా ఎందుకుంది?" అన్నాడు

"ప్రభూ! మీరు దయతో నన్నడుగుతున్నట్లుగానే, నేను చెప్పేది కూడా కోపం తెచ్చుకోకుండా వినండి. మీ తమ్ముడు విభీషణుడు వెళ్ళి కలసినప్పుడే రామచంద్రుడు ఆయనను లంకకు రాజును చేశాడు. వానరులు నన్ను రావణ దూత అంటూ బంధించి అనేక రకాల బాధలుపెట్టారు. వారు నా ముక్కు చెవులు కోయబోయారు. శ్రీరాముని మీద ఒట్టు పెట్టేసరికి నన్ను వదిలివేశారు.

ప్రభూ! మీరు శ్రీరాముని సైన్యం పాటవం గురించి అడుగుతున్నారు. ఆ సైన్యము కోట్ల ముఖాలతోనైనా వర్ణించలేము. విచిత్రమైన ముఖాలవారు, విశాలమైన, భయంకరమైన వానరులు, ఎలుగుబంట్లు అనేక రూపాల్లో ఉన్నారు.

లంకను తగులబెట్టి, అక్షయకుమారుని చంపినవాని బలము, మిగతా వానరుల బలంకంటే చాలా తక్కువ. పెద్దపెద్ద పేర్లున్న యోధులున్నారు. వారిలో లెక్కలేనంత మంది ఏనుగులబలముల వారు. విశాలమైన శరీరాలుగలవారున్నారు, ద్వివిద, మయంద, నీల, గవ, మరియు బలములో మేటి జాంబవంతుడు మొదలైన వారందరు మహాబలవంతులు.

వానరులందరు సుగ్రీవునితో సమానమైన బలం కలవారు. వీరి లాగా ఇంకా కోటిమంది వానరులున్నారు. వారందరిని ఎంతవరని లెక్కపెట్టగలము? శ్రీరాముని దయ వలన వారిలో అంతు తెలియని బలముంది. వారు మూడు లోకాలను గడ్డిపోచలలాగా భావిస్తున్నారు.

దశముఖా! పద్దెనిమిదివందల వానరసేనా పతులున్నారని, ఆ సేనలో ఘిమ్మజయించలేని వానరుడు ఒక్కడు కూడా లేడని నా చెవ్రలారా విన్నాను. వారందరు క్రోధంతో చేతులకు తీటపుట్టినట్లుగా చేతులు రుద్దుకుంటున్నారు, కాని శ్రీరామచంద్రుడు ఆజ్ఞ ఇవ్వడం లేదు. వారు సముద్రాన్ని పాముల, చేపలతోసహా ఎండబెట్టగలసత్తా గలవారు. విశాలమైన పర్వతాలతో నింపి పూడ్చి వేయగల సమర్థులు.

రావణుని పిప్పిపిప్పి చేసి మట్టిలో కలిపివేస్తామని వానరులంతా అంటున్నారు. స్వభావసిద్ధంగా ఏ భయమూలేని వానరులు లంకను మ్రింగి వేస్తామంటూ బొబ్బలు పెట్టుచున్నట్లనిపించింది.

వానరులు, ఎలుగుబంట్లు అందరు శూరులు, వీరులు. ఇందుకు తోడుగా మామూలుగానే వారికి సహాయపడడానికి శ్రీరామచంద్రుడు ఉండనే ఉన్నాడు. రాజా! వారు కోట్ల యములనుకూడా యుద్ధంలో జయించగలరు.

ఇక రామచంద్రుని సాహసం, బలం, బుద్ధిని గురించి లక్షల మంది ఆదిశేషులయినా వర్ణించలేరు. ఆయన ఒకే ఒక్కబాణంతో వందల సముద్రాలను ఎండించగలరు. కాని నీతి వర్తనుడైన ఆయన మీ తమ్ముని ఉపాయమడిగాడు. మీ తమ్ముడు చెప్పిన ప్రకారం ఆయన సముద్రాన్ని త్రోవయిమ్మని కోరుతున్నారు. ఆయన దయా సాగరుడు" అంటూ దూత చెప్పిన విషయాలు విని పెద్దగా నవ్వి-

"ఇలాంటి బుద్ధిగలవాడు గనుకనే కోతులను సహాయకులుగా ఎంచుకున్నాడు. సాధారణంగా పిరికివాడైన విభీషణుని మాటలు విని

సముద్రుని పసిపిల్లలాగా మొండిపట్టుపట్టాడు, ఒక రకంగా ప్రతిమ లాడుకుంటున్నాడు. అరే, మూర్ఖుడా! నీవు అనవసరంగా అతనిని గురించి గొప్పగా ఎందుకు చెబుతున్నావు? శత్రువైన రాముని బుద్ధి బలము యొక్క లోతు నేను బాగా తెలిసికొన్నారాజంతా!

విభీషణుని లాంటి పిరికిపందను మంత్రిగా నియమించుకున్న వానికి ప్రపంచంలో జయమేమిటి? కీర్తేమిటి?" అని రావణు కనగానే దూతకు ఈ దుష్టుని మాటలువిని ఎంతో కోపం వచ్చి ఇదే సమయమను కొని ఉత్తరము బయటకు తీసి-ప్రభూ! రామచంద్రుని తమ్ముడు ఈ పత్రం వ్రాసి మీ కిమ్మని ఇచ్చాడు. దీనిని చదువుకొని మీ హృదయాన్ని చల్లబరచు కోండి." అన్నాడు.

రావణుడు నవ్వి పత్రాన్ని ఎడమచేత్తో తీసుకొని మంత్రిని పిలిచి చదివించాడు. అందులోని విషయం "అరే మూర్ఖుడా! రావణా, నీవు పనికిమాలిన కబుర్లు చెప్తూ, మనస్సును సంతోషపెట్టు కుంటూ, నీకులాన్ని సర్వనాశనం చేసికోబోకు. రామచంద్రునికి ఎదురు తిరిగి బ్రహ్మ, విష్ణు, శివుల అండకుచేరినా నీవు బ్రతికిబట్టకట్టి మన లేవు. నీమేకపోతు గాంభీర్యంలాంటి అభిమానాన్ని వదలి నీ తమ్ముడు విభీషణునిలాగా ప్రభువు యొక్క చరణకమలాలను ఆశ్రయించు. తుమ్మెదవయినా కా, లేదా దుష్టుడా! రాముని బాణరూపమైన అగ్నిలో నీ కుల సహితంగా దీపపు మిడత లాగా మాడిపోవు" అని వుంది.

పత్రములోని మాటలు విని రావణుడు మనస్సులో మాత్రం భయపడ్డాడు, కాని నవ్వి అందరిని పిలిపించి- "ఈ వ్రాతలు భూమి మీదపడిన మనుష్యుడు ఆకాశాన్ని తాకాలని ఆశపడడం లాంటివే కాక, ఒక చిరుతాపసి అయిన లక్ష్మణుని వాక్చాతుర్యం కూడా" అని నిర్లక్ష్యంగా అన్నాడు.

రాముని మాటలు విని శుకుడు-"ప్రభూ! పత్రములోని విష

యాలు నూటికి నూరు పాళ్ళ సత్యమైనవి. మీరు అభిమాన స్వభావాన్ని వదలి ఆలోచించండి. క్రోధాన్ని వదలి నా మాటలు వినండి. ప్రభూ! శ్రీరామునితో వైరము వదలివేయండి.

శ్రీరాముడు అన్నిలోకాలకు అధిపతి అయినప్పటికీ ఆయన స్వభావం చాలా సున్నితమైనది. మీరాయనను కలువగానే మీమీద ఎంతో దయచూపుతారు. మీ అపరాధాన్ని మనస్సులో ఉంచుకోనే ఉంచుకోరు. ప్రభూ! సీతమ్మను రామచంద్రునికి ఒప్పగించండి. నా మాటను కాదనకండి" అనే సరికిరావణుడు శుకుని ఒక్క తన్ను తన్నాడు. అతను కూడా రావణునికి నమస్కరించి, కృపాసింధువు, రాముడున్న చోటుకువెళ్ళి రామచంద్రునికి కథంతా వినిపించి ఆయన దయతో తన పూర్వ స్థితికి వచ్చాడు.

"పార్వతీ! ఆయన జ్ఞానవంతుడైన ముని, కాని అగస్త్యన మహా ఋషి శాపంవల్ల రాక్షసుడైనాడు. శ్రీరాముని చరణాలకు వంగివంగి మాటిమాటికి నమస్కరించి ఆ ముని తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడని శివుడు చెప్పాడు.

మూడురోజులుగడచిపోయాయి. కాని మూర్ఖత్వంతో సముద్రుడు వినయంగాను, మెత్తగాను చెప్పితే వినలేదు. శ్రీరామచంద్రుడు క్రోధంతో-"భయంలేకపోతే రుచియుండడు. లక్ష్మణా!ధనస్సు బాణాలు ఇవ్వు, నేను అగ్ని బాణంతో సముద్రాన్ని ఎండగట్టుతాను. మూర్ఖుని బ్రతిమలాడుట, కపటితో స్నేహం, పుట్టుకతోనే లోభి అయినవానికి నీతులు చెప్పడం, మోహ మమతలలో చిక్కుకొనియున్న మనుష్యులకు జ్ఞానానికి సంబంధించిన కథలు చెప్పడం, పరమలోభికి వైరాగ్య విషయాలు వర్ణించి చెప్పడం, కోపిష్ఠికి శాంతి వచనాలు వినిపించడం, కామ పిచ్చి వున్నవానికి ఈశ్వరుని కథలు చెప్పడం, సారంలేని భూమిలో విత్తనాలు నాటితే వచ్చుపంటలాంటిది" అని అంటూ ధన

స్సును ఎక్కుపెట్టాడు. ఈ పద్ధతి లక్ష్మణునకు బాగానచ్చింది. ప్రభువు ధనస్సు మీద అగ్నిబాణాన్ని ఎక్కుపెట్టేటప్పటికి, సముద్రుని హృదయంలో నిప్పులమంటలు వెలరేగాయి. సముద్రంలోని మొసళ్ళు, పాములు, చేపలగుంపులు గాబరాపడిపోయాయి. జీవాలన్నీ మాడిపోయాయి. ఇదంతా తెలిసికుని బంగారుపళ్ళెరంలో అనేక మణులను నింపుకొని, అభిమానం వదలి బ్రాహ్మణుని రూపంలో వచ్చాడు సముద్రుడు.

అప్పుడు కాకుభశుండి "గరుత్మంతా! ఎవరు ఎన్ని విధాల తడిపినా, అరటి, కోస్తేనేగాని ఫలాల నివ్వనట్లుగా, నీచుడు బెదరిస్తే తప్ప, బ్రతిమలాడితే వంగడు, అర్థంచేసికోలేడు" అన్నాడు.

సముద్రుడు గాబరాతో ప్రభువు పాదములుపట్టుకొని-"ప్రభూ! నా తప్పులను మన్నించు, ఆకాశం, అగ్ని, గాలి, భూమియను వీటి పనులు పుట్టుకతోనే జడములు, చురుకుదనం వీటిలో తక్కువ.

ప్రభూ! మీ ప్రోత్సాహంతో ఈ వస్తువులన్నింటిని మాయ ప్రపంచం కొరకు సృష్టించిందని గ్రంథాలన్నీ చెబుతున్నాయి. మీ ఆజ్ఞానుసారం నడచుకొన్నవారికి సుఖం కలుగుతుంది.

ప్రభూ! నాకు బుద్ధి వచ్చుపని చేశారు. నాకు చాలా మేలయిన పని యిది. కాని హద్దులు కూడా మీరు ఏర్పరచినవే "డోలు, పల్లెటూరి వ్యక్తి, హీనుడు, పశువు, స్త్రీ-ఈ అయిదుగురు కదలించనిదే కదలరు. అనగా, వీరిని వారివారికి తగినట్లుగా ప్రోత్సహిస్తూ ఉండాలి. లేదా కదలిస్తూ ఉండాలి. ఇక్కడ కొట్టడమంటే ప్రోత్సాహించడం, వాయించడం అనితులసీదాసుగారి భావమని నా వుద్దేశ్యం)

ఇలా సముద్రుడు అతి వినయంగా మాట్లాడడం విని, దయగల ప్రభువు నవ్వి "అయ్యా! వానరులు దాటిపోడానికి వీలు కల్పించు వాలు" అన్నాడు రామచంద్రుడు.

"ప్రభూ! నలనీలులను ఇద్దరు సోదరులున్నారు. వారు చిన్న తనంలో ఋషి ద్వారా ఆశీర్వాదం పొందారు. వారుతాకితే ఎంత బరువైన పర్వతమైనా, మీప్రతాపంతో సముద్రంలో తేలుతుంది. మీ గొప్పతనాన్ని మనస్సులో నుంచుకొని, నా బలాన్ని బట్టి నేనూ చేయగలిగినంత సహాయం చేస్తాను.

ప్రభూ! ఈ విధంగా, మీ కీర్తిని మూడులోకాల్లో ప్రశం సించుకొనునట్లుగా, సముద్రం మీద వంతెన నిర్మించండి. ఈ మీ బాణంతో నాకు ఉత్తరపుటొడ్డుకు దగ్గర ఉండే పాపాత్ముల గుంప యిన దుష్టులను చంపేయండి"

కృపగల శ్రీరామచంద్రుడు సముద్రుని మాటలు విని, అతని మనస్సును మరి మరి చికాకు పెట్టుచున్న దుష్టులను సంహరించేశాడు.

సముద్రుడు శ్రీరాముని అంతులేని పరాక్రమాన్ని,పౌరుషాన్ని చూచి సుఖ మనుభవించాడు. దుష్టుల స్థితిగతులన్ని వినిపించి, శ్రీరా ముని పాదములకు నమస్కరించి సముద్రుడు వెళ్ళిపోయాడు.

శ్రీరామునకు ఇలాశాంతంగా పని పూర్తికావడంతో ఎంతో ఆనందించాడు. ఈ చరిత్ర కలియుగ పాపాలకు దూరం చేసేదని తులసీదాసు గానంచేశాడు. శ్రీరామచంద్రుని గుణాలు సుఖాలగనులు, సంశయాలను, దుఃఖాలను నాశనం చేసేవి. అరే, మూర్ఖ మనసా? నీవు సంసారంలోని ఆశలు, అండలు వదలి నిరంతరం శ్రీరామ చంద్రుని గురించి గానం చెయ్యి.

శ్రీరామచంద్రుని గుణాలను చెప్పుకుంటుంటే, అన్ని సుఖ సంతోషాలు ప్రాప్తిస్తాయి. వీటిని ఆదరంగా విన్నవారు నౌక లేకుం డానే సంసారసాగరాన్ని దాటిపోగల్గుతారు.

తులసీ రామాయణం సుందరకాండం సమాప్తం

# 6. లంకా కాండము

మన్మథుని శత్రువైన శ్రీమహాదేవుని చేత సేవలందుకొనువాడు, సంసార భయాలను పోగొట్టేవాడు, కాలరూపంలో వున్న మదించిన ఏనుగులకు సింహంలాంటివాడు, యోగులకు ప్రభువు, జ్ఞానంద్వారా తెలిసికో వీలున్నవాడు, గుణాలన్నింటికి స్థానమైనవాడు. అపజయాన్ని ఎరుగనివాడు, సత్త్వ, రజస్తమో గుణాలకు మించిన గుణాలు కల వాడు, మాయను దగ్గరకు చేరనివ్వనివాడు, ఎలాంటి చెడు లక్షణాలు లేనివాడు, దేవతలకు స్వామి, దుష్టులను, దుర్మార్గులను సంహరించ డానికి రాత్రింబవళ్ళు సిద్ధంగా ఉండేవాడు, బ్రాహ్మణులందరికి పూజ్యుడైన పరమాత్మ, జలముతో నిండిన మేఘాల వన్నెతో వెలిగి పోతున్నవాడు, కమలాల్లాంటి కన్నులు గలవాడు, భూమి అంతటికి రాజు రూపంలో వున్న పరమదైవమైన శ్రీరామచంద్రునికి నమస్క రిస్తున్నాను.

శంఖము,చంద్రునిలాంటి వెలుగుతోవెలిగిపోయే అందమైన శరీరం గలవాడు, పులితోలును బట్టలుగా ధరించినవాడు, నల్లని భయంకర మైన పాములను అలంకారాలుగా మెడలో వేసికొని వున్నవాడు,గంగా చంద్రులకు ప్రియమైనవాడు, కాశీకి ప్రభువు. కలియుగ పాపాలను పారద్రోలువాడు, శుభాలను సుఖాలను అందించు కల్పవృక్షం లాంటి వాడు, పార్వతికి భర్త, గుణాలకు గని, మన్మధుని బూడిద చేసిన వాడు, నమస్కరించడానికి అర్హుడు, అయిన శ్రీశంకరునకు నమస్కరి స్తున్నాను.

సజ్జనులకు కూడా లభించని మోక్షాన్ని ప్రసాదించువాడు, దుర్మా ర్గులకు ఎప్పటికప్పుడు దండన యిచ్చువాడు అయిన ఆ శంకరుడు, నాకు శుభాలను పెంచుగాక!

నిమిషాలు, సంవత్సరాలు, యుగాలు, కల్పాలు ప్రచండమైన బాణాలు, కాలం వాటికి ధనస్సు అరే, మనసా! నీవు ఆ శ్రీరాముని ఎందుకు భజించవు??"

## 26

సముద్రుని మాటలు విని శ్రీరామచంద్రుడు మంత్రులను పిలిచి-"ఇంకా ఆలశ్యమేమిటి? సైన్యం దాటడానికి సేతువు నిర్మించండి, దాని మీద మనుష్యులు భవసాగరాన్ని దాటాలి" అన్నాడు.

జాంబవంతుడు చేతులు జోడించి- "సూర్యవంశంలోని శ్రేష్ఠుడవైన శ్రీరామచంద్రా! మీ పేరే అందమైన, శ్రేష్ఠమైన సేతువు, దీని మీద ఎక్కితే మనుష్యుల సాంసారిక జంజాటాలన్నీ పోతాయి. మీకు తెలియని విషయాలు లోకంలో ఏముంటాయి? ఎవరికి, మీ కంటె ఎక్కువ తెలుస్తాయి?"అన్నాడు.

ఈ చిన్న సముద్రాన్ని దాటడానికి ఎంతకాలం పడుతుందన్న మాట పవనసుతుడైన హనుమంతుడు విని-"ప్రభూ! మీ ప్రతాప రూపము, భయంకరమైన సముద్రంలోని అన్ని సముద్రంలోని నీళ్ళను ఇంతకు మునుపే ఎండజేసింది. కాని, మీ శత్రువుల స్త్రీల కన్నీళ్ళ ప్రవాహంతో, ఇది మళ్ళా నిండిపోయింది. అందుచేత ఇందులోని నీళ్ళన్నీ ఉప్పనయిపోయాయి." అన్నాడు.

హనుమంతుని ఈ అత్యుక్తి విని వానరులు శ్రీరాముని వైపు చూచి నవ్వారు. జాంబవంతుడు నలనీలులను ఇద్దరన్నదమ్ములను పిలచి కథంతా చెప్పాడు. "శ్రీరాముని ప్రతాపం స్మరించుకొని సేతువును నిర్మించండి. ప్రభుప్రతాపం అండగా వున్నంత కాలమూ ఏ పనీ కష్టమనిపించదు" అని వానరుల సమూహాన్ని పిలచి-

"వారందరు శ్రీరాముని పాదాలను మనస్సులో తలచుకొంటూ చెట్లను, పర్వతాలను పెకలించుకొని తెండి." అనగానే వానరులు, ఎలుగుబంట్లు "మహాప్రతాపవంతుడైన రామునకు జై" అంటూ వెళ్ళి పోయారు.

వారు ఎంతో ఎత్తైన చెట్లను, పర్వతాలను ఆటగా లేపుతు న్నారు, ఎప్పటి కప్పుడు తెచ్చి నల, నీలులకు అందిస్తున్నారు. వారు వాటిని చక్కగా పేర్చి సేతువు నిర్మిస్తున్నారు. పెద్ద పెద్ద పర్వతా లను వానరులు తెస్తుంటే, వాటిని బంతుల్లాగా నలనీలులు అందు కుంటున్నారు. సేతువు చక్కగా నిర్మించబడటం చూచి కృపాసాగరు డయిన శ్రీరామచంద్రుడు నవ్వి-"ఇక్కడి భూమి చాలా రమణీయ మైనది, శ్రేష్ఠమైనది, దీని అపార మహిమను వర్ణించడం సాధ్యం కాదు. నేను ఇక్కడ శివుని ప్రతిష్టచేస్తాను. ఆయన నా హృదయంలో నిలచి ఉంటాడు," అన్నాడు.

శ్రీరాముని మాటలు విని సుగ్రీవుడు అనేక మంది దూతలను పంపి, శ్రేష్ఠులయిన మునులను పిలిపించాడు. శ్రీరాముడు శివలింగా న్ని స్థాపించి నియమపూర్వకంగా పూజలుచేసి-"శివునితో సమానమైన ప్రియుడు మరొకడు నాకు లేడు. శివద్రోహి అయివుండి, నా భక్తుడ నని చెప్పుకొనే వ్యక్తి కలలో కూడా నన్ను చూడలేడు. శంకరునకు వ్యతిరేకి అయి, నా భక్తిని కోరుకునేవాడు, మూర్ఖుడు, బుద్ధి తక్కువ వాడు.

శంకరునకు ప్రియుడై, నాకు ద్రోహం చేసినవాడు, శివునకు ద్రోహం చేసి, నాకు భక్తుడయిన వాడు, కల్పం వరకు ఘోరనర కంలో నివసిస్తాడు.

నేను స్థాపించిన ఈ రామేశ్వరాన్ని దర్శించినవారు, శరీ రాంతమున నా నివాసానికి చేరుకుంటారు. గంగా జలంతోని

నీళ్ళను తెచ్చి, శివుని అభిషేకానికిచ్చిన భక్తులు మోక్షాన్ని పొందుతారు.

ఏ కోరికలు లేకుండా, కపటాలు వదలి, రామేశ్వరుని సేవలు చేసినవారికి శివుడు నా భక్తిని ప్రసాదిస్తాడు. నా ఈ నిర్మిస్తున్న సేతువును దర్శించినవారు, ఏ కష్టము లేకుండా భవసాగరాన్ని దాటి పోతారు"

శ్రీరాముని మాటలు అందరికీ నచ్చాయి. మునిశ్రేష్ఠులందరు తమతమ ఆశ్రమాలకు వెళ్ళిపోయారు. మహాదేవుడంటున్నాడు—

"పార్వతీ! శరణుజొచ్చిన వారియందు ప్రీతి చూపడం శ్రీరాముని పద్ధతి."

నేర్పరులైన నీల, నలులు సేతువును నిర్మించారు. శ్రీరాముని దయవలన వారి కీర్తి అంతటా వ్యాపించింది. మునిగిపోని బండలు, ఇతర బండలను కూడా మునగకుండా చేస్తున్నాయి. ఆయన కవి నావ లాగా తయారయాయి. ఇందులో సముద్రం యొక్క మహిమగాని, బండల్లో ఉన్న లక్షణాలుగాని, వానరుల వాకపక్యంగాని ఏమీ లేదు. శ్రీరఘునాథుని ప్రతాపం వలన సముద్రంలో బండలు తేలుతున్నాయి. ఇలాంటి శ్రీరామచంద్రుని వదలి, ఇతరులను సేవించు వారిని గురించి ఏమనుకోవాలి.

సేతువు చాలా గట్టిగా తయారయింది. దాని మీద ఎక్కి కృపాళువు అయిన శ్రీరామచంద్రుడు సముద్రపు విస్తీర్ణం చూస్తున్నాడు. కరుణాసాగరుని దర్శించుకోడానికి జలంలో వుండు ప్రాణులు బయటకు వచ్చాయి.

అనేకరకాలైన మొసళ్ళు, చేపలు, పాములు కనిపిస్తున్నాయి, వాటిలోని కొన్ని శరీరాలు వంద ఆమడలున్నాయి. అందులో కొన్ని ఒక దానిని మరొకటి తిని వేయగలవీ వున్నాయి. కాని, అవి కూడా ఎవరినో చూచి భయపడుతూనే ఉన్నాయి.

అవన్నీ వైరం మాని ప్రభువును దర్శించుకుంటున్నాయి' తొలినా వెళ్ళ ం లేదు. అన్ని ఆనందంగా ఉన్నాయి. వాటివాటున నీన్ను కనబడటంలేదు. అవన్నీ భగవంతుని రూపాన్ని చూచి ఆనంద మగ్నలయి పోయాయి. ప్రభువు ఆజ్ఞ ప్రకారం సైన్యము సేతువుదాటి పోయింది. వానరసేనను ఇంతని ఎవరు లెఖ్ఖ పెట్టి చెప్పగలరు?

సేతుబంధంమీద చాలామంది గుంపుగా ఏర్పడ్డారు. కొందరు వానరులు ఆకాశమార్గాన ఎగిరి వెళ్ళారు. చాలామంది జలచరాల మీద ఎక్కిదాటుతున్నారు.

ఈ విచిత్రం చూచి రామలక్ష్మణులు నవ్వుకున్నారు. సేన సహితంగా రఘునాథుడు దాటి వెళ్ళాడు. వానరసేనాపతులకు లెక్క లేదు.

ప్రభువు సముద్రం అవతల బసవేసి, వానరులందరికి, "మీరు వెళ్ళి అందమైన పండ్లు, పూలు తెండ"ని చెప్పాడు. శ్రీరామచంద్రుని మాట వినగానే వానరులు, ఎలుగుబంట్లు, ఇటు అటు పరుగులు తీశారు.

శ్రీరాముని సేవ కొరకు, వృక్షాలన్నీ ఋతువు కాకపోయినా కాచి, పూశాయి. ఎలుగుబంట్లు, వానరులు తియ్యతియ్యని పండ్లుతిని చెట్లను ఊగిస్తున్నారు. కొండల శిఖరాలను పెరికి లంకవైపు విసు రుతున్నారు.

అక్కడ ఎక్కడైనా, ఎవడైనా రాక్షసుడు కనిపిస్తే, వాడి చుట్టూ చేరి ఆటలుపట్టిస్తున్నారు. దంతాలతో వాళ్ళ ముక్కులు, చెవులు కొరికేస్తున్నారు. వారెళ్ళి విషయాలన్నీ రావణునితో చెప్పు కుంటున్నారు.

సముద్రం మీద సేతువు నిర్మించారు, అను సంగతి రావణుని చెవుల బడగానే, అయన పది ముఖాలలో భీతి కనబడ్డది. ఇక మండో

దరి యీ వార్త విని భర్త పాదాల వద్ద తలనుంచి నాథా కోపాన్ని వదలి నా మాట వినండి. బుద్ధి, బలంతో జయించగలమనుకునే వారి తోనే వైరం పెట్టుకోవాలి. మీకూ శ్రీరామచంద్రునికి, మిణుగురు పురుగు, సూర్యునికి వున్నంత తేడావుంది.

ఆయన ఎంతో బలవంతులైన మధుకైటభులను చంపాడు. మహావీరులైన హిరణ్యకశిపు, హిరణ్యాక్షులను సంహరించాడు. బలిని బంధించాడు. సహస్రబాహుని చంపాడు; ఆ భగవంతుడే భూమి భారాన్ని తగ్గించడానికి అవతారమెత్తాడు. నాథా! ఆయనతో వైరము పెట్టుకోకండి. కాలం, కర్మ, సమస్తప్రాణికోటి ఆయన అధీనంలో వున్నాయి.

శ్రీరాముని పాదకమలాల వద్ద తలనుంచి, జానకిని ఆయనకు ఒప్పగించండి. పుత్రునకు రాజ్య మొప్పగించి వనంలోకి వెళ్ళి శ్రీరాముని భజించండి.

నాథా! శ్రీరామచంద్రుడు దీనుల యందు దయగలవాడు, ఎదురుగా పోతే పెద్ద పులి కూడా తినదు. మీరు చేయదలచుకున్న పనులు చేశారు. దేవతలు, రాక్షసులు మొదలైన చరచరాలన్నింటిని మీరు జయించారు.

దశకంఠా! రాజు తన జీవితంలో వనానికి వెళ్ళాలని భక్తులు, మహాత్ములు నీతి కోవిదులు చెబుతుంటారు. గనుక స్వామీ! వనానికి వెళ్ళి, సంసారాన్ని సృష్టించి, పాలించి, సంహరించు ఆయనను భజించండి.

శ్రీరాముని కొరకు శ్రేష్ఠులైన మునులు అనేక ప్రయత్నాలు చేస్తుంటారు. రాజులు రాజ్యాలను వదలి వైరాగులవుతున్నారు. శ్రీరాముడు శరణాగతులను ఎంతో ప్రేమిస్తాడు. కోర్కెలన్నీ వదలి ఆయననే సేవించండి.

ఆ కౌసలాధీపుడయిన శ్రీరామచంద్రుడు మిమ్మ కరుణించ డానికే వచ్చాడు. నా మాట వింటే మీకు మూడు లోకాల్లో కీర్తి వ్యాపిస్తుంది." అంటూ కళ్ళ వెంట నీళ్ళ వస్తుండగా కాళ్ళ పట్టు కొంది. భయంతో ఆమె ఒళ్ళ వణికిపోతున్నా, భర్తనెలాగైనా కాపాడుకోవాలను ఆదుర్దాతో-"నాథా! నా పసుపు కుంకమ నిలవి వుండేందుకైనా శ్రీరాముని శరణువేడండి" అంది.

రావణుడు మండోదరిని పైకి లేపి, తన గొప్పతనాన్ని చెప్పు కోవడం మొదలుపెట్టాడు-"ప్రియురాలా! విను, నీవు అనవసరంగా భయపడుతున్నావు. ప్రపంచంలో నాకు సాటివచ్చు యోధుడెవ డున్నాడు?

నేను నా భుజబలంతో వరుణుని, కుబేరుని, పవనుని, యముని కాలుని, దిక్పాలకులందరిని జయించాను. దేవతలు, రాక్షసులు, మనుష్యులు అందరు నా వశమైపోయారు, ఇలాంటి పరిస్థితులలో నీ కెందుకు భయమేస్తున్నది?" అని మండోదరికి అనేక విధాల తెలియ జెప్పి, రావణుడు సభలోకి వెళ్ళి కూచున్నాడు. కాలవశమయిపోయి నందున గర్వ మెక్కువయింద'ని మనస్సులో అనుకుంది మండోదరి.

సభలోకి వచ్చి రావణుడు తన మంత్రులనడిగాడు-"శత్రువుతో ఏ విధంగా యుద్ధం చేయాలి?"

"నిశాచరనాథా! వినండి, మీరు మాటిమాటికి అడుగడమెం దుకు? అసలు మనకు భయముంటే గదా, ఆలోచించాల్సింది? మను ష్యులు, ఎలుగుబంట్లు, వానరులు మన ఆహారాలేకదా?" అన్నారు మంత్రులు

వారి మాటలు విన్న రావణ పుత్రుడు ప్రహస్థుడు చేతులు జోడించి-"ప్రభూ! నీతికి విరుద్ధంగా ఏమీ చేయకండి. మంత్రులలో చాలా తక్కువ బుద్ధి వుంటుంది. ఈ మంత్రులందరు ఇచ్ఛకాలు

మాట్లాడుతుంటారు. ఈ రకంగా పనులు సాగవు, సముద్రాన్ని దాటి ఒక్క వానరుడు వచ్చాడు. అతను వేసిన భీభత్సానికి రాక్షసులందరు తల్లడిల్లిపోయారు, ఆ సమయంలో ఏమీకెవ్వరికీ మీ తోచలేదు. నగరాన్ని తగులబెట్టేటప్పుడు అతన్ని పట్టుకొని ఎందుకు తినలేదు? ఈ మంత్రులు చెప్పే విషయాలన్నీ ఇప్పుడు ఇంపుగా ఉన్నట్లుంటాయి గాని, ముందు కాలంలో కొంపలు తీస్తాయి. ఎంతో దుఃఖపడవలసి వస్తుంది.

సునాయాసంగా అతి సహజంగా సముద్రం మీద ఆనకట్ట కట్టి సైన్య సమేతంగా వచ్చి మన త్రికూట పర్వతం మీద ఎక్కి కూర్చున్న వారు సామాన్యులా? మనవారందరు బుగ్గలుబ్బించి, మేమూ అందరిని తినేస్తామని బీరాలు పలుకుతున్నారు.

నాన్నగారూ! నా మాటలను, ఆదరంగా వినండి. నన్ను పిరికివాడినని అనుకోవద్దు. ప్రియమైన మాటలు వినేవారు, వినిపించేవారు ప్రపంచంలో చాలామంది ఉంటారు.

ప్రభూ! ఎంతో మేలు కలిగించే మాటలు, మాట్లాడే వారు ప్రపంచంలో చాలా తక్కువమంది ఉంటారు. మొదట దూతను పంపి, సీతను ఒప్పగించడం నీతి.

తండ్రీ! ఆయన తన స్త్రీ తనకు దక్కిన తరువాత, వెళ్ళిపోతే, వారితో తగాదా పెట్టుకోవద్దు. తిరిగి వెళ్ళకపోతే అప్పుడు పట్టుదలతో యుద్ధం చేద్దాం. మీరు నా మాటవిన్నట్లయితే, ప్రపంచంలో రెండు విధాల మంచి కీర్తి వస్తుంది."

ఆ మాటలకు రావణుడు క్రోధంతో-"అరే మూర్ఖపుత్రా! నీకు ఈ బుద్ధి ఎవరు నేర్పితే వచ్చింది? నీ మనస్సులో ఇప్పటినుండే సందేహాలు ప్రారంభమయాయా, నీవు వెదురు వేరుల్లో పురుగులాగా తయారయావు."

తండ్రి కఠినమైన మాటలు విన్న ప్రహస్థుడు సభలో నుండి లేచి ఇంటికి వెళ్తూ-"చచ్చేవానికి మందులు నచ్చనట్లుగా, నీకు నా మంచి మాటలు నచ్చడం లేదు."

సాయంకాల సమయాన రావణుడు తన ఇరవై భుజాలను చూచుకుంటూ మహలువైపు వెళ్ళాడు.

లంక శిఖరం మీద ఒక భవనం చాలా విచిత్రంగా వుంది. అది వ్యాయామశాల. అక్కడకు వెళ్ళి రావణుడు కూచున్నాడు. కిన్నరులు ఆయన గుణాలను గానం చేస్తున్నారు. తాళం, మృదంగం, వీణ మొదలైనవి వాయిస్తున్నారు. నేర్పరులైన అప్సరలు నాట్యాలు చేస్తున్నారు. తలమీద చాలా బలమైన శత్రువు ఎక్కి వున్నా, అతను భయమేమీ లేకుండా ఇంద్రునితో సమానంగా భోగ విలాసాల్లో మునిగి ఉన్నాడు.

ఇక్కడ త్రికూట పర్వతం మీద శ్రీరామచంద్రుడు ఎంతో సైన్యంతో సిద్ధంగా ఉన్నాడు. ఆ పర్వతం మీదనున్న ఒక అందమైన ఎత్తైన, సమతల శిఖరాన్ని చూచి, వృక్షాల మెత్తని ఆకులు, పూలు, ఏరి లక్ష్మణుడు తన చేతులతో ప్రక్కగా ఏర్పరచాడు. దాని మీద అందమైన లేడి చర్మము పరచాడు. ఆ ఆసనం మీద కృపాళువు శ్రీరామచంద్రుడు కూచున్నాడు.

ప్రభువు తన శిరస్సును సుగ్రీవుని ఒడిలో ఉంచాడు. కుడి, ఎడమవైపులలో ధనస్సు. బాణాలు ఉంచారు. ఇద్దరి కరకమలాల లోని బాణాలను సవరించుకుంటున్నారు. విభీషణుడు ధనస్సును చెవుల వద్ద నుంచుకొని ప్రభువు అనుమతి కోరుతున్నాడు.

చాలా అదృష్టవంతులైన అంగద, హనుమంతులు ప్రభువు చరణకమలాలను ఒత్తుచున్నారు, ప్రభువు వెనుక వీరాసనం వేసికొని లక్ష్మణుడు నడుముకు అంబులపొది, చేతిలో ధనస్సును ధరించి

చూడముచ్చటగా ఉన్నాడు. ఈ రకంగా కృప, గుణాలకు గని అయిన శ్రీరామచంద్రుడు కూచుని ఉన్నాడు, ఆ విధంగా ఎల్లప్పుడూ ధ్యానంలో ఉండేవారు ధన్యులు.

శ్రీరాముడు తూర్పువైపు దృష్టి మరిపేటప్పటికి, చంద్రుడు ఉదయిస్తున్నాడు. ఆయన చంద్రుని చూచి-"చంద్రుని చూడండి. సింహంలాగా ఎంతో నిర్భయంగా ఉన్నాడు.

తూర్పు దిక్కు-రూపమైన గుహలో ఉండే, ప్రతాపవంతుడు, తేజశ్శాలి, బలాఢ్యుడు అయిన చంద్రుని రూపమైన సింహము, చీకటి రూపమైన మదించిన ఏనుగును చీల్చి, ఆకాశరూపమైన వనంలో తిరుగుతూ ఉంది.

ఆకాశంలో మెరసే నక్షత్రాలు ఏనుగుదంతంతో చేసిన ఆభరణాలు. అవి రాత్రి రూపమైన అందమైన స్త్రీకి శృంగారాలు. ప్రభువు అన్నాడు-"సోదరులారా! చంద్రునిలో వున్న నలుపేమిటి? మీకు తెలిసిన ప్రకారం చెప్పండి."

"రఘునాథా! చంద్రునిలో భూమి యొక్క నీడ కనిపిస్తున్నది" అన్నాడు సుగ్రీవుడు. మరొకడు-"రాహువు చంద్రుని కొట్టిన మచ్చ చంద్రుని హృదయంలో వుంది"-అన్నాడు. ఇంకొకడు "బ్రహ్మ రతి ముఖాన్ని తయారు చేసినప్పుడు, చంద్రుని సారం లాగివేశాడు. ఆ బెజ్జమే చంద్రుని హృదయంలో కనిపిస్తున్నది. అందులో నుండే ఆకాశపు నీడ కనిపిస్తున్నది.

"విషము చంద్రునకు చాలా యిష్టమైన మిత్రుడు. దానిని చంద్రుడు తన హృదయంలో ఉంచుకున్నాడు. విషముతో కూడి వున్న కిరణ సమూహాలను వ్యాపింపజేసి, అది విరహంలో స్త్రీ పురుషులను మాడ్చివేస్తున్నది" అన్నాడు.

"ప్రభూ! ఏ ప్రభు, మీ ప్రియసేవకుడు. ఆయన హృదయంలో మీ ఆకారముంటుంది. ఆ శ్యామల వర్ణమే చంద్రునిలో మెరుస్తూ ఉంటుంది" అన్నాడు హనుమంతుడు.

హనుమంతుని మాటలు విని నేర్పరియైన రాముడు నవ్వి దక్షిణపువైపు చూసి-"విభీషణా! దక్షిణపు దిక్కుకు మళ్ళీచూడు, మేఘాలు తిరుగుతూ ఉన్నాయి. మధురమైన ధ్వనులతో దట్టమైన మేఘాలు, కఠోరమైన వడగండ్ల వాన కురువపోతున్నదా అన్నట్లుగా, గర్జిస్తున్నాయి." అన్నాడు

"కృపాళా! ఇది మెరుపూ కాదు, మేఘాల సమూహమూ కాదు. లంక శిఖరం మీద ఒక అందమైన భవనముంది. అక్కడ రావణుడు, నాట్యాలు,గానాలు ఉన్న వ్యాయామాలను చూస్తున్నాడు.

రావణుని తలమీద మేఘంలాంటి నల్లని గొడుగుంది. అదే మేఘంలాగా కనిపిస్తున్నది. ప్రభూ! మండోదరి చెవులకున్న కమ్మలు మెరుపుల్లాగా మెరుస్తున్నాయి.

దేవోత్తమా! మనోహరమైన తాళ, మృదంగాల ధ్వనిలాగా వున్నదే, అతని గర్జన ధ్వని" అన్నాడు విభీషణుడు

రావణుని అభిమానాన్ని తెలిసికొని రాముడు నవ్వుకొని, ధనస్సు ఎక్కుపెట్టి బాణాన్ని సరిపెట్టి వదలాడు. ఒకేబాణంతో రావణుని గొడుగు, కిరీటము, మండోదరి చెవులపోగులు తెగి అందరు చూస్తుండగానే నేలమీద పడ్డాయి. ఆయన పడగొట్టేది ఎవరికి తెలియలేదు. ఇలా చమత్కారం చేసి రాముని బాణము మరల తిరిగి వచ్చి అంబులపొదిలో చేరిపోయింది. చాలా విచిత్రమైన ఈ ఘటనను చూచిన సభంతా సంభ్రమాశ్చర్యాలతో భయపడిపోయింది.

భూమి కదలలేదు, జోరుగా గాలి (తుఫాను) వీచలేదు, అస్త్ర శస్త్రాలను ఎవ్వరూ కళ్ళతో చూడనేలేదు. మరి గొడుగు, కిరీటము,

కుండలాలు ఎలా పడిపోయాయి? ఇది చాలా భయంకరమైన అపశ
కునమని అందరు ఆలోచనలో పడిపోయారు.

రావణుడు సభంతా భయపడిపోవటం చూచి నవ్వి, తనకు లోపలున్న భయాన్ని కప్పిపుచ్చుకోడానికి చమత్కారంగా-"నా తలలు పడిపోయినప్పుడు కూడా ఇలాగే జరుగుతూ వచ్చాయి, ఇప్పుడు కిరీటము క్రిందపడినంత మాత్రాన అపశకునమేమిటి? మీరు ఇండ్లకు వెళ్ళి నిద్రపొండి, భయపడవద్దు" అన్నాడు. వారందరు రావణునకు తలలు వంచి నమస్కారాలు చేసి పోయారు.

మండోదరి హృదయంలో, వెళ్లల కమ్మలు క్రిందపడిపోయి నప్పటి నుంచి బెంగ పట్టుకుంది. ఆమె కళ్ళంట నీళ్ళు పెట్టుకొని, రెండు చేతులు జోడించి రావణుతో-"ప్రాణనాథా! నా మనవి ఆలకించండి. స్వామీ! రామచంద్రునితో వైరము మానండి, ఆయనను మనిషిగా తలంచి పట్టుదల చూపకండి. రఘువంశమణి శ్రీరామ చంద్రుడు విశ్వరూపుడు. నా ఈ మాటను నమ్మండి. వేదాలు ఆయన అంగాలన్నింటిలో బ్రహ్మాండాలున్నాయని కల్పన చేశాయి.

ఆయన చరణాలు పాతాళలోకంలో, తల బ్రహ్మలోకంలో వుంది. లోకాలెన్నైతే ఉన్నాయో, అవన్నీ ఆయన అంగాంగాలలో ఇమిడివున్నాయి. ఆయన కనుబొమల విలాసమే భయంకరమైనకాలం, నేత్రాలు, కేశాలు మేఘాల సమూహాలు.

ఆయన ముక్కు అశ్వినీ కుమారులు, లెక్కలేనన్ని రాత్రింబవళ్ళు ఆయన రెప్పలు కదిలించడాలు, చెవులు పదిదిక్కులు, అని వేదాలు చెప్పాయి, ఆయనశ్వాస గాలి, ఆయనవాక్కులే వేదాలు.

లోభం ఆయన పెదవులు, భయంకరమైన ఆయన దంతాలు యమరాజు. మాయనవ్వకం, దిక్పాలకులు భుజాలు. అగ్ని ముఖము, వరుణుడు జీవుడు, ఉత్పత్తి, పాలన, ప్రళయమునేవి ఆయన చేష్టలు.

పద్దెనిమిది రకాల వనస్పతులు ఆయన రోమాలు, పర్వతము ఆయన ఎముకలు, నదులన్నీ ఆయన నరాలు, పొట్టసముద్రం. నరకము క్రింది ఇంద్రియాలు. ఈ ప్రకారంగా ప్రభువు విశ్వరూపుడు. ఇంకా ఎక్కువ కల్పన ఎక్కడ చేయనూ?

ఆయన అహంకారము మహాదేవుడు, ఆయన బుద్ధి బ్రహ్మదేవుడు, ఆయన మనస్సు చంద్రుడు, చిత్తం విష్ణువు. – చరాచర రూపాలలో వున్న భగవంతుడైన శ్రీరాముడు మనుష్యుని రూపంలో నివసించి వున్నాడు.

ప్రాణపతీ! ఇదంతా, మనస్సులో ఆలోచించి, శ్రీరామచంద్రునితో వైరము మానేసి, ఆయన పాదాల యందు ప్రేమవుంచండి. అలా మీరు చేస్తే నా ముత్తైదువతనం శాశ్వతంగా వుంటుంది.” అంది.

భార్యమాటలు విని, నవ్వి–“మోహం యొక్క మహిమ బలవత్తరమైనది. స్త్రీల హృదయాలలో ఎనిమిది అవగుణాలు ఎల్లప్పుడు వుంటాయని అందరు అనడం నిజమేనన్నమాట! అవి సాహసం, అబద్ధం, చాంచల్యం, కపటము, భయము, అజ్ఞానము, అపవిత్రత, నిర్దయత.

నీవు శత్రువు యొక్క విరాట్రూపము ఎన్నో రకాలుగాచూపి, చెప్పి, నన్ను, అతనంటే ఎంతో భయపడేట్టు, చేయాలని ప్రయత్నిస్తున్నావు.

ప్రియురాలా! ఈ చరాచరాలన్నీ నా వశంలో ఉన్నాయి. నీ దయవలన నాకు అర్థమయిపోయింది! నీ నేర్పరితనం నేను తెలిసికున్నాను. ఈ వంకతోనే నీవు నా గొప్పతనాన్ని చెప్పావు.

మృగనయనీ! నీ మాటలు చాలా గూఢమైనవి, అవి అర్థం చేసికొంటే ఆనందం కలిగించేవి, వింటే భయాన్ని దూరం చేసేవి”

అన్నాడు. మండోదరి, మృత్యువు వశమయి యున్న తన భర్త బుద్ధి చెడిపోయిందని మనస్సులో నిశ్చయించుకుంది.

అనేక రకాల వినోదాలతో తెల్లవారింది. సహజంగానే నిర్భయుడు, ధురంధరుడైన రావణుడు తన సభలోకి వెళ్ళాడు.

మేఘాలు అమృతం కురిపించినా, వెత్రాలు పూయవు, కాయవు. అదే విధంగా, బ్రహ్మలాంటి జ్ఞానం గల గురువు లభించినా మూర్ఖునికి జ్ఞానం అబ్బదు.

## 27

అటు రావణుడు మంత్రులను వెంటబెట్టుకొని చాలా ఎత్తైన శిఖరం మీదకు వెళ్ళాడు. అప్పుడు శుకసారణుడు-"రాజా! కపుల సమూహాన్ని చూడండి. వారు కిలకిలమంటూ సింహనాదాలు చేస్తున్నారు. ఏడు తాళ్ళతో సమానమైన ఎత్తుగా వున్నారు. వేయికోట్ల అంతులేని బలం గల వానరులు వీరి వెంట ఉన్నారు.

వీరు యుద్ధంలో జయింపశక్యము కానివారు, సహజంగా నిర్భయులు. వారి గర్జనలు విని లంకంతా వణికిపోతూవుంది. వర్షఋతువులో రెండు ధనస్సులు పుట్టుకొచ్చాయి, అన్నట్లుగా, వీరి తోకలు ఆకాశం దాకా ఉన్నాయి.

ఈ యిద్దరు విశ్వకర్మ యొక్క ప్రియ పుత్రులు. వీరు తాకినందు వలననే బండలు నీళ్ళమీద తేలాయి. వీరు తామ్రగిరి లోయలో వుంటున్నారు, గోదావరిలోని నిర్మలమైన జలం త్రాగుతున్నారు.

ఎంతో బలశాలురైన వీరులు, ఆ ముందు నడుస్తున్నారే,వారు శ్రీరామచంద్రునకు చాలాప్రియులు. వీరు యుద్ధంలో యమున్నయినా మన్ను తినిపిస్తారు. ఈ నల్లని రంగుల్లో వున్న వానరులు నలనీలులు వానరుల పద్దెనిమి పద్మాల సైన్యం వీరి భుజాల ఆధారంతో పనులు

చేస్తుంది. తన చేతులతో మనోహరమైన సుగంధ పుష్పాలను తీసుకొని శ్రీరాముడు వీరి భుజాలకు పూజలు చేశాడు.

పర్వతంతో సమానంగా పెరుగుతున్నవాడు, పద్మాలుగల తాటి చెట్లతో సమానమైన ఎత్తుగలవాడు, పులింపానికి ఒత్తున వుండేవాడు, మేఘాల సమూహాన్ని చూడగానే పట్టుకొచ్చేవాడు, ఎర్రని కమలాలతో సమానమైన శరీరం గలవాడు, సంధ్యా మేఘం ఉదయించినట్లుగా వున్నవాడు, తోకను త్రిప్పి కొట్టితే భూమి పగిలిపోవునట్లు చేయువాడు, లంకను తిని వేసేవానిలాగా చూచేవాడు, వాలికి పుట్టినవాడు, తారకుపుత్రుడు, మహావీరుడు, శ్రీరామునకు అత్యంత ప్రియుడు, సూర్యునితో సమానంగా ప్రభువును హృదయంలో ఉంచుకున్నవాడు, అయిదు పద్మాల వానరులు వెంటనున్నవాడు, ఇంద్రుని వజ్రాయుధాన్నయినా త్రుంచగలవాడు, ఉదయాచలాన్ని ఒడిలో పెట్టుకోగలవాడు, పరమచతురుడైన సేనాపతి, రఘునాథుని కృపతో చాలా అదృష్టవంతుడయినవాడు, భూమిమీద పాదాలు పెట్టినొక్కితే శేష నాగుడు కూడా వ్యాకులపడి పోయేటట్లు చేసేవాడు, సేనకుముందు నడచేవాడు, యువరాజు అంగదుడు.

ఈ నాలుగువైపుల తిరుగుతున్న వారిని చూడు. వీరిని చూస్తుంటే లంకలో శ్రావణ మాసపు మేఘాలు తిరుగుతున్నాయా అన్నట్లున్నాయి. వీరు ముందు వెనుకల పది దిక్కుల్లో పరుగులుతీసి రాళ్ళు, పర్వతాలు, చెట్లను పెకలించి వేస్తున్నారు.

వీరిలో ప్రతి ఒక్కరిలో వెయ్యి ఏనుగుల బలముంది. వీరి సంఖ్య ఏడు పద్మాలు. వీరు కాశీలో నివసిస్తున్నారు. వీరెన్నడూ యుద్ధంలో వీపులు చూపలేదు.

వీరు గోళ్ళతో, పండ్ల రూపాలైన అస్త్రాలను ధరించి, వుంటారు. వీరికి ద్వంద్వ యుద్ధం బాగా తెలుసు. వీరిసేనాపతి ధూమ్ర

కేతు, ఇతను లంకకు దగ్గరగా జన ఏర్పాటు చేసికొన్నాడు.

ఇతని అన్నగారే జాంబవంతుడు. అతని బలాన్ని గురించి చెప్పడానికి మాటలు చాలవు. దేవతలు, రాక్షసులు వాని ముందు బలాదూరు! ఆయన భూమిని బంతిలాగా లేపగలడు. ఇతను నిర్భయంగా నర్మదానది ఒడ్డున ఉంటున్నాడు. ఆయన శరీరం వజ్రంతో సమానమైన కాఠిన్యం గలది. ఈ జాంబవంతుడు సుగ్రీవుని మంత్రి, రఘునాథునకు ప్రియమైన దాసుడు. ఇతన్ని యుద్ధంలో జయింపగల ననుకునేవాడు మూర్ఖుడు.

ఇప్పుడిక, ఈ అంతు తెలియని సైన్యాన్ని చూడు. కిరిలంగిన తో కొండలు వెలతెలపోతున్నాయి. బాలసూర్యుని కిరణాలు బయటకు వచ్చి రాక్షస రూపమైన అంధకారాన్ని పోగొట్టదలచాయా అన్నట్లుగా వుంది సైన్యం.

వీటి సంఖ్య ఇరవైనాలుగు అరబ్బులు. వేలపొట్లతో సమానంగా కోట్లసంఖ్యతో వీరున్నారు. బండలు, పర్వతాలు వారి ఎదుటబడినప్పుడు, కాళ్ళతో నలిపి దుమ్ముచేస్తున్నారు. వీరు సుమేరు పర్వత గుహాలలో నివసిస్తున్నారు. వీరి సేనాపతికి చావులేదు. అతను ఎంతో బలవంతుడు, ఇంద్రునకు మేలు చేసేవాడు, సుగ్రీవునకు ఆనందం కలిగించే మిత్రుడు.

అతను గంగలోని నీళ్ళు త్రాగుతాడు, పర్వత శరీరంలాగా అతని శరీరముంటుంది, అతని గర్జనలే మనకు మాటిమాటికి సింహనాదాలుగా వినిపిస్తున్నాయి.

అతని కీర్తి మూడులోకాల్లో వ్యాపించివుంది, అతను ఎన్నో ఏనుగులను చంపేశాడు, అతని బలానికి అంతులేదు. అతను వానరుల రాజు కేసరి. అతని పుత్రుడు హనుమంతుడు.

కమలాల్లాంటి శరీరం గలవాడు, కైలాస పర్వతంమీదనున్న

శరభాలలాగా వున్నవాడు, అందమైన నానావిధరంగుకళ్ళవాడు, ఇష్టమొచ్చినట్లు శరీరాలు మార్చుకొనేవాడు. నాలుగు మూలలకు చూడగలవాడు, లంకవైపు తోకను మలుపుతున్నవాడు, ప్రళయ మేఘాల్లాగా గర్జిస్తున్నవాడు, ఇంద్రునితో కలసి యుద్ధానికి వెళ్ళిన ప్పటి నుంచి ఇష్టము వచ్చినట్లుగా శరీరాన్ని మార్చుకునేవాడు, ఇంద్రుని స్నేహితుడు, దేవతలకు ఎల్లప్పుడు సహాయం చేసేవాడు కోట్ల వానరులు వెంటనున్నవాడు, ఎరుపు, పసుపు, తెలుపు, మరనేక రంగుల్లో కనిపించేవాడు, రెండవ వాలిలాంటివాడు, ఇతని నివాసం దర్దుర పర్వతం మీద, మనసా, వాచా, కర్మణా శ్రీరామచంద్రు నకు దాసుడు. పర్వతాలను ఇతను దాటునప్పుడు దుమ్ములేస్తూ వుం టుంది, సూర్యుని తేజస్సును తగ్గించిన వాడు అయిన ఇతని పేరు సుషేణుడు. తార ఈయన కూతురు.

ఆ వానరుని చూడు. ప్రాతఃకాలంలోని సుమేరు పర్వతము యొక్క శోభలాగా అతను కాషాయ రంగులో శోభాయమానంగా ఉన్నాడు. లంకను తగులబెట్టింది వానరుడే. ప్రభూ! ఇప్పుడు మరల ఎందుకు వస్తున్నాడో తెలియడంలేదు.

తల్లి అంజన గర్భం నుండి నేలపడగానే ఆకలవుతుందని అడి గాడు 'పండిన ఎర్రని పండ్లు తినమని ఆమె చెప్పింది. ఆమె మాటలు విని అయన అటు ఇటు తిరిగి ఇష్టమయిన వస్తువులు చూస్తున్నాడు. ఇంతలో ప్రాతఃకాల సూర్యుడు ఉదయిస్తున్నది చూచి, ఆకాశంలోకి ఎగిరాడు. "సూర్యుని మింగేస్తాడని ఇంద్రుడతను కొని వజ్రా యుధంతో కొట్టేసరికి అతని గడ్డం మాత్రం వంకర తిరిగిపోయింది. అప్పుడు పవనుడు కోపంతో గాలిని ఆపివేశాడు.

దేవతలు వెంబడెత్తి స్తుతించి 'ఇతని శరీరం వజ్రంలాగా అయి పోతుందని వరదాన మిచ్చారు. అప్పుడు పవనుడు వాయువును

వులతో సమానమైన రణధీరుడు. స్వామీ! అలాంటి శ్రీరాముని దర్శించుకోండి.

ఈయనకు ఎడమవైపున విభీషణుడున్నాడు. ఆయన తల మీద రాజతిలకం శోభాయమానంగావుంది. ఈయనకు బీజమంత్రా లన్నీ తెలుసు. ఈయన జంకుగొంకు లేకుండా రాముని పని చేస్తాడు.

ఇక ఈ గొప్ప సైన్యాన్ని చూడండి. ఆ సైన్యాన్ని చూస్తుంటే భాద్రపదమాసంలోని మేఘాలులా వున్నాయి.

బ్రహ్మ ఒక కన్యను సృష్టించాడు, ఆమె కండ్లు అందంగాను, రూపం మనోహరంగాను వుంది. ఆమె వెంట్రుకల మీద సూర్యుని వీర్యం పడింది. ఋతుకాలమును కొని ఇంద్రుడు ఆమెను కలిసాడు. ఆయన వీర్యం ద్వారా ఇద్దరు పుత్రులు కలిగారు. దేవతాంశలతో వారు వానర శరీరధారులయారు.

వీరి నివాసస్థానము కిష్కింధ. అక్కడి మధువనం దేవతల నందనవనంకంటే మిన్న అయినది. వీరి నివాస స్థానము ఋష్యమూక పర్వతము. అక్కడ శ్రీరామచంద్రుడు నాలుగు నెలలున్నాడు.

ఇతని అన్న వాలి. అతనిని శ్రీరాముడు యుద్ధంలో చంపే శాడు. సుగ్రీవునిని రాజును చేశాడు. తార ఇతని పట్టపురాణి. ఆమె పుత్రుడు అంగదుడు, చాలా తెలివిగలవాడు, జ్ఞాని.

వేయికోట్లు ఒక అరబ్బు. వేయి అరబ్బులు ఒక బిందువు, వేయి బిందువులు ఒక పదము. అలాంటి పద్దెనిమిది పదాలసైన్యం శ్రీరాముని పని కొరకు మీతో యుద్ధం చేయడానికి సిద్ధంగావుంది. వీరుని వేషంలో వున్న, విశాలమైన, నేత్రాలుగల, మెడలో ముత్యాల మాలను ధరించియున్న, సుగ్రీవుడు అరవై వేల ఏనుగుల బలముకల వాడు, ఎల్లప్పుడు ధర్మాన్ని పాటిస్తుంటాడు. తెల్లని గొడుగు అతని తలమీద శోభాయమానంగా వుంటుంది. అతడే వారికి రాజు."

ఈ విషయాలన్నీ చెప్తూ సారణుడు, రావణునకు వానర దళా లన్నింటిని చూపాడు, కాని అభిమాని అయిన రావణుడు కాలవశుడై ఉన్న కారణాన అతనిని. అతని మాటలను లెక్కచేయలేదు.

## 28

ఉదయము శ్రీరామచంద్రుడు నిద్రలేచి, మంత్రులందరిని పిలిచి-"తొందరగా చెప్పండి, ఏమి చేయవలసి వుంటుంది" అన్నాడు.

ఆ మాటలకు జాంబవంతుడు రాముని పాదాల యందు తల వంచి-"సర్వజ్ఞా! అందరి హృదయాల్లో నివసించి వున్న మహాత్మా! బుద్ధి. బల, తేజస్సు, ధర్మ, గుణాలరాశి, వాలి పుత్రుడైన అంగదుని దూతగా పంపమని నాకు తోచిన విధంగా చెబుతున్నాను."

ఈ మంచి సలహా అందరికీ నచ్చింది. అప్పుడు కృపానిధి అయిన శ్రీరామచంద్రుడు-"బుద్ధిబలంలో, గుణాలలో మిన్న అయిన అంగదా! నా పని కొరకు నీవు లంకకు వెళ్ళు, నీకు పెద్దగా వివరించి చెప్పాల్సిన పనిలేదు. నీవు చాలా తెలివిగలవాడవు, ఆవులిస్తే ప్రేవులు లెక్కపెట్టగల చాతుర్యము గలవాడవు. శత్రువుతో మాట్లాడునప్పుడు మన పని పూర్తి అగులాగా, ఆయనకు మేలు కలుగు లాగా మాట్లాడు.

ప్రభువు ఆజ్ఞను తలదాల్చి, పాదాలకు నమస్కరించి అంగదుడు లేచి-"శ్రీరామ ప్రభూ! మీ దయ వున్న వారందరు గుణ నిధులే. మీ కార్యాలన్నీ స్వయంగా సిద్ధమయ్యేవున్నాయి. కాని మీరు నాకు గొప్పతన మిచ్చి ఆదరిస్తున్నారంతే.

అంగదుని హృదయం సంతోషంతో వున్నందున శరీరం పుల కించిపోయింది. ప్రభువు పాదాలకు నమస్కరించి, ఆయన గొప్పత నాన్ని హృదయంలో దాచుకొని. అందరికి నమస్కరించి అంగదుడు

వెళ్ళాడు. ప్రభు ప్రతాపం కలిగిన హృదయంలో రణసాహసమున్న వీరుడైన వాలి పుత్రుడయిన అంగదుడు సహజంగానే నిర్భయుడు.

లంకలో జొరబడగానే రావణుని పుత్రుడు కలిశాడు. అతను ఆడుకొంటూ ఉన్నాడు. మాటల్లోనే ఇద్దరికీ క్రోధం పెరిగిపోయింది. ఇద్దరూ చాలా బలవంతులు, యువకులు కూడాను.

అతను అంగదుని తన్నాడు. అతన్ని అక్కడే కాళ్ళు పట్టుకొని త్రిప్పి నేలమీద పడేశాడు! రాక్షసులందరు ఈ మహా వీరుణ్ణి చూచి ఇటు అటు పరుగులు తీశారు.

లంకను తగులబెట్టిపోయిన, ఆ వానరుడే మరల వచ్చాడని నగరం మొత్తంలో గోలగా వుంది.

ఇప్పుడు బ్రహ్మ ఏమి వేయదలచుకున్నాడో, తెలియకుండా వుంది అనుకుంటున్నారు భయంతో అంగదుని చూచిన వారల్లా సంజ్ఞలతో, ఆయన అడగకుండానే త్రోవలు చూపుతున్నారు.

మహాబలవంతుడైన అంగదుడు శ్రీరామచంద్రుని చరణారవిందాలను స్మరించుకుంటూ సింహంలాంటి ఠీవితో, ఇటు అటుచూచుకుంటూ రావణుని సభాద్వారం వద్దకు వెళ్ళి, తన రాకను తెలిపాడు. అది విని నవ్వి- "ఎక్కడి వానరుడు? పిలుచుకురండి" అన్నాడు. రావణుడు.

చాలా మంది రాక్షసులు వెళ్ళి అంగదుని పిలుచుకు వచ్చారు. అంగదుడు రావణుని ప్రాణమున్న కాటుక కొండలా, చూచాడు. అతని భుజాలు చెట్లలాగా, తలలు పర్వత శిఖరాల్లాగా ఉన్నాయి. రోమాలు అనేకమైన తీగల్లాగా వున్నాయి. నోరు, ముక్కు, కండ్లు చెవులు, పర్వత గుహల్లాగా ఉన్నాయి.

ఎంతో గొప్పవీరుడైన అంగదుడు సభలోకి ఏ జంకూ లేకుండా వచ్చాడు, అంగదుని చూడగానే సభలోని వారందరు లేచి నిల

ఒడ్డారు. వీరి నడవడిక చూసిన రావణునకు చాలా కోపం వచ్చింది.

మదించిన ఏనుగుల గుంపులోకి సింహం వెళ్ళినట్లుగానే, శ్రీరాముని ప్రభావం స్మరించుకొని, నిర్భయంగా ఆయన శిలవంటి సభలో నిలుచున్నాడు. రావణుడు-"రే, కోతీ! నీ వెవరివి" అన్నాడు.

"రావణా! నేను శ్రీరామచంద్రుని దూతను. మా నాయనతో నీకు స్నేహముండేది. అందువలన, సోదరా! నేను నీ మేలు కోరి వచ్చాను. నీ కులము ఉత్తమమైనది, నీవు పులస్త్యుని మనుమడవు; నీవు శివుని, బ్రహ్మను ఎంతో భక్తిగా పూజించావు. వరదానాలు పొంది నీ వనుకొన్న పనులన్నీ పూర్తి చేసుకొన్నావు. లోకపాలకులను, రాజులను జయించావు.

రాజమదంతో మోహావశుడయి నీవు జగత్తుకే మాత అయిన సీతను ఎత్తుకు వచ్చావు. నేను నీ మేలును కోరి చెప్పే మాటలువిను. ప్రభువైన శ్రీరామచంద్రుడు నీ తప్పులన్నీ క్షమిస్తాడు.

పండ్లక్రింద గడ్డిపోచను పెట్టుకొనియో, గొంతు దగ్గర గొడ్డలి పెట్టుకొనియో, నీ కుటుంబీకులను, రాణిని, వెంటపెట్టుకొని ఆదరంగా జానకిని ముందుంచుకొని వెళ్ళి-" శరణాగత రక్షకా! రఘువంశమణీ! శ్రీరామా! ఇప్పుడు నన్ను రక్షించు' అన్నావంటే, నీ దీనవచనాలను వినగానే ప్రభువైన శ్రీరామచంద్రుడు నీ భయాన్ని పోగొట్టాడు" అన్నాడంగదుడు.

"ఆరే, మూర్ఖకోతీ! జాగ్రత్తగా మాట్లాడు, నేను దేవతలకు శత్రువునని నీకు తెలియదా? ముందు! నీ పేరు, నీ తండ్రి పేరు చెప్పు ఏ సంబంధంతో నీ తండ్రి స్నేహం చేశాడో కూడా చెప్పు?" అన్నాడు తీవ్రంగా రావణుడు.

"నా పేరు అంగదుడు, నేను వాలి పుత్రుడను, ఆయన్ను నీ వెప్పుడైనా కలశావా?"

అంగదుని మాటలు వినగానే రావణుడు ఖంగుతిని-"వాలి అనే ఒక వానరుడున్నాడని నేను ఒప్పుకుంటాను, అంగదా! నీవు వాలి పుత్రుడవా? నీవు నీ కులనాశనమైన వెదురు పొదకు అగ్నిలాగా పుట్టావు. గర్భంలోనే చచ్చిపోతే బాగుండేది. నీవు అనవసరంగా పుట్టి, నీ నోటితో తాపసి మాత అనిపించుకుంటున్నావు. ఇప్పుడు వాలి కుశలము చెప్పు. అతనెక్కడుంటున్నాడు?" అన్నాడు. అందుకు అంగదుడు

"పది రోజుల తరువాత వాలి వద్దకు వెళ్ళి, మిత్రుని కౌగలించుకొని కుశల సమాచారాలు అడుగు. శ్రీరామునితో వైరం పెట్టుకుంటే ఉండే కుశలమంతా నీకాయన వినిపిస్తాడు. రే, మూర్ఖా! శ్రీరాముడు లేని హృదయంలోనే భేదాలు, సంశయాలు పుట్టుకొస్తుంటాయి.

రావణా! నేను కులనాశకుడనన్న మాట నూటికి నూరు పాళ్ళ సత్యం. నీవు నిజమైన కులపాలకుడవు అని గ్రుడ్డివారు, చెవిటివారు కూడా అనరు, నీకు ఇరవై చెవులు, ఇరవై కండ్లున్నాయి. శివుడు, బ్రహ్మ మొదలైన దేవతలు, మునులు, శ్రీరామచంద్రుని పాదాలకు పూజలు చేయాలని కోరుకుంటున్నారు, ఆ ప్రభువు దూతనయిన నేను కులాన్ని ముంచేశానా? ఇలాంటి బుద్ధి వున్న నీ గుండె ఎందుకు పగిలిపోదు?"అన్నాడు నవ్వుతూ అంగదుడు.

అంగదుని కఠోర వచనాలు విన్న రావణుడు ముఖము చిట్లించుకొని-"అరే, దుష్టుడా! నేను నీతి, ధర్మం తెలిసినవాడను గాన, నీ కటు వచనాలు విని ఓర్చుకుంటున్నాను. నీతి, ధర్మాలను రక్షించడానికే నేను నీ మాటలు విని కూడా సహించి ఊరుకున్నాను." అన్నాడు.

"నీ ధర్మశీలత్వం నేను కూడా విన్నాను. నీవు పరాయి స్త్రీని దొంగతనంగా తీసుకొచ్చావు. కళ్ళతో మాతను ప్రత్యక్షించిన విధం కూడా చూశాను. ఇలాంటి ధర్మవ్రతధారివైన నీవు నీళ్ళల్లో మునిగి ఎందుకు చావలేదు? నీ చెల్లెలు, ముక్కు తెగిన సోదరి శూర్పణఖను చూసుకొని, ధర్మాన్ని ఓదారించే నీవు క్షమించావు. నీ ధర్మశీలత ప్రపంచం ప్రసిద్ధమై కోతైకూస్తున్నది. నీ దర్శనం పొందగలిగిన నేనూ అదృష్టవంతుడనే" అన్నాడంగదుడు.

"రే, మూర్ఖపశువా! వానరా! ఊరిక వాగకు. నా భుజాలను చూడు. ఇవి సమస్త మహాబలులైన లోకపాలకుల బలరూపమైన చంద్రుని మ్రింగి వేసే రాహువుతో సమానమైనవి.

ఆకాశరూపంలో వున్న చెరువులోని కమలల్లాంటి నా భుజాల పైన కైలాస పర్వతాన్ని ఎత్తి ఆపాను. శివుని సహితంగా ఆ కైలాస పర్వతం హంసలాగా ఎంత అందంగా ఉందో చూడు.

అంగదా, విను. నీ సైన్యంలో నాతో యుద్ధం చేయగల యోధునొకనిని చెప్పు. నీ ప్రభువంటావా, ఆయన భార్య ఎడబాటుతో చేవ చచ్చి ఉన్నాడు. ఆయన తమ్ముడు, అన్న దుఃఖాన్ని చూస్తు న్నాడు గాన, అతనూ దుఃఖంలో వుండి, ఉదాసీనుడైపోయాడు.

నీవు, సుగ్రీవుడు నది ఒడ్డున వున్న చెట్లు, నా సోదరుడు విభీష ణుడు, వాడూ చాలా పిరికివాడు. మంత్రి జాంబవంతుడు ముసలిబగ్గు. అతడు యుద్ధంలో ఏమి తట్టుకోగల్గుతాడు?

నలనీలులకు శిల్పకళ మాత్రమే తెలుసు. కాని ఒక కోతి వున్నాడు. అతడు చాలా బలవంతుడు. అతను ఇంతకు ముందు ఇక్కడకు వచ్చి,నగరాన్ని తగులబెట్టిపోయాడు" అన్నాడు రావణుడు.

"రాక్షసా! నిజం చెప్పు. నిజంగా ఆ వానరుడు లంకను తగు లబెట్టాడా? రావణుని నగరాన్ని ఒకచిన్న వానరుడు తగులబెట్ట

డమా? ఇలాంటి మాటలను సత్యమని ఎవరు నమ్ముతారు?

రావణా! నీవు పెద్ద యోధుడని పొగడుతున్న అతను, సుగ్రీవుని దూతలలో ఒక చిన్న దూత. పరుగులు తీసే వారందరు యోధులు కాలేరు. అతన్ని మేము కబుర్లు తెలిసికొని రమ్మని పంపాము.

ఆ వానరుడు ప్రభువు ఆజ్ఞ లేకుండానే నగరాన్ని తగులబెట్టాడా? అందువల్లనే తిరిగి వచ్చినప్పుడతను సుగ్రీవుని వద్దకు రాలేదు, భయంచేత ఎక్కడో దాక్కున్నాడు.

రావణా! నీవు నిజము చెప్పావు గాని నాకు కోపం రాదు. మా సైన్యంలో, నీతో యుద్ధంచేసి, గెలుపొందని వాడొక్కడూ లేడు.

"ప్రేమగాని, వైరం కాని సమానులతోనే ఉండాలి అని నీతి శాస్త్రం చెబుతున్నది. సింహము నక్కను చంపితే, దానినెవరైనా మంచి పని చేసిందంటారా? నిన్ను చంపటం శ్రీరాముని గౌరవానికి లోటు, దోషం కూడాను. అయితే, రావణా! విను, క్షత్రియ జాతి కోపం చాలా కఠినంగా వుంటుంది."

అంగదుడు గూఢార్థాల, మాటల బాణాలతో శత్రువు హృదయంలో భీతిని కలుగచేశాడు. ఆ బాణాలను వీరరావణుడు ప్రత్యుత్తరమను రూపంలోని నవ్వుతో బయటకు లాగి వేసికొంటున్నాడు.

రావణుడు నవ్వి-"వానరుల్లో ఒక గొప్ప గుణముంది. వారిని పోషించిన వారిని ఎలాగైనా కాపాడాలని ఎంతో ప్రయత్నాలు చేస్తారు. తమ స్వామి కొరకు సిగ్గువదలి, ఎక్కడబడితే అక్కడ నాట్యాలు వేస్తున్నారు. వారిలో ఏ ధర్మనిపుణత్వముంది. వారు ఎంతో ధన్యులు.

అంగదా! మీ జాతి వారందరు స్వామి భక్తులు, నీవు నీ స్వామి గుణాలను ఈ విధంగా ఎందుకు చెప్పవు? నేను గుణాలను

గ్రహిస్తాను, చాలా చతురుడను, అందువల్లనే నీ కఠోర వచనాలను నేను లక్ష్యపెట్టడం లేదు."

"నీ నిజమైన, గుణాలను లక్షణాలను, హనుమంతుడు చెప్పగా నేను విన్నాను. అతను నీ అశోక వాటికను ధ్వంసం చేశాడు, పుత్రుని చంపాడు, నగరాన్ని తగలెట్టాడు, అయినా అతన్ని నీవేమీ చేయలేకపోయావు.

నీ సాధుస్వభావాన్ని గ్రహించే, రావణా! నేను అవినయంగా నడచాను. హనుమంతుడు నాతో చెప్పినట్లుగానే, నేనిక్కడ చూస్తున్నాను. నీకు సిగ్గులేదు, రోషంలేదు, కోపం లేదు."

"రే, వానరా! నీకు ఇలాంటి బుద్ధి వుండబట్టే, తండ్రిని తినేశావు." అంటూ రావణుడు నవ్వాడు. "తండ్రిని తిన్నాను ఇప్పుడ నిన్నూ తినేస్తాను. అయితే నాకు కొంచె మర్థమయిపోయింది.

"ఓ, అధమ అభిమానీ! వాలికి నిర్మలమైన కీర్తి వుంది, ఆయనతో నిన్ను సమానుడను చేసి నిన్ను తినను. ఆయన్ను తిన్నా, చంపినా అందం, నీలాంటి వారిని చంపితే, గౌరవం తగ్గిపోతుంది.

రావణా! ప్రపంచంలో ఎంతమంది రావణులున్నారో, చెప్పు, నేను నా చెవులతో విన్న రావణులను చెప్తాను విను.

ఒక రావణుడు బలిని జయించాలని పాతాళలోకానికి వెళ్ళాడు. అతన్ని పిల్లలు గుర్రపుసాలలో బంధించారు. బాలకులు ఆటగా అతన్ని చావకొట్టేశారు. బలికి దయగలిగి అతన్ని వదలి పెట్టాడు.

మరొక రావణుడు సహస్రభాహును చూచి, అతన్ని అద్భుతమైన ఒకప్రాణి అనుకొని పట్టుకున్నాడు. తమాషాగా అతను ఇంటికి తీసుకెళ్ళాడు. పులస్త్యముని వెళ్ళి అతన్ని వదలించుకొచ్చాడు.

ఇంకొక రావణుని గురించి చెప్పడానికి నాకు సంకోచంగా

వుంది. అతను చాలా రోజులు వాలిచంకలో ఉన్నాడు. వీరిలో నీవు ఏ రావణుడవు? క్రోధం వదలి నిజం చెప్పు."

"మూర్ఖా! నా భుజాలసంగతి కైలాస పర్వతానికి తెలుసు; నా వీరత్వము శివునకు తెలుసు, నా తలలను పూలుగా భావించి ఆయన కర్పించాను, తలలరూపాల్లో వున్న కమలాలను నేనే స్వయంగా అనేకసార్లు శివునకు పూజచేశాను. శఠుడా! నా భుజాలబలాన్ని దిక్పాల కులు ఎరుగుదురు. వారి హృదయాల్లో ఇప్పటికీ నేనంటే హడలు.

దిగ్గజాలు నా భుజబలాన్నెరిగున్నాయి. నేను వాటి కఠోరమైన దంతాలను గట్టిగా తాకాను, వాటితో కలబడ్డాను, నా హృదయంలో అవెన్నడూ గుచ్చుకోకపోగా నా హృదయానికి తగిలి అవి ముల్లంగి దుంపలాగా విరిగి పోయాయి.

మదించిన ఏనుగులున్న నావ కదలనట్లుగా, నేను నడుస్తూ వుంటే భూమి కదలిపోతుంది. నేను ప్రతాపవంతుడనైన రావణు డను. నేను ప్రపంచంలో ప్రసిద్ధుడను. అరే, బూటకపు వాగుడు పోతా! ఈ సంగతులు నీ వెన్నడు వినలేదా?"

జగత్తులో ప్రసిద్ధి చెందిన, శూరవీరుడైన రావణుని నీవు తక్కువ అంచనా వేస్తున్నావు, మనుష్యుని గొప్పగా చెబుతున్నావు. రే తుచ్ఛ, దుష్ట వానరా! నేను నీ తెలివిని అర్థం చేసికొన్నాను."

వీవాళి మానీ! రావణా! నీవు ఒళ్ళు దగ్గర బెట్టుకొని మాట్లాడు. పరశురాముని గొడ్డలి సహస్రభాహువులు దట్టమైన అడవితో సమాన మైన భుజాలకు అగ్నిలాంటిది, ఆయన గొడ్డలి రూపమైన సముద్రం లోని లోతులో లెక్కలేనంత మంది రాజులు మునిగిపోయారు, ఆ పరశురాముని బలం శ్రీరామచంద్రుని చూడగానే నిర్వీర్యమైంది అలాంటి శ్రీరామచంద్రుడు మనుష్యుడెలా అవుతాడు?

అరే, మూర్ఖుడా! శ్రీరామచంద్రుడు మనుష్యుడా? కామదేవుడు ధనస్సును ధరించిన వాడా? గంగ నదియా? కామధేనువు పశువా? కల్పవృక్షము చెట్టా? అన్నదానము దానమా? అమృతము రసమా? గరుత్మంతుడు పక్షియా? శేషుడు సర్పమా? రావణా! చింతామణి కూడా రాయేనా? అరే, మందమతీ! రావణా! వైకుంఠం కూడా లోక మేనా? శ్రీరామచంద్రునియందు అఖండమైన భక్తి ఉండటం సాధారణ లాభమా?

సేనా సహితంగా నీ రాజ్యాన్ని అల్లకల్లోల పరచి, అశోక వాటికను ధ్వంసంచేసి, నగరాన్ని తగలెట్టి, నీ కొడుకును చంపి తిరిగి వచ్చినవాడు వానరుడా?

రావణా! విను, నీవు కపటాన్ని వదలి దయాసాగరుడైన శ్రీరాముని ఎందుకు భజించవు? అరే, దుష్టా! నీవు రామునకు వ్యతిరేకి వైనప్పుడు బ్రహ్మ, శివుడు కూడా నిన్ను రక్షించలేరు.

మూర్ఖా! అనవసరంగా బుగ్గలు వాయించుకోకు. బడాయిలు కొట్టుకోకు. రామునితో వైరం పెట్టుకుంటే, ఆయన బాణాలు తగులగానే నీ తలలు వానరుల ముందు నేలమీదపడే గతి పడుతుంది. నీ ఆ బంతుల్లాంటి తలలమీద ఎలుగుబంట్లు, వానరులు 'పోలో' ఆట ఆడుకుంటారు. యుద్ధంలో శ్రీరామచంద్రునకు క్రోధం వస్తే ఆయన పదునైన బాణాలు వదలబడి నీవైపు పరుగెత్తుతాయి. ఆ సమయంలో నీ బడాయిలు సాగుతాయా? ఇవన్నీ ఆలోచించి ఉదారుడైన శ్రీరాముని భజించు."

అంగదుని మాటలు వినేసరికి రావణుడు క్రోధంతో కాగిపోయి మండుచున్న అగ్నిలో నెయ్యిపోసినట్లుగా గద్దరించి పలికాడు- "నా సోదరుడు కుంభకర్ణుడు, ఇంద్రుని శత్రువు. సుప్రసిద్ధుడైన మేఘనాథుడు నా పుత్రుడు. నేను చరాచరాలన్నింటిని జయించినవాడను,

నా పరాక్రమాన్ని గురించి నీవు విని వుండకపోవచ్చు.

రే, మూర్ఖా! కోతుల సహాయంతో సముద్రంమీద వంతెన నిర్మించినాయన గొప్పతనాన్ని గురించి ఇందాకటి నుంచి బొల్లువాగుడు వాగుతున్నావు. పక్షులు ఎన్నో సముద్రాన్ని దాటిపోతున్నాయి. అవన్నీ వీరులు అనిపించుకోలేవు.

నా భుజాలు సముద్రాలు, వాటిలో బలరూపమైన జలం నిండి వుంది. దానిలో దేవతలు, మనుష్యులు, శూరవీరులు మునిగి చచ్చారు. ఈ గంభీరమైన, అపారమైన ఖరమై సముద్రాలను దాటేవాడెవడో చెప్పు?

నేను దిగ్గజాలతో నీళ్ళు నింపించాను. దుష్టా! నీవు ఒక్క రాజు గొప్పతనాన్ని నాకు చెపుతున్నావు. నీవు మాటిమాటికి ఏవో గుణాలున్నట్లు ఏకరువు పెడుతున్నావే, ఆ స్వామి అసలు యుద్ధం చేయగల యోధుడేనా? అయితే దూత నెందుకు పంపాడు? శత్రువుతో సంధి చేసికోవానికి అతనికి సిగ్గుండొద్దూ? రే, మూర్ఖ వానరా! కైలాసాన్ని మథనం చేసే నా భుజాలను చూడు, అప్పుడు మీ ప్రభువు గొప్పతనాలను చెప్పు.

నాలాగా, స్వయంగా తలలు సంతోషంగా నరికి అగ్నిలో హవనం చేసిన మగాడెవడున్నాడో చూపు లోకంలో, ఇందుకు శివుడే సాక్షి. నా తలలు తగులబడిపోయేటప్పుడు నా పుర్రెల మీద బ్రహ్మ వ్రాసిన వ్రాతలు శివుడు చూచాడు. మనుష్యుని చేతిలో నా చావు వుందని బ్రహ్మవ్రాస్తే, చదివి. ఆయన వ్రాసినది అబద్ధమని నవ్వాను కూడా. ఆ విషయం తెలిసి కూడా నేను భయపడను. ఎందుకంటే, ముసలిబ్రహ్మ మతిభ్రమచేత అలా వ్రాసి ఉంటాడు పాపం, రే, మూర్ఖా! నీకు సిగ్గు లేక మాటిమాటికి మరెవడో యోధుడని నా వద్ద కాకి కూతలు కూస్తున్నావు."

"రావణా! ప్రపంచంలో నీలాంటి సిగ్గున్నవాడెవ్వడూ లేడు. సిగ్గు నీ స్వాభావికమైన స్వభావమే. నీవు నీ నోటితో నీ అవగుణాలను ఎన్నడూ చెప్పవు. తలలు నరుక్కోవడం, కైలాసాన్ని ఎత్తిన కథ నీ మనస్సులో స్థిరపడిపోయింది. అందుకని దానిని ఇప్పటికి ఇరవై సార్లన్నా చెప్పావు. సహస్రభాహువు, బలి, వాలి నిన్ను ఓడించి, ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు త్రాగించిన సంగతులు చెప్పవు, దాస్తావు,

బుద్ధిలేని పంధా! ఇక నీ వాగుడు ఆపివేయుము. తలలు స్వయంగా నరుక్కున్న వాడెన్నడూ వీరుడు కాడు. గారడివాడు, తన చేతులతో తన శరీమంతా బరుక్కున్నంత మాత్రాన అతన్ని శూర వీరుడని ఎవడూ అనడు,

రే, మందబుద్ధీ! నీవు ఆలోచించుకో. బుద్ధి తక్కువగా నడచుకొని దీపప్పురుగులాగా మాడి చావకూడదని నా కోరిక. గాడిదలు ఎన్నో బరువులు మోస్తున్నా, వాటిని శూరవీరులనలేము.

దుష్టుడా! ఇక ఎక్కువగా వాగకు, అభిమానాన్ని వదలి నా మాటలు విను, దశముఖా! నేను దూతగా రాలేదు. నన్ను శ్రీరామచంద్రుడు దూతగా పంపలేదు. సింహానికి నక్కను చంపితే కీర్తి రాదు; శ్రీరాముని ఈ మాటలను విన్న నేను ఆయన ఆజ్ఞననుసరించి నీ కఠోరవచనాలు సహించాను. లేకపోతే నీ ముఖాన్ని త్రుంచి సీతను తీసుకెళ్ళి వుండేవాడను, అరే రాక్షసాధమా! నీవు ఎవరు లేకుండా చూచి పరాయిస్త్రీని తీసుకొచ్చినప్పుడే, నీ బలము నాకు తెలిసింది.

నీవు రాక్షసులకు ప్రభువువు, నేను శ్రీరామచంద్రుని సేవకుడను, సుగ్రీవుని సేవకుడను, దూతను, నేను శ్రీరామునికి జరిగిన అవమానంతో భయపడి వున్నట్లయితే, నేను ఇన్ని మాటలు మాట్లాడ గలిగే

వాడనేనా? నిన్ను భూమిమీద పడగొట్టి, నీ సైన్యాన్ని చంపి, నీ నగరాన్ని సర్వనాశనం చేసి, నీ స్త్రీలతో సహా జనకసుతను తీసుకు పోయేవాడను.

నేనలాచేస్తే, అందులో నా గొప్పతనమేమీ లేదు. చచ్చినవాడిని చంపడం వీరత్వంకాదు. వంకరనడక వాడు, వ్యభిచారి, లోభి, మూర్ఖుడు, అతి దరిద్రుడు పెద్దపేరున్నవాడు, ఎంతో ముసలివాడు, దీర్ఘరోగి, ఎప్పుడు క్రోధంతో ఉండేవాడు, హరిద్రోహి, వేద, సత్పురుషుల శత్రువు, తన శరీరాన్నే ప్రేమించుకునేవాడు, ఇతరులను నిందించేవాడు, పాపి. ఈ పద్నాల్గురు జీవన్మృతులతో సమానులు.

ఇవన్నీ ఆలోచించి, దుష్టుడా! నిన్ను నేను చంపడంలేదు. కాని, ఇప్పుడిక నాకు కోపం తెప్పించకు."

అంగదుని మాటలు విని క్రోధంతో రావణుడు పండ్లతో పెదిములను నొక్కుతూ, చేతులు నులుముకుంటూ-"అరే, నీచమైన కోతీ! ఇక ఇప్పుడు నీవు చావదలచుకున్నట్లున్నది. అందుకే పిట్టచిన్నది. శిరా శఘనమన్నట్లుగా, రెచ్చిపోతున్నావు. నీవు ఎవరి బలాన్ని చూచుకొనో, ఎగిరెగిరి పడుతున్నావు. ఆ బలవంతునకు బుద్ధి, తేజస్సు, పరాక్రమములేదని తేలిపోయింది.

అతనికి గుణాలు, ప్రతిష్ఠ లేదని తెలిసిన తండ్రి వనవాసానికి తోలేశాడు. అతనికి వనవాస దుఃఖము, భార్యా వియోగదుఃఖంతో పాటు నా భయము కూడా వుంది. నీ వేదో బలమున్నవాడని చెబుతున్నావే, అటాంటివారిని రాక్షసులు రాత్రింబవళ్ళు తినేస్తున్నారు. మొండిపట్టు వదలి ఆలోచించరా, మూర్ఖుడా!

రావణుడు శ్రీరాముని నిందించగానే అంగదునకు కోపం కట్టలు తెంచుకొని వచ్చింది. ఎందుకంటే, హరి, శివుల నిందలను

విన్నవారు, అప్పులను పంపినంత పాపాన్ని పొందుతాడు.

కపిశ్రేష్ఠుడైన అంగదుడు పండ్లు పటపట కొరికి రెండు చేతు లను గట్టిగా నేలమీద కొట్టాడు. భూమి ఊగిపోయింది. సభాసదు లందరు పోర్లపడ్డారు. వారందరు భయరూపమైన భూతము పట్టు కున్నట్లుగా పారిపోయారు.

రావణుడు పడిపోతూ సమాళించుకున్నాడు. ఆయన అంద మైన కిరీటాలు నేలమీద పడిపోయాయి. కొందరి నతను తన తలల మీద ఉంచుకున్నాడు. కొందరిని అంగదుడు శ్రీరామచంద్రుని వద్దకు విసరేశాడు. కిరీటాలు పడటం చూచి వానరులు పారిపోతూ– "దేవుడా! పగలే నక్షత్రాలు రాలిపోతున్నాయా? లేక రావణుడు కోపంతో "వేగంగా వచ్చు నాలుగు వజ్రాయుధాలను విసరివేశాడా?"

ప్రభువు శ్రీరామచంద్రుడు నవ్వుతూ–"భయపడవద్దు. ఇవినక్ష త్రాలూ, వజ్రాయుధాలు, జండాలు, రాహువు ఏమీ కావు. ఇవి అంగ దుడు విసరేసిన రావణుని కిరీటాలు." అన్నాడు.

హనుమంతుడు దూకి వాటిని పట్టుకొని, ప్రభువు వద్దకు తెచ్చి ఉంచాడు. ఎలుగుబంట్లు, వానరులు వాటి తమాషా చూస్తున్నారు. వాటి వెలుగు సూర్యుని వెలుగులాగా వుంది.

అక్కడ, సభలో రావణుడు క్రోధంతో "పరుగెత్తండి, ఈ కోతిని పట్టుకోండి, పారిపోనివ్వద్దు. ఎక్కడవాళ్ళక్కడ పరుగులు తీసి వానరులను పట్టుకొని తినండి.

అందరు వెళ్ళి, భూమిమీద వానరులను లేకుండా చేయండి. తాపసులుగా వున్న ఆ ఇద్దరన్నదమ్ములను ప్రాణాలతో పట్టుకురండి." అన్నాడు.

అంగదుడు–"నీకు, జడాయిలు కొట్టుకోవడం సిగ్గెయ్యడంలేదు. అరే, నిర్లజ్జ కులనాశకుడా! గొంతు పిసుక్కొని చావు. నా పరాక్రమం

చూసి కూడా, నీ గుండె పగిలి పోవడం లేదా? అరే, స్త్రీ దొంగా! చెడు నడవడికలు కలవాడా, మహాపాపీ, మందబుద్ధీ, మదమత్తుడా! నీవు సన్నిపాత రోగంతో ఎందుకు వాగుతున్నావు? రే, దుష్ట నర భక్షకుడా! ఇప్పుడు నీవు కాలానికి వశుడవైపో. ఈ రామనిందకు ఫలమేమిటో నీకు తెలుసా? వానరులు, ఎలుగుబంట్లు నీ చంపలు చినప్పుడు తెలుస్తుంది.

రే, అభిమానీ! శ్రీరాముడు మనిషి అన్నప్పుడు నీ నాలుక ఎందుకు తెగి పడిపోవడంలేదు? నీ నాలుకలు తలలతో సహా రణ భూమిలో పడిపోతాయనుటలో సందేహమేమీలేదు.

రే, రావణా! వాలిని ఒక్కబాణంతో చంపిన వాడు మనుష్యుడా? నీ ఇరవై కండ్లు గ్రుడ్డివై పోయాయి. రే, అజ్ఞానీ! నీవు పుట్టడమే దండుగ. శ్రీరాముని బాణాలు నీ రక్తము కొరకు దప్పికగొని వున్నాయి. రే, వాగుడు కోరూ! ఆ భయంతోనే, అంటే రాముని బాణాలతో నీవు చావావాల్సివుంది గాన, నిన్ను వదలివేస్తున్నాను.

నేను నీ పండ్లూడ గొట్టడానికి కూడా సమర్థుడను. కాని, నాకు శ్రీరాముని ఆజ్ఞ లేదు. నీ పది తలలను త్రుంచివేయాలని, లంకను పెరికి సముద్రంలో పారవేయాలన్నంత క్రోధము వస్తున్నది. నీ లంకమేడిపండు లాంటిది. పురుగులుగా మీరందరూ అందులో వున్నారు. నేను వానరుడను, పండ్లు తినడంలో నాకేమీ అడ్డుండదు. మరి ఏమి చేయను? దాతడైన రామచంద్రుని ఆజ్ఞ నాకు లేదు." అన్నాడు ఘాటుగా.

అంగదుని చాకచక్యమయిన మాటలు విని రావణుడు నవ్వుకొని-"బాగా అబద్ధాలాడడం నీ వెక్కడ నేర్చుకున్నావు? వాలి ఎన్నడూ ఇలా బడాయిలు కొట్టుకోలేదు నీవు తాపసులను కలసిన తరువాత, వదరబోతువయిపోయావు" అన్నాడు.

"అరే. ఇరవై చేతులవాడా! నేను నీ పది నాలుకలు పెరికి పారవేయకపోతే, నిజంగా వనరుపోతునే" అంటూ అంగదుడు శ్రీరాముని ప్రతాపాన్ని స్మరించుకొంటూ, క్రోధంగా సభలోకి ప్రతిజ్ఞ చేసి కాలు పెట్టి "రే, మూర్ఖుడా! నా కాలు నీవు తొలగించగలిగితే, శ్రీరాముడు తిరిగి వెళ్ళిపోతాడు. నేను సీతను వదలి పెట్టి వెళ్ళిపోతాను. కాదా సీతరాములు కలసి వెళ్తారు అప్పుడు నేను నా ఓటమి ఒప్పుకుంటాను." అన్నాడు,

"యోధులారా! ఈ వానరుని కాలు పట్టుకొనిలాగి భూమిమీద పారవేయండి." అన్నాడు రావణుడు.

మేఘనాధుడు మొదలైన బలవంతులనేకమంది సంతోషంగా ఎక్కడివారక్కడ లేచారు. వారు ఎగసిరుతూ, ఎంతో బలం చూపి అనేక ప్రయత్నాలు చేస్తున్నారు, కాని కాలు కదల్చలేకపోతున్నారు, అందరు తలలు వంచి కూచున్నారు.

కాగభుశుండి అంటున్నది. "గరుత్మంతా! మరల లేచి రాక్షసులు పైకురికారు. కాని, వెడిపోయిన యోగి మోహరూపమైన వృక్షాన్ని పెకలించలేనట్లుగా, అంగదుని కాలు అటుఇటు కదలడం లేదు.

కోట్ల విఘ్నాలు వచ్చినప్పటికి కూడా, భక్తుల మనస్సులు నీతిని తప్పనట్లుగానే, అంగదుని కాలు భూమి మీద నుండి లేవడం లేదు. ఇదంతా చూచిన శత్రువైన రావణుని గర్వం తగ్గుతూ ఉంది. అంగదుని పరాక్రమం చూచి, అందరు వెనుకంజ వేశారు. అప్పుడు రావణుడు స్వయంగా లేచి, అంగదుని పాదము పట్టుకోబోయినప్పుడు వాలి కుమారుడైన అంగదుడు-

"నా పాదాన్ని పట్టుకున్నందున నీ ఉద్ధరణ జరుగదు. మూర్ఖుడా! నీవు వెళ్ళి రాముని కాళ్ళు ఎందుకు పట్టుకోవు?" అన్నాడు.

ఇలా అనేసరికి, అతను, మనస్సులో ఎంతో కుంచుకుపోయి కూచున్నాడు. ఆయన ముఖంలోని కళ మారి పోయింది. అందం తగ్గిపోయింది, అతన్ని చూస్తే మిట్ట మధ్యాహ్నంవేళ చంద్రునిలాగా వున్నాడు.

రావణుడు సింహాసనంమీద తలవంచి, సంపదలన్నీ పోగొట్టుకొన్నవానిలాగా కూచున్నాడు. జగత్తుకు ఆత్మ, ప్రాణాలకు స్వామి అయిన శ్రీరామునకు ద్రోహం చేసేవాడు ఎలా శక్తిని పొందగల్గుతాడు?

"ఉమా! శ్రీరాముని చూపులతో సంసారము యొక్క ఉత్పత్తి నష్టములు జరుగుతున్నాయి. గడ్డిపోచను వజ్రాయుధంగాను, వజ్రాయుధాన్ని గడ్డిపరకలాగా చేసే, ఆయన దూత యొక్క ప్రతిజ్ఞ ఎలా వట్టిదయిపోతుంది?

అంగదుడు అనేక విధాలుగా హితాన్ని చెప్పాడు, కాని రావణుడు ఒప్పుకోలేదు, ఆయన కాలము దగ్గరకు వచ్చింది. శత్రువు గర్వాన్ని చూర్ణంచేసి ప్రభువు యొక్క కీర్తిని వినిపించి అంగదుడు వెను తిరిగి వచ్చాడు.

యుద్ధంలో నిన్ను ఆటలాడించి చంపనంతవరకు, ఇప్పుడే నా గొప్పతనాన్ని ఏమి చెప్పను? అంగదుడు మొదటనే ఆయన కుమారుని చంపేశాడు, ఈ సమాచారం విన్న రావణుడు ఎంతో దుఃఖించాడు. అంగదుని బలాన్ని చూచి రాక్షసులందరు వ్యాకులపడిపోయారు.

శత్రువు గర్వాన్ని మట్టు పెట్టి వాలిపుత్రుడు, అంగదుడు సంతోషంగా శ్రీరాముని పాదకమలాలను పట్టుకున్నాడు. ఆయన శరీరం పులకించిపోయింది, కళ్ళంట నీళ్ళొచ్చాయి.

రావణుడు సాయంకాలం అయినట్లు గ్రహించి, దుఃఖంతో తన

మహాలుకు వెళ్ళాడు.

"నాథా! మనస్సులో ఆలోచించి చెడు బుద్ధిని వదలండి. శ్రీరాముని తో యుద్ధం చేయడం మీకు సబబుకాదు. లక్ష్మణుడు ఒక చిన్న గీత గీస్తే, ఆ గీతనే మీరు దాటలేకపోయారు. అలాంటి మీ వీరత్వాన్ని ఒకసారి జ్ఞప్తికి తెచ్చుకోండి.

నాథా! ఆయన దూతలు చీకూచింతలు లేకుండా తేలికగా సముద్రాన్ని దాటివచ్చారు. అలాంటి దూతలకు స్వామి అయిన శ్రీరాముని మీరు గెలువగలరా? సముద్రాన్ని దాటిన వాడు సింహంలాంటి వీరుడు. అతను నిర్భయంగా లంకలోకి ప్రవేశించినప్పుడు అతని నేమీ చేయలేని మీరు, అతని ప్రభువును జయించగలరా?

ఆయన రాక్షసులను వధించి వనాన్ని ధ్వంసం చేయడమే గాక, మీ కళ్ళ యెదుటనే అక్షయ కుమారుని చంపేశాడు. లంకను తగులబెట్టి బూడిద చేసి వెళ్ళాడు. అప్పుడు మీ బలమూ, గర్వమూ ఏమయిపోయాయి?

స్వామీ! ఇప్పుడు అనవసరంగా అతిగా ప్రవర్తించకండి. నేను చెప్పేమాటలను మనస్సులో బాగా ఆలోచించండి. శ్రీరాముని కేవలం రాజని మాత్రం అనుకోవద్దు, ఆయన చరాచర జగత్తుకు స్వామి. మహాపరాక్రమవంతుడనేది మరచిపోకండి!

ఆయన బాణప్రతాపాన్ని మారీచుడు రుచి చూచాడు. అతను చెప్పిన మాటలు మీ చెవి కెక్కలేదు. జనకమహారాజు సభలో లెక్కలేనంతమంది రాజులున్నారు. అక్కడ చెప్పడానికి వీలులేనంత గర్వము, బలమున్న మీరు కూడా ఉన్నారు.

శ్రీరాముడు ధనస్సును త్రుంచి, సీతను పెండ్లాడినప్పుడు ఆయనను యుద్ధంలో ఎందుకు జయించలేదు? ఇంద్రుని పుత్రుడు జయంతుడు, ఈయనతో బలము తక్కువవున్నదని, ఆలోచించి

ప్రాణాలు పోగొట్టుకోలేదు కాని, ఒక కన్ను పోగొట్టుకున్నాడు, శూర్పణఖ పరిస్థితి మీకు బాగా తెలుసు. అయినా మీకు సిగ్గుగా లేదు.

విరాధుని, ఖరదూషణులను, ఆటగా కబంధుని ఒక్కబాణంతో వాలిని చంపినవాని, మహత్త్వాన్ని తెలిసికోనాథా!

చిటికలో సముద్రంమీద వంతెన ఏర్పరచిన వాడు వానర సహితంగా సువేల పర్వతం మీదకు వెళ్ళి బసచేసిన వాడు, దయ గలిగి, మీ మేలు కోరి, సూర్యవంశంలో శ్రేష్ఠుడైన శ్రీరామచంద్రుడు మీ కంటే అన్ని విధాలా గొప్పవాడైనా దూతను పంపాడు.

సభ మధ్యలో మీ బలాన్ని మధించి చూచిన వారు, ఏను గుల్లో సింహంలాంటివారు, అయిన అంగద హనుమంతులు రణశూ రులు, శ్రేష్ఠ వీరులు, ఆయన సేవకులు.

నాథా! మీరు ఆయనను ఎంతసేపటికి మనిషి, మనిషి, అంటు న్నారు. మీరు అనవసర గౌరవానికి పోయి, మమతను కాదని మదా న్ని పోషిస్తున్నారు. స్వామీ! మీరు శ్రీరామునితో వైరము కొని తెచ్చుకున్నారు, కాలానికి వశులై పోయారు. అందువలన మీ మన స్సులోకి బుద్ధి ప్రవేశించడం లేదు.

కాలము ఎవరిని చంపదు? అది ధర్మాన్ని, బలాన్ని బుద్ధిని, ఆలోచనలను పనిచేయకుండా చేస్తుంది. కాలము సమీపించిన వారికి మీలాగానే మతిభ్రమించి పోతుంది.

మీ యిద్దరి బిడ్డలు చంపబడ్డారు, నగరం తగలడిపోయింది, ఇకనైనా మీ పొరపాటును సరిచేసికోండి. శ్రీరాముని భజించి, శ్రేష్ఠ మైన కీర్తిని సంపాదించుకోండి," అంది మండోదరి.

రాణి మండోదరి యొక్క ఘాటైన, పోటు మాటలు విని, ఉదయం కాగానే, రావణుడు లేచి తన సభలోకి వెళ్ళి, భయాన్ని

మరచి ఎంతో అభిమానంగా సింహాసనం మీద కూచున్నాడు.

ఇక్కడ సువేల పర్వతం మీదనున్న శ్రీరామచంద్రుడు అంగదుని పిలిచాడు. అంగదుడు వచ్చి పాదకమలాలయందు తల వంచాడు. ఎంతో ఆదరంగా తన వద్ద కూచోబెట్టుకొని, నవ్వుతూ దయామయుడైన, రామచంద్రుడు-"అంగదా! నాకు చాలా ఉల్లాసంగా వుంది. సోదరా! నిన్ను నేను అడిగే విషయాలకు సమాధానం చెప్పు, రావణుడు రాక్షసులకు తలమానికము. అతని భుజాల, అంతులేని, పరాక్రమాన్ని ప్రపంచమంతా నెత్తిన నోరు పెట్టుకొని చెప్పుకుంటున్నది, అతని కిరీటాలు నీవు విసరేశావు. ఆ కిరీటాలు నీకెలా చిక్కాయి?" అన్నాడు

"సర్వజ్ఞా! అవి కిరీటాలు కావు, రావణుని యొక్క నాలుగు గుణాలు. సామ, దాన, భేద, దండోపాయాలు రాజు హృదయంలో ఎప్పుడూ వుంటాయని వేదాలు చెప్పాయి. ఈ నాలుగు నీతి, ధర్మాలకు అందమైన పాదాలు. అలా అనుకొని ఇవి మీ వద్దకొచ్చాయి.

ధర్మహీనుడు, ప్రభు పాదాలయందు ప్రేమలేని రావణుడు కాలవశమయిపోయాడు. కోసలాధీశా! అందువలనే గుణాలు అతనిని వదలి మీ శరణుజొచ్చాయి.

ఉదారుడైన రామచంద్రుడు అంగదుని విచిత్రమైన చాతుర్యాన్ని విని నవ్వాడు. వాలి పుత్రుడు లంక సమాచారమంతా చెప్పాడు.

శ్రీరామచంద్రుడు శత్రువు సమాచారమంతా తెలిసికొని మంత్రులను పిలచి అన్నాడు-"లంకలో నాలుగు విచిత్రమైన ద్వారాలున్నాయి. వాటిలో ఏ విధంగా ప్రవేశించాలి? ఈ విషయం ఆలోచించి చెప్పండి."

అప్పుడు సుగ్రీవుడు, జాంబవంతుడు, విభీషణుడు హృద

యంలో శ్రీరామచంద్రుని స్మరించుకొని ఒండారులు ఆలోచించి వానర సైన్యాన్ని నాలుగు జట్లగా విభజించారు. వారి కొరకు తగిన సేనాపతులను నియమించారు. సేనాపతులందరిని పిలిచి, అందరితో శ్రీరామచంద్రుని ప్రతాపాన్ని గురించి చెప్పారు. ఆ మాటలను విని వానరులందరు పెద్దగా అరచుకొంటూ పరుగులు తీశారు.

వారు సంతోషంతో శ్రీరామచంద్రుని పాదాల మీద తల ఉంచి, పర్వత శిఖరాలను తీసికొని పరుగెత్తుకున్నారు, "రాజా రామచంద్రునికి జై" అంటూ ఎలుగుబంట్లు, వానరులు గర్జిస్తున్నారు, రెచ్చగొడుతున్నారు.

లంకకోట చాలా దుర్గమమయినదని వానరులకు తెలుసు, అయినా వారు ప్రభువు ప్రతాపంతో నిర్భయంగా వెళ్ళారు. దట్టమైన మేఘాలలాగా నలువైపు చుట్టు ముట్టి, వారు నోళ్ళతోనే నగారాలు, బాకాలు ఊదుతున్నారు.

మహాబలవంతులైన ఆ వానర, ఎలుగుబంట్లు శ్రీరామునికి జై "అంటూ వానరరాజు సుగ్రీవునికి జై' అంటూ సింహనాదం చేస్తున్నారు.

లంకలో చాలా గందరగోళమేర్పడింది. అంతులేని అహంకారమున్న రావణుడు ఇదంతా విని-"ఈ వానరుల అవిధేయత చూడండి." అంటూ నవ్వి, తన రాక్షస సైన్యాన్ని పిలిపించాడు.

"కాలం పంపిన వానరులు ఇక్కడకు వచ్చారు, మా రాక్షసులందరు ఆకలితో ఉన్నారు" అంటూ మూర్ఖ రావణుడు, బ్రహ్మ, ఇంటి వద్ద వున్న వారికే భోజనాలు పంపాడని పిచ్చి నవ్వు నవ్వి, "వీరులారా! మీరు నాల్గు దిక్కుల్లో వెళ్ళండి, పట్టుకొని ఎలుగుబంట్లను, వానరులను తినేయండి." అన్నాడు.

"పార్వతీ! రావణునకు వచ్చినంత అభిమానముంది." అన్నాడు శివుడు.

రాక్షసులు ఆజ్ఞ తీసుకొని, చేతుల్లో బల్లాలు, ఈటెలు, బరిసెలు, రోకళ్ళు, త్రిశూలాలు, కత్తులు, గండ్రగొడ్డళ్ళు, పర్వతశిలలు తీసికొని వెళ్ళారు.

మాంసాహార మూర్ఖ పక్షులు ఎరుపురంగులో వున్న అనేకమైన రాళ్ళను చూచి, వాటి మీద, ముక్కులు విరిగిపోతాయను ఊహ కూడా చేయకుండా కవసినట్లుగా మూర్ఖ రాక్షసులు పరుగులు తీశారు.

అనేక రకాల ఆయుధాలు, ధనస్సులు, బాణాలు ధరించి, కోట్ల ఉత్తమ వీరులు, రణధీరులైన రాక్షసులు, ప్రహరీ గోడల శిఖరాల మీద ఎక్కి కూచున్నారు. వారు కూర్చున్నప్పుడు చూస్తే, సుమేరు పర్వత శిఖరాల మీద మేఘాలు కూచున్నట్లుగా, శోభాయమానంగా ఉన్నారు. డోళ్ళు, వాయిద్యాలు, యుద్ధ సంబంధమైన వాయిద్యాలు వాయిస్తున్నారు. వాటిని విని యోధుల మనస్సులలో ఉత్సాహం పెరిగిపోతున్నది.

లెక్కలేనన్ని బాకాలు, సన్నాయీలు మ్రోగుతూ ఉన్నాయి. వాటిని విన్న పిరికి వాళ్ళకు కూడా గుండెలు పగిలిపోతున్నాయి. వాళ్ళందరు వెళ్ళి వానరుల సమూహాలను చూచారు. మహా విశాలమైన శరీరాలు గల ఎలుగు బంట్ల యోధులున్నారు.

ఎలుగుబంట్లు, వానరులు పరుగులు తీస్తూ లోయలను కూడా లెక్కచేయడంలేదు. వారు కొండలను పగులగొట్టి మార్గాలు ఏర్పరచారు. కోట్లమంది వీరులు పండ్లు పటపట కొరుకుతూ దంతాలతో పెదాలు నొక్కుకుంటూ పందేలు వేస్తున్నారు. అటు రావణునిమీద ఇటు రాముని మీద ఒట్లు పెట్టుకుంటున్నారు. జయజయ కారాలు చేస్తూ, యుద్ధాలు చేస్తున్నారు. రాక్షసులు పైనుండి కొండలు విసరి

వేస్తున్నారు, వానరులు వాటిని పట్టుకొని మరల రాక్షసుల మీదకు విసిరేస్తున్నారు.

కొండల పెళ్ళలు తీసుకొని వానరులు, ఎలుగుబంట్లు కోట మీద విసరేస్తున్నారు. కొందరు ఉరికి రాక్షసుల పాదాలు పట్టు కొని భూమిమీద వేసికొట్టి పారిపోతూ రెచ్చగొడుతున్నారు. ఎంతో మరుకైన ప్రతాపవంతులైన వానరులు, ఎలుగుబంట్లు ఎగిరికోట మీద, భవనాలమీద ఎక్కి శ్రీరాముని కీర్తిని గానం చేస్తూన్నారు.

ఒక్కొక్క రాక్షసుని పట్టుకొని వానరులు పారిపోయారు. పైన వానరులుండి, క్రింద రాక్షసులనుంచి నేలమీద పడుతూ ఉన్నారు. శ్రీరామచంద్రుని ప్రతాపంతో వానరుల గుంపులు రాక్ష సుల సమూహాలను మట్టి కరిపిస్తున్నాయి. మరల వానరులు కోట మీద ఎక్కి అక్కడక్కడ "సూర్యునితో సమానమైన ప్రతాపవం తుడు శ్రీరామునికిజై" అంటున్నారు.

తీవ్రమైన గాలి కొట్టినప్పుడు మేఘాలు చెల్లాచెదరయి పోయిన ట్లుగా, రాక్షసుల గుంపులు పారిపోతున్నాయి. లంకాపట్టణంలో ఎంతో హాహాకారాలు వ్యాపించాయి. పిల్లలు, వికలాంగులు, స్త్రీలు ఏడుస్తున్నారు. అందరు కలసి రావణుని సుఖంగా రాజ్యం చేస్తూ ఈయన బాధను పిలిచాడని తిడుతున్నారు. రావణుడు, సైన్యం పారిపోతున్న విషయము విన్నప్పుడు, యోధులను పిలిపించి క్రోధంతో-"వీపులు చూపి యుద్ధాన్నుండి పారిపోయి వచ్చిన వారం దరిని నా పదునైన కత్తితో నరికి వేస్తా. నా సొమ్మంతా తిని అనేక సుఖభోగాలనుభవించిన మీకు ఇవాళ ప్రాణాలు తియ్యనయినాయా?" అన్నాడు.

రావణుని కఠోర వచనాలు విన్నవీరులందరు భయపడి, సిగ్గు పడి క్రోధంతో తిరిగివచ్చి, ఎదురుగా యుద్ధం చేసి చావడమే వీరుల

లక్షణమని ఆలోచించి, తమ ప్రాణాల యందు మోహము వదలి వేశారు.

అనేక అస్త్రశస్త్రాలు ధరించి రాక్షస యోధులు వానరులను రెచ్చగొట్టి, కలియబడ్డారు. వారు కర్రలు, త్రిశూలాలతో బాదమోది ఎలుగుబంట్లను, వానరులను చికాకు పరచారు.

"పార్వతి! వానరులు భయంతో పారిపోతున్నారు. వారి చేష్టలు చూస్తుంటే ముందు కాలంలో వారే జయిస్తారా, అన్నట్లున్నది.

"అంగద, హనుమంతులెక్కడ? బలవంతులైన నలనీలులెక్కడ ఉన్నారు?" అంటున్నారు కొందరు వానరులు.

వానరులందరు వ్యాకులంతో ఉన్నారని విన్న సమయంలో హనుమంతుడు పశ్చిమ దిక్కున ఉన్నాడు. అక్కడ మేఘనాధుడు యుద్ధం చేస్తున్నాడు. ఆ ద్వారం విరుగడం లేదు, చాలా గట్టిగా వుంది, వీర హనుమానునకు కోపం వచ్చింది. ఆయన ప్రళయంగా పెద్దగా గర్జించి లఖించి లంక కోట మీద ఎక్కి, పర్వతాన్ని చేతిలోకి తీసికొని మేఘనాధుని వైపు పరుగెత్తి, రథాన్ని త్రుంచివేసి, సారథిని చంపి, మేఘనాధుని రొమ్ము మీద ఒక తన్ను తన్నాడు. రెండవ సారథి మేఘనాధుడు వ్యాకులంగా ఉన్నట్లు తెలిసికొని, రథంమీద ఎక్కి వెంటనే రాజభవనానికి తీసికెళ్ళాడు.

యుద్ధంలో శత్రువులకు విరుద్ధంగా ఇద్దరు వానరులు క్రోధంలో వున్నారు. శ్రీరామ చంద్రుని స్మరించుకొని ఇద్దరు పరుగెత్తి రావణుని భవనం మీద కూచుని, కోసలాధీశుడైన రాముని కీర్తిస్తున్నారు.

వారు కలశాలతో సహా భవనాన్ని పట్టుకొని పడగొట్టారు. ఇది చూచి రాక్షసరాజు భయపడ్డాడు, స్త్రీలందరు చేతులతో గుండెలు

బాధుకుంటూ, ఇప్పుడు ఇద్దరు గందరగోళం వేసే వానరులు వచ్చా రు' అనుకుంటున్నారు.

ఆ వానరులు బెదరిస్తూ వారిని భయపెట్టడం, రామచంద్రుని కీర్తిని గొప్పగా చెప్పుకోవడం చేస్తున్నారు. మరల చేతులతో బంగారు స్తంభాలను పెరికివేసి. ఇప్పుడిక ఉపద్రవం ఆరంభించండి" అంటూ వారు, శత్రుసేనలోకి గర్జించి దూకి, చేతులతో శత్రువులను కొడుతు న్నారు. "మీరు రాముని భజించరా, అందుకు ఫలమనుభవిం చండి" అంటూ కొందరు తంతుంటే, మరికొందరు కొడుతున్నారు.

ఒకడ్ని పట్టుకొని, రెండవనాని మీద వేసినొక్కివేస్తున్నారు. తలలను త్రుంచి పారేస్తున్నారు. ఆ తలలు వెళ్ళి రావణుని ముందు పడి, పెరుగుకుండలు పగిలినట్లుగా, పగిలిపోతున్నాయి.

పెద్ద పెద్ద సరదారుల కాళ్ళు పట్టుకొని ప్రభువు వద్దకు విసరి వేస్తున్నారు. విభీషణుడు వారి పేర్లు చెబుతున్నాడు. రామచంద్రుడు వారికి కూడా తన వద్ద స్థానమిస్తున్నాడు.

బ్రాహ్మణుల మాంసాలు తినే దుష్ట రాక్షసులు కూడా, యోగు లు కోరుకొను మోక్షాన్ని పొందుతున్నారు.

పార్వతీ! శ్రీరామచంద్రుడు చాలా దయగలవాడు. రాక్షసులు వాకు వైరభక్తులని ఆయన అనుకుంటున్నాడు. భవానీ! ఇలాంటి ప్రభువును తమతమ భ్రమలు వదలి భజించని వారు దురదృష్ట వంతులు. ఆయన లాంటి వారు ఆయనే కాని మరెవ్వరున్నారు?

శ్రీరామచంద్రుడు, "అంగదుడు, హనుమంతుడు కోటలో జొరబడ్డారు. వారిద్దరు, రెండు మందరాచలాలు సముద్రాన్ని మథి స్తున్నట్లుగా, వారు లంకను సర్వనాశనం చేస్తున్నారు, ఉల్లాసంగా కూడా ఉన్నార"ని అందరితో అన్నాడు.

తమ చేతుల బలంతో శత్రుసేనను నుగ్గు నుగ్గు చేసి, పగలు

గడవిపోతున్నట్లు చూచి, హనుమంతుడు, అంగదుడు ఇద్దరు కష్ట మేమీ లేకుండానే, శ్రీరామచంద్రుడున్న చోటకి దూకి వచ్చారు. శ్రీ రామచంద్రుడు చాలా సంతోషించి, వారిని కృపాదృష్టితో చూచాడు. వారిద్దరి శ్రమలు పోయి, ఎంతో సుఖమనుభవించారు. అంగదుడు హనుమంతుడు వెళ్ళినట్లు తెలిసికొని ఎలుగుబంటులలోని యోధులు తిరిగి వెళ్ళారు. సాయంకాలపు బలము పొంది రావణుని తిడ్తూ వాన రులు వెంట పడ్డారు.

రాక్షససేనలు వస్తున్నాయి. వారు తిరిగి వచ్చి తిరుగబడ్డారు. రెండుసేనలు బలమైనవే. యోధులు సవాళ్ళు చేస్తూ యుద్ధం చేస్తు న్నారు, ఎవరూ ఓడడం లేదు.

రాక్షసులందరు నలుపు, వానరులు కూడా విశాలమైన శరీ రాలు గలవారు, రంగుల రంగులలో ఉన్నారు. రెండువైపుల బల వంతులు, యోధులు సమానంగా ఉన్నారు. వీరత్వము తన ఆటలు చూపిస్తున్నదా, అన్నట్లుగా, కోపంతో వారు పోట్లాడుకుంటున్నారు. వర్షఋతువు, శరదృతువులలోని మేఘాలు గాలి ఊపుతో ప్రేరితమై పోట్లాడుకుంటున్నాయా, అన్నట్లుగా వుంది.

సేనా పతులైన అకంపనుడు, అతికాయుడు అను రాక్షసులు తన సేన విచలితమై పోతున్నట్లు చూచి రాక్షస మాయను ప్రయోగిం చారు. క్షణంలో దట్టమైన చీకటి ఏర్పడిపోయింది. రక్తము, రాళ్ళు, బూడిద వర్షం కురువసాగింది.

పది దిక్కులలో కటిక చీకటి చూచిన వానర దళానికి ఏమీ తోచలేదు. గోలగోలగావుంది. ఎవరికి ఎవరూ కనిపించడం లేదు. ఎక్కడ వాళ్ళక్కడ అరుస్తున్నారు.

శ్రీరామచంద్రుడు రహస్యమంతా తెలిసికొని అంగద, హను మంతులను పిలిచి, విషయమంతా తెలిసికొని, వారికి తెల్పియజెప్పాడు

వా రిద్దరు వీరులు క్రోధంతో పరుగెత్తారు.

కృపానిధి శ్రీరామచంద్రుడు నవ్వి, ధనస్సు ఎక్కుపెట్టి వెంటనే అగ్ని బాణాన్ని వదిలాడు. జ్ఞానం కలిగిన తరువాత సందేహాలు లేకుండ పోయినట్లుగ, ఆ బాణంతో వెలుతురు వచ్చి చీకటి లేకుండా పోయింది. ఎలుగుబంట్లు, వానరులు వెలుతురు రాగానే అలసట పోయి, నిర్భయులై క్రోధంతో పరుగెత్తారు. అంగద హనుమంతులు రణంలో గర్జించారు, వారి కేకలు విని రాక్షసులు పారిపోయారు. పారిపోతున్న రాక్షసులను ఎలుగు బంట్లు, వానరులు పట్టుకొని నేల మీద కొట్టారు. అద్భుతమైన చేష్టలు చేస్తున్నారు. కాళ్ళు పట్టుకొని వారిని సముద్రంలోకి విసిరేస్తున్నారు. వారిని మొసళ్ళు,చేపలు తింటున్నాయి.

కొంతమంది చచ్చారు, కొందరు దెబ్బలుతిన్నారు. కొందరు పారిపోయి కోటమీద ఎక్కారు. శత్రుసేనను గందరగోళంచేసి వానరులు, ఎలుగుబంట్లు పెద్దగా అరుస్తున్నారు.

రాత్రి అయినట్లు తెలసికొని నాలుగు రకాల సేన, శ్రీరామ చంద్రుడున్న చోటుకు వచ్చింది. శ్రీరామచంద్రుడు కృపాదృష్టితో చూచే కొలది, వానరులందరి అలసటలు దూరమైపోతున్నాయి.

అక్కడ రావణుడు మంత్రులను పిలచి "చచ్చిన యోధులందరి పేర్లు చెప్పూ, వానరులు సగం సైన్యాన్ని చంపారు, ఇప్పుడేమి చేయాలి?" అని అడిగాడు.

మాల్యవంతుడను పేరుగల ఒక ముసలి రాక్షసుడున్నాడు. అతను రావణునకు తాత (అమ్మ తండ్రి) శ్రేష్ఠుడైన మంత్రి. అయన అతిపవిత్రమైన నీతులు చెప్పాడు-"నేను చెప్పేది విను, రావణా! నీవు జానకిని తీసుకొచ్చినప్పటి నుండి ఎటువంటి అపశకునాలవుతు న్నాయో, చెప్పడం కష్టం, వేదాలు, పురాణాలు గానం చేసే అయన

తో వైరం పెట్టుకున్న వారెవ్వరు సుఖపడలేదు. హిరణ్యకశిపుసహితంగా హిరణ్యాక్షుని, మహాబలశాలురైన మధుకైటభులను చంపిన ప్రభువు, కృపాసింధువు, భగవంతుడు, రామరూపంలో అవతరించాడు.

## 29

ఆయన, దుష్టులైన రాక్షస రూపవనాన్ని తగలెట్టడానికి కాలాగ్నితో సమానుడు. గుణాలకు విధి, పరిపూర్ణజ్ఞానవంతుడు. శివుడు, బ్రహ్మ కూడా ఆయన భజనలు చేస్తున్నారు. ఆయనతో వైరం వద్దు.

నీవు సీతను ఆయన కిచ్చి, పరమ స్నేహపాత్రుడైన రాముని భజించు." అన్నాడు మాల్యవంతుడు,

ఆయన మాటలు రావణునకు బాణాల్లాగా గుచ్చు కొన్నందున-"ఓయీ పనికి మాలినవాడా! ఇక్కడనుండి వెళ్ళిపో ఇంకా నాకు నీ ముఖం చూపేవంటే, తరువాత ఏమయేది, నాకే తెలియదు.

నీవు ముసలివాడవయిపోయావు, లేకపోతే నిన్నిప్పుడే చంపేసి ఉండేవాడను." అన్నాడు. "ఇతన్ని కృపానిధి శ్రీరామచంద్రుడు చంపాలనుకుంటున్నట్లుగానే వుంది" అని మాల్యవంతుడు మనస్సులో రావణుని తిట్టుకుంటూ వెళ్ళిపోయాడు.

"ఉదయం నాతడాకా చూడండి. ఎక్కువ చెప్పడం దేనికి అన్నాడు క్రోధంతో మేఘనాథుడు

పుత్రుని మాటలు విన్నాక రావణునకు కొంత ఊతం చిక్కింది. అతన్ని ప్రేమతో దగ్గరకు తీసుకొని ఒళ్ళోకూచోబెట్టుకున్నాడు. రాత్రంతా ఆలోచనలతోనే గడచిపోయింది. తెల్లవారింది. ఎలుగుబంట్లు, వానరులు నాలుగు ద్వారాల వద్ద చుట్టుముట్టారు. నగరంలో అందరు బెంబేలెత్తి పోతున్నారు. అనేకరకాలయిన ఆయుధాలు

పుచ్చుకొని రాక్షసులు పరుగెత్తి, పైనుండి కొండల శిఖరాలను దొర్లి స్తున్నారు.

పర్వత శిఖరాలెన్నో దొర్లించారు, అనేక రకాల గుండ్లువేశారు. ప్రళయ మేఘాలను చూచి భయపడినట్లుగా, వారు భయపడి పోతు న్నారు, భయంకరమైన వానరులు కలియబడుతున్నారు, ఢీ కొంటు న్నారు, తెగిపోతున్నారు, కాని ఓడిపోవడంలేదు. వారి శరీరాలు రక్త మయాలయి పోయాయి. వాళ్ళ పర్వతాలు తీసుకొని వేస్తున్నారు, రాక్షసులు ఎక్కడి వారక్కడ చస్తున్నారు.

వానరులు మరల కోటను ఆక్రమించుకొన్నారని, మేఘనాధుడు విని, ఆ వీరుడు కోట నుండి దిగి పెద్ద నగారా వాయించుకుంటూ ఎదురుగా వెళ్ళి-"అయోధ్యారాజు! లోకాలన్నింటిలో ప్రసిద్ధి చెంది యున్న వారు, ధనుర్ధారులు అయిన ఇద్దరన్నదమ్ములున్నారే, ఆ రామలక్ష్మణు లెక్కడున్నారు? నల, నీల, ద్వివిద, సుగ్రీవ, బలానికి నిధి అయిన అంగదుడు హనుమంతుడు ఎక్కడ?

సోదరునకు ద్రోహం చేసిన విభీషణుడెక్కడ? ఇవాళ వీరం దరిని పట్టుదలతో చంపేస్తాను." అంటూ తన ధనస్సుమీద కఠిన మైన బాణాలను ఎక్కుబెట్టుకొని వాలాక్రోధంతో చెవులవరకు ధన స్సును లాగి బాణాలను వేస్తున్నాడు. ఆ బాణాలు, రెక్కలున్న ఎన్నో సర్పాలు లాగా పరుగులు తీస్తున్నాయా అన్నట్లున్నాయి. వానరులు అక్కడక్కడ పడిపోతున్నట్లు కనిపిస్తున్నారు. ఆ ఆ సమయంలో ఆయన ఎదుటికి ఎవ్వరూ రాలేకపోయారు. వానరులు ఎలుగుబంట్లు ఎటువారటు పారిపోయారు, అందరికి యుద్ధ కోరిక చచ్చిపోయింది. ఇకా యుద్ధంలో వానరులు, ఎలుగుబంట్లు కనబడనే లేదు. ప్రాణాలు మిగుల్చుకుని పోయారు.

ఆయన పది పది బాణాలు అందరిమీద వదలాడు. వానర వీరులు నేలమీద పడిపోయారు. బలవంతుడైన మేఘనాధుడు రణ ధీరుడై సింహంలాగా గర్జిస్తున్నాడు.

వానర సైన్యమంతా వ్యాకులంలో వున్నట్లు చూచిన హను మంతుడు కోపంతో, కాలమే పరుగెత్తింవా, అన్నట్లుగా పరుగెత్తాడు. ఆయన వెంటనే ఒక పెద్ద పర్వతాన్ని పెకలించి. క్రోధంతో మేఘ నాధుని మీద వేశాడు. పర్వతము వస్తున్నట్లు చూచి అతను ఆకా శంలోకి ఎగిరాడు. రథము, సారథి, గుర్రాలు నష్టమైపోయాయి. హనుమంతుడతనిని ఎన్నోసార్లు సవాళ్ళు చేశాడు, కాని అతను రాలేదు. అతనికి తన బలము, హనుమంతుని బలము తెలుసు.

మరల మేఘనాధుడు శ్రీరామచంద్రుని వద్ద కెళ్ళి, ఆయనను ఎన్నో రకాలుగా నిందించి, అనేక రకాల అస్త్రశస్త్రాలు వదలాడు. కాని ప్రభువు వాటిని తేలిగ్గానే త్రుంచి వేశాడు. ప్రభుప్రతాపాన్ని చూచి, ఆ మూర్ఖుడు ఎంతో సిగ్గుపడి, రకరకాల మాయలు చేశాడు. చిన్నపాము పిల్లను తీసికొని గరుత్మంతునకు చూపి దానిని భయపెట్టి నట్లుగా, ఏవేవో పనికి మాలిన మాయలన్నీ చేస్తున్నాడు. శివుడు, బ్రహ్మ, చిన్న పెద్దలందరు ఆయన మాయావశులై వుంటే, ఈ నీచ మైన బుద్ధిగల రాక్షసుడు ఆయనకు తన మాయలు చూపిస్తున్నాడు.

అతను ఆకాశంలోకి వెళ్ళి అగ్నులు కురిపిస్తున్నాడు. భూమి నుండి జలధారలు బయలుదేరాయి. రకరకాల పిశాచాలు నాట్యాలు చేస్తూ "చంపండి, నరకండి" అంటూ శబ్దాలు చేస్తున్నాయి. అవి ఒక్కొక్కప్పుడు అశుద్ధం,చీము, ర క్తము, వెంట్రుకలు, ఎముకలు కురి పిస్తున్నాయి. మరొకప్పుడు ఎన్నో బండలు విసరేస్తున్నాయి. అవి, దుమ్ము పోస్తున్నాయి. చీకటిమయమై పోతున్నది. తాను చాపిన చేయి తనకే అగు పడడం లేదు.

రాక్షస మాయలు చూచిన వానరులందరు భయపడిపోయారు. అందరి మరణం ఇప్పుడే జరిగిపోతుందనుకుంటున్నారు. ఈ నాటక మంతా చూచి, శ్రీరామచంద్రుడు నవ్వి, వానరులందరు భయపడి పోయారని తెలుసుకొని, ఆయన ఒక్క బాణంతో మాయను దూరం చేశాడు. దాంతో సూర్యుని వెలుగురాగానే చీకటి దూరమయిపోయి నట్లుగానే, మాయదూరమయిపోయింది. మరల కృపాదృష్టితో వాన రులను, ఎలుగుబంట్లను, చూడగానే, వారందరు యుద్ధం చేయ వద్దు, ఆగండని, అన్నా ఆగేట్టు లేని స్థితికి మారిపోయారు.

శ్రీరాముని ఆజ్ఞప్రకారము అంగదుడు మొదలైన వానరులను వెంటబెట్టుకొని, లక్ష్మణుడు క్రోధంతో ధనస్సు, బాణాలు తీసి కొని వెళ్ళాడు. ఆయన కన్ను కమలాల్లాగా వున్నాయి, హృదయం వెడల్పుగావుంది. చేతులు పొడవుగా ఉన్నాయి, హిమాలయ పర్వ తంతో సమానమైన ఎరుపురంగు, కుంకుమ పువ్వురంగు కలసిన శరీ రము ఆయనది. అటు రావణుడు యోధులను పంపాడు. వారు అనేక రకాలయిన ఆయుధాలతో పరుగులెత్తారు.

వానరులకు పర్వతాలు, గోళ్ళు, చెట్లు, ఆయుధాలు. వారు "శ్రీరామునికిజై" అంటూ పరుగెత్తారు; అందరు తమతమ పోటీ దారులతో కలియబడ్డారు. ఇటుఅటు కూడా జయము దగ్గరలో కని పించడం లేదు. ఇరువైపులవారు యోధాన యోధులే.

రాక్షసులను వానరులు ముక్కులమీద గుద్దుతున్నారు, తంతున్నారు, విజయము పొందిన వానరులు వారిని కొట్టడము, చంపడమేగాక బెదరిస్తున్నారు కూడా. "చంపండి, పట్టుకోండి, పట్టు కొని చంపండి, తలలు పగులగొట్టండి, చేతులు విరచేయండి" అన్న ధ్వనులు నవఖండాల్లో వినిపోయాయి. ప్రచండమైన మొండేలు అటు ఇటు పరుగులు తీస్తున్నాయి. ఆకాశంలోని దేవతలందరు ఈ

విలాసాలను చూస్తున్నారు. వారికి ఒకప్పుడు ఆశ్చర్యం, మరొక్కప్పుడు ఆనందం కల్గుతూ వుంది.

రక్తము గుంటల్లో నిండిపోయి గడ్డ కట్టింది, దానిమీద దుమ్ము పడుతూ వుంది. ఆ స్థితిని చూస్తే, నిప్పుమీద శవము బూడిద వ్యాపిస్తున్నట్లుగా వుంది.

గాయాలు తగిలిన వాళ్లు, వికసించిన మోదుగు చెట్లలాగా, శోభాయమానంగా ఉన్నారు. లక్ష్మణుడు, మేఘనాధుడు ఇద్దరు యోధులు ఒకరితో మరొకరు చాలా క్రోధంతో ఢీ కొంటున్నారు. ఒకరిని మరొకరు జయించలేకపోతున్నారు. మేఘనాధుడు కపటముగా మాయగా, యుద్ధం చేస్తున్నాడు. లక్ష్మణుడు అత్యంత క్రోధంతో, మేఘనాధుని రథాన్ని పగులగొట్టాడు, సారధిని చంపేశాడు.

లక్ష్మణుడు అనేక రకాల బాణాలు వేశాడు. రాక్షసునకు ప్రాణాలు మాత్రము మిగిలి ఉన్నాయి. రావణ పుత్రుడు, మేఘనాధుడికి "ఇప్పుడు పెద్ద ప్రమాదము వచ్చింది, తన ప్రాణాలు ఇక వుండవ"ని అనుమానించి వీరఘాతినీ అనుశక్తిని వదలాడు. దాని తేజఃశక్తి లక్ష్మణుని రొమ్ములో చేరిపోయింది. శక్తి తగిలేటప్పటికి అతనికి మూర్ఛ వచ్చింది. మేఘనాధుడు నిర్భయంగా వికటాట్టహాసం చేస్తూ ఆయన దగ్గరకు వచ్చాడు.

మేఘనాధుని లాంటి వంద కోట్లమంది ఆయనను లేపుతున్నారు. కాని, జగత్తుకు ఆధారుడైన శేషుడు ఎలాలేస్తాడు? వారు సిగ్గుతో వెళ్ళిపోయారు.

"పార్వతీ! శ్రీరాముని క్రోధాగ్ని పద్నాలుగు భువనాలను దగ్ధం చేసేస్తున్నది. దేవతలు, మనుష్యులు, సమస్త చరాచరాలు జగత్తుకు సేవలు చేస్తున్నాయి శ్రీరాముని లాంటి వానిని యుద్ధం

లో ఎవరు జయించగలరు? శ్రీరాముని కృప వుంటేనే, ఆయన లీలలను తెలిసికోగల్గుతారు."

సంధ్యాసమయమయింది. ఇరువైపుల సైన్యాలు తిరిగి వచ్చాయి. సేనాపతులందరు తమతమ సేనలను నిర్వహించుకుంటున్నారు.

సర్వవ్యాపకుడు, బ్రహ్మ, జయింపశక్యము కానివాడు, లోకాలకు స్వామి, కరుణానిధి అయిన శ్రీరామచంద్రుడు–

"లక్ష్మణుడెక్కడున్నాడు" అని అడిగాడు. అప్పటికి హనుమంతుడు అయన్ను తీసుకొని వచ్చాడు. తమ్ముని చూసి ప్రభువు చాలా దుఃఖపడ్డాడు.

"లంకలో సుషేణుడను వైద్యుడున్నాడు, అతన్ని తీసుకు రావడానికి ఎవరిని పంపాలి?" అన్నాడు జాంబవంతుడు.

హనుమంతుడు చిన్న రూపంతో లంకకు వెళ్ళి, సుషేణ వైద్యుని ఇంటితో సహా తీసుకొచ్చాడు. సుషేణుడు వచ్చి శ్రీరఘునాథుని పాదాలకు తలవంచి నమస్కరించి, పర్వతము, ఔషధం పేరు చెప్పి-"హనుమంతా! ఔషధం తేవడానికి వెళ్ళు" అన్నాడు.

శ్రీరామచంద్రుని పాదకమలాలను హృదయంలో ఉంచుకొని తన బలాన్ని తలుస్తూ హనుమంతుడు వెళ్ళాడు. అటువైపు ఒక దూత రహస్యాలన్ని బయటపెట్టాడు, రావణుడప్పుడు కాలనేమి ఇంటికి వెళ్ళి రహస్యమంతా చెప్పాడు, అతను విని, మాటిమాటికి తలబాదుకొని-"మీరు చూస్తుండగానే నగరాన్ని తగులబెట్టిన వాని మార్గాన్ని ఎవరు ఆపగలరు? అన్నాడు రావణునితో

ప్రభూ! శ్రీరఘునాథుని భజించి, మీ మేలును చూచుకోండి. అనవసర తాత్పారం మానేయండి. నేత్రాలకు ఆనందాన్ని కలిగించే వాడు, కమలములతో సమానమైన అందము, శ్యామల శరీరాన్ని మీ హృదయంలో ఉంచుకోండి. నేను, నీవు, నాది, అనుభావ

మూఢత్వాన్ని వదిలేయండి. మహామోహ రూపమైన రాత్రిలో నిద్రి స్తున్న మీరు మేల్కొనండి. కాలరూపమైన సర్పాన్ని కూడా భక్షించే శ్రీరాముని మీరు కలలోనైనా జయించగలరా?" అన్నాడు.

ఈ మాటలు విని రావణుడు ఎంతో కోప్పడ్డాడు. కాలనేమి మనస్సులో-"శ్రీరాముని దూత చేతిలో చావడం మంచిది. ఈ దుష్టుడు పాప సమూహంలో నిమగ్నమయిపోయాడు" అనుకొని వెళ్ళిపోయాడు. మార్గంలో సరోవరాలు, మందిరాలు, అందమైన తోటలు ఏర్పరచాడు. హనుమంతుడు అందమైన ఆశ్రమాన్ని చూచి, "ముని నడిగి నీళ్ళు త్రాగితే, అలసట దూరమయి పోతుంద"ను కున్నాడు.

అక్కడ రాక్షసుడు కపటవేషంలో కూర్చుని వున్నాడు. అతను మాయద్వారా మాయాపతి దూతను మోహింపజేయాలనుకుంటు న్నాడు. హనుమంతుడు దగ్గరకు వెళ్ళి తలవంచగా, శ్రీరాముని గుణాలు చెప్తూ-"రావణ రాములకి ఘోరమైన యుద్ధం జరుగుతూవుంది. శ్రీరాముడు జయిస్తాడు, ఇందులో సందేహం లేదు. సోదరా! నేని క్కడ వుండే చూస్తున్నాను. జ్ఞాన దృష్టి బలం నాలో చాలా వుంది.

అప్పుడు కపి జల మడిగాడు. ఆయన కమండల మిచ్చాడు. అప్పుడుకపి-"కొద్ది నీళ్ళతో నేను తృప్తిపడ్తాను" అన్నాడు.

"సరోవరంలో స్నానంచేసి తొందరగారా. నేను దీక్షనిస్తాను. దాంతో నీకు కూడా జ్ఞానం ప్రాప్తిస్తుంది." అన్నాడు ముని.

సరోవరంలో దిగగానే ఒక అక మొసలి హనుమంతుని కాలు పట్టుకుంది, హనుమంతుడు దానిని చంపేశాడు. అప్పుడది దివ్య మైన శరీరాన్ని దాల్చి విమానం మీద ఎక్కి ఆకాశానికి వెళ్ళి-"కపీ! మీ దర్శనంతో నా పాపాలన్నీ పటాపంచలయిపోయాయి. సోదరా! మునిశ్రేష్ఠుని శాపం కూడా తొలగిపోయింది. ఇతను మునికాదు, వచ్చి మోసగాడు, రాక్షసుడు, నామాట సత్యము" అని అప్సర వెళ్ళ

గానే, హనుమంతుడుముని వద్దకు వెళ్ళి-"మునీ! ముందుగురు దక్షిణ పుచ్చుకోండి. తరువాత నాకు మంత్రం నేర్పవచ్చు" అంటూ అతని తలను తోకతో చుట్టి భూమి మీద పడేశాడు. అతను చచ్చేటప్పుడు తన రాక్షస శరీరం చూపి, "రామా, రామా" అంటూ ప్రాణాలు వదిలేశాడు. ఇది చూచిన తరువాత సంతోషంగా హనుమంతుడు వెళ్ళిపోయాడు.

ఆయన పర్వతాన్ని చూచాడు, కాని ఔషధాన్ని గుర్తించలేక పోయాడు. అప్పుడు హనుమంతుడు ఒక్కసారిగా పర్వతాన్ని పెకలించి, చేతితో రాత్రికి రాత్రే ఆకాశంలో పరుగెత్తి, అయోధ్యకు చేరుకున్నాడు.

ఆకాశంలో భరతుడు, అతి విశాలమైన స్వరూపాన్ని చూచి, మనస్సులో రాక్షసుడను కొని, ధనస్సు చెవి దాకా లాగి, ఫలితం కోరకుండా, బాణాన్ని వదలాడు. బాణం తగులగానే మూర్ఛపోతూ, -"రామా! రఘునాథా!" అని ఉచ్చరిస్తూ హనుమంతుడు భూమి మీద పడిపోయాడు. 'రామా' అన్న ప్రియ వచనాలు విని భరతుడు పరుగెత్తుకొంటూ, హనుమంతుని వద్దకు వచ్చి, హనుమంతుడు వ్యాకులంగా ఉండడం చూచి హృదయానికి హత్తుకొని, అనేకరకాలుగా పపర్యలు చేశాడు, కాని ఆయనకు తెలివిరాలేదు. భరతుడు ఉదాసీనుడయి, కళ్ళంట నీళ్ళు పెట్టుకొని-"శ్రీరామునకు విముఖుని చేసిన బ్రహ్మయే, మరల ఈ కఠినమైన దుఃఖం కూడా తెచ్చి పెట్టాడు. మనసా, వాచా, కర్మణా, శ్రీరామచంద్రుని చరణారవిందాల యందు నాకు నిష్కపట ప్రేమ ఉండివుంటే,నేనంటే శ్రీరామునకు ప్రేముంటే, ఈ కపి అలసట, బాధ నుండి తేరుకోవాలి" అన్నాడు.

ఈ మాటలు వినగానే హనుమంతుడు-"కోసలాధీశుడైన శ్రీ రామునికి జై" అంటూ లేచి కూచున్నాడు, భరతుడు హనుమంతుని

హృదయానికి ఆనించుకొని, పులకితుడై పోయాడు. కళ్ళంట నీళ్ళు వచ్చాయి, శ్రీరాముని స్మరించాడు, ఆయన ప్రేమ హృదయంలో యిముడడంలేదు.

"సోదరా! తమ్ముడు లక్ష్మణుడు, తల్లి జానకి సహితంగా సుఖా లకు నిధి యొక్క క్షేమసమాచారాలు చెప్పు" అన్నాడు. హనుమం తుడు చరిత్ర అంతా క్లుప్తంగా చెప్పాడు. దానిని విని భరతుడు దుఃఖంతో పశ్చాత్తాపపడ్తూ– "దేవా! నేను ప్రపంచంలో ఎందుకు పుట్టినట్లు? ప్రభువుకు ఏ విషయంలోనూ పనికిరాలేదు." అంటూ కాలము అనుకూలంగా లేదని గ్రహించి, ధైర్యం తెచ్చుకొని భర తుడు-"సోదరా! నీవు చేరడానికి ఆలశ్యం కావచ్చు,ఉదయం అయితే పనులన్నీ పాడయిపోతాయి. అంచేత పర్వత సహితంగా నా బాణం మీద కూచుంటే, నేను నిన్ను కృపానిధి శ్రీరాముడున్న చోటుకు పంపిస్తాను" అన్నాడు.

హనుమంతునకు ఈయన మాటలు వినగానే, నా బరువును ఈ బాణం మోయగలదా?" అను అహంకారం కలిగింది మరల రాముని స్వభావాన్ని తలచుకొని, భరతుని పాదాలకు నమస్కరించి, చేతులు జోడించి—

"స్వామీ! మీ ప్రతాపాన్ని హృదయంలో తలచుకొంటూ వెంటనే వెళ్ళి పోతాను" అంటూ, ఆజ్ఞను పొంది, భరతుని పాదాలకు వందనాలు చేసి హనుమంతుడు వెళ్ళిపోయాడు,

హనుమంతుడు, భరతుని బాహుబలం, శీలం, గుణాలను, ప్రభువు చరణాల యందు వున్న అమితమైన ప్రేమను మనస్సులోనే మాటి మాటికి తలచుకుంటూ వెళ్తున్నాడు.

అక్కడ శ్రీరామచంద్రుడు లక్ష్మణుని చూచి మామూలు మను షిలాగా-" అర్ధరాత్రి గడచిపోయింది. హనుమంతుడు రాలేదు."

అంటూ శ్రీరామచంద్రుడు తమ్ముడు లక్ష్మణుని ఎత్తుకొని హృదయానికి అనించుకొని-'సోదరా! నీవు నేను దుఃఖంగా ఉంటే ఎన్నడూ చూడలేవు. నీ స్వభావమెల్లప్పుడు చాలా సున్నితమైనది. నీవు నా కోసం తల్లిదండ్రులను విడిచి వచ్చి, చలిని, ఎండను, గాలులను సహించావు.

లక్ష్మణా! ఆ ప్రేమ ఇప్పుడెక్కడుకుపోయింది? నా వ్యాకులమైన మాటలనైనా విని ఎందుకు లేవవు? వనంలో తమ్ముని వియోగం తటస్థిస్తుందని నాకు ముందే తెలిసియుంటే,తండ్రి మాటల ప్రకారం వనానికి రావడం ఒప్పుకుని ఉండేవాడను కాను.

పుత్రులు, ధనము, భార్య, ఇల్లు, కుటుంబం, ఇవన్నీ మాటి మాటికి ఏర్పడుతుంటాయి, పోతుంటాయి. సోదరా!ఇది ఆలోచించిప, ప్రపంచంలో నీ వంటి తోబుట్టువు రెండవసారి లభించడు!

రెక్కలులేని పక్షి, మణిలేని సర్పము, తొండములేని ఏనుగు దీనులయిపోయినట్లుగానే, సోదరా! కఠినుడైన బ్రహ్మ నీవు లేకుండా నన్ను బ్రతికించితే, నా బ్రతుకు వ్యర్థమయినదే.

స్త్రీ కొరకు ప్రియమైన సోదరుని పోగొట్టుకొని, నేనే ముఖం పెట్టుకొని అయోధ్యకు వెళ్తాను? ప్రపంచంలో అపకీర్తి సహించవలసి వచ్చినా, స్త్రీ హాని లెక్కలోనిది కాదు,

ఇప్పుడు, సోదరా! నా కఠోరము విష్ఠురమైన హృదయం లోకనిందను, నీ శోకాన్ని, రెంటిని సహిస్తుంది. సోదరా! నీ తల్లికి నీవు ఒక్కగాని ఒక పుత్రుడవు, ఆమెకు ప్రాణాధారుడవు.

అన్ని విధాలా సుఖపెడుతానని, మేలు చేసేవాడనని, మీ యమ్మ చేతులు పట్టుకొని, నిన్ను నా అధీనం చేసింది. నేనిప్పుడు వెళ్ళి, ఆమెకేమని జవాబివ్వాలి? సోదరా! లేచి నాకు ఎందుకు తెలియ

చెప్పవు?" అన్నాడు శ్రీరాముడు.

"ఆలోచనలను పోగొట్టే, శ్రీరాముడు అనేక విధాలా ఆలోచిస్తున్నాడు. కమలాల్లాంటి కళ్ళ వెంట కన్నీళ్ళు కారుతున్నాయి. ఉమా! ఒక అఖండమైన దయానిధి మరొక మనుష్యలీలను చూపించాడు." అన్నాడు శివుడు.

ప్రభువు విలాపాన్ని ఈ విధంగా విన్న వానర సమూహం వ్యాకుల పడిపోయింది. ఆ సమయంలో హనుమంతుడు, కరుణ రసంలో వీరరసం కలిసినట్లుగా, వచ్చి అందరిని కలుసుకొన్నాడు. సంతోషంతో శ్రీరాముడు హనుమంతుని కౌగలించుకున్నాడు. ప్రభువు చేసిన ఉపకారాలను మరువని వారే కృతజ్ఞులు.

సుషేణుడు వైద్యం వెంటనే చేశాడు. లక్ష్మణుడు ఆనందంగా లేచి కూచున్నాడు.

ప్రభువు సోదరుని హృదయానికి హత్తుకున్నాడు. ఎలుగు బంట్లు, వానరుల సైన్యం ఆనందించింది. తరువాత హనుమంతుడు వైద్యుని ఎక్కడనుంచి ఏ విధంగా తెచ్చాడో, ఆ విధంగానే, అక్కడకు చేర్చాడు.

ఏకాదశి రోజున బలవంతుడైన ధూమ్రాక్షుడు విజృంభించాడు, చాలా భయంకరమైన యుద్ధం చేశాడు. హనుమంతుడు అతన్ని చంపేశాడు. తరువాత దుఃఖాలు పెట్టు అకంపనుడు వచ్చాడు. అతను కూడా భయంకరమైన యుద్ధం చేశాడు. అతనిని యువరాజు అంగదుడు సవాలు చేసి చంపేశాడు. మరల క్రోధంతో ప్రహస్తుని మీదకు పరుగెత్తాడు. అతనిని నీలుడు చంపి భూమి మీద పడేశాడు. తరువాత మహోదరుడు అమితకోపంతో వచ్చాడు. ఆ యోధుని హనుమంతుడు చంపాడు. మరల అతికాయుడు క్రోధంతో కలియబడ్డాడు, ఎనిమిది రోజులు యుద్ధం చేసి చంపబడ్డాడు.

కుంభకర్ణుని పుత్రులు కుంభ, నికుంభులు వచ్చి, యుద్ధంచేశారు. వారు అయిదురోజులు యుద్ధం చేసి చనిపోయారు. అప్పుడు మహాయోధుడు మకరాక్షుడు వచ్చాడు. అతను లక్ష్మణునితో చాలా పెద్ద యుద్ధం చేశాడు. లక్ష్మణుడు, అతనిని చంపేశాడు. వానరులకు ఆనందం కలిగింది. వారు కేకలు పెడ్తూ, జయజయకారాలు' పలికారు.

# 30

రావణుడు ఈ సమాచారము విన్నప్పటిన్లా, చాలా దుఃఖంతో తన తలను మోదుకుంటున్నాడు. చివరకు భయపడి కుంభకర్ణుని వద్దకు వచ్చి, ఎన్నో ఉపాయాలతో అతన్ని నిద్ర నుంచి లేపాడు. కుంభకర్ణుడు లేచాడు. అతను, సాక్షాత్తు కాలం శరీరాన్ని ధరించి కనిపిస్తుందా, అన్నట్లున్నాడు.

కుంభకర్ణుడు అడిగాడు "సోదరా! నీ ముఖం యెందుకు వాడిపోయి వుంది?"

రావణుడు సీతను తెచ్చిన కథంతా వినిపించి "సోదరా! వానరులు మన పెద్ద పెద్ద వీరులయిన రాక్షస యోధులను చంపేశారు. దేవతలకు వైరులయిన వారు, నరభక్షక యోధులయిన దుర్ముఖ, అతికాయ, అకంపన, మహోదర మొదలైన వీరులు,రణధీరులందరు యుద్ధంలో చనిపోయారు " అని చెప్పాడు.

రావణుని మాటలు విని కుంభకర్ణుడు పెద్దగా ఏడ్చి–"మూర్ఖా! జగత్తుకు జనని అయిన సీతను లేవనెత్తుకొని వచ్చి, ఇప్పుడు నీకు మేలు జరుగాలని కోరుకుంటున్నావు.

రాక్షసరాజా! నీవు చేసిన పని మంచిదికాదు. ఇప్పుడొచ్చి నన్నెందుకు నిద్ర లేపావు? సోదరా! ఇప్పుడైన గర్వాన్ని వదలి

శ్రీరాముని భజిస్తే నీకు మేలు జరుగుతుంది.

దశకంఠా! హనుమంతుడులాంటి సేవకులున్న రాముడు మనుష్యుడా? నీవు చేయబోయే ఈ పెద్ద పనిని ముందుగా నాకు చెప్పలేదు. శివుడు, బ్రహ్మ, మొదలైన దేవతలు సేవకులుగా వున్న ఆ పరబ్రహ్మతో వైరం పెట్టుకున్నావు. నారదముని నాకు నేర్పిన జ్ఞానాన్ని నీకు నేర్పితే బాగుండేది. ఏమైనా సమయం గడచిపోతున్నది.

సోదరా! ఇప్పుడు నీవు నాతో ఆఖరిసారనుకొని చేతులు చాచి కలుసుకో. నేను వెళ్ళి, నా నేత్రాలను సఫలం చేసికొంటాను. శ్యామ శరీరి, కమలనయనుడు, మూడు రకాల పాపాలను పోగొట్టే శ్రీరామచంద్రుని వద్దకు వెళ్ళి దర్శనం చేసుకొంటాను.

శ్రీరాముని రూప, గుణాలను మనస్సులో తలచుకొని, అతను ఒక్కక్షణం ప్రేమలో మగ్నుడై పోయి, మరల రావణుని, కోట్లకుండల సారాయిని, అనేకమైన గేదెలను అడిగాడు.

గేదెలను తిని, సారాయిత్రాగి, ఆ కుంభకర్ణుడు వజ్రంలాగా గర్జించాడు. మరల మదమత్తుడై, యుద్ధంలో ఆరితేరిన అతను కోటను వదలి ఒంటరిగా వెళ్ళాడు, వెంటసైన్యం కూడా రాలేదు.

అతన్ని చూచి విభీషణుడు ముందుకు వచ్చి, ఆయన కాళ్ళ మీద పడి, తన పేరు చెప్పాడు, సోదరుని పైకి లేపి తన హృదయానికి హత్తుకొని, శ్రీరాముని భక్తుడని తెలిసికొన్న అతనికి అమిత ప్రేమ కల్గింది.

"సోదరా! ఎంతో మేలు చేకూర్చు సలహానేనిస్తుంటే రావణుడు నన్ను కాలితో తన్నాడు. ఆ చింతతో నేను శ్రీరాముని వద్దకు వచ్చాను. దీనుడనయిన నేను ప్రభువుకు అత్యంత ప్రియుడనయినాను," అన్నాడు విభీషణుడు.

27)

"సోదరా! రావణుడు కాలవశుడైపోయినాడు. మంచి ఉపదే శాలను, అటువంటి వాడెలా ఆదరిస్తాడు? విభీషణా! నీవు ధన్యుడవు, సోదరా! నీవు రాక్షస వంశానికి భూషణుడవు, నీవు సుఖ సంతోషా లకు ఆలవాలమయిన రాముని భజించి, మన వంశాన్ని ఉద్ధరించావు.

మనసా, వాచా, కర్మణా, కపటాన్ని వదలి రణధీరుడైనరాముని భజించు. ఇక ఇప్పుడు నీ వెళ్ళిపో, ఈ సమయంలో నాకు నావారు, పరాయి వారను వివక్షణ వుండదు. నేను చావుకు సిద్ధమై ఉన్నాను." అన్నాడు కుంభకర్ణుడు.

సోదరుని మాటలు విని విభీషణుడు రాముడున్న చోటుకు తిరిగి వెళ్ళి "ప్రభూ! పర్వత సమానమైన శరీరం గల రణధీరుడు కుంభకర్ణుడొస్తున్నాడు" అన్నాడు.

వానరులు ఈ మాటలు వినగానే, బలముగలవారు అరచు కొంటూ పరుగెత్తి, చెట్లు, పర్వతాలు పెరికివేసి, పండ్లు పటపటకొరికి అతని మీద వేశారు. కోట్ల పర్వత శిఖరాల దెబ్బలు వానరులు ఒకేసారి కొడుతున్నారు కాని అతని మనస్సు చలించలేదు, శరీరం కదలలేదు. ఏనుగు జిల్లేడు పూలు తగిలినప్పుడు కదలకుండా నిర్ల క్ష్యంగా వున్నట్లుగా, అతనున్నాడు.

హనుమంతుడు అప్పుడు అతని రొమ్ము మీద ఒక్కతన్ను తన్నాడు. దాంతో అతను వ్యాకులంగా భూమి మీద పడిపోయి తల బాదుకుంటున్నాడు. కాసేపటికి మరల లేచి అతను హనుమంతుని కొట్టాడు. ఆయన తల తిరిగిపోయి, కళ్ళు బయర్లు గమ్మి, నేలమీద పడిపోయాడు. తరువాత నల, నీలులను క్రిందపడవేశాడు. మిగతా వారిని నేలకేసి కొట్టి చంపాడు. వానర సైన్యము పారిపోతున్నది. భయంచేత ఎవ్వరు ఎదుటికి రాలేకపోతున్నారు. అంగదుడు మొద లగు వానర వీరులను సుగ్రీవునితో సహా మూర్ఛితులను జేసి, సుగ్రీ

పుని చంకలో పెట్టుకొని అపారమైన బలవంతుడు కుంభకర్ణుడు తిరిగి వెళ్ళిపోయాడు.

శివుడంటున్నాడు-"పార్వతీ! పాముల సమూహంలో కలిసి గరుడుడు ఆటలాడుతున్నట్లుగా, శ్రీరాముడు నరలీలలు చూపిస్తు న్నాడు. ముఖము విఘ్నింపనంత మాత్రాన కాలాన్ని కూడా తిని వేయ గల వానికి ఈ యుద్ధము ఏమి నాటకం ప్రత్యేకంగా చెప్ప బడు తుంది?

ప్రభువు ప్రపంచాన్ని పవిత్రం చేయడానికి తన కీర్తిని వ్యాపింప చేస్తున్నాడు. ఆ కీర్తిని మనుష్యులు భవసాగరం దాటడానికి గానాలు చేస్తున్నారు. హనుమంతుని మూర్ఛ దూరమయిపోగానే ఆయన సుగ్రీవుని వెదకుతున్నాడు.

సుగ్రీవుని మూర్ఛ కూడా దూరమయినప్పుడాయన ప్రక్కనుండి వచ్చాడు. కుంభకర్ణుడు సుగ్రీవుడు చచ్చాడనుకున్నాడు. కుంభకర్ణుని ముక్కు, చెవులు పళ్ళతో కొరికి సుగ్రీవుడు ఆకాశంలోకి ఎగిరిపోయిన తరువాత గాని కుంభకర్ణునకు సుగ్రీవుడు బ్రతికియే వున్నాడని తెలియ లేదు. ఆయన సుగ్రీవుని కాళ్ళు పట్టుకొని భూమి మీద పడగొట్టాడు. అప్పుడు సుగ్రీవుడు చాలా తొందరగా లేచి. మరల అతన్ని కొట్టాడు. తరువాత బలవంతుడైన సుగ్రీవుడు ప్రభువు వద్దకు వెళ్ళి-" కృపానిధీ. మీకు జయమగుగాక' అన్నాడు.

చెవులు, ముక్కు తెగిపోయినట్లు తెలిసికొన్న కుంభకర్ణుడు మనస్సులో చాలా బాధపడి కోపంతో తిరిగి వెళ్ళాడు. ఆయన అసలే భయంకర రూపం గలవాడు, దానికి తోడుగా ఇప్పుడు ముక్కు, చెవులు కూడా లేకుండా పోయేటప్పటికి, ఇంకా భయంకరంగా ఉన్నాడు. ఇతన్ని చూచి వానరుల సైన్యానికి భయం పట్టుకుంది.

"రఘుకుల భూషణునకు జై" అంటూ, హో,హో అని

అరుస్తూ వానరులు పరుగెత్తి ఆయన మీద తెంపు లేకుండా పర్వ తాలు వృక్షాలు వేశారు. క్రోధంలో వున్న కాలము వస్తున్నట్లుగా, యుద్ధంలో వ్యతిరేకమయినట్లు గ్రహించిన కుంభకర్ణుడు వస్తున్నాడు. అతను కోట్ల వానరులను పట్టుకొని తినేస్తున్నాడు. ఆ తినడం చూస్తుంటే, మిడుతలు గుహల్లోకి జొరబడుతున్నాయా, అన్నట్లుంది.

కోట్ల వానరులను పట్టుకొని శరీరంతో నలిపివేస్తున్నాడు. మరి కొన్ని కోట్లమందిని చేతులతో నలిపి మట్టిలో కలిపేస్తున్నాడు. నోటి నుండి, ముక్కునుండి, చెవులనుండి బయటకు వచ్చి ఎలుగుబంట్లు, వానరులు గుంపులు గుంపులుగా పారిపోతున్నారు.

బ్రహ్మ ఇతనికే ప్రపంచం మొత్తము అర్పించాడు, ఆ సంసా రమే ఇతన్ని తిని వేస్తుందన్నట్లుగా, యుద్ధమదంలో మత్తెక్కివున్న కుంభకర్ణుడు గర్వంగా ఉన్నాడు, యోధులు పారిపోయారు, వారిని తిరిగి రమ్మన్నా రావడం లేదు. వారికి కండ్లు కనపడడం లేదు, కేకలు వేసినా వారికి వినబడడం లేదు.

కుంభకర్ణుడు వానర సైన్యాన్ని చెల్లాచెదరు చేసినాడని తెలిసి కొన్ని రాక్షసులు పరుగులు తీసుకొంటూ వచ్చారు. సైన్యం వ్యాకు లంగా ఉండడం, శత్రువుల సైన్యాలు అనేక రకాలుగా వచ్చినట్లు శ్రీరామచంద్రుడు చూచి-"సుగ్రీవా! విభీషణ, లక్ష్మణులారా! మీరు సైన్యాన్ని సిద్ధంచేసికోండి. నేను ఈ దుష్టుని పరాక్రమాన్ని, సైన్యా న్ని చూచుకొంటాను." అంటూ చేతిలో ధనస్సు, నడుమున అంబుల పొది సిద్ధం చేసికొని శత్రువును నాశనం చేయడానికి శ్రీరాముడు వెళ్ళి, తన ధనస్సు నారిని లాగాడు. దాని శబ్దం విన్న శత్రుసైన్యా నికి చెవులు దిబ్బడబడిపోయాయి. ఆ తరువాత ప్రభువు ఒక లక్ష బాణాలు వదలాడు. అవి రెక్కలున్న నల్లత్రాచుపాముల్లాగా పోయా యి. బాణాలు పోయినచోట్లల్లో వున్న భయంకర రాక్షసులు ముక్కలు

ముక్కలై పోయారు.

వారి కాళ్ళు, తలలు హృదయాలు, చేతులు తెగిపోయాయి. వందలమంది వీరులు అంగహీనులైపోయారు. దెబ్బలు, గాయాలతో వున్న రాక్షసులు గిరగిర తిరిగి నేలమీదపడిపోయారు. దెబ్బలు తగులని యోధులు మరల లేచి మరల యుద్ధం చేస్తున్నారు.

బాణాలు తగులగానే వారు మేఘాల్లాగా గర్జిస్తున్నారు. చాలా మంది కఠినమైన బాణాలను చూచి పారిపోతున్నారు. మరికొందరు వీరుల మొండాలు తలలు లేకుండా పరుగులు తీస్తూ. "పట్టుకోండి, చంపండి" అని అరుస్తున్నాయి. క్షణంలోనే ప్రభువు బాణాలు భయంకర రాక్షసులను నరికివేసి, మరల ఆ బాణాలన్నీ రఘునాధుని అంబుల పొదిలోకి వచ్చి చేరాయి.

"క్షణంలోనే శ్రీరామచంద్రుడు రాక్షసులనందరిని చంపివేసి నట్లు కుంభకర్ణుడు చూచాడు, మహాబలవంతులైన చాలామంది యోధులు కోపంతో, సింహాల్లాగా పెద్ద శబ్దాలు వేస్తున్నారు. వారు పర్వతాలను పెరికి పెద్ద యోధులున్న చోటపడవేస్తున్నారు, పర్వ తాలు రావడం చూచిన శ్రీరామచంద్రుడు వాటిని బాణాలతో నుగ్గు నుగ్గువేసి దుమ్ముగా మార్చివేస్తున్నాడు.

శ్రీరామచంద్రుడు కోపంతో ధనస్సునులాగి ఎన్నో కఠోర మైన బాణాలు వేశాడు. ఆ బాణాలు, కుంభకర్ణుని శరీరంలో అటు నుండి ఇటు, మెరుపులు మేఘాల్లో జొరబడిపోతున్నట్లుగా, జొరబడి పోతున్నాయి.

ఆయన నల్లని శరీరం నుండి కారుతూ ఉన్న రక్తం, కాటుకక కొండ నుండి ఎర్రమన్ను కాలువలు ప్రవహిస్తున్నాయా అన్నట్లుగా శోభాయమానంగా వుంది. అతనిని చూచి ఎలుగుబంట్లు, వానరులు పారిపోయారు. వారు దగ్గరకు రాగానే అతను ఎందు వచ్చి, తరు

వాత గర్జించి ఎంతో మంది వానరులను పట్టుకొని మదించిన ఏనుగు లాగా వారిని భూమి మీద కొడుతూ, రావణుని, కాసేపు నిందిస్తూ వున్నాడు. ఇదంతా చూచిన ఎలుగుబంట్లు, వానరుల గుంపులు, తోడేళ్ళను చూచిన గొర్రెల గుంపులు పారిపోయినట్లుగా, పారిపోతు న్నాయి.

శివుడంటున్నాడు-"భవానీ! ఎలుగుబంట్లు, వానరులు గాబరాతో బ్రతుకు జీవుడా అనుకుంటూ పారిపోయారు.

ఈ రాక్షసులు కరువులాంటివారు, ఈ కరువు వానర కుల రూపమైన దేశంలోకి రావాలను కొంటున్నది. "హే, శరణాగతుల దుఃఖాలను దూరం చేసే రామా! కృపానిధి, మేఘాలను ధరించు వాడా, రక్షించు, రక్షించు అంటూ వున్న దీనవచనాలను వినగానే భగవానుడు ధనస్సు, బాణాలను సిద్ధం చేసికొని, సేనను వెనుకవుంచి, పరాక్రమ వంతుడైన శ్రీరామచంద్రుడు ముందుకు వెళ్ళాడు.

శ్రీరామచంద్రుడు ధనస్సును లాగి వంద బాణాలు వేశాడు. అవిపోయి కుంభకర్ణుని రొమ్ములో గుచ్చుకొన్నాయి. బాణాలు తగులగానే అతను కోపంతో పరుగెత్తాడు. ఆ సమయంలో పర్వతాలు ఊగి పోయాయి, భూమి కదలిపోయింది.

అతను ఒక కొండను లేవదీశాడు. శ్రీరాముడు అతని భుజాలను తెగగొట్టి వేశాడు. అప్పుడతను ఎడమచేత్తో పర్వతాన్ని పట్టుకొని పరుగెత్తాడు. ప్రభువు ఆ చేతిని కూడా తెగనరికి భూమి మీద పడ వేశాడు.

భుజాలు తెగిపోయిన ఆ దుష్టుడు, రెక్కలు లేని మందరాచలం లాగా వెలిగిపోతున్నాడు. తరువాత కోపదృష్టితో ప్రభువువైపు చూచాడు. అతనిప్పుడు మూడు లోకాలను మింగివేస్తాడాను కుంటుంటా, అన్నట్లుంది. అతను చాలా పెద్దగా ఏనుగులాగా ఘీంక

రిస్తూ, నోరు తెరచి పరుగెత్తాడు. ఆకాశంలోని సిద్ధులు, దేవతలు భయంతో హాహాకారాలు చేస్తున్నారు.

కరుణానిధి శ్రీరామచంద్రుడు, దేవతలు భయపడిపోయారని తెలిసికొని చెవివరకు ధనస్సును లాగి బాణాలతో రాక్షసుని నోరంతా నింపాడు. అయినా ఆ బలవంతుడు నేలమీద పడిపోలేదు.

బాణాలతో నిండియున్న నోటితో అతను ప్రభువు వద్దకు కాల రూపమైన అంబులపొది శరీరాన్ని ధరించి వచ్చిందా, అన్నట్లుగా వచ్చాడు. ప్రభువు కోపంతో పదునైన బాణం తీసికొని, అతని తలను మొండెం నుండి వేరు చేశాడు. ఆ తల రావణుని వద్దకు వెళ్ళిపడింది దానిని చూచిన రావణుడు; మణిపోగొట్టుకొన్న సర్పంలాగా, వ్యాకుల పడిపోయాడు. కుంభకర్ణుని మొండెం పరుగెత్తింది, భూమి క్రుంగి పోయింది ఆ తల బరువుకు. అప్పుడు శ్రీరామచంద్రుడు ఆ తలను రెండు ముక్కలు చేశాడు. ఆ రెండు ఖండాలు, తన క్రింద నున్న వానరులను. ఎలుగుబంట్లను, రాక్షసులను అణచివేస్తూ, ఆకాశం నుండి రెండు కొండలు క్రిందపడిపోయాయా, అన్నట్లుగా పడిపో యాయి. కుంభకర్ణుని తేజస్సు ప్రభువు ముఖంలో కలసిపోయింది. ఇదంతా చూచిన దేవతలు, మునులు మొదలైనవారు ఆశ్చర్యపడి పోయారు.

దేవతల సమూహము ఆకాశంలో వాయిద్యాలు వాయిస్తూ, సంతోషిస్తూ, చాలా పూలను కురిపిస్తున్నారు. తరువాత నమస్కా రాలు చేసి దేవతలందరు వెళ్ళిపోయారు. ఆ సమయంలోనే నార దుడు వచ్చాడు.

శ్రీహరి యొక్క అందమైన వీరరసయుక్తమైన గుణాలను ఆకా శం నుండే నారదుడు గానం చేశాడు. ఆ గానాలు ప్రభువుకు చాలా సంతోషాన్ని కలిగించాయి. "దుష్ట రావణుని తొందరగా చంపండి

అంటూ ముని వెళ్ళిపోయాడు. శ్రీరామచంద్రుడు యుద్ధభూమిలో శోభాయమానంగా ఉన్నాడు.

ముఖం మీద చెమట బొట్లున్నాయి. కమలాల్లాగా కళ్ళు కొంచెం ఎర్రగా ఉన్నాయి, శరీరంమీద రక్తపు మరకలున్నాయి. రెండు చేతులతో ధనస్సు, బాణాలను సవరిస్తున్నాడు. వలువైపులా ఎలుగుబంట్లు, వానరులు ఉన్నారు.

తులసీదాసు అంటున్నాడు-"ఎన్నో ముఖాలున్న శేషుడు కూడా ఆ సమయంలోని ప్రభువు శోభను వర్ణించలేడు."

శివుడంటున్నాడు-"పార్వతీ! నీమడు, పాపి అయిన కుంభకర్ణుడను రాక్షసుని కూడా ప్రభువు తన స్థానానికి చేర్చుకున్నాడు. ఇలాంటి శ్రీరాముని భజించని మనుష్యులు బుద్ధిలేని వారు మాత్రమే.

పగలు పూర్తయిపోగానే ఇరువైపుల సేనలు తిరిగి పోయారు. ఈ రోజు యోధులందరు బాగా అలసిపోయారు. కాని, శ్రీరాముని దయ వలన సైన్య బలం, గడ్డి వేయగానే అగ్ని పెరిగిపోయినట్లుగా, పెరిగిపోయింది.

అటువైపు రాత్రింబవళ్ళు, రాక్షసులు, తన నోటితో అంటే, పుణ్యము క్షీణించి పోయినంతగా, క్షీణించిపోతున్నారు. రావణుడు సోదరుని తలను హృదయానికి అనించుకొని మాటిమాటికి విలపిస్తున్నాడు.

స్త్రీలు కుంభకర్ణుని తేజస్సు, బల పరాక్రమాలను తలచుకొని చేతులతో రొమ్ములను బాదుకుంటూ ఏడుస్తున్నారు. ఆ సమయంలోనే మేఘనాధుడు వచ్చి, అనేక కథలు తండ్రికి చెప్తూ, "రేపు నా వీరత్వం చూద్దువు గాని, ఇప్పటినుండే బడాయిలు కొట్టుకోవడం దేనికి? నేను ఇష్టదేవుని వలన పొందిన బలాన్ని, రథాన్ని నేనీనాటి

వరకు నీకు చూపలేదు." అని జటాయులు చెబుతూ ఉండడంతోనే తెల్లవారింది.

నలువైపుల ముఖద్వారాల వద్ద, వేల మంది ఎలుగుబంట్లు, వానరులు, గుమిగూడారు. ఇటు యమునిలాగా వీర వానరులు, ఎలుగుబంట్లు, అటు రణధీరులయిన రాక్షసులున్నారు. "గరుడా! ఇరువైపుల వారు ఎవరికి వారు గెలవాలని యుద్ధం చేస్తున్నారు. అది బ్రహ్మాండమైన యుద్ధం" అంది కాగభుసుండి.

మేఘనాథుడు ఇంతకు ముందు చెప్పిన మహామాయారథంమీద ఆకాశంలోకి వెళ్ళి, అట్టహాసం చేస్తూ గర్జించాడు. దాంతో వానర సైన్యానికి భయమేర్పడిపోయింది.

అతను శక్తిని, శూల, బాణ, కత్తులు మొదలైన అస్త్ర శస్త్రాలను, గండ్రగొడ్డళ్ళ మొదలైన వాటిని ప్రయోగిస్తున్నాడు. వజ్రాలను, బల్లేలను, రాళ్ళను పడవేస్తూనే, ఎన్నో బాణాలను కూడా కురిపిస్తున్నాడు.

పది దిక్కుల్లో బాణాలు పరచబడ్డాయి, వాటిని చూస్తుంటే, మఘనక్షత్రంలో మేఘాలు జడివాన కురిపించుచున్నట్లనిపిస్తున్నాయి. "పట్టుకోండి, చంపండి" అనే శబ్దాలు చెవులకు వినుపిస్తున్నాయి కాని ఎవరు ఎవర్ని చంపుతున్నారో, తెలియడంలేదు.

కొండలు, చెట్లను తీసుకొని వానరులు ఆకాశంలోకి పరుగెత్తిపోతున్నారు. కాని ఎవరూ అక్కడ కనిపించకపోయేటప్పటికి దుఃఖంతో తిరిగి వస్తున్నారు. దాట శక్యం కాని లోయలు, త్రోవలు, గుహలను మాయా బలంతో మేఘనాథుడు బాణాల బోనులు వేసేశాడు.

"ఇప్పుడెక్కడికి వెళ్ళాలి?" అని వానరులు భయపడ్డారు. వారు పర్వతాలన్నీ ఇంద్రుని చేమలో పడివున్నట్లుగా భావించి వ్యాకులపడి

పోతున్నారు. హనుమంతుడు, అంగదుడు, నలుడు, నీలుడు మొద లైన బలవంతులందరిని మేఘనాథుడు వ్యాకులపరచాడు.

లక్ష్మణ, సుగ్రీవ, విభీషణుల శరీరాలను తన బాణాలతో కొట్టి జల్లెళ్ళు చేశాడు. ఇప్పుడు రఘునాథునితో యుద్ధం చేస్తున్నాడు. అతని బాణాలు పాములులాగా వచ్చి తగులుతున్నాయి.

శ్రీరామచంద్రుడు లీలావశుడయి నాగపాశానికి వశుడై య్యాడు. లేకపోతే స్వతంత్రుడు, అనంతుడు అద్వితీయుడు, వికారాలు లేని వాడు, ఎల్లప్పుడు తన అధీనంలో ఉండే శ్రీరాముడు నాగపాశానికి వశుడవడమేమి?? ఆయన నటకుని లాగా రకరకాల నాటకాలాడు తున్నాడు. యుద్ధానికి శోభరావడానికి ప్రభు తనంతట తాను బంధింప బడినా, దేవతలకు భయము వేయక తప్పలేదు.

శివుడంటున్నాడు-"పార్వతీ! శ్రీరాముని నామాన్ని జపించి మునులు భవ బంధనాలను త్రెంచుకోగల్గుతున్నారు. అలాంటి సర్వ వ్యాపకుడు, జగత్తుకు ఆధారమైనవాడు అయిన ప్రభువు ఎప్పుడైనా బంధించబడడానికి వీలుందా?

భవానీ! శ్రీరామచంద్రుని సగుణ చరిత్ర, బుద్ధి, మనస్సు, వాణితో వర్ణించినందున తేలదు. తత్త్వజ్ఞానులు, విరక్తులు అన్ని తర్కాలను కలిపియే భజిస్తున్నారు."

మేఘనాథుడు సైన్యాన్ని చికాకు పెట్టాడు, పెద్దమాటలంటూ మరల కనిపించాడు. అతన్ని జాంబవంతుడు సవాలుచేసి-"అరే, దుష్టా! ఆగు." అనగానే మేఘనాధునకు అమితమైన కోపం వచ్చి "అరే, మూర్ఖా! నీవు ముసలివాడవని వదలేశాను. నీచుడా? నన్నే నీవు సవాలుచేసి, రెచ్చగొడ్తావా?" అంటూ పదునైన త్రిశూలాన్ని వేశాడు. జాంబవంతుడు దాన్ని మధ్యలోనే పట్టుకొని పరుగెత్తి, ఆ త్రిశూలాన్ని మేఘనాధుని రొమ్ములో పొడిచాడు. ఆ దేవ ఘాతకుడు

గిరగిర తిరిగి భూమి మీద పడిపోయాడు. మరల క్రోధంతో అతని పాదాలను పట్టుకొని త్రిప్పి, భూమి మీద పడవేసి అతని దేవుళ్లే చూపాడు.

జాంబవంతునకు వరదానముంది. అందువలన మేఘనాధుడు చంపుదామను కున్నా అతను చావడు. జాంబవంతుడు అతని కాళ్ళు పట్టుకొని లంకలో పారవేశాడు. ఇటు వానర సైన్యము వద్దకు నారదుడు గరుడుని పంపాడు. అతను వెంటనే రాముని వద్దకు వచ్చాడు.

పక్షి రాజయిన గరుడుడు మాయాసర్పాలన్నింటిని పట్టుకొని తినేశాడు. మాయ దూరమయిపోవడం చేత వానరులు సంతోషించారు.

వానరులు క్రోధంతో మరల పర్వతాలు, వృక్షాలు, గోళ్ళు తీసుకొని పరుగెత్తారు. రాక్షసులు కంగారుతో పరుగెత్తి కోట మీద ఎక్కారు.

మేఘనాధుని మూర్ఛ తొలగి, తెలివి వచ్చింది. తండ్రినిచూచి చాలా సిగ్గుపడి, వెంటనే అతను ఒక పర్వతపు లోయలోకి వెళ్ళి, "అజేయుడనవడానికి యజ్ఞం చేయాలి" అని నిశ్చయించుకున్నాడు.

ఇక్కడ విభీషణుడు ఆలోచించి-"రామచంద్రునితో దుష్టుడు, మాయావీ, మేఘనాధుడు, దేవతలను బాధించేవాడు, అపవిత్రమైన యజ్ఞం చేస్తున్నాడు.

స్వామి! ఈ యజ్ఞము పూర్తి అయితే శత్రువయిన మేఘనాధుని తొందరగా ఎవ్వరూ జయించలేరు." అన్నాడు.

ఈ మాటలు విని రాముడు ఎంతో సంతోషించి, అంగద మొదలైన వానరులను పిలచి-"సోదరులారా! మీరందరు లక్ష్మణుని వెంట వెళ్ళి, యజ్ఞాన్ని ధ్వంసం చేయండి. లక్ష్మణా! దేవతలు భయపడిపోతూ ఉంటే, నాకు చాలా బాధగా వుంది. నీవు యుద్ధంలో వారి

దుఃఖం దూరమయేటందుకు వానిని చంపు.

సోదరా! అతన్ని బలము, బుద్ధి, రెంటిని ఉపయోగించి చంపు దాంతో ఆ రాక్షసుడు నాశనమయిపోతాడు. జాంబవంత, సుగ్రీవ, విభీషణులారా! మీ ముగ్గురు సైన్యంతో వుండండి." అన్నాడు.

శ్రీరాముడు అజ్ఞను తలదాల్చి, నడుమున అంబులపొది కట్టు కొని, ధనస్సును చక్కజేసికొని, ప్రభు ప్రతాపాన్ని మనస్సులో ఉంచుకొని, లక్ష్మణుడు మేఘంలాగా గంభీరంగా-"ఈ రోజు అతన్ని చంపకుండా వస్తే, నేను ఇక మీదట మీ సేవకుడనని అనిపించు కోను. వందల శివులు అతనికి అండగా వచ్చినా, మేఘనాధుని చంపే స్తాను. ఈ మాట మీ మీద ఒట్టు పెట్టుకొని చెప్తున్నాను." అని శ్రీరామచంద్రుని పాదాల వద్ద తలనుంచి లక్ష్మణుడు వెంటనే వెళ్ళి పోయాడు. అంగద, నీల, మయంద, నల, హనుమంత మొదలైన వీరయోధులు వెంట ఉన్నారు.

వానరులు అక్కడకు వెళ్ళి చూచారు. అతనక్కడ కూచుని రక్తము, గేదెలను అహూతిగా యిస్తున్నాడు. వానరులు యజ్ఞాన్ని ధ్వంసం చేశారు. అప్పటికీ అతను లేవక పోయేటప్పటికి, వారతన్ని పొగడసాగారు.

అతను ఇంకా లేవకపోయేసరికి, విధిలేక అతని జుట్టు పట్టుకొని కాళ్ళతో తన్ని పారిపోతున్నారు. అతను త్రిశూలం తీసికొని పరు గెత్తాడు. అతన్ని చూచి వానరులు పారిపోయి, లక్ష్మణుని ఎదుటకు వెళ్ళి నిలబడ్డారు.

క్రోధం ఎక్కువయిన మేఘనాధుడు అక్కడకు వచ్చి, మాటి మాటికి గర్జించి పెద్ద గోల చేస్తున్నాడు. అప్పుడు క్రోధంతో హను మంతుడు, అంగదుడు పరుగెత్తుకొచ్చారు. రొమ్ముల్లో త్రిశూలమును గుచ్చి వారిని నేలమీద పడగొట్టాడు. తరువాత లక్ష్మణుని మీద

పదునైన త్రిశూలాన్ని వదలాడు మేఘనాధుడు. లక్ష్మణుడు బాణాలను వదలి దాన్ని రెండు ముక్కలు చేశాడు. తరువాత అంగదుడు, హనుమంతుడు లేచి కోపంతో అతన్ని కొట్టారు. కాని అతనికి దెబ్బలు తగులలేదు.

శత్రువు కొట్టితే పాపంలేదని, వీరులందరు తిరిగి వెళ్తున్నారు. అప్పుడతను పెద్దగా అరుస్తూ పరుగెత్తాడు. కోపంతో వున్న యముడిలాగా వస్తున్న అతన్ని చూచిన లక్ష్మణుడు తీక్ష్ణమైన బాణాలను వదలాడు ఆ వజ్రాల్లాంటి బాణాలు వస్తున్నట్లు చూచిన, ఆ దుష్టుడు వెంటనే కనబడకుండాపోయి, రకరకాల వేషాలు మార్చి యుద్ధం చేస్తున్నాడు. అతను కాసేపు కనబడుతున్నాడు, కాసేపు కనబడడం లేదు.

శత్రువు ఓడిపోకపోవడం చూచిన వానరులు భయపడిపోయారు. అప్పుడు లక్ష్మణునికి క్రోధం వచ్చింది. ఈ పాపిని ఇప్పటి వరకు బాగా ఆడుకోనిచ్చాను. ఇక లాభంలేదు. వీడిని వధించవలసిందే." అనుకొని, కోసలపతి శ్రీరామచంద్రుని ప్రతాపాన్ని మనస్సులో తలచుకొని లక్ష్మణుడు బాణాన్ని ఎక్కుపెట్టి వదలగానే, అదిపోయి మేఘనాధుని రొమ్ములో గుచ్చుకొంది. చచ్చేటప్పుడు అతను అన్ని మాయలు వదలివేశాడు.

"శ్రీరాముని తమ్ముడయిన లక్ష్మణుడెక్కడున్నాడు? శ్రీరామచంద్రుడెక్కడున్నాడు?" అంటూ ప్రాణాలు వదలాడు. అంగద, హనుమంతులు "నీ తల్లి ధన్యురాలు, నీవు లక్ష్మణుని చేతిలో చచ్చావు." అన్నారు.

అప్పుడు హనుమంతుడు మేఘనాధుని శవాన్ని లంకానగర ద్వారం దగ్గర ఉంచి, తిరిగి వచ్చాడు. మేఘనాధుడు చచ్చాడన్న వార్త విన్న దేవతలు, గంధర్వులు విమానాల మీద ఎక్కి ఆకాశం

లోకి వచ్చి, పూలు కురిపించి, బాకాలు ఊది శ్రీరాముని నిర్మలమైన కీర్తిని గానం చేస్తున్నారు.

"హే అనంతా! జగదాధారా! మీకు జయమగుగాక. మీరు దేవతలందరిని ఒడ్డున వేశారు." అంటూ స్తుతించి దేవతలు, సిద్ధులు వెళ్ళిపోయారు. లక్ష్మణుడు దయానిధి అయిన శ్రీరాముని వద్దకు వెళ్ళాడు. రావణుడు పుత్రుని మరణం వినగానే, మూర్ఛ వచ్చి క్రింద పడిపోయాడు. మండోదరి రొమ్ములు బాదుకుంటూ, అనేకరకాలుగా విలపిస్తూ వుంది. నగరంలో వారంతా వింతించారు. అందరు రావణుని నీచుడన్నారు.

"సంసారము నశించేదని, మీ హృదయాల్లో ఆలోచించుకోండ"ని రావణుడు స్త్రీలకు అనేక ప్రకారాలుగా తెలియజెప్పాడు. రావణుడు వారికి జ్ఞానోపదేశాలు చేశాడు. అతనసలే చెడ్డబుద్ధిగలవాడు, అయినా అతని మాటలు శుభంగాను,పవిత్రంగాను వున్నాయి. ఇతరులకు ఉపదేశాలిచ్చేవారు కోకొల్లలుగా వున్నారు. కాని ఆ ఉపదేశాల ప్రకారము ఆచరించేవారు చాలా తక్కువ మంది ఉంటారు.

## సులోచన కథ

మేఘనాధుని తలను శ్రీరాముని ముందుంచింది సులోచన దాన్ని వానరులు, ఎలుగుబంట్లు చూస్తున్నారు. లీలామయుడయిన శ్రీరామచంద్రుడు, ఆ తలను చూచి, "దీనిని జాగ్రత్తగా కనిపెట్టి వుండండి" అన్నాడు.

ఇప్పుడిక, ఏ విధంగా బాణముద్వారా ఆయన భుజాలు పక్షులులాగా లంకలోకి వెళ్ళాయో, చెప్తానా కథను. ఆ బాణాలతో దెబ్బలు

తిన్న, రక్తమయమైయున్న భుజాలు మేఘనాథుని వరండాలోపోయి పడ్డవి. అక్కడ రతి కంటే అందమైన రూప, గుణాలు గల సులోచన కూచుని శోభాయమానంగా వుంది. ఈమె వాసుకి అను నాగుని పుత్రిక, రావణుని కోడలు, మేఘనాథుని భార్య, అందాలగని.

బంగారు సింహాసనం మీద కూచుని వుందామె. మూడు లోకాల్లోని విద్యాధరస్త్రీలందరు ఆమెకు సేవలు చేస్తున్నారు. అనేకరకాలుగా, వినయంతో, పూజిస్తున్నారు, ఇక ఆమె సుఖానందాలను గురించి ఎవరు చెప్పగలరు?

సంపూర్ణ సుఖాలనిచ్చు వృక్షాల కాంతి అన్నట్లుగా, ఆమె భర్త భుజాలు అక్కడకు వచ్చి పడ్డాయి. ఆమె దాసీలు రక్తంతో తడసియున్న భుజాలను చూచి–"ఆశ్చర్యకరమైన యుద్ధం జరిగింది. అందువల్లనే అఖండం ఖండమయినట్లు కన్పిస్తున్నది."అన్నారు.

దాసీలందరు అన్నమాటలు విన్న, అందమైన నేత్రాలు గల సులోచన సింహాసనాన్ని వదలి నిలుచుంది. ప్రేమచేత ఆమెకు వణుకు ఎక్కువయిపోయి, అశుభసూచకమైన కుడికన్ను అదరసాగింది.

రామరావణులకు ఘోరమైన యుద్ధం జరుగుతూ వుంది. నా వీరశిరోమణిస్వామి కూడా ఆ యుద్ధంలోనే వున్నాడు. దేవతలు, రాక్షసులు ఆయనతో యుద్ధం చేయలేరు. అయినా బ్రహ్మ వ్యతిరేకము ఎలా వుంటుందో చెప్పలేము." అని ఆమె వెళ్ళిపోయింది.

ఆమె భర్త భుజాలను చూచి కోట్లమంది ఏడుస్తున్నారు. కంకణాలు, మణులతో పొదిగిన మహావృక్షాల్లాంటి ఆ భుజాలు మరెవ్వరికీ ఉండవు. కాని ఆ భుజాలు చూసుకొంటున్నప్పటికీ ఆమెకు నమ్మకం లేదు. నిద్రపోకుండా, స్త్రీ సుఖం లేకుండా భోజనం మాని పద్నాలుగు సంవత్సరాలున్న వాని చేతిలో మేఘనాథుడు చచ్చిపోతాడన్న

సంగతి అమె కెప్పటి నుండో తెలుసు.

"నేను పతివ్రతాస్త్రీనయితే ఈ భుజాలు స్వయంగా వ్రాసి నా సందేహాలను పోగొట్టాలి" అని నిశ్చయించుకొంది. ఈ మాట విన గానే చేతులు కదలాయి. ఆ స్థితిని చూచి ఒక సఖి లేచి పరుగెత్తి, వెదకి సీమసున్నం తెచ్చింది. దానిని ఆయన చేతి కందించింది. ఆ చెయ్యి మణులతో పొదగిన వరండాలో లక్ష్మణుని గొప్ప కీర్తిని వ్రాస్తున్నది. "నిద్ర, స్త్రీ, భోజనం పదసంవత్సరాలు వదలినా, వాటి మహిమ చాలా తప్పినవి. ఆయన నాశనం లేనివాడు, అఖండుడు, కన్పించడు, తగ్గిపోడు, అంతటా వ్యాపించి వున్నవాడు.

ఆయనే ప్రపంచ ఉత్పత్తి, పాలన, సంహారణ చేస్తుంటాడు. ఆయనే మూడు రూపాల్లో, బ్రహ్మ, విష్ణు, మహేశుడయి మార్పులు చూపిస్తాడు. ఆయన యమునకు యముడు, ఆయన్ను శేషుడు, సర స్వతి, శంకరుడు కూడా, వర్ణించలేరు.

ఆయన దేవతల, భక్తులకు మేలు చేయాలని శరీరాలు ధరిస్తూ ఉంటాడు. ఆయన పేరు భవసాగరము యొక్కవంతెన, కమలాల రూపాలలో వున్న మునుల హృదయాలు ఆయనకు నివాసస్థానాలు జ్ఞాన, ఆలోచన, బుద్ధులలో ఈ మునులు శ్రేష్ఠులుగాన వారిని కని పెట్టుకొని వుంటాడు ప్రభువు.

కోట్ల కల్పాల వరకు శాస్త్రాలు ఆయన గుణాలను, ఆయన కథను వర్ణిస్తూ వస్తున్నాయి. ఇంతవరకాయన సంగతి ఎవరికీ అంతు పట్టలేదు. అలాంటి ఆయన గుణాలను తామసుడు, ప్రాణంలేని శరీ రంతో వ్రాసి ఎలా వర్ణించగల్గుతాడు?

నా తల శ్రీరాముని దర్శించుకొందామని వెళ్ళింది. నీకు నమ్మ కం కలుగడానికి కేవలం చేతులు మాత్రం పంపాడు." అని చెయ్యి అన్ని విషయాలు వ్రాసింది. అప్పుడామె ఎంతో దుఃఖంతో భూమి

మీద పడిపోయింది.

శ్రీరామ, లక్ష్మణుల పేర్ల యదార్థం తన భర్త చేతితో వ్రాసి నప్పుడు, ఆమె చదివి కూడా, స్త్రీల స్వాభావిక ధర్మాన్ననుసరించి, ఆమె అనేకమంది సఖుల మధ్య అసహాయితగా,అందరి లాగానే ఏడుస్తున్నది. ఆమె తన భర్త లక్షణాలన్నింటిని జ్ఞప్తికి తెచ్చుకొని ఏడుస్తూ "ఇంద్రుడు నా భర్త భుజబలాన్ని తట్టుకోలేక ఒకప్పుడు పారి పోయాడు, ఆ భుజమే ఈనాడు నేలపాలయింది." అనుకుంది.

సులోచన మణులను, నగలు, వస్త్రాలు తీసేసి, నేల మీద పడి, తలమోదుకొంటూ వుంది. ఆమె శోకరూపమైన నదిలో మునిగి పోయింది. శరీరదృష్టిలేదు. దారుణమైన ఈ ఆపదను ఎవరికి చెప్పు కోవాలి?" అనుకుంటున్నది.

సఖులు అంచెలంచలుగా ఆమెను ఓదారుస్తూ వున్నారు. కాని ఆమె శోకాగ్నిలో మాడిపోతూనే వుంది. క్షణక్షణం ఆమె నేలమీద పడిపోతున్నది. లేస్తున్నది. భర్త బలాన్ని వర్ణిస్తూ వుంది, ఏడుస్తూ వుంది. అందులో ఒక తెలివిగల సఖి-"పతివ్రతా! శోకము వదలి వెయ్యి; చేయవలసిన పని చెయ్యి. నీవు చాలా తెలివిగలదానవు" అంది.

ఈ మాటలు విని సులోచన-"మంచిదమ్మా సఖీ! నీవు నిజం చెబుతున్నావు. బ్రహ్మ నాకీ దుఃఖం వ్రాసిపెట్టాడు. లేకపోతే నా యిల్లు అన్ని సుఖాలకు,వస్తువులకు నిలయమై వుండేలా బ్రహ్మ ఎందుకు చేశాడు" అంటూ, ఆమె భవనంలోకి వెళ్ళి మణులు, బ్బు రాసులు చూచుకొంది. ఆ వైభవాన్ని చూచిన తర్వాతయినా ఆమె మనస్సు ఆ వైభవాల యందు ఆసక్తి చూపలేదు. ఆమె మనస్సు భర్త పాదాల వద్దనే వుంది.

ఆమె అందమైన మణులతో కూర్చిన పాలకిని తయారు చేయించి దాని మీద భుజాన్ని ఎక్కించి తాను కూడా ఎక్కి దేవతలకు కూడా లభించడానికి వీలులేని భవనాన్ని వదలి వేసింది. ఈమెను చూచి ప్రజలు కూడా ఇళ్ళు వదలి ఆమె వెంట బయలుదేరారు. ప్రేమవలన అందరి కళ్ళంట నీళ్ళొచ్చాయి. మూడు లోకాల్లో ధన్యులయిన పతివ్రతలలో తలమానికమయిన నాగరాజ కన్యను చూచి అందరు నమస్కారాలు చేశారు.

ద్వారపాలకుడు వెళ్ళి రావణునకు సూచించాడు. "తొందరగా తీసుకురండి" రావణుడు ఆజ్ఞాపించాడు. సులోచన అక్కడికి వచ్చి దుఃఖంతో-"మీరుండగానే, నేను ఈ రోజు సుఖాలను వదలి దుఃఖాలకు అధికారిణినయి పోయాను. నా గతి ఈ విధమయిపోయింది. ఆకాశం నుండి ఈ భుజము బాణాలతో తెగి, నా భవనంలోకి రక్తంతో తడిసి ముద్దయినట్లుయి వచ్చి పడ్డది. భుజాన్ని చూచి నేను ఎంతో భయపడ్డాను. సందేహంతో ఈయన చేతిలో సీమసున్న ముంచాను. ఈయన శ్రీరామలక్ష్మణుల మహిమను వ్రాసి, క్రమంగా జరిగిన దంతా చెప్పాడు. ఆగుణ గాథను చదివి నేను విస్తుపోయాను. నేనే గనుక ఈయన తలను పొంది యున్నట్లయితే, వెంటనే తగులబడిపోయి వుండేదానను. భుజము నా భవనానికి వచ్చింది, తల శ్రీరాముని వద్ద వుంది

రాక్షసరాజా! నాకు ఎలాగైనా నా భర్త తల లభించు ప్రయత్నం చేయండి, మీరు బలవంతులు." అంది.

కోడలు మాటలు ఆయనకు వజ్రాల్లాగా వున్నాయి, ఆయన తన బ్రతుకు మీద ఆశ వదలుకున్నాడు. "రామ, లక్ష్మణ, సుగ్రీవ, నల, నీల ద్వివిద, హనుమ, విభీషణ, ఋషభులందరిని చంపి నేను తలను తొందరలో తెస్తాను.

ఇప్పటివరకు నేను కుంభకర్ణుడి మీద దేవతలకు శత్రువయిన మేఘనాథుని మీద ఎన్నో ఆశలు పెట్టుకొని వున్నాను. అందుకనే ఈ నాటివరకు నేను యుద్ధం చేయలేదు. వీరందరి బలం నా కర్థమయిపోయింది. వారు మనుష్యులు, వానరులు చంపితే చచ్చారు. ఈ మాట వింటుంటే నాకు సిగ్గేస్తున్నది. మేఘనాథ, కుంభకర్ణుల ముందు ఆ వానరుల బలమెంత? వానరులు ఇంత దుర్దశ కలిగించారు.

కులవధూ! శోకాన్ని వదలి పెట్టు, నన్ను వారితో సమానుడవని అనుకోబోకు. పుత్రికా! నీవు నాలుగు ఘడియలు ఆగి, నాభయంకరయుద్ధాన్ని చూడు. నీ శత్రువుల తలలు తేలిగ్గా తెస్తాను. జీవుడు పూర్వకర్మల ఫలాలను అనుభవిస్తాడు. లేకపోతే వానరులకు, రాక్షసులకు స్నేహమేమిటి? రాక్షసులు యోధులు, సుమేరు పర్వతాన్ని అవలీలగా పెరికి, చేతుల మధ్య పెట్టుకోగలవారు, వారిని దోమలల్లాగా వానరులు తినేశారు. అది నీచమైన కాలం చేసిన కుట్ర." అన్నాడు రావణుడు.

సులోచన హృదయంలో శోకముంది, మనస్సు స్థిరంగావుంది. ఆమె రావణుడు చెప్పేమాటలను పట్టించుకోవడంలేదు. ఆయన బలాన్ని గురించి చెప్పుకుంటుంటే, ఆమెకు సంతోషం కలుగడంలేదు. ఆయన మాటలు వింటుంటే ఆమెకు కోపం వచ్చి

"మనుష్యులలో, వానరులలో ఎంతో బలమున్నట్లు చూచి కూడా మీరు వారిని తక్కువచేసి మాట్లాడుతున్నారు. దేవశత్రూ రావణా! సముద్రాన్ని దాటి వచ్చి,లంకను తగులబెట్టిపోయిన అతన్ని కూడా మీరు చిన్నవాడని, బలము తక్కువవాడని అనుకుంటున్నారా? కుంభకర్ణ, అతికాయ,మహోదర, సోదరులతో సహా నా భర్త యుద్ధం చేసి చనిపోయారు. ఆ గెలుపును తేలిగ్గా కొట్టి వేస్తారా? ఇది మహా అజ్ఞానానికి రాచబాటలాగా వుంది,

మీకు సమాధానం చెప్పడం పాపం అయినా, అంతా పోగొట్టు కొన్న నేను వాదోపవాదాలు చేసి ఏమి ప్రయోజనం? రాజ్యానికి తిరిగి వచ్చినా నాకేమీ ప్రయోజనం లేదు. భర్త లేనిపోట్లన్ని నర కాలతో సమానం." అని లేచి మండోదరి వద్దకు వెళ్ళి, శోకకథంతా చెప్పి ఆమె పాదాలు పట్టుకొని ఏడ్చింది.

సులోచన మాటలు విన్న మండోదరి రాణి ఏడుస్తున్నది. ఆ సమయంలోనే తన భర్త భుజము వ్రాసిన, శ్రీరామలక్ష్మణుల మహి మను చెప్పింది. రావణుని కోపం, వచ్చినవారిని నిందించడం, తనను ఓదార్చడం చెప్పింది.

తన కోడలు చెప్పినమాటలు విని మండోదరి దుఃఖంతో- "అమ్మా! నీవు చాలా తెలివిగలదానవు. నేను నారదముని చెప్పిన మాటలు విన్నాను. ఆ మాటలు నీకు చెప్తాను. సత్యమని నమ్మ, వెనుకటి విషయాలన్నీ సత్యమయినాయి. ఆయన చెప్పిన మాటల్లో ఒక్కటి కూడా ఇంత వరకు అబద్ధం కాలేదు.

పుత్రికా! ముందు జరుగబోవు కథను, నాకు ముని చెప్పినది చెప్తాను విను. ఇప్పుడన్ని శోకాలను వదలి భర్తతో పాటు కాలి పరలోకాన్ని సాధించు.

నీవు శిరస్సు కొరకు శ్రీరాముని వద్దకు వెళ్ళు, ఆయన మీద సంకోచాలుండడమేమిటి? ఇవాళ నీకు సిగ్గు భూషణం కాదు. చెడు కాలం వచ్చినప్పుడు గుణ, దోషాలను లెక్కించరు. అక్కడ మీ మామ విభీషణుడు కూడా ఉన్నాడు. అంగదుడు నాకు పుత్రునితో సమానుడు! శ్రీరామచంద్రుడు ఏకపత్నీవ్రతుడు. లక్ష్మణుని కీర్తి నీవు వినేవున్నావు.

జాంబవంత, సుగ్రీవ, ద్వివిద, మయందలు మంత్రులు మహా బలవంతులు, హనుమంతుడు బ్రహ్మచారి, ఆయన విశ్వస్వరూపుడు.

సంసారం నుండి దూరం చేసే భగవంతుడనుకో.

నీ భర్త చేత్తో వ్రాసిన శ్రీరామలక్ష్మణుల ప్రభావం నీకు తెలిసే పోయింది. నేను కూడా ఋషి చెప్పిన కథనే చెప్పాను. ఇక ఆలశ్యం చేయబోకు" అంది మండోదరి కోడలితో.

అత్తగారు చెప్పిన మాటలను విని సులోచన మండోదరి పాదాల వద్ద తలవుంచి శ్రీరామ లక్ష్మణుల వద్దకు వెళ్ళింది.

ఆమె ఎలుగుబంట్లను, వానరుల సేనను చూచింది. అది సముద్రాన్ని, సుషేణ పర్వతాన్ని దాటి మరొక సముద్రం పొంగి వచ్చిందా అన్నట్లుగా, చుట్టుకొని వుంది. సైన్యంలో పసుపు పచ్చని,పచ్చని బూడిదరంగు, దుమ్ము వర్ణపు వానరులున్నారు.

ఆమె సేనలోకి వెళ్ళడానికి క్రొత్త కోడలు ఇంట్లోకి వచ్చినట్లుగా వెనుక ముందు లాడుతూ వుంది. ఆమెకు ముందుకు వెళ్ళి అందం చిందుతూ వున్న శ్యామ, ఎరుపు వర్ణాలలో వున్న శ్రీరామ లక్ష్మణులను చూచింది.

పాపాలన్నింటిని పోగొట్టే శ్రీరామచంద్రుడు సభ మధ్యలో ఉన్నాడు. ఆయన్ను చూడగానే ఆమె కళ్ళు చల్లబడిపోయాయి. నేల మీద తలవుంచి సులోచన నమస్కారం చేస్తున్నది. ఆమె చరిత్రను విభీషణుడు చెప్పాడు-"ఈమె రావణుని కోడలు"అని.

ఆమెను పతివ్రతగా తెలిసికొన్న ప్రభువు చూచాడు. "ఈమె మేఘనాథునకు తగిన శీలవంతురాలయిన భార్య, అనుకున్నాడు.

"శ్రీరామచంద్రా! మీ విరోధాన్ని విలాసంగా భావించుకొన్న దాని ఫలితమిలా అయిపోయింది. నా భర్త చనిపోయాడని అనుకున్న సమయంలో ఆయన తన చేత్తో, నాకు మీ మహిమను వ్రాసి చూపాడు, రఘువంశమణీ! నేను మిమ్మ అడుగుదామని వచ్చాను.

భూ భారాన్ని తగ్గించేవాడు, కృపాసాగరుడు, ఖరుని శత్రువు,

శివుని, శేషుని, మునుల నమస్కారాల నందు కొనేవాడు, అయి శ్రీరామచంద్రుని పాదాలను సులోచన తాకి ప్రభువును గుర్తించి వినయంగా-"శోకాలను దూరం చేయువాడా, దీనుల యెడ దయచూపువాడా, రఘువంశంలో శ్రేష్ఠుడవైన శ్రీరామా! మీకు జయము కలుగు గాక!

దయాసాగరా, భక్తులకు ఆనందాన్నిచ్చే శ్రీరఘునాథా! నేను మీ అండకు వచ్చాను. అందాల రాశీ! నా భర్త తల నాకు లభిస్తే, నేను దానితో పాటు సహగమనం చేస్తాను. నాకు తలను యిప్పించండి. నా భర్త శరీరాన్ని వదలివేశాడు. ఆయన చాలా అదృష్టవంతుడు మీకు ప్రియుడు. ఆయనకు ముక్తి లభించింది. మీ కీర్తి ప్రపంచంలో వ్యాపించిపోయింది. దానిని వర్ణించడానికి నేను యోగ్యురాలను కాను అంది.

ఈ విధంగా లక్ష్మి, బ్రహ్మల ద్వారా సేవింపబడుచున్న శ్రీ రఘునాథుని చరణకమలాల యందు తలనుంచి, చేతులు జోడించి సులోచన నిలబడి వుంది. ఆమె మాటలు విని కమలనయనుడయిన శ్రీరామ చంద్రుని నేత్రాలలో నుండి నీటి ధార ప్రవహించింది.

ఇలాంటి స్వామి రామచంద్రుడు. దీనుల మేలు కోరుచున్నాడు. కారణము లేని దయచూపుతున్నాడు.

తులసీదాసు అంటున్నాడు-"అరే, మూర్ఖా, కపటపు ఉచ్చులను నుండి బయటికి వచ్చి ఆయనను భజించు."

"భగవంతుడా! మీరు లేనిచోటంటూ లేదు. మీకు ఆది మధ్య, అంతాలు లేవు." అంది సులోచన

సులోచన దుఃఖంతో మాట్లాడుతున్న మాటలు విని రఘునాథుడు పులకితుడై పోయాడు. అంగాలు పట్టు సడలిపోయింది. "నేను నీ భర్తను బ్రతికిస్తాను. నీవు వందల సంవత్సరాలు లంకను

పాలించు. శోకాన్ని వదలి సంతోషంగా నీ యింటికి తిరిగి వెళ్ళు" అన్నాడు శ్రీరామచంద్రుడు.

సత్యాన్ని తప్పని ప్రభువు మాటలను విని వానరులకు చాలా భయమేసింది. కాని, వారు ప్రభువు స్థితిని చూచి ఏమీ అనలేకపోయారు. "బ్రహ్మ ఏమి చేయనున్నాడో, వేచి చూద్దాము, ఈయన వరమువలచి ఇతన్ని బ్రతికిస్తే దేవతలందరు ఎప్పుడూ చింతిస్తూనే వుండాలి. విభీషణుడు లంకను ఎలా పాలిస్తాడు? వైరం జ్ఞప్తికిరాగానే మేఘనాథుడు ధనస్సు తీసుకొని పరుగెత్తుతాడు." అనుకుంటూ వానరులు ప్రభువు ముఖకవళికను చూచి భయపడ్డారు. భగవానుడు శరణాగత రక్షకుడు. శ్రీరాముని అతి దయను, రావణుని కోడలు, చూచి వినయంగా అంది-

"రఘునాథా! మీరు ఉదారులు, ఏదయినా యివ్వడానికి సమర్థులు, నేను మిమ్మ దయానిధి వని తెలిసికొన్నాను. ఇలా బ్రతికి యుండటం కంటే, చావడమే మంచిదను నిర్ణయానికి వచ్చాను.

నా భర్త తన భుజాల బలంతో అన్ని లోకాలను జయించాడు. పధ్నాలుగు లోకాల్లో వుండే సుఖాలను అనుభవించాడు. యుద్ధరూపమైన తీర్థంలో మహా యాచకుడయిన లక్ష్మణుని గుర్తించి, ప్రాణ ధనాన్ని దానం చేశాడు. ఇప్పుడు నేను కానుక రూపంలో నా భర్తను తిరిగి తీసుకోదలచలేదు. ఎందుకంటే అన్నింటికంటే అధిక లాభం మీ దర్శనమే. నేను కూడా వెళ్ళి సత్య సాధన చేసి చచ్చిపోయి, యోగులు మిమ్ము కలిసి ఉత్తమగతులు పొందినట్లుగా, నేనూ పొందుతాను.

రఘువీరా! నాకు మోక్ష ప్రాప్తికి అవకాశం లభించింది. మీలో కలసిపోతే, మరి జన్మవుండదు. సముద్రంలోకి వెళ్ళిన నీళ్ళు మరల తిరిగి రానట్లుగా, మీ వద్దకు వచ్చిన వారు మరలిరారు.

వేదోత్తమా! మీరు మనస్సులలోని భావాలను అర్థం చేసికో గలవారు. అందుచేత మా నావను ఒడ్డుకు చేర్చండి," అంది.

శ్రీరాముడు సుగ్రీవుని పిలిచి మేఘనాథుని శిరస్సు తెప్పించి యిచ్చాడు. దానిని పొంది సులోచన కృతార్థురాలయినట్లు భావించింది. పతి విరహము మరల ప్రారంభమయింది. 'నా ప్రాణాలకు సంజీవని మూలమా!' అంటూ ఆమె కొంగుతో మేఘనాథుని ముఖాన వున్న దుమ్మును దులుపుతున్నది.

ఇది చూచి, తలలేని చేయి సీమసున్నం తీసికొని ఎలా వ్రాయ గలుగుతుంది. ఇప్పుడే ముఖం నవ్వితే, ఆ మాట కూడా నిజమేనను కోవచ్చు లేకపోతే రాక్షసుల మాయలన్నీ అబద్ధాలనుకోవాలి.

శ్రేష్ఠులయిన మునులు సాధన చేసి పొందలేని జ్ఞానం, ఈ చచ్చి పోయిన చేతికి ఎక్కడ నుండి వచ్చింది?" అన్నాడు సుగ్రీవుడు.

"వానరరాజా! కుతర్కము ఉచితంకాదు. ఈ తల ఇప్పుడే నవ్వుతుంది" అన్నాడు శ్రీరామచంద్రుడు.

సులోచన మేఘనాథుని తలతో-"స్వామీ! తొందరగా నవ్వండి. లేకపోతే చేయి వ్రాసినదంతా అబద్ధమంటారు" అంది.

ఆ తల ఒక్కక్షణం ఆలస్యంచేసింది. చచ్చిపోయిన నోరు మూసికొని వుంది, తెరువలేదు.

"యుద్ధంలో అందరిని చంపి అలసిపోయారా? లక్ష్మణుని బాణం తగిలినందున మీరు నాకు దుఃఖమును పెంచారు. ఇప్పుడు ప్రభూ శ్రీరాముని ముందు నా సిగ్గెందుకు తీసేస్తారు? మనసా, వాచా కర్మణా ఈ నా శరీరము భర్తనే దేవతగా భావిస్తున్నట్లయితే, ప్రభు శ్రీరామచంద్రుని సభ మధ్యలో ఈ తల మాట్లాడాలి. దాంతో విలువ కట్టలేని కీర్తి వ్యాపిస్తుంది. స్వామీ! మీ పరిస్థితి ఇలా వుంటుందని ముందే నాకు తెలిసివుంటే, మీకు సహాయం చేయడానికి

మానాన్నను చంపి ఉండేదానను" అంది సులోచన.

ఆమె మాటలు విన్న తల ఇప్పుడు నవ్వింది. ఎలుగుబంట్లు, వానరులు ఆశ్చర్యచకితులై ఉలిక్కిపడ్డారు. తలనవ్వడం చూచి అంతను ఆశ్చర్యపోతున్నట్లు చూచారు. (సులోచన తన తండ్రి సహాయం మాట ఎత్తగానే, "ఎక్కడైనా నాగరాజు భగవంతుని జయిస్తాడా?" అని తల నవ్వింది.)

వజ్రం లాంటి ఈ శబ్దము వినలేము, తల మౌనంగా వుండిపోయింది. సుగ్రీవునకు ఎంతో సంతోషము కలిగింది. ఆయన ఆ స్త్రీని ఎంతో పొగడాడు. వానరులకు చాలా ఆశ్చర్యవేసింది.

అప్పుడు వానరరాజు శ్రీరామచంద్రుని పాదాలలో తలవంచి "స్వామీ! తల ఎందుకు నవ్వింవో చెప్పండి," అన్నాడు.

"సుగ్రీవా! లక్ష్మణా! తల నవ్విన దెందుకో చెప్తాను విను. మనసా, వాచా, కర్మణా భర్తకు సేవలు చేయాలి. భార్య మేలుకు అంతకుమించిన ఉపాయం మరొకటి లేదు, ఈ విషయమును మనస్సులో నుంచుకొని భార్య భర్తకు సేవలు చేస్తుంది. అలా చేసినప్పుడు దేవతలు, మునులు సంతోషిస్తారు.

నాగరాజు కుమార్తె సత్యమును తప్పదు, ఆమె సత్యాధారంతోనే దేవతలకు శత్రువయిన మేఘనాధుని తల నవ్వింది." ప్రభువు మాటలు విన్న వానరులు ఆనందించారు,హనుమంతుడు మాటిమాటికి ఆయన పాదాలను పట్టుకుంటున్నాడు.

శివుడంటున్నాడు–"ప్రభువు భక్తులను గొప్పగా చెప్తుంటారు. ప్రభువు మహిమ అలాంటిది. ఆయన కన్నెత్తి చూచినంత మాత్రాన ప్రపంచము పుడుతున్నది, చస్తున్నది. అలాంటి ఆయనకు భక్తులను మెచ్చుకోవడంలో ఆశ్చర్యం కలిగించేదేముంది?"

తలను పొందిన సులోచన ప్రభువు పాదాలు పట్టుకొని, "కోసల రాజా! ఈ రోజు వరకు నా కోసమని యుద్ధం ఆపండి." అంటూ ఆమె విభీషణుని కాళ్ళమీద పడ్డది. అదే సమయంలో శ్రీరఘునాథుని పాదాలయందు మనస్సు నిలిచింది.

"రావణుని సోదరా! మీరు నాకు తండ్రితో సమానులు, ఈ కులము యొక్క మానమర్యాదలు మీ చేతితో ఉన్నాయి. మీరు పులస్త్య వంశ దీపకులు. మీరు శ్రీరాముని సామీప్య రూపమైన ఫలాన్ని పొందారు. పొరపాటున, తెలియక మిమ్ము తప్పుగా భావించాను. జ్ఞానం కలిగిన తరువాత మీరెంత గొప్పవారో, ఎంత గుణవంతులో అర్థమయింది.

మీరు ఉత్తమ కీర్తులు పొంది, పుణ్య కర్మలు చేస్తూ, సమాజ సహితంగా యుగయుగాల వరకు అడ్డులేకుండా రాజ్యము పాలించండి. మిమ్ము తలచుకొన్నంత మాత్రాన సజ్జనులు ముక్తులయిపోతారు రఘునాథునితో పాటు మిమ్ము కూడా భజిస్తుంటారు." అంది సులోచన.

ఈ మాటలు వినగానే విభీషణుని మనస్సులో కరుణ ఉదయించింది. కాని తన దుఃఖాన్ని వెల్లడి చేయలేదు. కాల, కర్మల పరిస్థితులు తెలియజెప్పాడు. సులోచన ఆయన అనుమతితో వెళ్ళింది.

ఆమె వానర సైన్యం నుండి దాటించి విభీషణుడు తిరిగి వచ్చాడు. ఆ సమయంలో ఆయన రావణుని వైరము మరచి, ఎంతో దుఃఖ పడ్డాడు.

సులోచన భర్త తలను పాలకీమీద పెట్టి, ఎక్కింది. శ్రీరాముని దయతో దాని ప్రభావం పెరిగిపోయింది. హృదయంలో శ్యామ మూర్తిని ఉంచుకొన్నది. ఆమె నాలుక తెంపు లేకుండా రామనామాన్ని జపిస్తున్నది.

నది, సముద్రపు సంగమునకు వచ్చిన ప్రతిపోటున ఆమె వెళ్ళింది. ఆమె ఇలా వచ్చినట్లు తెలిసికొన్న రావణుడు కూడా అక్కడకు వెళ్ళి ఉన్నాడు. శోకదాయకమైన సూర్యుడు ప్రకాశించాడా, అన్నట్లుగా. వెంట మండోదరి, రాణి వాసమంతావుంది.

రాక్షసరాజు ఆజ్ఞ ప్రకారం ఉత్తమ సేవకులు పడుగెత్తి చందనం, అగరు, సుగంధాలు తెచ్చారు. స్వర్గలోకానికి మెట్లు ఏర్పరచినట్లుగా, చితిని గట్టిగా ఏర్పాటుచేశారు. అగ్ని పెట్టగానే మంటలు లేచి ఆకాశం వరకు పోయాయి. అలా వెళ్ళటం ఎవ్వరూ చూడలేదు. సులోచన స్వర్గానికి వెళ్ళిపోయింది.

# 29. అహిరావణుని కథ

రాత్రి నాలుగు ఘడియలయింది. రావణుడు సంధ్యావందనం చేసికొన్నాడు. అతడు ఇరవై చేతులు జోడించి చాలా భక్తితో శివుని ధ్యానిస్తున్నాడు.

"పక్షిరాజా! అతడు శివునకు మనఃకర్మల ద్వారా సేవకుడు. చాలా అదృష్టవంతుడు. రావణుడు ఆకర్షణ మంత్రాన్ని జపించాడు. దాంతో పాతాళంలో వున్న అహిరావణుని మనస్సు చలించిపో యింది."

రావణుడు ఏ కారణంచేత వ్యాకులపడిపోతున్నాడను' అను మానం కలిగింది. ఆయనకు మూడులోకాలు వశమైవున్నాయి, అయ నను జయించే వీరుడేలేడు" అనుకున్నాడు అహిరావణుడు. ఆయన తన హృదయంలో కామధేనువును ధ్యానించాడు. అతను వెంటనే శివమంటపంలో రావణుడు కూచున్న చోటుకు వచ్చాడు. రాక్షస రాజుకు తలవంచి నమస్కరించాడు. రావణుడు అతని చేతులు పట్టు కొని ఆసనం మీద కూచోబెట్టాడు. అహిరావణుడు ప్రేమతో క్షేమ

సమాచారాలు అడిగాడు. ఆయన మొదట సోదరి శూర్పణఖ చెడ్డ బుద్ధిని తెలిపాడు. తరువాత ఖర, దూషణ, మారీచులు కథ చెప్పాడు. మరల సీతాపహరణం; పవన పుత్రుడయిన హనుమంతుని బలం, లంకాదహనం, సేతువును నిర్మించి ప్రభువు ఏ విధంగా లంకకు వచ్చింది, అంగదుని సంవాదము, వినిపించాడు.

తరువాత అవని, అకంపనుడు, అతికాయుడు యుద్ధంలో చంప బడ్డారు." అంటూ సోదరా! నీ విప్పుడొచ్చి క్షేమసమాచారాలడుగు తున్నావు. నీవు వచ్చి అడిగేటప్పటికి రాక్షససైన్యమంతా నాశన మయ్యేపోయింది. కుంభకర్ణుని, మేఘనాథుని చంపిన రామలక్ష్మణు లను మనుష్యులనుకున్నాను. ఇప్పుడు నిన్ను నా వద్దకు పిలిపించు కున్న దెందుకంటే. శత్రువులను నాశనం చేసే ఉపాయం చెప్తా వనియే" అన్నాడు రావణుడు.

"ఇదొక పెద్ద సమస్యకాదు, నేను ఇద్దరు సోదరులను ఎత్తు కొని పాతాళలోకంలోని దేవికి బలియిచ్చి, రాక్షసకులంలో కీర్తిని పొందుతాను. రాత్రి, సూర్యునిలాగా ప్రకాశం వచ్చినప్పుడు, వారిని తీసుకొని వెళ్ళాననుకో." అంటూ, రావణునికి తెలియపరచి, తలవంచి తన బలాన్ని చెప్పుకొని, తన యిష్టదైవాన్ని తలచుకొని శ్రీరాముని సైన్యంలోకి వచ్చాడు.

గాఢాంధకారంలో ఏమీ కనిపించటం లేదు. యోధాన యోధు లైన వానరవీరులు అక్కడ మేల్కొని యుండి "శ్రీరామునికి జయ మగుగాక" అంటున్నారు. చాలా చీకటిగావుంది. కాగడాలు కూడా అక్కడలేవు. ఎప్పుడు, ఏమి జరుగుతున్నది, ఆ చీకట్లో కనబడడం లేదు.

అక్కడ హనుమంతుడు ఒక ఉపాయాన్ని ఆలోచించాడు· తన తోక పరిధిని ఏర్పాటు చేశాడు. సర్పాల రాజు అక్కడ వ్యాపించి

వున్నాడా అన్నట్లున్నది ఆ తోక వైశాల్యం.

ఆ తోక వైశాల్యం పర్వతాకారంగా కనిపిస్తున్నది. ద్వారం వద్ద హనుమంతుడు సిద్ధంగా ఉన్నాడు. అది చూచి అహిరావణుని గుండె గుభేలుమంది, అతనికేమీ తోచలేదు.

భవానీ! అప్పుడతను కపటవేషం వేసుకున్నాడు. విభీషణుని లాగా వేషం మార్చుకొని, ఆ కపి హనుమంతుని చూచుకొని వత్సా సోదరా! కృపానిధి దీనబంధు, ప్రభువు వద్దకు వెళ్తున్నాను, నేను శ్రీ రామచంద్రుని అనుమతితో సంధ్యావందనం చేసికోడానికి వెళ్ళాను. ఆలశ్యమయింది. శ్రీరామచంద్రునకు కోపం రాకుండా ఉండగలందులకు తొందరగా వెళ్ళుతున్నాను" అన్నాడు.

హనుమంతుడు సహజంగానే ప్రతాపవంతుడు, దీనికి తోడు దేవతల ప్రభువుకు దాసుడు. అతన్ని మర్యాదకొరకైనా చూడకుండా సరాసరి శ్రీరాముని వద్దకు వెళ్ళాడు. మూర్ఖుడయినందున భయపడలేదు. హనుమంతునకు అనుమానం కలుగలేదు, ఎందువలనంటే, అతను విభీషణుని వేషంలో వున్నాడు.

గరుడా! జరుగవలసినది జరిగే తీరుతుంది. కాలం చాలా బలవత్తరమైనది. హనుమంతుడు అతని మాటలు నిజమనుకున్నాడు సోదరా! కపటపు ఎత్తులను అర్థం చేసికోవడం కష్టం. అది ఇతరుల మనస్సును, ధనాన్ని కూడా హరించివేస్తుంది.

**ఆజ్ఞను పొంది** అహిరావణుడు శ్రీరామలక్ష్మణులున్న తావుకు వెళ్ళాడు. వానరరాజు సుగ్రీవుడు, జాంబవంతుడు, నల, నీల, అంగద, సుషేణ మొదలైన బలవంతులు వున్నారు. ద్వివిద, మయంద, గవ, గవాక్ష మొదలైన రణధీరులైన వానరులు, ఇతర వీరయోధులతో కలసి విభీషణుడు నిద్రపోతున్నాడు. వారి మధ్యలో రావణ రూపంలో వున్న చంద్రుని మ్రింగడానికి పొంచివున్న రాహువులాగా శ్రీరా

ము, శేషపతి లక్ష్మణుడు ఒకేచోట నిద్రించియున్నారు. కుడివైపున రాముడు, ఎడమవైపున లక్ష్మణుడు నిద్రించియున్నారు. లక్ష్మణుని మీద ప్రభువు చేయివేసి యున్నాడు.

లక్ష్మణుని వక్షస్థలం మీద రాముని చెయ్యి, బంగారం మీద మణి వున్నట్లుగా శోభాయమానంగా వుంది. వానరులందరు క్షీరసాగరంలాగాను, అక్కడ అన్నదమ్ములిద్దరు పడుకొన్నట్లుగాను వున్నారు.

లక్ష్మణునితో పాటు చక్కని ధనస్సు, బాణాలు శ్రీరాముని వద్ద ఉన్నాయి. మేఘశ్యాముడైన శ్రీరాముని చూచి అహిరావణుడు మనస్సులోనే నమస్కరించుకున్నాడు.

బ్రహ్మ మొదలైన దేవతలు ధ్యానించి కూడా పొందలేని, మునులు, శివుడు తమ హృదయాలలో పూజించబడువాడు, వైరాగులు దర్శించదలచుకొని జపతపాలు చేసి ఆకర్షింపదలచి నామం వల్లిస్తున్న ఆ రాముని, సేవకుల భయాలను దూరం చేయువానిని అతను కళ్ళారా చూచి, "రావణుని పని పూర్తి చేయాలి"అని మనసులో ఆలోచించి, "ఈ యిద్దరిని ఎలా తీసుకెళ్ళాలి?'' అని తన మాయా ప్రభావాన్ని స్మరించాడు.

అది తన మాయతో అందరికి మతులు పనిచేయకుండా చేసింది. మంత్రాలవల్ల అందరి నోళ్ళు మూతలు పడిపోయాయి. రామలక్ష్మణు లిద్దరిని లేపుకొని అదృశ్యుడయాడు.

ఆ సమయంలో ఆకాశ మార్గంలో ఎంతో వెలుగు కనిపించింది. ఆ వెలుగును చూడగానే "అహిరావణుడు తాను చెప్పినట్లు శ్రీరామలక్ష్మణులను తీసుకొస్తున్నాడ'ని చాలా సంతోషించాడు. అహిరావణుడు క్షణంలో తన లోకానికి వెళ్ళాడు. ఇక్కడ వానరులలో గోలగోలగా వుంది.

వానరులు కళాకాంతులు లేకుండా మేల్కొన్నారు. ధార్మ

నీళ్ళులేని సముద్రంగా, చంద్రుడు లేని రాత్రిలాగా, పగటిచంద్రుని లాగా, కనిపిస్తున్నారు. మూడు లోకాలకు భూషణుడయిన శ్రీరామ చంద్రుడెక్కడ?" అని వానరులు అనుకుంటున్నారు.

అందరు కలిసి సైన్యంలో వెదకారు కాని అన్నదమ్ములిద్దరు కనిపించలేదు. ఇది చూసి, నీళ్ళులేనప్పుడు జలచరాలు వ్యాకులపడు నట్లుగా వానరులందరు వ్యాకులపడిపోయారు.

"బ్రహ్మా ఇలా చేశావేమిటి! శ్రీరాముని లేకుండా చేసి ఆయన మా ప్రాణాలు తీయాలనుకున్నట్లున్నావు. రామలక్ష్మణులిద్దరు వీర రులెక్కడ?" అంటూ వారు దుఃఖంతో ధైర్యంగా వుండలేకపోయు న్నారు.

"బ్రహ్మ కలిసి వచ్చిన కాలాన్ని కల్లెట్లు చేశాడు. రాక్షసుల సైన్యమంతా చచ్చిపోయింది. కేవలము ముఖ్య శత్రువు రావణుడు మాత్రమే మిగిలివున్నాడు. అతనూ శ్రీరాముని బాణాలు తగిలితే ఉండడు. సోదరులారా! మనలాంటి దురదృష్టవంతులెవ్వరూ ఉం డరు. మనము రావణుని జయించినా, సీతకేమని జవాబుచెప్పాలి?" అంటూ సుగ్రీవుడు వ్యాకులంతో, వజ్రాయుధం తగిలినప్పుడు పర్వ తంపడి పోయినట్లుగా, క్రిందపడిపోయాడు.

విభీషణుని సంగతి ఇక చెప్పనక్కరేలేదు. అప్పుడే ఈనిన ఆవు, దూడ కోసం తిరిగినట్లుగా, తిరుగుతున్నాడు.

హనుమంత, జాంబవంతులతో సహా అందరికి అనేక రకాల దుఃఖాలు ఆవరించాయి. గరుడా! ఆ రాత్రి చీకట్లో ఎవరికీ ఏమీ పాలుపోలేదు. అప్పుడు హనుమంతుడన్నాడు-"నా మనస్సులో ఒక ఆశ్చర్యం కలుగుతున్నది. ఒక వ్యక్తి ఎవరో విభీషణుని వేషంలో వచ్చాడు. నేనతను ప్రభువు వద్దకు వెళ్తున్నప్పుడు చూశాను. అతన్ని

అడిగితే ఎన్నో మంచి విషయాలు చెప్పావు. నేనా రాక్షసుని మన స్సులోని మర్మాన్ని తెలిసికోలేకపోయాను."

"ప్రభువును అహిరావణుడు ఎత్తుకపోయాడు. అతను నాగలోకంలో వుంటాడు. నా శరీరంతో సమానమైన వేషమున్నవాడు, నా పోలికలున్నవాడు మరొకడు లేడు. ఆ మహా బలవంతునకు చాలా మాయలు తెలుసు. బలమున్న వారు నాగలోకానికి వెళ్ళి, అతన్ని జయించి ఇద్దరన్నదములతెండి" అన్నాడు విభీషణుడు.

"హనుమా! నీ బలాన్ని ప్రపంచమంతా ఎరుగు. సోదరా! ఇద్దరన్న దమ్ములు తొందరలో ఇక్కడకు వచ్చే మార్గము చూడు. దప్పిక గొన్నవారు నీళ్ళకోసం ఎదురుచూస్తున్నట్లుగానే. శ్రీరాముడు లేనందున మనం దుఃఖంలో వున్నాము. హనుమా! సూర్యుడు లేనప్పుడు కమలములు వాడిపోయే విధంగా, రాముని చూడని మనము కళాహీనులమైపోయాము." అన్నాడు జాంబవంతుడు.

"సోదరా! పవనపుత్రా! రఘునాథుడు లేని బ్రతుకు నికృష్టమైనది. ఇప్పుడు ఒక్కొక్క క్షణం యుగాలుగా గడుస్తున్నది. నీవు సీతను వెదకావు, ఔషధం తెచ్చావు. అదే విధంగా గుణనిధి అయిన శ్రీరాముని తీసుకురా," అని సుగ్రీవుడు ఎంతో దుఃఖపడ్డాడు.

"మీరు ధైర్యంగా ఉండండి. లేకపోతే సైన్యము పిరికిపాలవుతుంది. మీరు శోకాన్ని వదలేయండి. నేను పద్నాలుగు భువనాలు, మూడులోకాల్లో నుండి శ్రీరామలక్ష్మణులను తీసుకొస్తాను. ఇప్పుడందరు జాగ్రత్తగా వుండండి. కాలమువచ్చి ఎదురుగా వచ్చి నిలబడ్డా మీరు జంకకుండా ఎదుర్కోండి." అంటూ ప్రళయ కాల మేఘంలాగా హనుమంతుడు వెళ్తూ ఒక వృక్షం క్రిందకు వెళ్ళాడు. అక్కడ ఒక మగగ్రద్ద అడుగ్రద్ద వున్నవి "ఆడుగ్రద్ద గర్భిణి" అది

మగగ్రద్దతో "మనుష్యుని మాంసము తెమ్ము. "నేను దానిని తింటే నాకు తృప్తిగా వుంటుంది" అంది. దాని మాటలు విని గ్రద్ద-"అహి రావణుడు రాముని తీసుకెళ్ళాడు. అతను ఆయనను దేవికి బలియిస్తాడు. నీవు అదృష్టవంతురాలవు, నీ కక్కడి మాంసము దొరుకుతుంది. ఏ ఉపాయంతోనైనా నేను మాంసము తెచ్చి నీ కిస్తాను". అని గ్రద్ద తన భార్యకు ఆదరంగా చెప్పింది.

హనుమంతుడు ఈ సమాచారము విని, హృదయంలో శ్రీరాముని స్మరించుకొని, ఆ క్షణంలోనే పాతాళ లోకానికి వెళ్ళి, అహి రావణుని నగరంలోకి ప్రవేశించాడు. అక్కడ మకరధ్వజుడను పేరు గల ద్వారపాలకుడున్నాడు. ఆ కపి హనుమంతుని బెదరించి- "నీవు నన్ను అవమానిస్తున్నావు, నీకు భయం లేదా? దీపపుపురుగుకు దీపాన్ని చూస్తే భయం వుండదు. అలా వుంది నీ స్థితి. నేను పవన పుత్రుని కుమారుడను. కాలాన్ని కూడా లెక్కచేయని స్వామి భక్తుడను." క్రోధంతో అన్నాడు.

ఈ మాటలు విన్న హనుమంతుడు ఆశ్చర్యంతో-"అరే, తెలివి తక్కువ మూర్ఖుడా! నాకు కలలో కూడా బిడ్డలులేరే! ఇలా అనడానికి నీకు భయమేయడం లేదా? నీ బుద్ధి కోర్కెల వశమెప్పుడయిపోయింది? నా పుత్రుడవు ఎలా అవుతావు? అలా అనడానికి నీవు సిగ్గెయ్యంత లేదా?

నీవు నాకు పుత్రుడవు ఎలా అవుతావు? నీ పుట్టుకను గురించి నాకు ఎందుకు చెప్పవు?" అన్నాడు.

"అయ్యా! మీరు లంకను తగులబెట్టి, సముద్రము పదకు వచ్చినప్పుడు, మీకు చెమట పోసి వుంది. ఆ చెమట సముద్రములో పడినప్పుడొక చేపదానిని మ్రింగింది, అప్పుడు నేను పుట్టాను. ఈ

విధంగా నేను మీ పుత్రుడను. నేను నా తల్లిదండ్రులను చూడటం లేదు, నేను అహిరావణుని సేవలు చేస్తూ, ఆయన ఆజ్ఞప్రకారం ఇక్కడున్నాను." అన్నాడు మకర ధ్వజుడు.

"నీ మాటలు నిజము. అతను శ్రీరామ లక్ష్మణులను తెచ్చి ఏమి చేస్తున్నాడు? పుత్రా! ఆ స్థానాన్ని చెప్పు. నేను నా స్వామివద్దకు పోవాలను కుంటున్నాను" అన్నాడు హనుమంతుడు.

"తండ్రీ! నాకీ విషయాలు తెలియను. నేను రాక్షసరాజువు అహిరావణుడు, సీతాపతి శ్రీరాముని, శేషపతి లక్ష్మణుని తీసుకొచ్చాడని, అతను హెరామం చేస్తున్నాడని ఈ రోజే వారిని దేవికి బలియిస్తాడని విన్నాను. నేను నా చెవులతో విన్న విషయాలు మీకు చెప్పాను. నేను మాత్రం నా స్వామి కార్యం కొరకు దుఃఖాలను సహిస్తానని మీకు స్పష్టంగా చెబుతున్నాను. మీరు వెళతానంటే మాత్రం వెళ్ళనివ్వను. స్వామి ఆజ్ఞను పాటించని అపకీర్తి తెచ్చుకోను." అంటూ వున్న అతనిని హనుమంతుడు త్రోసేసి వెళ్ళాడు. మకర ధ్వజునకు కోపం వచ్చి, అతను హనుమంతుని గుద్దాడు. హనుమంతుడతనిని గుద్దాడు. ఒకరినొకరు కొట్టుకుంటున్నారు. ఇద్దరిబలము సమానంగావుంది, ఎవరిబలమూ తక్కువగాలేదు.

ఒకరిని మరొకరు నెట్టివేయలేకపోతున్నారు. మారుతి ఆయన పుత్రుడు ఇద్దరు మహాయోధులు. భవానీ! ఎక్కువ ఆలశ్యమయిందనుకొని పుత్రుని తోకకు కట్టుకొని హనుమంతుడు సూక్ష్మరూపంలో యజ్ఞశాల వద్దకు వెళ్ళి చూచాడు. జీవుల ప్రాణాలను లెక్కపెట్టలేనన్ని అక్కడున్నాయి. అక్కడ దేవీమండపముంది. అక్కడి రక్తపాత్రల్ని గురించి వర్ణించలేము.

అనేక రకాలయిన ఎండినపండ్లు, పిండివంటలు దేవీస్థానానికి తెచ్చి వుంచబడ్డాయి. ఒక పూల మనిషి పూలు తెచ్చింది. కపిరాజు

ఒక పూవు మధ్యలోకి చేరుకున్నాడు. ఆయన పూవు కంటే తేలిక యాడు. ఆ పూలమనిషి పూలు తీసికొని మండపంలోకి వచ్చింది. పూలన్నీ దేవీమీద చల్లారు. అప్పుడు వానరుని విశాలరూపం పెరి గింది.

పాదాలను తాకి దేవి భూమిలోకి పోయింది. కపి నోరు తెరచి నిలబడ్డాడు. చాలా అందంగా ఉన్నాడు. రాక్షసులకు ఆయన అందం చూడగానే అత్యానందం కల్గి, "ఈ రోజు దేవి ప్రత్యక్ష మయింది. రాక్షసుల అదృష్టం పండిపోయింది" అంటూ మరల నమస్కరించి పూజలు చేస్తున్నారు. వచ్చిన వారొచ్చినట్లు హనుమం తుని నోరు నింపుతున్నారు. అక్కడ వస్తువులన్నీ కుప్పలు పోసివు న్నాయి. అందులో ఒక్కటికూడా మిగులలేదు. అన్నిటిని హనుమం తుడు తినేశాడు.

హనుమంతుని ఆటలు, వినోదాలు ఎక్కువయినాయి. రాక్షస కులం నాశనమయ్యే స్థితికి వచ్చింది. భుజంమీద ఎక్కిన బలి పశువు మాదిరిగా, అహిరావణుని హృదయంలో సుఖమనిపించింది.

యజ్ఞము సఫలమయిందను కొనగానే రామలక్ష్మణులను అక్క డకు తీసుకొచ్చి నిలబెట్టారు. రాక్షసుని చేతిలో అనేకమైన ఆయుధా లున్నాయి, కొందరు గదలు, కొందరు ధనస్సుబాణాలు, శక్తి శూలా లు కత్తులు, బల్లేలు తీసికొని యున్నారు. కొందరు విల్లకోలలు, లోడీ లు,(వ్యాయమసాథవాలు) గండ్రగొడ్డళ్ళు,ఉచ్చులు,ఉరులు, బెత్తాలు, బరిసెలు, ధనస్సులు, బాణాలు తీసికొనివున్నారు వాటిని చూస్తేనే ప్రాణాలు ఎగిరిపోయేటట్లున్నాయి.

వారందరు మాయాబలంలో ఆరితేరినవారు, కాని ఎంతో భయంకరమైన రూపాలతో, మూర్ఖులు, చెడు లక్షణాలుగల వారుగా ఉన్నారు. ఈ విధంగా వీరులందరు అక్కడ ఉండి, అహిరావణుని

ఆజ్ఞను అనుసరించి నడచుకొంటున్నారు.

వారు కత్తులు తీసి ప్రభువును నరకడానికి దగ్గరకు వచ్చారు-"రాజనీతి ప్రకారము నడచుకోండి. ఇంకా మూడు క్షణాల వరకు ఆగండి." అన్నాడందులో ఒకడు.

ఈ మాటలు విని అహిరావణుడు-"ఎవడో ఈ మాటలన్న వాడు, ఆయనను స్మరించుకోవచ్చు, లేకపోతే స్వప్న రాత్రితో సమాసంగా ఇద్దరన్నదమ్ముల కాలం వచ్చి తొంగి చూస్తుంది. కొంచెం ఆలశ్యమయితే వారి ప్రాణాలుండవు"అన్నాడు.

"పార్వతీ! ఆ మూర్ఖ సరస్వతి అంటున్న మాట నీతో చెప్ప డానికి నాకు సంకోచంగా వుంది. లక్ష్మణుడు రామునివైపు చూస్తు న్నాడు, రాముడు లక్ష్మణునివైపు చూస్తున్నాడు. పక్షిరాజ-గరుడా! ప్రభులీలలను ఎలా చెప్పగలను?" అన్నాడు శివుడు.

"ప్రపంచమంతా నా నామాన్ని జపిస్తున్నది. ఈ సమయంలో మనము హనుమంతుని స్మరించుకొందాం. ఆయన దగ్గరలోనే వున్నా డు." అనుకొని ప్రభువు హనుమంతుని స్మరించాడు. బ్రహ్మవ్రాసిన వ్రాత తప్పదు" అని ప్రభువు అనుకొనే సమయంలోనే అతను చంప డానికి సిద్ధమయ్యాడు, అప్పుడు మేఘంలాగా హనుమంతుడు వచ్చి అరచాడు.

రాక్షసులందరు భయపడిపోయి-"అహిరావణుడు కపటవేషం లో దేవతల స్వామిని ఎత్తుకొని రావడం మంచిదికాదు." అనుకు న్నారు. ఇందుచేతనే ఇవాళ దేవికి కోపం వచ్చింది. ఇప్పుడు మనం దరికి కీడు దాపురించింది. రెండవసారి కపి(హనుమంతుడు) పెద్దగా అరచేటప్పటికి, ఉమా! రాక్షసులు ఇంకా భయపడిపోయారు.

గాలి బాగా వీచినప్పుడు సముద్రపు నీరు చంచలమయిపోవ నట్లుగా,గర్వంతో ఉన్న రాక్షసులందరు గందరగోళపడిపోయారు.

ఆ క్షణంలోనే హనుమంతుడు ఇద్దరిని ఎత్తుకొని,రాక్షససమూహాన్ని కొట్టసాగాడు.

ఖడ్గం తీసికొని హనుమంతుడు అనేకమంది భుజాలు, తలలు నరికివేశాడు. కొందరికి ముక్కు, చెవులు లేకుండా చేశాడు, కొందరిని పట్టుకొని కాళ్ళతో తన్ని అగ్నిలోకి నెట్టేశాడు. ఎవరు తప్పించుకొని పోకుండా ఉండడానికి తోకను వలయంగా చుట్టి ఉంచాడు. ఇలా అందరిని చంపాడు. అప్పుడు అహిరావణుడు-

"అరే, మూర్ఖకోతీ! నీకు భయంలేదా? నేను అహిరావణుడనని నీకు తెలియదా? జంబుమాలిని, పాపము రావణుని పుత్రుని నీవు చంపావు. హనుమా! నేను కాలనేమిలాంటి వాడను కాను" అంటూ హనుమంతుని శరీరం మీద వజ్రంలాంటి దెబ్బకొట్టాడు. పవన పుత్రుడు కత్తిని లాగి అతన్ని కొట్టి, తలనరికి నిప్పులో పడవేసి, ఆ తలను పూర్ణాహుతికానిచ్చి ప్రభువును తీసికొని వెళ్ళాడు.

మకరధ్వజుడు ప్రార్థించగా, అతని కాయన బంధన విముక్తుని చేసి రాజ్యాన్ని ఇచ్చి-"పుత్రా! నీవు ఇక్కడ రాజ్యం చేస్తూ, మా ప్రభువులయిన ఇద్దరన్నదమ్ములను ఎల్లప్పుడు ధ్యానిస్తూవుండు" అని హనుమంతుడు తన వారి వద్దకు వచ్చాడు. యుద్ధంలో,వచ్చినసైన్యం శరీరంలో తిరిగి ప్రాణము వచ్చినప్పుడు, సర్పము మణి పొందినప్పుడు సంతోషించినట్టుగా, సుఖమనుభవించి సంతోషించారు.

ఎడబాటయిన ప్రియాప్రియులు వచ్చికలిసికొన్నప్పుడు ఆనందం పడినట్లుగానే, ఇద్దరన్నదమ్ములను చూచి అందరు ఆనందించారు.

తరువాత అందరు హనుమంతుని కలసి-"సోదరా! నీవు మా ప్రాణాలను కాపాడావు"అన్నారు. దేవతలు పూల వర్షం కురిపించారు. సంతోషంగా బాకాలు ఊదారు. సైన్య సహితంగా ఇద్దరన్నదమ్ములు సంతోషించారు. అటు రావణునకు విషయాలన్నీ తెలిసిపో

యాయి. దూతలు వెళ్ళి జరిగినదంతా చెప్పారు.

అహిరావణుడు చచ్చిపోయాడన్న వార్త విన్న రావణుడు కళావిహీనుడై ఎంతో దుఃఖించాడు. వారి మాటలు ఆయనకు బాణాల లాగా ఉన్నాయి. ఆయన తల తిరిగి, మూర్ఛితుడై భూమిమీద పడి పోయాడు. ముఖము వాడిపోయింది, కళ్ళవెంట నీళ్ళుకారాయి. అత నేమీ మాట్లాడలేక, మాటిమాటికి తలబాదుకుంటున్నాడు. ఆ సమ యంలో మండోదరి వచ్చి ఆయనకు అనేక రకాలుగా నచ్చజెప్పింది, కాని ఆ మూర్ఖుడు కాలము దగ్గరకు వచ్చి ఆమె మాటలు వినిపించుకో కుండా, కోపగించుకున్నాడు.

## నారాంతకుని కథ

భార్య మండోదరి మాటలు విని ఆయనకు కోపమెక్కువయింది అయినా ధైర్యం తెచ్చుకొని లేచి కూచున్నాడు. ఆ సమయంలో ఒక మంత్రి వచ్చాడు. రావణుడు అతనిని గౌరవంగా కూచోబెట్టాడు.

ఆ మంత్రి పేరు "సింధురనాథుడు" ఆ ముసలివాడు చాలా బలవంతుడు, పరమజ్ఞాని, చతురుడు. అతను ఎల్లప్పుడు విభీషణుని వెంట ఉండేవాడు, రావణుని సభలోకి ఎన్నడూ వెళ్ళలేదు. ఇది మంచి సమయమని ఆలోచించి రావణునకు నీతి విషయాలు చెప్పసా గాడు. కాని ఆయన మాటలు రావణునకు నచ్చక ఆయనను మరొక విషయంలోకి తీసుకెళ్ళాడు, ఇది గ్రహించి ఆ మంత్రి

"దేవశత్రూ! మనస్సులో ఎందుకు చింతలు? ఇప్పుడింకా అక్షయ మొదలైన పుత్రులకంటే రెట్టింపు బలమున్న పుత్రులు మిగిలి వున్నారు." అన్నాడుమంత్రి.

"ఇప్పుడు మా కులంలో యోధులెవరు మిగిలువ్నారు?" మంత్రి ని అడిగాడు రావణుడు.

"మీరు మీ మనస్సులో ఆలోచించుకోండి. మీ పుత్రుడు నారాంతకుడున్నాడు. అతను మూలానక్షత్రంలో పుట్టాడని వెళ్ళగొట్టారు, అతనింకా చావలేదు. ఆయన శివునకు ఇష్టుడు. అతను బిహాబావలపురంలో రాజ్యం చేస్తున్నాడు. అక్కడ డెబ్భై రెండు కోట్ల మందికి సమానమైన వీరయోధులున్నారు. అక్కడ రాజు, ప్రజల మధ్య భేదమేమీ లేదు."అన్నాడు మంత్రి.

ఆయన మాటలు విన్న రావణుడు ఎంతో సంతోషించి"ధూమకేతు'' అను దూతను తన వద్దకు పిలిచి, ఆదర పూర్వకంగా తెలియజెప్పాడు. భగవంతుని కోరిక మీద ఆ సమయాన సుగ్రీవపుత్రుడు దధిబలుడను వానరుడు అక్కడకు వచ్చి, బిహాబావలపురాన్ని చూచి మోహితుడై అతను కొన్నిరోజులక్కడ ఉన్నాడు.

కానున్నది కాకమానదన్నట్లుగా, ఆ వానరుడు రాక్షసులతో పాటు ఒక సంవత్సరం వరకు చదువుకుంటూ ఉన్నాడు. అప్పుడు గురువు కోపంతో-"అరే, మూర్ఖా! నీవు నీ గురువు సోదరుని చంపేవాడవయిపోతావు.''అన్నాడు.

ఏ అపరాధం చేయకుండానే గురువు శాపం విని దధిబలుడు ఏమీ మాట్లాడకుండా గర్వంగా అక్కడనుండి వెళ్ళిపోయాడు. త్రోవలో అతనికి దేవఋషి నారదుడు కలిశాడు. సుగ్రీవపుత్రుడు ప్రేమతో ఆయన పాదాలు పట్టుకొన్నాడు.

అటు రావణ పుత్రుడు నారాంతకుడు విద్య పూర్తిచేసికొని అక్కడక్కడ యుద్ధాలు చేస్తున్నాడు. రావణుని దూత అక్కడకు వచ్చి, సభను చూచి ప్రత్యేకంగా విస్తుపోయాడు.

పగలు ఒక ఝాము గడచిన తరువాత వీలును చూచి ఆయన నారాంతకునికి తలవంచి నమస్కరించాడు. రావణుని పత్రమిచ్చి అందరి క్షేమాలు అడిగాడు.

నారాంతకుడు తన క్షేమాలు చెప్పి రావణుని క్షేమాలు అడిగాడు. దూత జాగ్రత్తగా లంకకోట విషయాలు చెప్పాడు. అప్పుడు నారాంతకుడు "భయంకరమైన వాయిద్యాలు వాయించు, నాలుగు రకాలసైన్యాన్ని సిద్ధం చెయ్యి. నేను తండ్రి దూతతో కలసి జన్మభూమికి వెళ్ళాలనుకుంటున్నాను" అన్నాడు.

నారాంతకుని ఆజ్ఞప్రకారము రాక్షససమూహము తమ సరంజామాను సర్దుకుంటున్నది. అందమైన గుర్రాలు, ఏనుగులు, ఒంటెలు, రథాలు, కంచరగాడిదలు, ఆకాశవిమానాలు. నానావిధాలైన అస్త్రశస్త్రాలు చేతుల్లోకి తీసుకొని రాక్షస సైన్యము వెళ్ళుతున్నది. వారు వ్రోగయి అన్ని హంగామాలు పూర్తిచేసికొని అనేక రకాలైన వాయిద్యాలు వాయించారు. ఆ వాయిద్యాలలో ప్రతి వాయిద్యాని కొక గుర్తువుంది.

భర్త వెళ్ళుట ఖాయమని తెలిసికొన్న ఆయన భార్య బిందుమతి తన మనస్సులో-"రామచంద్రునితో విరోధం పెట్టుకోవడం మంచిది కాదు. ఇప్పుడు నేను కూడా వెంట వెళ్ళాలి" అనుకొని అందమైన వస్త్రాలు భూషణాలు ధరించి తన భర్త పాదాలు పట్టుకొని-"ప్రాణనాథా! నేను అత్త, మామల దర్శనం కొరకు మీతో పాటు వస్తాను" అని ప్రార్థించింది.

రావణ పుత్రుడు నారాంతకుడు భార్య మాటలు విని ఎంతో సంతోషించి-"సంకోచాలన్నీ వదలి సఖులతో కలసి మాతో పాటు రా" అని వెంటనే తన దళంతో కలసి లంకా నగరం దగ్గరకు వెళ్ళి-"తనగురువైన మునీశ్వరునితో నలభై కోసుల దూరాన దళం ఉన్నప్పుడు జరిగిన విషయం చెప్తాను, విను. అక్కడ లక్ష్మీపతి, కృపాళువు అయిన రామచంద్రుడు నల్లని మేఘాలలాంటి సైన్యాన్ని రావడం, చూచాడు. ప్రభువు సర్వజ్ఞుడయినా, నీతి ప్రకారం నడచుకొనేం

దుకు. మంత్రులను పిలిచి-"మిత్రులారా! దక్షిణపు వైపు చూడండి ఎన్నో మేఘాలు గర్జిస్తూ వస్తున్నాయి."అన్నాడు.

"ఉమా! శ్రీరఘునాథుడు అంతటా ఉండువాడయినా, ఈ మాట అడుగడం, ఆయనలీలలలో ఇదొకలీల"అన్నాడు శివుడు.

శ్రీరామచంద్రుని మాటలు విని విభీషణుడు నవ్వి, ప్రభుపు పాదకమలాలు పట్టుకొని-"స్వామీ! ఇది మేఘాల గుంపు కాదు, రాక్షసరాజు నారాంతకుడు. ఇతను సింహావాసపురంలో వుంటాడు ఇతన్ని రావణుడు పిలిపించాడు. ధూమకేతు మాతతో పాటు ఎంతో అల్లకల్లోలము చేసుకుంటూ, పెద్దగా అరుస్తూ వస్తున్నాడు.

ప్రభూ! ఈయనతో పాటు అనేకమంది గుణవంతులు కూడా ఉన్నారు. వారు పాడుతూ, వాయిద్యాలు వాయిస్తూ వస్తున్నారు. ఆ దుష్ట చతురంగసైన్యాన్ని, ఏనుగులు, గుర్రాలు, రథాలు,కాలిబంట్లను తీసికొని, నాలుగు దిక్కుల్లో తిరుగుతున్నారు"అన్నాడు.

అటు నారాంతకుడు సైన్యంతో సహా రావణుని భవనానికి వెళ్ళాడు. రావణుడు పుత్రుని చూచి పులకితుడై కలిసి, కుశలక్షేమా లడిగి, ఎంతో సంతోషంగా కూర్చోబెట్టుకున్నాడు.

నారాంతకుని సైన్యాన్ని, ఐశ్వర్యాన్ని చూచి మూర్ఖ రావణుడు అన్ని చింతలు మరచిపోయాడు. సీతను ఏ విధంగా ఎత్తుకొచ్చి నది, సవివరంగా చెప్పాడు. తరువాత ఆ మూర్ఖుడు, పాపాలగని అయిన రాక్షస రావణుడు "నీవు వెళ్ళి శయనించు" అని పుత్రునితో చెప్పి తాను కూడా లేచి వెళ్ళాడు. ఆ రాత్రి గడచి తెల్లవారివప్పుడు లోకాలకు రక్షకుడు శ్రీరామచంద్రుడు మేల్కొన్నాడు.

అప్పుడు వానరులు లంకను ముట్టడించారు" అని విన్న నారాంతకుడు చాలా క్రోధితుడయాడు. ఆ మహాబలశాలి, తన అపార

సైన్యాన్ని సమాయత్తపరచుకొని, బాకాలు ఊపి లంక నుంచి బయలు దేరాడు. నాలుగు ద్వారాల వద్ద యుద్ధం చేసి, బాణాలు వర్షంగా కురిపించి, వానర సైన్యాన్ని కంగారు పెట్టాడు. రాక్షసులు లంక నుండి, పర్వతం నుండి మిడుతల దండు వచ్చినట్లు, వచ్చారు.

వానరులు పారిపోవడం చూచిన హనుమంతుడు పండ్లు పట పటా కొరికి పెద్దగా అరచి, నాలుగువైపులా తోకను పెంచి, దుష్ట రాక్షసుల సమూహాన్ని పోకుండా ఆపాడు.

వారిని తీగెన వున్న పండ్లను మాదిరిగా నేలమీద వేసి కొట్టు తున్నాడు. ఎంతో మందిని దిక్కులన్నింట పారవేశాడు. ఒకవైపు హనుమంతుడు రెండవవైపు అంగదుడు యుద్ధం చేస్తున్నారు.

రాక్షసుల సైన్యం సముద్రంలాగాను, రెండు రకాల వానర యోధులు మందరాచలంలాగా వున్నారు. వారు సైన్యరూపమైన సాగరాన్ని "జయ"రూపమైన రత్నాలను వెలికి తీయుటకు చిలుకు తున్నాయి, ఇది చూచిన శ్రీరామచంద్రుడు నవ్వాడు.

వానరుల పరాక్రమం చూచి నారాంతకునకు క్రోధం పెరిగి పోయి, ప్రళయకాలంతో సమానంగా చాలా భయంకరమైన శబ్దం చేశాడు. రాక్షసులు గట్టిగట్టి బండలు, అస్త్రాలు తీసికొని పరుగు లెత్తారు.

అతను ఒకేసారి ఎన్నో బాణాలు వేసి, అస్త్రాలతో కొట్టి వాన రులను ఆతలాకుతలం చేశాడు. వారు రామలక్ష్మణులను స్తుతిస్తు న్నారు. అందులో ఒకడు-"బ్రహ్మ మనకు వ్యతిరేకి అయినాడు" అంటున్నాడు.

ఈ మధ్యలో నారాంతకుని మంత్రి వచ్చి అంగదుని పాదాలు పట్టుకొన్నాడు. అలాగే ఇంకా ఎంతో మంది యోధులు వాని అంగా

లను చుట్టుకొన్నారు. అంగదుడు అందరితో కలసి ఆకాశంలోకి ఎగి రాడు.

ఆకాశంలో వాలి పుత్రుడు, సూర్యుని దగ్గరకు వెళ్ళే చిట్కా వేశాడు. దాంతో వారి అంగాలు తగులపడి క్రింద పడిపోయారు. అంగదుడు యుద్ధభూమిలోకి వచ్చాడు. ఇతన్ని చూచి రాక్షసుల రెండవ సేనాపతి పిశాచాల సైన్యంతో పాటు అక్కడకు వచ్చి, ప్రచండమైన త్రిశూలాన్నిలాగి అంగదుని కొట్టాడు. అంగదుడు వెం టనే క్రిందపడి పోయాడు. ఇది చూచి హనుమంతుడు పరుగెత్తుకొచ్చి త్రిశూలాన్ని లాగి కొట్టాడు. సేనాపతి ముక్కలయి పోయాడు

సమాచారమంతా విని రఘునాధుడు-"లక్ష్మణా! మీరు తొంద రగా వెళ్ళండి"అన్నాడు. లక్ష్మణుడు తలవంచి, భయంకరమైన ధన స్సు, బాణాలు తీసుకొని, శివుని ప్రార్థించి వెళ్ళాడు.

మూర్ఛనుండి తేరుకొని అంగదుడు మరల వచ్చాడు. లక్ష్మ ణుని నారి మ్రోత విని వానర సమాజమంతా తిరిగి వచ్చింది.

ధనస్సు యొక్క నాదధ్వని విన్న రాక్షసులకు చెవుడు వచ్చి నట్లయిపోయింది. ఇతర శబ్దాలు వినబడడంలేదు. లక్ష్మణుడు చాలా బాణాలను వర్షంలాగా కురిపించాడు, అనేకుల కాళ్ళు, చేతులు,తలలు తెగిపోయాయి.

ఇటు ఎలుగుబంట్లు, వానరులు జయము కోరుతుంటే, అటు రాక్షసులు తాము గెలవాలని యుద్ధం చేస్తున్నారు. మహావీరుడు,బల వంతుడైన అంగదుడు యుద్ధంలో శ్రేష్ఠమైన రణధీరుడు.

రెండు రకాల వానరులు సింహనాదం చేశారు. అప్పుడు పారి పోయిన వానరులు కూడా యుద్ధం చేయసాగారు. వారు ఎంతోమంది రాక్షసుల తలలు నరికి పారేస్తున్నారు, అటు రావణునకు తమ భుజాల బలాన్ని చూపుతున్నారు.

అనేకమంది రాక్షసులు చచ్చారని తెలిసిన నారాంతకునకు ఎక్కడ లేని కోపం పుట్టుకవచ్చింది. అతను రథ సహితంగా ఆకాశంలోకి వెళ్ళి కనపడకుండా, అస్త్రాల వర్షం కురిపిస్తున్నాడు.

క్షణంలో వానర సైన్యాన్ని మూర్ఛితులను చేసి, ఆ మూర్ఖుడు శ్రీరామచంద్రుని వద్దకు వెళ్ళి, మేఘాల గర్జనలాగా గర్జించి క్రోధంతో అనరాని మాటలంటున్నాడు. "రాక్షసకులద్రోహీ! జాగ్రత్త! ఇవాళ నేను సోదరుని వైర కారణంగా నిన్ను చంపేస్తాను." అంటూ అతను ఒక త్రిశూలాన్ని వదలాడు. దానిని జాంబవంతుడు మధ్యలోనే పట్టుకొని "రఘునాథునకు జై" అంటూ పరుగెత్తు కొచ్చి నారాంతకుని గుండెల్లో గుచ్చాడు.

త్రిశూలం తగులగానే అతను మూర్ఛపోయాడు. అప్పుడు జాంబవంతుడు, అతన్ని చేత్తో పట్టుకొని అనేకసార్లు నేలకేసికొట్టాడు, తరువాత కట్టేసి ఇసుకలో పాతిపెట్టాడు.

అదే సమయంలో వానరులందరు తేరుకొని, తమ ఇష్టాను ప్రకారం యుద్ధం చేస్తున్నారు. జాంబవంతుడు, ఈ దుష్టుడు నేను చంపితే చావడ"ని మనస్సులో అనుకొని, బ్రహ్మ ఇష్ట ప్రకారము భూమిలో పాతి పెట్టిన వానిని పెకలించి బయటికి తీసి, రెచ్చగొట్టి నాలుగు గుద్దులు ముక్కుమీద గుద్ది, కాళ్ళు పట్టుకొని లంకలోకి విసిరేశాడు. అక్కడ వున్న రావణుని ముందు పడ్డాడు వెళ్ళి నారాంతకుడు.

అప్పుడు రావణుడు "అయ్యో, అయ్యో" అంటూ పరుగెత్తి నారాంతకుని కౌగలించుకున్నాడు. ఇక్కడతను కనుపించకపోయే సరికి రాక్షస సమూహం గాబరాపడి కోటలోనికి పారిపోయింది.

సంధ్యాసమయం కాగానే వానరులు శ్రీరామచంద్రుని పాదాల ముందు తలలుంచి తమతమ స్థానాలకు వెళ్ళిపోయారు. తెల్లవారగానే

నారాంతకుడు మేల్కొని, రావణుని చూచి చాలా సిగ్గుపడి, వెంటనే రథమెక్కి ఒంటరిగానే పరుగెత్తి, ఆకాశ మార్గంలో యుద్ధభూమికి వచ్చాడు. వానరసైన్యము ఈ రహస్యం తెలిసికోలేక పోయింది. అతడు చాటుగా వుండి బాణాల వర్షం కురిపించాడు.

ఆ మూర్ఖుడు కృపానిధి శ్రీరామచంద్రుడున్న చోటుకు వజ్రా ల్లాంటి బాణాలు వందదాకా వదిలాడు. బాణాలు తగులగానే అనేక మంది వానరులు వెలవెలపోయారు. చాలా మంది పిరికివారు పారి పోయారు.

వీర వానర యోధులందరు సవాళ్ళు వేస్తూ ఆకాశంలోకి ఎగు రుతున్నారు. కాని వారికెక్కడ వెదకినా అతడు కనబడడం లేదు. అప్పుడు వానరవీరులు, వృక్షాలు, పర్వతాలు తీసికొని లంకలోకి వెళ్ళదామని నిర్ణయించుకుని, రావణుని మహలు యొక్క బురుజుల మీద తోకలు వ్యాపింపజేసి కూచున్నారు. చేతులతో బండలు,రాళ్ళు వేస్తున్నారు. దాంతో అనేకమంది రాక్షసులు నుగ్గునుగ్గయిపోయారు ఇది చూచి రాక్షస స్త్రీలు దుఃఖంతో ఏడుస్తూ, రావణుని నివాసానికి వెళ్ళారు.

రాక్షసుల చేతులు, కాళ్ళు విరుగగొట్టారు. వారు దీనంగా కేకలు వేస్తున్నారు దుష్టరాక్షసులు కోటనుండి బయటకు వచ్చి వనా నికి పారిపోతున్నారు. ఆ అరుగురు వానరులు లంకలోకి రావి ఆకు ల్లాగా వణికించారు. ఇండ్ల తలుపులు విరుగగొట్టారు. శత్రువుల స్త్రీల వెంట్రుకలు చేతులతో పట్టుకొని లాగి ఈడుస్తున్నారు.

లంకలో చాలా గందరగోళంగా వుంది. అప్పుడు దుష్టుడైన నారాంతకుడు ఇది విని ఆకాశం నుండి రథ సహితంగా, ఎంతో క్రోధంతో దిగి వచ్చి కనబడ్డాడు.

తన స్త్రీల దశను చూచి అతను చాలా కఠినంగా-"మూర్ఖ

లారా! యుద్ధం వదలి యిక్కడకు వచ్చారా? స్త్రీలతో పోట్లాడడానికి మీకు సిగ్గు వేయడం లేదా?" అన్నాడు.

వీని మాటలు విన్న వానరులకు బాలా ఆనందంగా వుంది. ఏడ్పులు పెడబొబ్బలు పెడ్తున్న రాక్షసస్త్రీలను వదలి, శిలలతోకొట్టి అతని రథాన్ని, గుర్రాలను చూర్ణం వేసేశారు. ఆయుధాలను విరుగ గొట్టి సారథిని చంపేశారు.

రావణుడు చూస్తుండగానే నారాంతకుని బావు దెబ్బలు కొట్టి చికాకు పెట్టారు. వాళ్ళు రాక్షసుల కాళ్ళను పట్టుకొని త్రిప్పుతూ, రఘునాథుని పవిత్రమైన కీర్తిని గానం చేస్తూ నాట్యాలు చేస్తున్నారు.

నారాంతకుడు ప్రాణాలమీద ఆశ, భయముతో గుర్రాలు నష్టమైపోవడం అనే మోహాన్ని వదిలేశాడు. శూరువీరులందరు ఆయన సందేహాన్ని పోగొట్టారు. గుర్రాల, ఏనుగుల ఘీంకారాలు నాల్గు వైపులావ్యాపించాయి. దుమ్ము కమ్మి ఆకాశమంతా మేఘ సమూహా ల్లాగాఅయిపోయింది. దాంతో తనవారు, పరాయివారను విషయం తెలియడం లేదు.

వానరు లింకా జాగ్రత్త పడనేలేదు. ఇంతలో రాక్షసులుదగ్గరకు రానే వచ్చారు. వల్లని రాక్షసులు, ఇందుకు తోడు కటికి చీకటి, ఇవి బాలక శత్రువులు బాణాలతో కొడుతున్నారు.

వానరులకు తాము చాపిన చేతులు తమకే అగు పడడం లేదు. ఒకరినొకరు పిలుచుకుంటున్నారు. ఏ రాక్షసుడు ఎదురుగా వచ్చి పోట్లాడ ంలేదు. వారు వానరులను చంపి భూమి మీద పడుకో బెట్టారు.

అనేక మంది వానరులు పారిపోయి సముద్రపు ఒడ్డుకు వచ్చి చేరుకున్నారు. శ్రీ రఘునాథుడు సైన్యం వ్యాకులంగా ఉండడం చూచి ధనస్సును ఎక్కుపెట్టి బాణాలను వదలేటప్పటికి సూర్యోదయ

మయినట్లుగా వెలుగు వచ్చింది. అంధకారము దూరము కాగానే ఎలుగుబంట్లు, వానరులు సంతోషంగా, పండ్లు పటపట కొరుకుతూ పరుగెత్తి కొచ్చి శత్రువులను కొట్టి చంపసాగారు. వారు ఒండొరులను సవాళ్ళు చేసికొంటూ తలపడ్డారు. భయంకరమైన యుద్ధం చేసుకుంటున్నారు. శ్రీరామచంద్రుని దయవలన నారాంతకుని సైన్యంలోని ఇరువది రెండు కోట్ల రాక్షసులను చంపి వానరులు ఆ రాత్రి గడపారు.

సూర్యోదయము యింది. శ్రీరామచంద్రుని ప్రకాశ బాణాలు అంబులపొదిలోకి వచ్చేశాయి. కోట్లమంది భయంకరరూపాల్లో వున్న తన యోధులతో కూడినసైన్యాన్ని చూచి నారాంతకుడు, అనేకమైన బాణాలు మత్తు కలిగించేవి వేశాడు. వానరులు కదలకుండా, మెదలకుండా ఉండిపోయారు. కదలించినా కదలడంలేదు. ఉచ్చుల్లో ఎలుకలను పెట్టునట్లుగా పెట్టడానికి పెద్ద పెద్ద ఉచ్చులు తీసికొని రాక్షసులు పరుగులు తీశారు. ఆరితేరిన వీరయోధులను, బలము గలవారనుకున్న వానరులను, మూర్ఛితులుగా వున్న వారిని లంకలోకి విసరేస్తున్నాడు. రావణుడు తన పుత్రుడు చేసిన పనికి సంతసించి, భ్రాతాజుల మాదిరిగా అతని భుజబలాన్ని పొగడుతూఉన్నాడు.

అంగద హనుమంతులు నిద్రలేచారు. నారాంతకునితో మరల యుద్ధం చేస్తున్నారు. వారు క్షణం యుద్ధం చేశారో, లేదో, వెంటనే వారిని కూడా బాణాలతో మూర్ఛితులను చేశాడు. మధ్యాహ్నమయింది. శ్రీరామచంద్రుడు జయమును ఊహించి, వానరులను, ఎలుగుబంట్లను మేల్కొల్పాడు. మూర్ఛ నుండి తేరుకొని వారు పరుగులెత్తారు.

వానరులందరి మూర్ఛలు దూరమయిపోయాయి. వారురాముని స్మరించుకున్నారు. బంధనాలు విడివడిపోయాయి. పవన పుత్రుని, అంగదుని చూచి, వారు "శ్రీరామునికి జై" అంటూ సంతోషించారు

శ్రీరామచంద్రుడు తమ్ముడైన లక్ష్మణునకు ఆజ్ఞయిచ్చాడు. ఆయన నమస్కరించి ప్రచండమైన ధనస్సు, బాణాలు తీసికొని లేచా డు. లక్ష్మణుడు నారాంతకునితో- "ఒక్కక్షణం నిలబడు. నీవు యుద్ధంలో అనేకమైన మాయలు చేశావు" అన్నాడు. అతను వజ్రం లాంటి ఒక బాణాన్ని లక్ష్మణుని రొమ్ములో వేసాడు. అది తగులగానే ఆయన యుద్ధభూమిలో పడిపోయాడు. దుష్ట రాక్షసులు పెచ్చరిల్లి పోయి, వానర సేనను తింటున్నారు. భయపడి వానరులు పారిపోతు న్నారు. ఇక బ్రతుకమనుకొంటున్నారు. రాక్షసులు ఎలుగుబంట్లు, వానరుల వేషాలతో వానరులనే తింటున్నారు. ఈ పనిని వానరులు పసికట్టారు.

ఆ సమయంలోనే లక్ష్మణునకు తెలివివచ్చింది. తన సైన్యం నాశనమయిపోతూ ఉండడం చూచాడు. పవన పుత్రుడు కపట నారాంతకుని మోసం తెలుసుకొని ఆకాశంలోకి ఎగిరాడు.

అతను తామసి యజ్ఞాన్ని మొదలుపెట్టి, బలి కొరకు పశువుల సమూహాన్ని తెచ్చాడు. సంధ్యాసమయం కాగానే సేనంతా అలసిపోయి శ్రీరాముని స్మరించి తిరిగి వచ్చింది.

లక్ష్మణుడు వెంటనే శ్రీరాముని వద్దకు వచ్చి, సైన్యంతో సహా ప్రభువు పాదకమలాలకు నమస్కరించాడు. దయాసాగరుడు, వానరు లను చూడగానే, వారి శ్రమలు దూరమయిపోయాయి

"మీ మీ స్థానాల్లో జాగ్రత్తగా వుండండి." అని సుఖసాగరు డయిన శ్రీరామచంద్రుడు అందరితో అన్నాడు. వానరులు, ఎలుగు బంట్లు ఆ ప్రకారంగానే స్మరించుకుంటూ వెళ్ళిపోయారు.

కాగభుసండి అంటున్నాడు-"గరుడా! పవిత్రమైన చరిత్ర చెప్ప డం, వినడంలో రెండు ఝాముల రాత్రి గడచిపోయింది. అప్పుడు దేవఋషి నారదుడు, శ్రీరాముడు శోభాయమానంగా ఉన్నచోటుకు

వచ్చాడు. ప్రభువు నమస్కరించి ఆయనకు ఆసనమిచ్చి, ఆశీర్వాదము పొంది సంతోషించాడు. ముని చక్కగా రాముని మునిరూపాన్ని తరువాత చూచి,చంద్రుని చూచి చకోరం ఆనందించినట్లుగా ఆనందించాడు. పులకితుడై ఋషి రాజైన నారదుడన్నాడు-

"స్వామీ! నేనిప్పుడు మీ వద్దకు వచ్చిన పని చెప్తాను వినండి. నన్ను బ్రహ్మ పంపించాడు. మీరు ఎల్లప్పుడు అనాథులకు రక్షకులుగా ఉంటున్నారు. అందుచేత బ్రహ్మమాటలను నిజము చేయండి. తెల్లవారే వరకు వానర రాజైన సుగ్రీవుని పుత్రుడైన దధిబలుని తీసుకు రాకుండా చూడండి."

"సోదరా! నీవు తొందరగా, సముద్రపు మధ్యలో ధవళగిరి వున్నచోటుకు వెళ్ళు. దధిబలుడు అక్కడ ధ్యానంలో వుండటం ప్రారంభించి, చాలా రోజులయింది. ఆయన తపోబలంతో తేజోవంతుడయినాడు. అతని దగ్గరికి వెళ్ళి, తెలివిగా, అతనిని సంతోషపెట్టి ఎలాగైనా అతన్ని పిలుచుకురండి." అన్నాడు హనుమంతునితో ప్రభువు.

పవన పుత్రుడు సంతోషంగా, శ్రీరాముని పాదాలకు నమస్కరించి వెళ్ళాడు. ఆయన ఉదాసీనంగా లేడు. హనుమంతుడు ఉత్తమ బాణంలాగా వేగంగా పరుగెత్తాడు. బలనిధి అయిన హనుమంతుడు మూడున్నర ఘడియల్లోనే అక్కడకు చేరుకున్నాడు. ఆయన భవనం సూర్యుని ప్రకాశంలాగా వెలిగిపోతున్నది. హనుమంతుడు ఆయన వద్దకు వెళ్ళి నిలుచున్నాడు. ఒక క్షణం హనుమంతుడు, "ప్రభువు వద్దకు ఎలా వెళ్ళాలి?"అని ఆలోచించాడు. ఈయన ఇంటితో పాటు లేవనెత్తుకుపోతే సరిపోతుంది. కాని భక్తుడనైన నాకు అలాంటి అజ్ఞ శ్రీరామచంద్రుడిచ్చి యుండలేదు.

దధిబలుని నిలుకడయైన ధ్యానాన్ని హనుమంతుడు తెలిసికొని, వాకచక్యం వదలివేసి, భగవంతుని స్మరించ నారంభించాడు. దైవాను సారంగా దధిబలుడు కాలు మడచుకొనుటకు (మూత్ర విసర్జనకు) లేచి నప్పుడు అతనిని చూచాడు. హనుమంతుడు "జయశ్రీరామా" అన్నాడు. ఇది విని దధిబలుడు తన కండ్లు తెరచాడు. అప్పుడు హనుమంతుడు అన్నాడు. సోదరా! మూడు లోకాలకు రక్షకుడైన శ్రీరామచంద్రుని దర్శించడానికి రా, శివుని హృదయ రూపమైన మానససరోవరంలోని హంసలాగా నివసించు, ఆ ప్రభువే ఆదరంగా నిన్ను తీసుకురమ్మని పంపాడు."

ఈ పవిత్రమైన మాటలు విని సుగ్రీవ పుత్రుడైన దధిబలుడు హనుమంతునితో కలసి భగవానుని వద్దకు వచ్చాడు, ఇద్దరు వాన రులు ప్రభువు వద్దకు వచ్చి, ఆయన పాదాలను చూచి, విష్ణువని తలచుకొంటూ తమ హృదయాల్లో ఆయన పాదాల యందు భక్తిని దాచుకున్నారు, దధిబలుడు ప్రేమతో కాళ్ళు పట్టుకొనియే ఉన్నాడు. ప్రభువు అతనిని చూచాడు. తన కరకమలాలతో అతని చేతులు పట్టుకొని ప్రభువు లక్ష్మణునితో సహా అతనిని కలిశాడు. వారు కూచుని, అయన్ను తన వద్ద కూచోబెట్టుకున్నారు. ఆ సమయానికే సుగ్రీవు డక్కడకు వచ్చాడు. పుత్రుని చూచుకొని సుగ్రీవుడు ఎంతో సంతోషించాడు.

నారాంతకుడు గురుపు సోదరుని చూచాడు. ఇద్దరు కలిసికొన్నారు సంతోషంగా క్షేమసమాచారాలు ఇద్దరు తెల్పుకున్నారు.

"పక్షి రాజగరుడా! సుగ్రీవ పుత్రుడైన దధిబలుడు చాలా తెలివిగలవాడు. అతని నోటినుండి పొగడ్త విని మిత్రునకు తెలియ చెప్తున్నాడు."

గురుపు సోదరుని మంచిమాటలు విన్న నారాంతకునకు అంత

లేని కోపం వచ్చింది. ఆ దుష్టుడు అతన్ని అనరాని మాటలంటూ, "వానరులు సహజంగానే రాత్రింబవళ్ళు పిరికివారిగానే ఉంటారు. తండ్రిని చంపిన తాపసునకు, అంగదుడు, పాదరక్షలుగా అయిపోయారు. దధిబలా! ఇది వానర కుల పద్ధతి. మా కులంలో శత్రువులతో పొత్తుపెట్టుకోవడముండదు." అని అతను ప్రభువు దగ్గరకు పరుగెత్తపోతున్నంటే, దధిబలుడతనిని తోకతో చుట్టేసి ఆపాడు.

"అరే, మూర్ఖా, పిరికి వానరా! నేనంటే నీకు భయంలేదా? నిన్ను గురువు సోదరుడవని వదలి పెడ్తున్నాను." అంటూ నారాంతకుడు ఒక్కత్రోపుత్రోసి వెళ్ళాడు. సుగ్రీవుని పుత్రునకు కోపం వచ్చింది, వెంటనే ముందుకొచ్చి అతన్ని పట్టుకొన్నాడు, నారాంతక దధిబలులు కలియబడ్డారు. ఇది చూచి వానరులు, ఎలుగుబంట్లు "శ్రీ రామునికి జై" అంటూ రాక్షసులతో యుద్ధం చేయసాగారు. తరువాత—"దధిబలా! నీ భుజ బలం ధన్యమైంది. యుద్ధం చాలా చాకచక్యంగా చేశావు." అన్నారు వానరులు, వానరుల పొగడ్తలు విన్న నారాంతకుడు కోపం తెచ్చుకొని దధిబలుని వెంటబెట్టుకొని కనబడకుండాపోయాడు. ఎనభై వేల ఆమడలు ఆకాశంలోకి వెళ్ళి దధిబలుడు మనస్సులో శ్రీరఘునాథుని తలచుకొని, రాక్షసుని పట్టుకొని, నేల మీద కొట్టాడు. చచ్చేటప్పుడు అతను పెద్దగా అరచాడు.

చచ్చేటప్పుడు రావణ పుత్రుడు నారాంతకుడు పెద్ద శబ్దంచేసి "శ్రీరామా శివా? అని అంటూ, తాపస వేషం వదలి ఉత్తమ శరీరాన్ని దాల్చాడు. "భరద్వాజమునీ! మునులు, సిద్ధులు, దేవతలు అనేకరకాలైన జప, యజ్ఞాలు చేసి పొందగల ఉత్తమగతిని అతను పొందాడు. ఆ ఫలాన్ని దయాసాగరుడు, శ్రీరామచంద్రుడు రాక్షసునకు సహజంగానే ప్రదానం చేశాడు."

"గరుడా! అతని అదృష్టాన్ని చూచి దేవతలు నిర్భయులై

నారు. వారు శ్రీరామచంద్రుని పాదాల్లో మనస్సుంచి సంతోషంగా పూలు చల్లారు".

నారాంతకుడు చచ్చిపోయాడని తెలిసికొని, అతని తలను త్రుంచి తన చేతిలోకి తీసికొని, మొండాన్ని లంకలోకి విసరివేశారు. అది ఖరుని శత్రువయిన శ్రీరామచంద్రుని వద్దకు వచ్చింది,

దధిబలుడు ప్రభువు వద్దకు వచ్చాడు. అతన్ని చూచి లక్ష్మీపతి శ్రీరామచంద్రుడు లేచి. లక్ష్మణుని సహితంగా ఎంతో ప్రేమగా కలసి సంతోషించాడు. ప్రభువు పద్ధతి ఎప్పుడూ ఇలాగే వుంటుంది. ఆయనకు చిన్న పెద్ద అను తారతమ్యముండదు.

ప్రభువు, నారాంతకుని శిరస్సుచూచి-"సుగ్రీవా! నారాంతకుని తల జాగ్రత్తగా ఉంచు. ఇది పాడయిపోకూడదు." అన్నాడు. శ్రీరాముడు.

సుగ్రీవుడా తలను జాగ్రత్తగా ఉంచాడు. ప్రభువు దధిబలుని ఎంతగానో పొగడాడు. జగదీశ్వరుని గొప్పతనాన్ని గురించి చెప్పిన ప్పుడు దేవతలకు విలువ పెరుగుతూ వస్తున్నది. అలాంటి ప్రభువు తన మిత్రుని ప్రశంసిస్తున్నాడు, ప్రభువు తనకనుకూలంగా వున్నట్లు గ్రహించిన, దధిబలుడు తన జన్మ సఫలమయిందనుకొని,శోకరహితు డయినాడు.

చేతులు జోడించి, వాక్కును భక్తి రసంలోముంచి-"జగదాత్మా, ప్రభూ! మీరు ఎల్లప్పుడు దీనుల హృదయాల్లోని విషయాలను తెలిసి కొనే స్వభావం కలవారు" అంటూ ఆయన ప్రభువు పాదాలమీద పడ్డాడు. ఆయన ప్రేమను చూచి వానరులు, దేవతలు ముగ్ధులయిపో యారు. ఆయనకు గర్వము లేకుండా ఉండడం చూచిన దీనదయా ళువయిన ప్రభువు ఎంతో ఆదరించి-"సోదరా! నీవు నీ యిష్టము వచ్చిన వరం కోరుకో" అన్నాడు. దధిబలుడు వినయంగా-"మీ రూప

గుణ, నామములు ఎల్లప్పుడు నా హృదయంలో నివసించునట్లుగాను, కాముకుడైన పురుషునకు స్త్రీ యందు, లోభికి ద్రవ్యమందు ప్రేమ వున్నట్లుగా, మీ చరణకమలాల యందు ప్రేమ వుండునట్లుగాను, వరదానం చేయండి" అన్నాడు.

శ్రీ రాముడు "అలాగే, అని మరొక వరం కూడా ఇస్తాను అని సోదరా! నీవు సంతోషంగా మహాదావల్ పురాన్ని ఏలుకో. అన్ని కపటము వదలి పార్వతీ పరమేశ్వరుల చరణాల యందు దృఢమైన భక్తిని ఉంచు" అన్నాడు.

భక్తి, రాజ్యము అను రెండు ఉత్తమ వరాలనుపొంది, దధి బలుడు ప్రభువు పాదాల వద్ద తలవంచి వెళ్ళాడు. "ఋషీ! అతన్ని శ్రీరాముడు సాదరంగా పంపించాడు."

రావణుడు కూడుని ఉన్న చోటున, వచ్చిపడిన నారాంతకుని తలలేని మొండెము చూచి ఎంతో దుఃఖపడ్డాడు.

శోకరూపమైన సాగరంలో లంకా రూపమైన నావ పడిపోయింది అందులో రాక్షస స్త్రీలందరు ఎక్కికూడున్నారు. మండోదరి బిందుమతిని కూర్చోబెట్టి, ఆమెకు సులోచనకథంతా చెప్పింది. ఇల్లు, సంపదలు వదలి పతి ప్రేమలో నిమగ్నమైపోయింది. అప్పుడు మండోదరి "కోడలా! మరొక ఉపాయం లేదు. నీవు శ్రీరాముడున్న చోటుకు వెళ్ళు" అంది.

అత్తగారి మాటలు విని, తెల్లవారగానే [illegible] [illegible] శరీరంతో, బంగారు విమానం తెప్పించి, అందులోకి తన చేతులతో భర్త శరీరాన్ని ఎక్కించి తీసుకువెళ్ళి "రఘుకుల శ్రేష్ఠా, రామా! రక్షించండి, రక్షించండి మీ కీర్తిని, మానమ్మకాన్ని వమ్ము చేయకండి. మీరు నా పతి ప్రేమను లెక్కచేయనట్లయితే, అది నీతి అనిపించుకోదు. పతియందు ప్రేమవున్న స్త్రీలు పతి మరణించిన తరు

వాత కూడా బ్రతికుంటే, ఆ ప్రేమకు అర్థముండదు. ఆ ప్రేమ ఎటు వంటిదో గుర్తింపడం తేలిక" అంది.

"భవానీ! ఈ పతివ్రత యొక్క నిరాశను,వినయంతో కూడిన వాక్కులను విని దీనదయాళుడు పులకితుడైపోయి, ఆమెను దగ్గరకు పిలవాడు. ఆమె వచ్చి ప్రభువు కాళ్ళమీద పడింది. శ్రీరాముడు ఆమెను లేపి కూచోబెట్టి మధురంగా-"బిందుమతీ! నీవు చాలా తెలివి గలదానవు. నీ హృదయంలో నీ భర్త పాదాల యందు అమితమైన ప్రేమ వుంది. నీ గుణాలను నేనెన్నని వర్ణించగలను? నీ యిష్టమైన వరం కోరుకో"అన్నాడు.

బిందుమతికి కళ్ళవెంట నీళ్ళొచ్చాయి. రెండు చేతులు జోడించి నిలబడి-"ప్రభూ! మీరు కల్ప వృక్షంలాగా దానశీలురు. మీ చరణ కమలాలు గంగలాగా పవిత్రమైనవి. మీరు నా భర్తతలను తొంద రగా తెప్పించండి"అంది.

ప్రభు శ్రీరామచంద్రుడు నారాంతకుని తలను తెప్పించాడు. భర్తతలను చూచి ఆమె సంతోషించి-"శ్రీరామచంద్రా! నాది మరొక కోరిక, కట్టెలు లేకుండా ఎలా తగులబడిపోగలము?" అంది.

ఆమె నియమ పూర్వకమైన మాటలు విని, శ్రీరామచంద్రుడు, హనుమంత, అంగదులు మొదలైన యోధులతో-"స్నేహితులారా! లంకలోకి వెళ్ళి, చందనం, అగరుల మోపులు తీసుకురండి"అన్నాడు శ్రీరాముని ఆజ్ఞ ప్రకారం వారు పరుగెత్తి లంకలోని ఇల్లిల్లు వెదకారు వానరులు చందనపు మోపులు, కట్టెలు ఎన్నో రామచంద్రుడున్న చోటుకు తెచ్చారు. అప్పుడు శ్రీరామచంద్రుడు-"విభీషణా! ఇది చాలా గొప్ప విషయం. బిందుమతి వెళ్ళదలచిన చోటుకు నీవు కూడా కట్టెల మోపులతో వహవెళ్ళు. రావణునియందున్న వైరము వదలి ఒక అందమైన, పవిత్రమైన చితిని తయారు చేయించు" అనిచెప్పాడు.

రావణుని సోదరుడు విభీషణుడు శ్రీరాముని ఆజ్ఞను తలదాల్చి లేచి, తనతో చందనము, అగరు మొదలైనవెన్నో తీసికొచ్చాడు. రావణుడు, భార్యలతో సహా, చిందుమతి ఉన్నచోటుకు వెళ్ళాడు. ఆమెను చూచి దేవతల శత్రువయిన రావణుడు ఎంతో దుఃఖపడ్డాడు. రాక్షస స్త్రీలందరు ఏడుస్తున్నారు.

నిత్యము భర్త వద్ద తమ ఇంట్లో కాచున్నట్లుగా, నారాంతకుని భార్యలందరు కాచున్నారు. నిప్పుపెట్టేటప్పటికి మంటలు లేవాయి, ఆయన భార్యలందరు ఆ చితిలోపడి స్వర్గానికి వెళ్ళారు.

వారి పరిస్థితులను చూచిన దేవతల భార్యలు వారిని పొగడ్తూ, తమతమ యిండ్లకు వెళ్ళారు. రావణుడు కూడా తన భార్యలతోపాటు సందేహ, భయాలతో తన భవనానికి వెళ్ళిపోయాడు.

శివుడు అన్నాడు-"ఉమా! శ్రీరాముని దయవలన ఈ చక్కని చరిత్రను నేను నీకు చెప్పాను. పార్వతీ! ఇప్పుడు మరొక చరిత్ర చెప్తా విను. నీవు శ్రద్ధగా వింటున్నావు గనుక నాకు చెప్పబుద్ధేస్తున్నది.

శ్రీరాముని శత్రువుని యెడ ప్రవర్తించాల్సిన రోజులు దగ్గరకు వచ్చాయి. ఆ ఆలోచనతోనే ఆపదల మ్రోతలు లంకలో మ్రోగుతున్నాయి.

# 34

రాత్రి గడచిపోయింది, తెల్లవారింది. వానరులు, ఎలుగుబంట్లు నాలుగు ద్వారాల వద్దకు వచ్చారు. యోధులను పిలిచి రావణుడు-"యుద్ధంలోకి వెళ్ళి శత్రువుల యెదుట నిలబడలేనివారు, భయపడు వారు, ముందుగానే పారిపొండి. యుద్ధభూమిలోకి వెళ్ళాక యుద్ధం చేయలేమంటే, కష్టాలపాలవుతారు. నా బాహుబలం మీద నేను ఆధారపడి శరీరాన్ని పెంచుకున్నాను. ఆక్రమణ చేసిన శత్రు

వులకు నేను స్వయంగానే తగిన బుద్ధి చెప్తాను." అంటూ ఆయన గాలిలాంటి వేగం గల రథాన్ని సిద్ధం చేసుకున్నాడు. యుద్ధభేరీలన్నీ మ్రోగుతున్నాయి. కాటుక తుఫాను వచ్చినట్లుగా, ఎంతో బలం గల వీరులు పోగయ్యారు.

ఆ సమయంలో అనేకమైన అపశకునాలెదురైనాయి. కాని, తన భుజబలగర్వంతో రావణుడు, ఆయన యోధులు, వీటిని లెక్క పెట్ట లేదు.

వారికున్న గర్వ మింతంతా కాదు. వారు శకునాలు పట్టించు కోవడం లేదు. చేతుల నుంచి ఆయుధాలు జారిపడిపోతున్నాయి. యోధులు రథాల నుండి పడిపోతున్నారు, గుర్రాలు, ఏనుగులు పెద్దగా సకిలించడం,ఘీంకరించడం చేస్తున్నాయి, పారిపోతున్నాయి. గ్రద్దలు, నక్కలు, కుక్కలు,గాడిదలు భయంకరంగా అరుస్తున్నాయి, కాలుని దూతలలాగా గ్రుడ్లగూబలు చాలా భయంకరంగా కూస్తున్నాయి. ఇవన్నీ చూస్తుంటే, ఇది వారికి మృత్యు సందేశమా అన్నట్లుగా వుంది.

మనుష్యులు, జీవులు, శత్రువులు, తెలివితక్కువగా శ్రీరాముని కు వ్యతిరేకులు. కాముకులు అయితే, వారికి కలలోనయినా శుభశకునాలయి, మనస్సుకు శాంతి లభిస్తుందా?

రాక్షసుల అంతు తెలియని సైన్యం బయలుదేరింది. చతురంగ సైన్యంలో అనేక దళాలున్నాయి. అనేక వాహనాలు, రథాలు, విమానాలు మొదలైనవి ఉన్నాయి. వాటి మీద అనేక రంగుల్లో జండాలు ఎగురుతున్నాయి. గాలి ఎగారగొట్టిన వర్షాకాలపు మేఘాలా అన్నట్లుగా, ఎన్నో మదించిన ఏనుగుల గుంపులు వెళ్ళాయి. యుద్ధం చేయడంలో శూరవీరులు, అనేకరకాల మాయలు ఎరిగున్న రాక్షసుల సమూహాలున్నాయి.

ఆ విచిత్రమైన సైన్యము, వసంతఋతువు సైన్యంలాగా చూడ ముచ్చటగా వుంది. సైన్యము వెళ్ళేటప్పుడు దిగ్గజాలు కదలిపోతు న్నాయి, సముద్రము అల్లకల్లోలమయిపోతున్నది, పర్వతాలు అల్ల ల్లాడుతున్నాయి.

వాటి కాళ్ళ దుమ్ముకు సూర్యుడు కూడా కనిపించడం లేదు, గాలి ఆగిపోయింది, భూమి వికావికలవుతూ వుంది. మహాప్రళయం తెచ్చే మేఘాలు గర్జించినట్లుగా, యుద్ధభేరీలు, బాకాలు హోరెత్తిపో తున్నాయి.

యుద్ధ వాయిద్యాలు మ్రోగుతున్నాయి. యోధులకు ఉత్సాహం తెచ్చే మారూరాగం వాయించబడుతూవుంది. వీరులందరు సింహనా దాలు చేస్తున్నారు. తమ పరాక్రమాలను ఏకరువు పెడుతున్నారు.

రావణుడంటున్నాడు–"వీరయోధులారా, వినండి. ఎలుగుబం ట్లను, వానరులను పిప్పి పిప్పి చేయండి. నేను ఆ ఇద్దరన్నదమ్ము లను చంపేస్తాను." అని ఎదురుగా తన సైన్యాన్ని నడిపించాడు. ఈ సమాచారము వానరుల కందగానే, రామచంద్రుని స్తుతిస్తూ పరుగె త్తారు.

వానరులు, ఎలుగుబంట్లు పరుగెత్తేటప్పుడు, రెక్కలు కట్టుకొని పర్వతాల గుంపులు అనేక బాణాలు తగిలినందున ఎగిరిపోతున్నాయా అన్నట్లుగా, భయంకరమైన కాలునిలాగా వున్నారు. గోళ్ళు,దంతాలు పర్వతాలు, విశాలమైన వృక్షాలే వారి ఆయుధాలు, ఆ మహాబల వంతులు ఎవరినీ చూచి భయపడరు. వారు రావణ రూపంలోనున్న మదించిన ఏనుగుకు కొరకు సింహాల్లాగా, "శ్రీరామచంద్రునికి జై" అంటూ ఆయన కీర్తిని గానం చేస్తున్నారు.

రెండువైపుల యోధులు జయజయకారాలు పలుకుతూ, సరియైన

జోడీలు చూసుకొని, ఇటు శ్రీరాముని కీర్తిని, అటు రావణుని కీర్తిని గొప్పగా చెప్పుకుంటున్నారు, కలియబడుతున్నారు.

రావణునకు రథమున్నది, శ్రీరామునకు రథంలేదని తెలిసికొని విభీషణుడు మనస్సులో సందేహ మేర్పడి ఆయన పాదాలకు నమస్కరించి ప్రేమతో-"ప్రభూ! మీకు రథం లేదు, కవచంలేదు, పాదరక్షలు లేవు. ఇలా వెళ్ళి మీరు అంత బలవంతుడైన రావణుని ఎలా జయిస్తారు?"అన్నాడు.

"సఖీ! విను, జయం కలిగించే రథం మరొకటుంది, శౌర్య, ధైర్యాలు ఆ రథానికి చక్రాలు, సత్య, శీలాలు దృఢమైన జెండా,బల, వివేక, సంయమాలు, పరోకారం. ఈ నాలుగు దాని గుర్రాలు. క్షమ దయ, సమతారూపమైన త్రాళ్ళతో అది బంధించబడుతుంది.

ఈశ్వరుని భజించడమే, ఆ రథానికి ఎంతో నేర్పరియైనసారథి, వైరాగ్యం డాలు, సంతోషం కత్తి, దానం గండ్రగొడ్డలి, బుద్ధి ప్రచండమైన శక్తి, విజ్ఞానం కఠోరమైన ధనస్సు.

సంయమ, నియమాలు బాణాలు, నిర్మలమైన నిలుకడ అయిన మనస్సు అంబులపొది, బ్రాహ్మణ, గురువులకు పూజలే అభేద్యమైన కవచము. ఇంతకుమించి విజయానికి మరేమి సాధనాలు కావాలి? సఖా! ఇలాంటి ధర్మరథమున్న వారినెవ్వరూ జయించలేరు."అన్నాడు శ్రీరాముడు.

ప్రభువు మాటలు విన్న విభీషణుడు ప్రభువు పాదాలను పట్టుకొని-"శ్రీరామచంద్రా! మీరు ఈ వంకతో నాకు ఎంతో జ్ఞానోదయం కలిగించారు" అన్నాడు.

అటు రావణుడు, ఇటు అంగద హనుమంతులు రెచ్చగొట్టుకుంటున్నారు. రాక్షసులు, ఎలుగు బంట్లు, వానరులు తమ తమ స్వాములను పొగడుకుంటూ యుద్ధం చేస్తున్నారు. బ్రహ్మ మొదలైన

దేవతలు, సిద్ధులు, మునులు విమానాల మీద ఎక్కి ఆకాశం నుండి యుద్ధం చూస్తున్నారు. పార్వతీ! నేను కూడా వారితో పాటు శ్రీరామ చంద్రుని చరిత్ర, యుద్ధం చూస్తున్నాను.

యుద్ధ ఆసక్తితో రెండువైపుల యోధులు మత్తులై పోతున్నారు కాని శ్రీరాముని బలంతో వానరులు జయిస్తున్నారు. ఒకరిని మరొకరు రెచ్చగొడ్తూ, మట్టగించి పారవేస్తున్నారు.

వారు కొడుతున్నారు, నరుకుతున్నారు, పట్టుకొంటున్నారు, క్రిందపడిపోతున్నారు. తలలు త్రుంచి, వాటితో ఇతరులను చంపుతున్నారు. పొట్టలు చీల్చేస్తున్నారు, భుజాలు విరుగదీస్తున్నారు. కాళ్ళు పట్టుకొని యోధులను భూమి మీద కొడుతున్నారు.

కోపించిన కాలునిలాగా వానరుల శరీరాల నుండి కారుతున్న రక్తం అందంగా వుంది. వారు బలవంతులైన రాక్షససైన్యంలోని యోధులను నలిపివేస్తూ, మేఘాల్లాగా గర్జిస్తున్నారు. చెంపలు వాయిస్తున్నారు. దవడలు పగుల గొడుతున్నారు, బెదరిస్తున్నారు, పళ్ళతో కొరుకుతున్నారు. తన్నులతో పిప్పిచేసి వేస్తున్నారు. వానరులు, ఎలుగుబంట్లు కిలకిలమంటున్నారు. దుష్టరాక్షసులను నాశనం చేయడానికి కపటము, మోసములు ప్రయోగిస్తున్నారు.

వారు రాక్షసులను పట్టుకొని వారి దవడలను చీల్చివేస్తున్నారు. రొమ్ములు చీల్చి ప్రేవులు బయటకు తీసి మెళ్ళోవేసికొంటున్నారు. వారిని చూస్తే నృశింహావతారం ఎన్నోరూపాలు ధరించినట్లుగా వుంది. భూమి నుండి ఆకాశం వరకు "పట్టుకోండి చంపండి" అను భయంకరమైన గోల పెచ్చుపెరిగిపోయింది.

రావణుడు తన సైన్యం వ్యాకులంగా వుండడం చూచి, పది ధనస్సులు తీసుకొని కోపంతో, గర్వంతో, "తిరిగిరండి, తిరిగిరండి" అంటూ వెళ్ళాడు. రావణుడు ఎంతో కోపంతో పరుగెత్తాడు. వాన

రులు కూడా ఆయన కెదురుగా 'హాహా' అంటూ నిలబడ్డారు, చేతు ల్లో వృక్షాలు, రాళ్ళు, కొండలు తీసికొని వారు అతనిమీద ఒకేసారి గా వేస్తున్నారు.

ఆ పర్వతాలు రావణుని వజ్రంలాంటి శరీరానికి తగులగానే ముక్కలుముక్కలయి విరిగిపోతున్నాయి. ఎంతో గర్వపోతు, క్రోధి అయిన రావణుడు తన స్థానాన్నుండి కదలలేదు, మెదలలేదు తన రథాన్ని ఆపి నిమ్మకు నీరెత్తినట్టుగా, ఏమీ జరుగుటలేదన్నట్టుగా నిలుచుని ఉన్నాడు.

అతను ఇటు, అటు కవిసి వానరయోధులను నలినలి చేస్తు న్నాడు. అప్పుడనేక మంది ఎలుగు బంట్లు, వానరులు పారిపోతూ- "అంగదా! హనుమంతా! రక్షించండి శ్రీరామచంద్రా రక్షించు. ఈ దుష్టుడు యమునిలాగా తినేస్తున్నాడు." అని పిలుస్తున్నారు.

రావణుడు వానరులందరు పారిపోవడం చూచి పది ధనుస్సుల మీద బాణాలు ఎక్కుబెట్టి వదులుతున్నాడు. పాములు ఎగిరి చుట్టు కొంటున్నట్లుగా ఆ బాణాలు వారి శరీరాలను చుట్టుకొంటున్నాయి. భూమి, ఆకాశం, దిక్కులు అంతటా బాణాలు పరచబడ్డాయి. వానరులు పారిపోవాలనుకున్నా ఎక్కడకు పారిపోగలరు? చాలా కలకలంగావుంది రాముని సైన్యం గాబరాతో-"రఘువీరా! దయాసింధూ! దీనబంధూ! భక్తరక్షకా! హరీ, భగవంతుడా! మమ్మ రక్షించు" అని పిలు స్తున్నారు.

తన సైన్యం చికాకుగా వుందని తెలిసికొన్న లక్ష్మణుడు, నడుముకు అంబుల పొది కట్టుకొని, ధనుస్సు చేతితో పట్టుకొని, శ్రీరామచంద్రుని పాదాలయందు తలవంచి క్రోధంతో వెళ్ళి-"అరే, దుష్టా! వానరులను, ఎలుగుబంట్లను ఎందుకు చంపుతున్నావు? నన్ను చూడు, నేను నీకు యముడను" అన్నాడు.

"అరే, పుత్రులను చంపిన ఘాతకుడా! నేను నిన్నే వెతుకు తున్నాను. నిన్ను చంపితేనే కక్షతీరి, నా ఒళ్ళు చల్లబడుతుంది." అంటూ రావణుడు తీక్ష్ణమైన బాణాలు వదలాడు. లక్ష్మణుడు ఆ బాణాలను వందముక్కలు చేశాడు. మరల రావణుడు అనేక అస్త్రాలు వదలాడు. లక్ష్మణుడు వాటినీ ముక్కలు చేశాడు.

లక్ష్మణుడు తన బాణాలతో రథాన్ని త్రుంచి సారథిని చంపే శాడు. పది తలల్లో వందల బాణాలు వేశాడు. పర్వతాల శిఖరాలలో పాములు దూరినట్లుగా, ఆ బాణాలు జొరబడిపోతున్నాయి.

వంద బాణాలు రావణుని రొమ్ములో కొట్టాడు. అతను స్ఫుర తప్పి పడిపోయాడు. స్ఫురతెలిసిన తరువాత ఆ మహాబలశాలి అయిన రావణుడు మరల లేచి, బ్రహ్మ ఇచ్చిన శక్తిని వదలాడు. ఆ శక్తి సరిగ్గా లక్ష్మణుని గుండెల్లో గుచ్చుకుంది. లక్ష్మణుడు స్ఫురతప్పి పడిపోయాడు. రావణుడు అతన్ని ఎత్తుతున్నాడు. కాని బలం చాలటంలేదు. లక్ష్మణుడు తనమీద, సమస్త బ్రహ్మాండాన్ని దుమ్ము కణాలలాగా పెట్టుకొనియున్నాడు. అలాంటి లక్ష్మణుని, మూర్ఖుడైన రావణుడు పైకి లేవదీయబోతున్నాడు. ఆయన మూడు లోకాలకు స్వామి, శేషావతారుడని ఆయనకు తెలియదు.

ఆ సమయంలో హనుమంతుడు కఠోరంగా మాట్లాడుతూ పరుగెత్తుకొచ్చాడు. ఆయన్ను చూచి రావణుడు ఆయనను బలంగా గుద్దాడు. హనుమంతుడు మోకాళ్ళమీద కూచున్నాడు. భూమిమీద పడలేదు. అయితే క్రోధం వలన సర్దుకొని లేచి, రావణుని ఒక గుద్దు గుద్దాడు. దాంతో వజ్రం పడ్డప్పుడు పర్వతం పడిపోయినట్లుగా, క్రింద పడిపోయాడు.

మూర్ఛనుండి తెప్పరిల్లి రావణుడు హనుమంతుని పరాక్రమాన్ని మెచ్చుకోసాగాడు. హనుమంతుడు అన్నాడు—

"అరే, దేవతల శత్రువా! నీవు ఇంకా బ్రతికి వున్నావంటే, నా పరాక్రమం ఎందుకు పనికి రానిదై పోయిందనుకోవాలి" అంటూ హనుమంతుడు లక్ష్మణుని తీసుకొచ్చాడు. రావణునకు ఆశ్చర్యం కలిగింది.

"సోదరా! నీవు యమునికూడా భక్షించేవాడవు, దేవతలను రక్షించేవాడవను విషయం మరచిపోకు" అన్నాడు శ్రీరామచంద్రుడు,

ఈ మాటవినగానే కృపానిధి లక్ష్మణుడు లేచి కూచున్నాడు. ఆ కాలశక్తి ఆకాశంలోకి వెళ్ళిపోయింది. లక్ష్మణుడు మరల ధనస్సు బాణాలను చేతిలోకి తీసికొని రావణుని రథాన్ని విరగ్గొట్టి, సారథిని చంపి, చికాకు పరచాడు. రావణుని గుండెలో వంద బాణాలువేశాడు. దాంతో అతను పడిపోయాడు. అప్పుడు రెండవసారథి ఆయన్ను రథం మీద ఎక్కించుకొని వెంటనే లంకలోకి తీసుకెళ్ళాడు.

ఇక్కడ రావణుడు మూర్ఛనుండి తేరుకొని యజ్ఞము చేస్తున్నాడు. ఆ మూర్ఖుడు శ్రీరామచంద్రుని శత్రువు అయినందున తన జయం పట్టుదలగా కోరుకుంటున్నాడు,

ఈ విషయం విభీషణునకు తెలియగానే వెంటనే శ్రీరామచంద్రునితో అన్నాడు-"ప్రభూ! రావణుడు ఒక యజ్ఞంచేస్తున్నాడు. అందులో సఫలుడయితే, ఆ దురదృష్టవంతుడు తేలిగ్గా చావడు.

ప్రభూ! వానరులను త్వరగా యజ్ఞం ధ్వంసం చేయడానికి పంపండి. దాంతో రావణుడు యుద్ధానికి వస్తాడు. తెల్లవారగానే శ్రీరామచంద్రుడు మంచి యోధులను పంపాడు. అంగదుడు, హనుమంతుడు మొదలైన వీరులందరు పరుగెత్తారు.

వానర యోధులు సహజంగానే ఎగిరి లంకమీద ఆక్రమణచేసి రావణుని భవనంలో నిర్భయంగా జొరబడ్డారు, రావణుడు యజ్ఞం చేయడం చూడగానే వారికి అమిత కోపం వచ్చి "అరే, సిగ్గుమాలిన

వాడా! నీవు యుద్ధం నుండి పారిపోయి ఇక్కడకు వచ్చావు! దొంగ జపం చేస్తున్నావు" అంటూ అంగదుడు ఒక్కతన్ను తన్నాడు. కాని ఆ మూర్ఖుడు వాడిని కూడా చూడలేదు. అతను అచంచల భక్తిలో మునిగివున్నాడు.

తన్నినా చూడకపోయేసరికి, వానరులు కోపంతో అతన్ని పళ్ళతో కొరకడం, కాళ్ళతో తన్నడం ప్రారంభించారు. తరువాత ఆడవారి జడలు పట్టుకొని బయటకు తీసుకొచ్చారు. వారు అతిదీనులై అరుస్తున్నారు. అప్పుడు రావణుడు యముడిలాగా, అతికోపంతో, వానరుల కాళ్ళు పట్టుకొని నేలమీద కొడుతున్నాడు, ఈ మధ్యలో వానరులు యజ్ఞాన్ని ధ్వంసం చేశారు. ఇది చూచి రావణుడు చావు దెబ్బతిన్నా ననుకున్నాడు.

యజ్ఞాన్ని ధ్వంసంచేసి వానరులందరు శ్రీరామచంద్రుని వద్దకు వచ్చారు, రావణుడు కోపంతో బ్రతుకుమీద ఆశలు వదలు కొని యుద్ధభూమికి వెళ్ళాడు.

ఆయన వెళ్ళేటప్పుడు భయంకరమైన అపశకునాలవుతున్నాయి కాలం దగ్గరకు వచ్చిందిగాన, అతను ఎవరిమాట వినలేదు. "యుద్ధ బాజాలు మ్రోయించండి" అన్నాడు.

అపారమైన రాక్షస సైన్యం బయలుదేరింది. అందులో ఏను గులు, రథాలు, కాలిబంట్లు, గుఱ్ఱపు స్వారీలు ఉన్నాయి. ప్రభువు ఎదుట ఆ దుష్టుడు, దీపపు పురుగులు అగ్నివైపు, కాలిపోవడానికి వెళ్ళినట్లుగా, పరుగెత్తాడు.

ఈ వైపు దేవతలు— "ప్రభూ! ఇతను మమ్మల్ని చాలా దుఃఖ పెడుతున్నాడు. స్వామీ! ఇక ఇతన్ని ఆడించకండి" సీత చాలా దుఃఖంలో వుంది అని ప్రార్థించారు.

దేవతల ప్రార్థన విని ప్రభువు చిరునవ్వునవ్వాడు. లేచి ధనస్సు

బాణాలు సిద్ధం చేసికొన్నాడు. వెంట్రుకలు జుట్టు తలపైన బిగించి వున్నాయి. వాటి మధ్యలో పూల గుత్తులు అందంగా వున్నాయి.

ఎర్రని కండ్లు, మేఘాలలాగ శ్యామల శరీరం, లోకాలన్నింటికి ఆనందాన్ని కలిగించే ప్రభువు చేతిలో ధనస్సు, నడుమున అక్షయ అంబుల పొది బిగించుకొనివుంది. బలమైన, పొడవైన భుజాలు, విశాలైన రొమ్ములో భృగువు గుర్తు చూడ ముచ్చటగా వుంది.

తులసీదాసు అంటున్నాడు—"ప్రభువు ధనస్సును చేతిలోకి తీసుకొని తిప్పుతున్నాడు. అప్పుడు బ్రహ్మాండం, దిగ్గజాలు, తాబేళ్ళు శేషుడు, సముద్రము, పర్వతాలను విసరివేస్తున్నది.

ప్రభువు అందాన్ని చూచి దేవతలు సంతోషంతో లెక్కలేనన్ని పూలు కురిపించి, దయాసాగరుడు, శోభ, గుణ, బలానికి నిధిఅయిన ప్రభువుకు జయ జయ కారాలు చెబుతున్నారు."

ఈ మధ్యలో రాక్షస సైన్యము చాలా ఎక్కువగా వున్నందున తొక్కిసలాటతో వచ్చింది. దానిని చూచి వానర వీరులు, ప్రళయ కాలంలో మేఘాల సమూహము తిరుగుతూ వచ్చినట్లుగా, ఆ సైన్యం ముందుకు వచ్చారు.

పది దిక్కుల్లో మెరుపులు మెరుస్తున్నట్లుగా, ఎన్నో కత్తులు, ఖడ్గాలు, శూలాలు, బల్లాలు, మెరుస్తూ వున్నాయి. భయంకరమైన మేఘాలు గర్జించినట్లుగా, ఏనుగులు, రథాలు, గుర్రాలు, కఠోరమైన శబ్దాలు చేస్తున్నాయి.

అందమైన ఇంద్రధనస్సు ఉదయించినట్లుగా, వానరుల తోకలెన్నో వ్యాపించివున్నాయి. జలప్రవాహంలాగా దుమ్ము లేస్తున్నది. ఎంతో వర్షము కురిసినట్లుగా, బాణాలు వెలిగిపోతున్నాయి.

మాటిమాటికి వజ్రపాతమవుచున్నటుగా, రెండు వైపుల యోధులు పర్వతాల వర్షం కురిపిస్తున్నారు. శ్రీరామచంద్రుడు క్రోధంతో

బాణాల జల్లు కురిపించాడు. దాంతో రాక్షసుల సైన్యం దెబ్బలు తిన్నది.

బాణాలు తగులగానే వీరులు కేకలుపెట్టి, గిరగిర తిరిగి ఎక్కడివారక్కడ పడిపోతున్నారు. కొండలనుండి సెలయేళ్ళు పారుతున్నట్లుగా, రక్తపు ప్రవాహంలాగా అనిపిస్తున్నది. ఆ రక్తపు నది పిరికివారిని భయపెట్టుతూవుంది. ఇరువైపుల సైన్యాలు ఆనదికి రెండు గట్లు, రథం ఇసుక, చక్రాలు సుడిగుండాలు, అది భయంకరంగా ప్రవహిస్తున్నది. అందులో ఏనుగులు, నడిచే గుర్రాలు, గాడిదలు, రకరకాల వాహనాలు జలజంతువులు ఉన్నాయి. వీటన్నింటిని ఎవరు లెక్కించగలరు? బాణాలు, బల్లెలు, ఖడ్గాలు పాములు, ధనస్సులు అలలు, డాళ్ళు వాలా తాబేళ్ళు ఉన్నాయి.

వీరులు, ఒడ్డున ఉన్న చెట్లలాగా, పడిపోతున్నారు. నురుగుల్లాగా ఎంతో క్రొవ్వువుంది. దానిని చూచి పిరికి వారు భయపడేచోట యోధులు సంతోషిస్తున్నారు.

ఆనదిలో భూతాలు, ప్రేతాలు, భయంకరమైన జటదారులు, శివగణాలు స్నానం చేస్తున్నారు, కాకులు, గ్రద్దలు, రెక్కలిప్పి ఎగురుతున్నాయి, ఒకదానినుండి మరొకటి లాక్కొని తింటున్నాయి.

ఎవడో అంటున్నాడు-"అరే, మూర్ఖులారా! ఇంత ఎక్కువగా వున్నా మీదరిద్రంమిమ్మ వదలడం లేదే. గాయాలు తగిలిన యోధులు ఒడ్డున పడి, ముంతెడు నీళ్ళల్లో పడివున్నట్లుగా, మూలుగుతున్నారు. ఒడ్డున కూచుని వున్న గ్రద్దలు ప్రేవులు లాగి వేసున్నాయి. ఎంతోమంది యోధులు రక్తంలో ప్రవహిస్తున్నారు. వారిమీద పక్షులు, నదిలో నౌకల పందేలు వేసినట్లుగా, కూచుని వున్నాయి. యోగినులు తమతమ పుర్రెలు నింపుకుంటున్నారు. ఆకాశంలో భూత, పిశా

బాల స్త్రీలు నాట్యాలు చేస్తున్నారు. పిశాచాల పుర్రెలు కరతాళాలను
మ్రోయిస్తూ అనేకరకాలుగా పాడుతున్నాయి. నక్కల గుంపులు కట
కట కొరుకుతున్నాయి. అవి తింటూ, హుం, హుం, అంటున్నాయి.
పొట్టనిండిన తరువాత గంతులేస్తున్నాయి. అనేక మొండేలు తలలు
లేకుండానే తిరుగుతున్నాయి. వారి తలలు భూమిమీద పడి "జయ
ము జయము" అంటున్నాయి.

"రాక్షసులు నాశనమయిపోతున్నారు నేను ఒంటరి వాడనయి
పోయాను. వానరులు, ఎలుగుబంట్లు, చాలామంది ఉన్నారు. ఇప్పు
డు అంతులేని మాయను రంగంలోకి దింపుతాను" అని మనస్సులో
ఆలోచించాడు రావణుడు.

దేవతలు ప్రభువు కాలినడకన రావడం చూచి చాలా బాధప
డ్డారు. ఇంద్రుడు మాతలిద్వారా, రథాన్ని వెంటనే పంపాడు. ఆ ది
వ్యమైన రథం మీద, కోసలపురస్వామి శ్రీరాముడునవ్వి, ఎక్కాడు.
ఆ రథానికి నాలుగు చురుకైన గుర్రాలు పూన్చి ఉన్నాయి, అవి ము
సలితనములేని, చావులేని, మనస్సుతో సమానంగా పరుగెత్తేవి.

శ్రీ రామచంద్రుడు రథం మీద చూచి వానరులకు విశేష
మైన ధైర్యం వచ్చి బలం ఎక్కువయింది. వానరులు హుషారుగా ప
రుగులు తీశారు. అప్పుడే రావణుడు మాయను ఉపయోగించాడు.

ఆ మాయను శ్రీరాముడు అర్థం చేసికున్నాడు. లక్ష్మణుడు,వా
నరులందరు దానిని నిజమైనదే ననుకున్నారు. వానరులు రావణుల
సైన్యంలో లక్ష్మణ సహితంగా అనేక మంది రాములను చూచి చాలా
భయపడి బొమ్మల్లాగా ఎక్కడి వారక్కడ నిలబడిపోయారు. తన
సైన్యం ఆశ్చర్య పడడం చూచిన శ్రీరాముడు నవ్వి, ధనస్సు, బా
ణాలు ఎక్కుపెట్టి క్షణంలో మాయను దూరం చేశాడు. వానర సైన్య
మంతా సంతోషించింది.

మరల శ్రీరామచంద్రుడు అందరి వైపు చూచి గంభీరంగా "ఇక ఇప్పుడు రావణరావణుల మధ్య జరిగే ద్వంద్వ యుద్ధం చూడండి, ఎందుకంటే వీరందరు చాలా అలసిపోయివున్నారు" అని బ్రాహ్మణుల పాదకమలాల వద్ద తలవంచి రధాన్ని పోనిచ్చాడు.

రావణుని క్రోధము ఎక్కువయి రెచ్చగొట్టు మాటలు మాట్లాడుతూ- "విను, తాపసి! నీవు ఇంతకుముందు యుద్ధంలో గెలిచిన వారి లాంటి వాడను కాను నేను, నా పేరు రావణుడు నా కీర్తి ప్రతిష్టలు ప్రపంచానికి బాగా తెలుసు,లోకపాలకులందరు యింకా నాఖైదులో పడివున్నారు. నీవు ఖరదూషణ, కబంధులను చంపావు. పాపము వాలిని చెట్టుచాటు నుండి చంపావు. రాక్షససమూహాన్ని సంహరించావు,కుంభకర్ణ మేఘనాధులను కూడా చంపావు.

రామా! నీవు యుద్ధభూమి నుండి పారిపోనట్లయితే వారందరి వైరమునే నేనొక్కడినే తీర్చుకుంటాను. ఇప్పుడు నిన్ను కాలానికి ఒప్పజెప్తాను. ఈ రోజు నీవు కౄరుడు పడని రావణుని పాలిట పడ్డావు." అన్నాడు.

రావణుడు మాటలాడిన మాటలు విని, అతనికి పోయేకాలము దాపురించిందనుకొని, కృపానిధి శ్రీరామ చంద్రుడు నవ్వి-"అనవసరమైన వాగుడు వాగి నీ శ్రేష్ఠమైన కీర్తిని పాడుచేసుకోవద్దు. క్షమించదమంటే ఏమిటో అర్థం చేసికొని నీతిని విను. ప్రపంచంలో మూడు రకాల పురుషులుంటారు. వారు గులాబి పూవు లాంటివారు, మామిడి పండు, పనసపండు లాంటి వారు. వీటిలో ఒకటి కేవలము గులాబి పూలు మాత్రము యిస్తుంది. రెండవరకపు చెట్లు,పండ్లు పూలు కూడా ఇస్తుంది. మూడవ రకపు చెట్లు కేవలము పండ్లే ఇచ్చునటువంటివి. ఇదేవిధంగా పురుషులు కూడాను. ఒకరు చెప్తారు గానీ చెయ్యరు,మరొకరు చెప్తారు చేస్తారు కూడా ఇంకొకరు చేస్తారుగాని చెప్పరు." అన్నాడు.

శ్రీరామచంద్రుని మాటలు విని రావణుడు నవ్వి-"నీవు నాకు జ్ఞానాన్ని నేర్పుతున్నావు. పగపెట్టుకొను సమయంలోనేమో భయ పడలేదు. ఇప్పుడు ప్రాణాలమీద తీపి ఏర్పడినట్లున్నది."అన్నాడు.

రావణుడు అనరాని మాటలని క్రోధంతో వజ్రాల్లాంటి అనేక రకాలయిన బాణాలు వదలాడు. అవి అన్నిదిక్కుల్లో, ఆకాశం భూమిలో వ్యాపించిపోయాయి.

అప్పుడు శ్రీరామచంద్రుడు అగ్ని బాణాన్ని వదలాడు. రావణుని బాణాలన్నీ క్షణంలో భస్మమైపోయాయి. రావణుడు మరీమండి పడి ఎంతో తీక్ష్ణమైన శక్తిని వదలాడు. ప్రభువు దానిని బాణంతో త్రిప్పికొట్టాడు.

రావణుడు అనేక చక్రాలు, త్రిశూలాలు వదలాడు. కాని ప్రభువు వాటిని తేలిగ్గా త్రుంచివేశాడు. దుష్టుల కోర్కెలు నిష్ఫలమై పోయినట్లుగా, రావణుని బాణాలన్నీ నిష్ఫలమయిపోతున్నాయి.

మరల రావణుడు శ్రీరాముని సారథిమీద వందబాణాలు వేశాడు. శ్రీరాముడు దయతోసారథిని లేపాడు. ఆ సమయంలో ప్రభువుకు చాలా కోపం వచ్చింది. అంబులపొదిలోని బాణాలు కలగా పులగం చేస్తున్నాడు. ఆయన ధనస్సు యొక్క మహాశబ్దం విని రాక్షసులందరు భయ రూపమైన గాలికి అంటుకొని పోయారు. మండోదరి వణికి పోయింది. తాబేళ్ళు, భూమి, కొండలు భయపడిపోయాయి. దిక్కుల్లోని ఏనుగులు భూమిని దంతాలతో పట్టుకొని ఘీంకారం చేస్తున్నాయి. ఆ వినోదమంతా చూచి దేవతలు నవ్వారు.

శ్రీరామచంద్రుడు ధనస్సును చెవివరకు లాగి బాణాలు వదలాడు. బుసలు కొట్టూ వస్తున్న పాముల్లాగా, వున్నాయి అవి.

ఆయన మొదట సారథిని, గుర్రాలను చంపాడు. తరువాత రథాన్ని ముక్కలుగా వేసి, జండాను లేకుండా చేశాడు. అప్పుడు రావ

ణుడు ఎంతో పెద్దగా అరచాడు, కాని లోపల నుంచి ఆయన బలం తగ్గిపోయింది.

తరువాత అతి కోపంతో, రెండవ రథంమీద ఎక్కి రకరకాల అస్త్రాలను వదలాడు. అతని ప్రయత్నాలన్నీ, పరులను ద్రోహం చేసేవాడు ఫలితాన్ని పొందలేనట్లుగా, నిష్ఫలమైపోయాయి.

రావణుడు పదిశూలాలు వదలాడు. అవి నాలుగు గుర్రాలను పడగొట్టాయి. అప్పుడు గుర్రాలను లేపుకొని శ్రీరామచంద్రుడు కోపంతో ధనస్సును ఎక్కుపెట్టి బాణాలు వదలాడు. తలలనుండి రక్తము కాలువలుగా ప్రవహించింది.

రావణుని తలల రూపమైన కమల వనంలో విహరించే శ్రీరాముని బాణాలు వరుసగా పోయాయి. శ్రీరాముడు అతని పది తలల్లో పది పది బాణాలు కొట్టాడు. తలల నుండి రక్తము కాలువల్లాగా ప్రవహిస్తున్నది.

రక్తము కారుతున్నప్పుడే రావణుడు పరుగెత్తాడు. ప్రభు శ్రీరాముడు మరల ధనస్సుమీద బాణాలు ఎక్కుబెట్టి ముప్పై బాణాలు వదలి, ఇరవై భుజాలతో సహా తలలు నరికి వేశాడు.

కోసలనాథుడు గొప్ప లీలాప్రియుడు. ఆయన రావణుని భుజాలను, తలలను మాటిమాటికి నరికివేస్తున్నాడు. ఆ తెగి పడిపోయిన తలలు, భుజాలు, ఎన్నో కేతువులు, రాహువులు ఆకాశంలో వ్యాపించిపోయినట్లుగా వ్యాపించి పోతున్నాయి.

ప్రభువు అతని తలలు నరికే కొద్దీ, అవి పెరిగిపోతున్నాయి. వాటిని చూస్తుంటే, కామం పెంచుకొన్న కొద్దీ, మన్మథుడు ఎప్పటికప్పుడు క్రొత్తవాడయినట్లుగా, తలలు పెరిగిపోతున్నట్లున్నాయి.

తన తలల ప్రవాహాన్ని చూచుకొన్న రావణుడు తన చావు మరచిపోయాడు. ఎంతో క్రోధితుడయాడు. అతను అతి మూర్ఖంగా

అరచి, పది బాణాలను గురిపెట్టి వదలాడు.

యుద్ధభూమిలో రావణుడు క్రోధంతో బాణాలు కురిపించి శ్రీ రాముని రథాన్ని కప్పేశాడు. ఒక్క క్షణం వరకు రథం కనిపించ లేదు. అది, పొగమంచులో సూర్యుడు కనబడనట్లుగా కనిపించలేదు.

దేవతలు హాహా కారం చేయగానే, ప్రభువు కోపంతో ధనస్సు చేతిలోకి తీసికొని, శత్రువుని బాణాలను త్రుంచేసి, అతని తలలు నరి కేశాడు. అవి అన్నిదిక్కుల్లో, ఆకాశం,భూమిలో వ్యాపించిపోయాయి.

ఆ తెగిన తలలు ఆకాశంలో పరుగెత్తుతూ, జయజయధ్వానాలు చేస్తూ భయము పుట్టిస్తున్నాయి. "లక్ష్మణుడు, హనుమంతుడు, సుగ్రీవుడెక్కడున్నారు? అయోధ్యాపతి రఘువీరుడెక్కడున్నాడు? రాము డెక్కడున్నాడు?" అంటూ చాలా తలలు పరుగెత్తాయి. వాటిని చూచి వానరులు పారిపోయారు. అప్పుడు శ్రీరామచంద్రుడు తన బాణా లతో ఆ తలలను నరికేశాడు.పుర్రెల మాలలను చూచి, చాలా మంది కాళికాదేవులు గుంపులుగా వచ్చి, రక్తపు నదిలో స్నానం చేసి వట వృక్షాన్ని పూజించడానికి వెళుతున్నాయా అన్నట్లున్నాయి.

రావణుడు కోపంతో తీవ్రమైన శక్తిని వదలాడు. అది విభీష ణునకు యమదండంతో సమానమైపోయింది.

భయంకరమైన శక్తి వస్తున్నట్లుగా చూచి , ప్రభువు తన శర ణాగతుల దుఃఖాలను దూరం చేయడంలో లభించిన కీర్తిని స్మరించు కొని విభీషణుని వెంటనే వెనుకకులాగి, ఎదురుగా తాను స్వయంగా వెళ్ళి దానిని అనుభవించాడు.

ఆ శక్తి తగులగానే కొంచెం స్పృహతప్పిన లక్షణా లేర్పడిన ట్లుగా ప్రభువు వినోదం చేశాడు. కాని దేవతలకు గాబరా పుట్టుకొ చ్చింది. విభీషణుడు ప్రభువు కొంత శ్రమ అనుభవించవలసి వచ్చి నట్లు గ్రహించి, చేతిలో గద తీసికొని కోపంతో ఆక్రందన చేసి- "అరే

దుర్భాగ్యుడా! మూర్ఖా! నీవు దేవతల, మనుష్యుల, మునుల,నాగులం దరితో వైరం పెట్టుకొన్నావు. శివునకు ఒక్కొక్కతల బలి యిచ్చి, ఒక్కొక్క దానికి బదులుగా కోట్ల తలలు పొందావు.

దుష్టుడా! ఇందుచేతనే నీ విప్పటి వరకు బ్రతికున్నావు. ఇప్పుడు నీ అంత్యకాలం నీ తలమీద నాట్యం చేస్తున్నది. శ్రీరామచంద్రు నకు వ్యతిరేకివై సంపదలు కోరుతున్నావు" అంటూ రావణుని రొమ్ము గురి చూచి గదతో కొట్టాడు.

ఆ దెబ్బకు రావణుడు నేలమీద పడ్డాడు. పది నోళ్ళ నుండి రక్తము కారుతూవుంది. ఇద్దరూ మహాబలవంతులు. కసిగా ఒకరునొకరు కొట్టుకొంటూ ఉన్నట్లుగా వున్నదా దృశ్యం.

"పార్వతీ! విభీషణుడు రావణునివైపు కన్నెత్తయినా చూడ గలడా? ఇప్పుడతను యమునిలాగా యుద్ధం చేస్తున్నాడు. ఇది రామ చంద్రుని ప్రతాపమే.

విభీషణుడు అలసిపోయినట్లు తెలిసికొని హనుమంతుడు పర్వతం తీసుకొని వచ్చి రావణుని సారథిని గుర్రాలతో సహా రథాన్ని పిండిపిండి చేశాడు. ఆ తరువాత రావణుని రొమ్ముమీద ఒక్కతన్ను తన్నాడు.

రావణుడు నిలబడ్డాడు, కాని ఆయన శరీరం గడగడవణికిపో యింది. విభీషణుడు శ్రీరాముడున్నచోటుకువెళ్ళాడు. రావణుడు హను మంతుని కొట్టాడు. ఆయన తోకపెంచి ఆకాశంలోకి వెళ్ళాడు. అతను తోకను పట్టుకొన్నాడు. అతన్ని కూడా తోకతో తీసికొని వెళ్ళాడు.

ఆకాశంలో ఇద్దరు యోధులు కలియబడి, ఒకరిని మరొకరు కొట్టుకోనారంభించారు, ఆకాశంలో ఎంతో కపటము, మోసాలుచేస్తూ కాటుకకొండ, సుమేరు పర్వతం పోట్లాడుకుంటున్నాయా, అన్నట్లుగా పోట్లాడుకుంటున్నారు. బుద్ధిబలంతో రాక్షసుని ఓడించాలంటే,

ఓడించలేకపోతున్నాడు. అందుచేత హనుమంతుడు ప్రభువును తలచుకున్నాడు.

ధీరుడైన హనుమంతుడు రఘునాథుని స్మరించుకొని రావణుని కొట్టాడు. అతను భూమి మీద పడి, మరల లేచి పోట్లాడుతున్నాడు ఇది చూచి దేవతలు ఇద్దరికీ జయము పలికారు. హనుమంతుడు సంకటములో చిక్కుకున్నట్లుగా గ్రహించి, వానరులు,ఎలుగుబంట్లు పరుగెత్తారు, మదమత్తుడైన రావణుడు వారిని మట్టివేశాడు.

శ్రీరాముడు రెప్పగొట్టేసరికి మళ్ళీవానరులు పరుగెత్తారు. వానరులను చూచి రావణుడు మాయను ప్రయోగించాడు. ఒక్క క్షణం అతను కనబడకుండా పోయాడు. మరల ఆ దుష్టుడు అనేక రూపాల్లో కనిపించి, శ్రీరాముని సైన్యములో ఉన్న వానరులు, ఎలుగుబంట్లతో సమాన సంఖ్యలో, ఎందరో రావణులుగా కనిపించాడు. ఇంత మంది రావణులను చూడగానే ఎలుగుబంట్లు, వానరుల ఎటు వారటు ధైర్యం సడలిపోయింది. "లక్ష్మణా! రామా! రక్షించండి" అని అరుస్తూ పారిపోయారు.

పది దిక్కుల్లో అనేకమంది రావణులు పరుగెత్తి, భయంకరమైన శబ్దాలతో అరచారు. దేవతలు భయపడి, "సోదరులారా! ఇక గెలుపు మాట మరచిపోండి" అంటూ పారిపోతున్నారు.

దేవతలందరిని ఒకే రావణుడు జయించాడు. ఇప్పుడు ఎంతో మంది రావణులయ్యారు. ఇక కొండ లోయల్లోకి పారిపోదాం పదండి. బ్రహ్మ, మహాదేవుడు, ప్రభు మహిమను ఎరుగుదురు గాన వారు మాత్రము నిర్భయంగా వున్నారు.

వానరులు రావణులను నిజమనుకుని గాబరాతో పారిపోతూ– "దయాసాగరా! రక్షించు" అని కేకలు పెడ్తున్నారు. హనుమంతుడు, అంగదుడు, నల, నీల మొదలైన యోధులు మాయావి రావణులను

పిప్పిపిప్పివేస్తూ కొడ్తున్నారు.

దేవతలు, వానరులు వ్యాకులంగా ఉండడంచూచి శ్రీరాముడు నవ్వి, తన ధనస్సును సిద్ధం చేసికొని ఒక్కబాణంతో క్షణంలో రావణులందరిని నాశనం చేశాడు. ఒక్కరావణుడు మాత్రమే మిగిలాడు. దేవతలందరు సంతోషించి, తిరిగి వెళ్ళి, ప్రభువు మీద పూలవర్షం కురిపించారు.

రఘునాథుడు తన భుజాన్ని ఎత్తి వానరులను యుద్ధానికి పొమ్మన్నాడు. వారు ఒండొరులను పిలుచుకొని ప్రభువు బలాన్ని పొంది యుద్ధభూమిలో ప్రవేశించారు.

దేవతలు శ్రీరామచంద్రుని స్తుతించడం చూచిన రావణుడు, వీరి దృష్టిలో నేను ఒంటరి వాడనయిపోయానని మనస్సులో అనుకొని, మూర్ఖులారా! మీరు ఎల్లప్పుడు నా చేతితో దెబ్బలు తింటూనే వున్నారు" అంటూ కోపంగా ఆకాశంలోకి పరుగెత్తాడు.

దేవతలు హాహా కారాలు చేస్తూ పరుగులు తీశారు. రావణుడు- "దుష్టులారా! నా యెదుట నుండి పారిపోయి ఎక్కడ ఉండగల్గుతారు?" అన్నాడు. దేవతలు కంగారుపడిపోవడం చూచిన అంగదుడు పరుగెత్తుకొని వచ్చి రావణుని కాళ్ళు పట్టుకొని భూమి మీద పడవేసి, బాగా తన్ని ప్రభువు దగ్గరకు వెళ్ళాడు. రావణుడు కోలుకొని లేచి చాలా పెద్దగా అరచి, పది ధనస్సులు ఎక్కుపెట్టి, వాటిలో బాణాలను చేర్చి బాణాల వర్షం కురిపించాడు. యోధులందరిని గాయపరచి, తన బలాన్ని చూచుకొని ఎంతో సంతోషించాడు.

శ్రీరామచంద్రుడప్పుడు రావణుని తలలు, భుజాలు, ధనస్సు బాణాలు తెగగొట్టి, తీర్థస్థానాల్లో చేసిన పాపాలు పెరిగినట్లుగా, అతను మరల కనిపించాడు.

శత్రువుని తలలు, భుజాలు పెరగడం చూసిన ఎలుగుబంట్లు, వానరులకు చాలా కోపం వచ్చి-"ఈ మూర్ఖుపు తలలు, భుజాలు తెగ గొట్టినా చావడంలేదు." అంటూ ఎలుగుబంట్లు, వానరులు మరల పరుగులెత్తారు.

అంగదుడు, హనుమంతుడు, నల, నీల, ద్వివిద, మయంద మొదలైన మహాబలవంతులైన వానరులు, ఎలుగుబంట్లు చెట్లు, కొండలు పెరికి కొడుతున్నారు. ఆ వృక్షాలను,కొండలను పట్టుకొని అతను త్రిప్పి కొడుతున్నాడు.

రావణుని శరీరాన్ని ఒకడు పీల్చి వేసతుంటే,మరొకడు కాళ్ళతో తంతున్నాడు. అప్పుడు నల, నీలు లతని శరీరం మీద ఎక్కి గోళ్ళతో రావణుని బుగ్గలను పీల్చేస్తున్నారు.

రక్తము చూచుకొన్న ఆ దేవతల శత్రువు రావణుడు కోపంతో వారిని పట్టుకోడానికి చేతులు చాచాడు. కాని వారు చిక్కలేదు. రెండు తుమ్మెదలు కమలవనంలో తిరుగుతున్నట్లుగా, వారు భుజాలమీద తిరుగుతున్నారు.

రావణుడు కోపంతో దుమికి ఇద్దరిని పట్టుకొని, భూమిమీద కొట్టే సమయంలో, అతని భుజాలను మెలేసి పారిపోయారు. అతను మళ్ళా కోపంతో చేతుల్లోకి పది ధనస్సులు తీసికొని, బాణాలు వేసి వానరులను గాయపరచాడు.

హనుమంతుడు మొదలైన వారిని మూర్ఛపోయేటట్లు కొట్టి సంధ్యాసమయమని గ్రహించి రావణుడు సంతోషించాడు. వానరు లందరు మూర్ఛితులై పోయారని తెలిసిన జాంబవంతుడు పరుగెత్తి కొచ్చాడు. ఆయనవెంట ఎలుగుబంట్లు ఉన్నారు. వారు పర్వతాలు, వృక్షాలు తీసికొని సవాళ్ళు చేస్తూ అతన్ని కొడుతున్నారు. బలవంతుడైన రావణుడు కోపంతో, అనేకమంది యోధుల కాళ్ళు పట్టుకొని

నేలకు వేసికొడుతున్నాడు. జాంబవంతుడు తనవారు వస్తున్నారని తెలిసికొని కోపంతో రావణుని రొమ్ము మీద తన్నాడు.

రొమ్ముమీద తన్ను తగులగానే రావణుడు బిత్తరపోయి, రథంమీద నుంచి క్రిందపడి, ఇరవై చేతులతో ఎలుగుబంట్లను పట్టుకొనేటప్పుడు, రాత్రిళ్ళు తుమ్మెదలు కమలాల్లో నివసించినట్లుగా, అనిపిస్తున్నది. ఎలుగుబంట్లరాజు జాంబవంతుడు రావణుని మూర్ఛితుడైనట్లు చూచి తెలివి తెప్పించడానికి ప్రయత్నించాడు.

మూర్ఛదూరమయిపోయిన తర్వాత ఎలుగుబంట్లు, వానరులు శ్రీరామచంద్రుని వద్దకు వచ్చారు. లంకలో రాక్షసులందరు చాలా భయపడి రావణుని చుట్టుకొని కూచున్నారు.

ఆ రాత్రే త్రిజట సీత వద్ద కెళ్ళి కథంతా చెప్పింది. శత్రువుని తలలు, భుజాలు పెరుగడం విని సీతకు ఎంతో భయమేసింది. ముఖం వెలతెలపోయింది, మనస్సుకు చింత పట్టుకుంది. అప్పుడు సీత త్రిజటతో—

"తల్లీ! ఏమి జరుగుతుందో, ఎందుకు చెప్పవు? ప్రపంచానికే దుఃఖాన్ని కలిగిస్తున్న అతను ఎలా చనిపోతాడు? రఘునాథుని బాణాలతో తలలు తెగిపోయినా అతను చావడం లేదు. బ్రహ్మ అంతా వ్యతిరేకమే చేస్తున్నాడు, నన్ను నా భర్త నుండి వేరుచేసిన అతన్ని బ్రతికిస్తున్నాడు బ్రహ్మ. ఇలా జరుగడం నా దురదృష్టమయివుంటుంది.

బ్రహ్మకు నేనంటే కోపం, అందుకనే బంగారు లేడిని ముందు ఏర్పరిచాడు. నాకు అంతులేని దుఃఖాలు అనుభవించు స్థితిని కల్పించాడు. లక్ష్మణుని అనరాని మాటలనే దానినిగా మార్చాడు. రఘునాథుని విరహరూపమైన కఠోర బాణాలతో, పొంచిపొంచి నన్ను కొట్టాడు. అలా బాధలు పెడ్తూ కూడా నా ప్రాణాలు పోకుండునట్లు చేసిన

ఆ బ్రహ్మయే అతన్ని బ్రతికిస్తున్నాడు, వేరెవ్వరు అతనికి సహాయం చేయడం లేదు" అంది.

కృపానిధి రామచంద్రుని తలచుకొని జానకి అనేక రకాలుగా విలపిస్తున్నది. త్రిజటఅంది-"రాజకుమారీ! విను,హృదయంలోబాణం తగులగానే రావణుడు చచ్చిపోతాడు. కాని, ప్రభువు ఆ కారణం తెలిసియే అతని రొమ్ముపైపు బాణాలు వేయడంలేదు. ఎందుకంటే, ఇతని హృదయంలో జానకి వుంది.

ఇతని హృదయంలో జానకితో బాటు నేను నివసించియున్నాను, నా హృదయంలో అనేక లోకాలున్నాయి. బాణము తగులగానే ఇవన్నీ నాశనమయిపోతాయి." అని శ్రీరామచంద్రుడు వెనుకాడుతున్నాడు.

సీత ఈమె మాటలు వినగానే చాలా ఆనందించడమేగాక దుఃఖపడింది కూడా. అప్పుడు త్రిజట మరల-"అమ్మాయీ! ఇప్పుడు పెద్ద సందేహాన్ని, శత్రువు ఎలా చచ్చిపోయేది చెప్తావిను.

తలలు తెగిపోయేటప్పుడు రావణునకు వ్యాకులమెక్కువవుతుంది. అప్పుడు, అతని మనస్సునుండి నిన్ను గురించిన ధ్యానం దూరమయిపోతుంది. అప్పుడు రావణుని రొమ్ములో శ్రీరామచంద్రుడు బాణాలు వేస్తాడు." అని జానకికి అనేక రకాలుగా తెలియజెప్పి త్రిజట తన యింటికి వెళ్ళింది. రామచంద్రుని స్వభావాన్ని తలచుకొని జానకి మనస్సులో చెప్పలేనంత విరహవ్యధ ప్రారంభమయింది.

ఆమెకు రాత్రి గడచుటలేదు. ఆమె అందుకని రాత్రిని,చంద్రుడిని ఎన్నోరీతులుగా నిందిస్తున్నది. రామచంద్రుని విరహంతో సీత మనస్సులో ఎంతో కుమిలిపోతూ వుంది.

ఆమె విరహంలో మాడిపోతున్న సమయంలో, ఎడమ కన్ను, భుజము అదురనారంభించాయి. ఈ శకునాన్ని తలచుకొని జానకి

మనస్సులో, ఇప్పుడు శ్రీరామచంద్రుడు కలుస్తాడని ధైర్యంగా విశ్వ
యించుకుంది.

రావణుడు అర్ధరాత్రి సమయంలో మూర్ఛనుండి తేరుకుని,తన
సారథిని విసుక్కొంటూ-"అరే, మూర్ఖా! నీవు నన్ను యుద్ధభూమి
నుండి తీసుకెళ్ళావు. అరే,నీచుడా! నీవు పనికిమాలినవాడవు" అన్నాడు.

సారథి అతని పాదాలు పట్టుకొని అనేకరకాలుగా తెలియజె
ప్పాడు తెల్లవారగానే రావణుడు రథమెక్కి మరల వచ్చాడు. అతడు
రావడం విన్న వానర సైన్యంలో చాలా కలవరం వ్యాపించింది.
పెద్ద పెద్ద యోధులు పర్వతాలు, వృక్షాలు పెరుక్కొని, పండ్లు పట
పట కొరుకుతూ పరుగెత్తారు.

భయంకరులైన వానరులు, ఎలుగుబంట్లు చేతుల్లో పర్వతాలు
పుచ్చుకొని పరుగెత్తి, కోపంతో కొడ్తున్నారు. వారు కొడ్తున్నం
దున రాక్షసులు పారిపోతున్నారు. బలవంతులైన వానరులు రాక్షస
సైన్యాన్ని గందరగోళం చేసి, రావణుని చుట్టుముట్టి, నలు వైపులు
చెంపలు వాయించి, గోళ్ళతో బరికి అతన్ని చికాకు పరచారు.

వానరులు అఖండులని తెలిసికొన్న రావణుడు తన మనస్సులో
ఆలోచించి కనపడకుండా పోయి క్షణంలో రాక్షస మాయను వ్యాప్తి
చేశాడు.

రావణుడు మాయను సృష్టించగానే భయంకరమైన ప్రాణులు
బయలుదేరాయి. భూతాలు, ప్రేతాలు, పిశాచాలు చేతుల్లో ధనస్సు,
బాణాలు పట్టుకొని కనిపించాయి.

యోగినులు ఒక చేతిలో కత్తి, రెండవచేతిలో మనుష్యుల పుర్రెలు
పట్టుకొని క్రొత్త రక్తం త్రాగి బాగా నాట్యం చేస్తూ పాడుతూ
"పట్టుకోండి, పట్టుకోండి" అంటూ భయంకరంగా అరుస్తున్నాయి.
ఈ ధ్వని నాల్గువైపుల వ్యాపించింది. అవి నోళ్ళు తెరచి తినడానికి

పరుగులు తీస్తున్నాయి. వానరులు వాటిని చూచి పారిపోతున్నారు.

వానరులు పారిపోయిన చోట్లల్లో నిప్పులు మండుచున్నట్లుగా చూచి భయపడిపోతున్నారు. తరువాత ఇసుక కురిపిస్తున్నారు. వాళ్ళ నిండా ఇసుకపోస్తున్నారు.

ఎక్కడి వానరుల నక్కడ అదరగొట్టి రావణుడు పెద్దగా అరచాడు. లక్ష్మణ, సుగ్రీవులతో సహా అందరు స్పృహ తప్పి పడిపోయారు. "హా రామా! హారఘునాథా!" అంటూ సమర్థులైన యోధులందరు తమ చేతులు నలుముకొంటూ తెల్లముఖాలు వేసివున్నారు. ఈ విధంగా అందరి బలాలను రూపుమాపి మరల మాయను సృష్టించాడు.

అతను అనేకమంది హనుమంతులను సృష్టించాడు. వారు కొండలు తీసికొని పరుగెత్తారు. వారు గుంపులుగుంపులుగా చేరి, నలువైపుల నుండి వెళ్ళి రామచంద్రుని చుట్టుముట్టి, తోకలెత్తి కిలకిలమంటూ-"చంపండి, పట్టుకోండి, వెళ్ళనివ్వవద్దు" అంటూ వున్నారు. పదిదిక్కుల్లో వారితోకలు శోభాయమానంగా ఉన్నాయి. వారి మధ్యలో శ్రీరామచంద్రుడున్నాడు. ప్రభువును చూచి దేవతలు ఆనంద శోకాలతో కలసిన "జయము, జయము" అంటున్నారు. అప్పుడు శ్రీరామచంద్రుడు కోపంతో ఒకే బాణంతో క్షణంలో రాక్షస మాయను లేకుండా చేశాడు.

మాయదూరమయిపోగానే వానరులు, ఎలుగుబంట్లు సంతోషించి, చెట్లు, పర్వతాలు తీసికొని తిరిగి వచ్చారు. శ్రీరామచంద్రుడు బాణాలు వదలాడు. దాంతో రావణుని భుజాలు, తలలు తెగి నేలమీద పడిపోయాయి.

"శ్రీరామ, రావణ యుద్ధ చరిత్రను, అనేకకల్పాల వరకు వందల శేషులు, కవులు గానం చేసినా అంతుతేలదు. ఆ యుద్ధ చరి

త్రలోని కొన్ని గుణాలను, ఈగ తనకున్న శక్తిని బట్టి ఆకాశానికి
ఎగిరినట్లుగా, తెలివి అంతగా లేని తులసీదాసు వర్ణించానని" ఆయనే
స్వయంగా చెప్పుకుంటున్నాడు.

అనేకసార్లు తలలు, భుజాలు తెగినా లంకాపతి. యోధుడయిన
రావణుడు చావడు, ప్రభువా! లీలలు చేస్తున్నాడు. కాని, మునులు,
సిద్ధులు, దేవతల బాధలను చూచి మనఃస్థిమితం లేకుండా ఉన్నాడు.

తెగనరుకగానే, రావణుని తలలు పెరుగుతున్నాయి. వాటిని
చూస్తుంటే, ప్రతి లాభ సమయంలో, లోభం పెరుగుతున్నట్లుగా
వుంది. ఎంత కష్టపడ్డా శత్రువు చావడంలేదు. అప్పుడు శ్రీరామ
చంద్రుడు విభీషణుని వైపు చూచాడు.

"పార్వతీ! ప్రభువు తలచుకుంటే యముడు కూడా చచ్చిపోతా
డు, అలాంటి ప్రభువు భక్తుల ప్రేమను పరీక్షిస్తున్నాడు." అన్నాడు
శివుడు.

విభీషణుడన్నాడు "సర్వమూ తెలిసిన ప్రభూ! చరా, చరానికి
స్వామీ! మీరు శరణాగత రక్షకులు, దేవతలకు, మునులకు సుఖా
న్నిచ్చేవారు.

నాథా! ఇతని బొడ్డులో అమృతముంది. ఆ అమృత బలంతోనే
రావణుడు జీవించి వున్నాడు."

విభీషణుని మాటలు వినగానే, కృపాసాగరుడయిన శ్రీరామ
చంద్రుడు సంతోషించి, భయంకరమైన బాణాలు చేతిలోకి తీసుకు
న్నాడు, అప్పుడనేకమైన అపశకునాలవుతున్నాయి. ఎన్నో నక్కలు,
గాడిదలు, కుక్కలు ఏడుస్తున్నాయి. పక్షులు దుఃఖ మధికమయి అరు
స్తున్నాయి. ఆకాశంలో అక్కడక్కడ తోకచుక్కలు కనిపిస్తున్నాయి.

పదిదిక్కుల్లో మంటలు మండిపోతున్నాయి. తిథి, నక్షత్రాల
పని లేకుండానే సూర్యగ్రహణం వచ్చింది. మండోదరి గుండెకు

వణుకు పుట్టి గాబరాగా వుంది. విగ్రహాలు కళ్ళంట నీళ్ళు కారుస్తు న్నాయి.

ఆకాశం నుండి నక్షత్రాలు రాలి పడుతున్నాయి, పీవగూడని గాలులు వీస్తున్నాయి, భూమి కదలిపోతున్నది. మేఘాల నుండి, రక్తం, ఇసుక, మట్టి వర్షం కురుస్తున్నది. ఇలా లెక్కలేనన్ని అపశకు నాలయినాయి. ఆ అపశకునాలు, ఇన్నని, ఎలా చెప్పగలం?

అనేక ఉపద్రవాలను చూచి, ఆకాశంలోని దేవతలు వ్యాకుల పడి "జయజయ"కారాలు చేస్తున్నారు. దేవతలు వ్యాకులంగా ఉండ డం చూచిన శ్రీరామచంద్రుడు ధనస్సుమీద బాణాలు ఉంచి, చెవి వరకు లాగి ముప్పై ఒక్కబాణాలు వేశాడు. శ్రీరాముడు తన బాణా లను, కాలరూపమైన పాముల్లాగా, వేశాడు.

ఒక బాణంతో బొడ్డులోని అమృతాన్ని ఎండజేశాడు. మిగిలిన ముప్పై బాణాలు, క్రోధంతో తలలు భుజాలు తెగిపోడానికి వేశాడు. తలలు భుజాలు వేరైపోయాయి. భుజాలులేని మొండేలు భూమిమీద నాట్యం చేస్తున్నాయి.

మొండేల పరుగుల వలన భూమి క్రుంగిపోతున్నది. అప్పుడు ప్రభువు బాణాలు వేసి ఆ మొండాన్ని రెండు భాగాలుగా చీల్చివేశాడు. చచ్చేటప్పుడు అతి ఘోరమైన శబ్దం చేస్తూ-"రాముడెక్కడున్నాడు? వేనాతని సవాలు చేసి యుద్ధంలో చస్తాను."అంటూ రావణుడు భూమి మీద పడిపోయాడు. భూమి కదలిపోయింది. సముద్రము, నదులు, దిగ్గజాలు, పర్వతాలు కదలాయి. రావణుడు తన మొండెము యొక్క రెండు భాగాలను విస్తరించి, ఎలుగుబంట్లను, వానరులను అణస్తూ భూమి మీదపడిపోయాడు.

శ్రీరాముని బాణాలు, రావణుని తలలను, భుజాలను మండో దరి దగ్గరుంచి, తిరిగి వచ్చాయి అంబుల పొదిలోకి. ఇదంతా చూచి

చెల్లాచెదరైపోయాయి. స్పృహలేదు. రొమ్ము బాదుకుంటూ అనేక విధాలుగా ఏడుస్తూ, రావణుని ప్రతాపాన్ని తలచుకొంటూ,

"నాథా! నీ బలంతో భూమి ఎల్లప్పుడు వణికిపోతూ ఉండేది. అగ్ని, సూర్యచంద్రులు కళలు తప్పిపోతుండేవారు. శేషుడు, తాబేళ్ళు (అవతారము) కూడా నీ బరువును మోయలేక పోయేవి. అలాంటి నీ శరీరం ఈ రోజు మట్టి కొట్టుకొని నేలమీద పడివుంది.

యుద్ధంలో నీ యెదురుగా, వరుణుడు, కుబేరుడు, మరుత్తు వీరిలో ఏ ఒక్కరు, నిలబడడానికి ధైర్యం చేయలేకపోయారు. స్వామీ! నీవు భుజాల బలంతో కాలాన్ని, యమునికూడాజయించావు, ఆ నీవు ఈ రోజు దిక్కులేనివానిగా యుద్ధభూమిలో పడివున్నావు.

నీ గొప్పతనము ప్రపంచానికి తెలుసు. నీ కుటుంబముయొక్క, నీ పుత్రుల బలాన్ని కూడా వర్ణింపతరం కాదు. కాని శ్రీరామచంద్రునకు శత్రువు అయినందున, కుటుంబంలో ఏడ్చేవారు కూడా లేని పరిస్థితి, తెచ్చిపెట్టిపోయావు.

నాథా! కాలము దగ్గర దాగియున్నందున నీవు మంచి మాటలు చెప్పినా వినలేదు, చరాచరానికంతటికి ప్రభువయిన శ్రీరామచంద్రుని మామూలు మనిషి అనుకొని,బలిఅయిపోయావు. రాక్షసరూపమైన వనాన్ని తగుల వేయడానికి అగ్ని అయి, బ్రహ్మ, శివుడు మొదలైన దేవతలందరు తలలు వంచి కొలుచుకొనే, ఆ ప్రభువును, అలాంటి దయాసాగరుని, పరమేశ్వరుని నీవు భజించలేకపోయావు. నీ శరీరం పుట్టుకతోనే పాపాల సమూహాలతో ఏర్పడింది. అందుచేత నీవు అందరిని శత్రువులుగా భావిస్తూ వచ్చావు గాని,మిత్రులుగాకాదు,అలాంటి నీకు కూడా ఆ నిర్వికార బ్రహ్మ తన వద్ద స్థానమిచ్చినందుకు,శ్రీరామచంద్రునకు నమస్కరిస్తున్నాను.

"నాథా! శ్రీరామచంద్రునితో సమానమైన దయాసాగరుడు

మరెవరున్నారు? మునులకు కూడా అసాధ్యమైన ఉత్తమ స్థానాన్ని ప్రభువు నీకు దయచేశాడు" అంది.

మండోదరి మాటలు విని దేవతలు, మునులు, సిద్ధులందరు ఆనందించారు. బ్రహ్మ, శివుడు, నారదుడు, సనకసనాది మహాతపసంపన్నులయిన మునులు కన్నార్పకుండా శ్రీరామచంద్రుని దర్శనం చేస్తూ ప్రేమలో మునిగి సంతోషంగా ఉన్నారు. విభీషణుడు స్త్రీలంతా ఏడుస్తూ ఉండటం చూశాడు. ఆయనకు చాలా బాధ కలిగి, వారి దగ్గరకు వచ్చి, సోదరుని పరిస్థితి చూచి చాలా దుఃఖపడ్డాడు.

ఆ సమయంలో ప్రభువు లక్ష్మణునకు ఆజ్ఞయిచ్చాడు. లక్ష్మణుడు విభీషణునకు అనేక విధాల తెలియజెప్పాడు. విభీషణుడు శ్రీరాముని వద్దకు వచ్చాడు. ప్రభువు కృపాదృష్టితో చూచి-"దుఃఖాలన్నింటిని వదలి రావణునికి ఉత్తరక్రియలు జరుపు" అన్నాడు.

విభీషణుడు ప్రభువు ఆజ్ఞప్రకారం, దేశ, కాలాలను మనస్సులో ఆలోచించి నియమప్రకారంగా అంత్యక్రియలు జరిపాడు. మండోదరి మొదలైన రాణులందరు తులసినీళ్ళు వదలి, మనస్సులో శ్రీరామచంద్రుని గుణాలను గానం చేస్తూ భవనాల్లోకి వెళ్ళారు.

విభీషణుడు వచ్చి నమస్కరించాడు. దయాసాగరుడైన శ్రీరామచంద్రుడు తమ్ముడు లక్ష్మణుని పిలిచి—"నీవు, సుగ్రీవుడు, అంగద, నల నీల, జాంబవంత, నీతి తెలిసిన హనుమంతుడు, అందరు కలసి విభీషణుని వెంట వెళ్ళి, రాజును చేయండి. నేను తండ్రి ఆజ్ఞ ప్రకారం నగరంలోకి రాలేను, కాని నాతో సమానమైన వానరులను, తమ్ముడైన లక్ష్మణుని పంపుతున్నాను" అన్నాడు.

ప్రభువు ఆజ్ఞప్రకారం వానరులు వెంటనే వెళ్ళి,రాజ్యాభిషేకపు ఏర్పాట్లు చేశారు. ఆదరంగా విభీషణుని సింహాసనం మీద కూచోబెట్టి రాజ్యాభిషేకం చేసి, వినయంగా అందరు చేతులు జోడించి తల

లు వంచారు. తరువాత విభీషణునితో కలిసి ప్రభువు వద్దకు వెళ్ళారు శ్రీరఘునాథుడు వానరులను పిలిచి, మధుర వచనాలు పలికి అందరికీ సంతోషం కలిగించి-"మీ బలంతోనే శత్రువు చచ్చిపోయాడు, విభీషణుడు రాజయ్యాడు. మీకీర్తి మూడులోకాల్లోనూ శాశ్వతంగా వుంటుంది. నాతో పాటుగా మీ అఖండమైన కీర్తిని గానం చేసిన వారు ఏ పరిశ్రమ చేయకుండానే అపారమైన సంసార సాగరం దాటిపోతారు"అన్నాడు.

ప్రభువు మాటలు విని కూడా వానరులకు తృప్తి కలుగలేదు. వారు శ్రీరామచంద్రుని పాదపద్మాలు పట్టుకొని మాటిమాటికి తలలు వంచి నమస్కరిస్తున్నారు.

ప్రభువు మరల హనుమంతుని పిలచి-"నీవు లంకలోకి వెళ్ళి, సీతకు విషయమంతా చెప్పి, ఆమె క్షేమసమాచారాలడిగి తెలిసికొని తిరిగిరా"అన్నాడు.

హనుమంతుడు లంకాపట్టణంలోకి వెళ్ళాడు. ఆయన వచ్చిన సంగతితెలిసి రాక్షసస్త్రీలు పురుషులు పరుగెత్తి, ఆయనకు అనేకరకాలయిన, ఆదర సత్కారాలు చేసి, జానకిని చూపించారు.

హనుమంతుడు దూరాన్నుండే నమస్కరించాడు. శ్రీరాముని దూత అయిన హనుమంతుడు, సీత కనుక్కొని-"సోదరా! కృపానిధి ప్రభువు, ఆయన తమ్ముడు లక్ష్మణుడు, వానరులు సేనా సహితంగా క్షేమంగా వున్నారా?"అడిగింది.

"తల్లీ! కోసలాధీశుడైన శ్రీరామచంద్రుడు అన్ని విధాలా క్షేమంగా ఉన్నాడు. ఆయన యుద్ధంలో రావణుని జయించాడు. విభీషణుడు శాశ్వతమైన రాజ్యాన్ని పొందాడు"అన్నాడు. కపి వచనాలు వినగానే ఆమె హృదయంలో ఆనందం పొంగి పొర్లిపోయింది.

ఆమె మాటి మాటికి హనుమంతునితో-"హనుమా! నేను నీకు ఏమి యిచ్చేది? మూడులోకాల్లో వాక్కుతో సమానమైనది మరొకటి లేదు." అంది.

"తల్లీ! నేను శత్రు సైన్యాన్ని జయించి, సోదర సహితంగా ప్రభువు రాముడిని ఆనందంగా చూస్తున్నాను, ఇవాళ నిస్సందేహంగా మా శత్రు ప్రతీకారాన్ని పొందినందుకు ఆనందంగా వుంది"అన్నాడు హనుమంతుడు.

"వత్సా! సద్గుణాలన్ని నీ హృదయంలో నివాసం చేయుగాక! లక్ష్మణునితో సహా శ్రీరామచంద్రుడు ఎల్లప్పుడు నీ కనుకూలంగా ఉండుగాక!

హనుమా! నేను ప్రభువును నా నేత్రాలతో దర్శించు ఉపాయం చూడు"అంది సీత. హనుమంతుడు శ్రీరామచంద్రుని వద్దకెళ్ళి సీత క్షేమాన్ని గురించి చెప్పాడు.

సూర్యవంశంలో తలమానికమైన శ్రీరాముడు సీత సందేశాన్ని విని అంగద, విభీషణులను పిలచి-"హనుమంతునితో పాటు మీరు వెళ్ళి, ఆదరంగా జానకిని తీసుకురండి''అన్నాడు.

అందరు వెంటనే సీతఉన్న చోటుకు వెళ్ళారు. రాక్షస స్త్రీలందరు వినయంగా ఆమెకు సేవలుచేస్తున్నారు. విభీషణుడు వెంటనే అందరికీ తెలియచేశాడు. వారు ఆదరంగా సీతకు స్నానం చేయించారు. అనేకరకాల నగలు పెట్టి అలంకరించి, అందమైన పాలకి తెప్పించారు. సీత, సంతోషంగా శ్రీరామచంద్రుని తలచుకొని, అందులో కూచుంది.

నాలుగువైపుల చేతుల్లో బెత్తాలు పుచ్చుకొని రక్షక భటులు నడచారు. అందరు చాలా సంతోషంగా ఉన్నారు. ఎలుగుబంట్లు, వానరులు దర్శించుకోడానికి వచ్చారు. రక్షకులు కోపంతో వారిని ఆపడానికి వచ్చారు.

"నా మాటలు వినండి. సీతను కాలి నడకన తీసుకుపొండి, ఎందుకంటే వానరులందరు ఆమెను తల్లిని చూచుకున్నట్లు చూడగలు

తారు." అని శ్రీరామచంద్రుడు నవ్వుతూ అన్నాడు.

ప్రభువు మాటలు విని ఎలుగుబంట్లు, వానరులు సంతోషించారు. దేవతలు ఆకాశం నుంచి పూలు కురిపించారు. సీతను మొదట అగ్నిలో ప్రవేశపెట్టారు. హృదయసాక్షిగా, భగవంతుడు ఆమె గొప్పతనాన్ని వెల్లడి చేయదలచి, లీలగా అనరాని మాట లాడాడు. ఆ మాటలు విన్న రాక్షసస్త్రీలు దుఃఖించసాగారు.

ప్రభువు మాటలను తలదాల్చి, మనసా, వాచా, కర్మణా పవిత్రురాలయిన సీత—"లక్ష్మణా! నీవు ధర్మాన్ని తెలిసికొని తొందరగా నిప్పును వెలిగించు" అంది.

సీత యొక్క విరహము, వివేకము, ధర్మము, నీతితో ఇమిడి యున్న వాక్కులను విని లక్ష్మణుడు కండ్ల వెంట నీరు పెట్టుకొని రెండు చేతులు జోడించి విలబడ్డాడు. ఆయన ప్రభువుతో ఏమనలేక పోయాడు.

శ్రీరాముని ఇష్టాన్ని తెలుసుకొన్న లక్ష్మణుడు శీఘ్రంగా వెళ్ళి కట్టెలు తెచ్చి నిప్పు పెట్టి వెలిగించాడు. నిప్పుమంటలు లేచినది చూచి సీత సంతోషించింది. ఆమెకు భయమేయలేదు.

"మనసా, వాచా, కర్మణా నా హృదయంలో శ్రీరాముడు తప్ప మరొక గతి లేదనుకున్నట్లయితే, అగ్నిదేవుడా! అందరి మనస్సులు తెలిసిన నీవు, నా విషయంలో చందనంలాగా చల్లబడిపో" అంటూ ప్రభువును తలచుకొని, కోసలపతికి జయమగుగాక' అంటూ చందనం లాగా శీతలంగా వున్న అగ్నిలో ప్రవేశించింది. అన్ని ప్రతిబింబాలు, సాంసారిక దోషాలు ఆ మంటల్లో కాలిపోయాయి. ప్రభువు చరిత్రను ఎవ్వరూ తెలిసికోలేకపోయారు. దేవతలు, సిద్ధులు, మునులు ఆకాశంలో నిలబడి చూస్తున్నారు కూడా. వారికీ అంతుబట్టలేదు.

అగ్ని రూపం ధరించి వేదాల్లో, జగత్తులో ప్రసిద్ధమైన సాక్షాత్తు

లక్ష్మి చేతిని పట్టుకొని శ్రీరామచంద్రునకు, క్షీరసాగరుడు, లక్ష్మిని హరి భగవంతునకు ఒప్పగించినట్లుగా, ఒప్పగించాడు, సీత శ్రీరాము నకు ఎడమవైపున వుంది. ఆమె, క్రొత్త నీలకమలము వద్ద బంగారు కమలము మొగ్గ వికసించినట్లుగా, శోభాయమానంగా వుంది.

దేవతలు సంతోషించి పూల వర్షం కురిపించారు. ఆకాశంలో వాయిద్యాలు మ్రోగాయి, కిన్నరులు గానం చేస్తున్నారు. విమానాల మీద ఎక్కి అప్సరలు నాట్యాలు చేస్తున్నారు.

సీత సహితంగా శ్రీరామచంద్రుని అంతులేని అందాన్ని చూచే ఎలుగుబంట్లు, వానరులు చాలా సంతోషించి, శ్రీరామచంద్రు నకు జయము చెప్పసాగారు.

తరువాత, శ్రీరాముని అజ్ఞనుపొంది సారథి మాతలి ప్రభువు పాదాలయందు తలవంచి వెళ్ళిపోయాడు. ఎల్లప్పుడు స్వార్థులైన దేవ తలు వచ్చి, పరుల మేలుకోరేవారిలాగా మాట్లాడసాగారు.

"దీనబంధూ! దయగల రఘునాథా! మీరు దేవతల యందు చాలా దయఉంచారు. ప్రపంచంలో అందరితో తగాదాలు పెట్టు కొనే దుష్టుడు, వ్యభిచారి,చెడుమార్గాన నడచు రావణుని అతనిపాపాల ద్వారా నాశనం చేశారు.

మీరు సత్యస్వరూపులు, నాశనంలేనివారు,సహజంగానే ఉదా సీనులు, అఖండులు, నిర్గుణులు, పుట్టుకలేని వారు, దోషములు లేని వారు, కరుణామయులు.

మీరు మత్స్య (చేప), వరాహ(పంది), వామన (పొట్టి), నృసింహ (నరుడు, సింహ కలసిన రూపంతో,పరశురామ అవతారాలు ఎత్తారు. నాథా! దేవతలకు బాధలు వచ్చినప్పుడల్లా మీరు శరీరాన్ని ధరించి మా దుఃఖాలను దూరం చేస్తూ వచ్చారు.

ఈ దుష్టుడు, కలుషితుడు, దేవతలకు ఎల్లప్పుడు శత్రువు.

కామముగలవాడు, లోభి, గర్విష్ఠి, కోపిష్ఠుడు. అలాంటి పందువుకు
రానివాడు కూడా మీ వద్ద స్థానం పొందగలిగాడు. ఈ విషయం
మాకు ఆశ్చర్యంగానే వుంది.

దేవతలమైన మేము మీ దయకు ఎంతో తగినవారము కావలసి
వుంది. కాని మేము మా లాభాలను, ప్రయోజనాలను దృష్టిలో వుంచు
కొని, లోభులమయి మీ యందు భక్తిని మరచిపోయాము. ఇందు
చేతనే పదవాని పాట్లు పడుతూ వచ్చాము. ప్రభూ! ఇప్పటికి మేము
నిన్ను వదలము, మమ్ము రక్షింపండి." అంటూ దేవతలు, సిద్ధులు
వినయంగా ఎక్కడివారక్కడ చేతులు జోడించి నిలబడ్డారు. అప్పుడు
ఎంతో ప్రేమతో పులకితశరీరుడై బ్రహ్మ స్తుతింపసాగాడు.

"సుఖానికి నిలయమైన హరీ! మీకు జయము కల్గుగాక! మీరు
రఘువంశంలో శ్రేష్ఠులు, ధనుర్ధారి. ప్రభూ! సంహారరూపమైన ఏను
గును నాశనం చేసే సింహము మీరు. మీరు గుణాలగని, చతురులు,
సమర్థులు.

మీ శరీరము, కామదేవుల అందములాంటి అందము కలది,
సిద్ధులు, మునీశ్వరులు, కవులు మీ గుణాలను గానం చేస్తున్నారు.
మీ కీర్తి నిర్మలమైనది, మీ గరుడుని మావెరిగా రావణ రూపమైన
పామును పట్టుకొన్నారు,

మీరు భక్తులను సుఖపెట్టేవారు, శోకభయాలను దూరం చేసే
వారు. కోపం లేనివారు, సదాజ్ఞానస్వరూపులు. మీ అవతారము ఉదా
రమయినది, అపారమైన గుణములుగలది, భూ భారాన్ని తగ్గించేది,
జ్ఞానము మెండుగా ఉండేది.

మీరు శాశ్వతంగా ఉండేవారు, మీకు పుట్టుకలేదు, మీరు
అనాది నుంచి వున్నవారే. శ్రీరామచంద్రా! నేను సంతోషంగా మీకు
నమస్కరిస్తున్నాను. రఘుకుల భూషణా! దూషణసంహారకా! నమస్తే

దోషాలను హరం చేయువాడా! దీనుడైన విభీషణుని మీరు రాజును చేశారు.

మీరు గుణ, జ్ఞానాలనిధులు. మానవుల యందు మీకు కోరిక లేదు. మీకు జన్మలేదు, మాయ మిమ్ము కన్నెత్తి చూడలేదు. అటువంటి మీకు నేను ఎల్లప్పుడు నమస్కరిస్తున్నాను. మీ భుజాలప్రతాపము, బలము సాటిలేనివి. మీరు దుష్టులను నాశనం చేయడంలో ఆరితేరిన వారు.

మీకు దీనులయందు దయ, వారికి కారణం లేకుండానే మేలు, చేస్తుంటారు. అలాంటి మీకు నమస్కరిస్తున్నాను. మీరు సంసార సాగరాన్ని ఒడ్డున వేసేవారు, మీరు కార్యానికి దూరంగా వుండు కార్యరూపులు, మనస్సులో ఏర్పడు పాపాలను దూరం చేసేవారు.

మీరు అందమైన ధనస్సు, బాణాలు, అంబులపొదిని దగ్గర వుంచుకుంటారు, మీ కండ్లు కమలాల్లాగా ఎర్రనివి. మీరు రాజులలో శ్రేష్ఠులు, సుఖాలకు నిధులు, లక్ష్మితో విహరించేవారు, అహంకార, కామాలను, మోహాలను నాశనం చేసేవారు.

మీలో దోషాలేమీ వుండవు. మీరు అఖండులు. ఇంద్రియాల ద్వారా మిమ్ము తెలిసికోవడం సాధ్యంకాదు. మీరు ఎల్లప్పుడు అన్నిరూపాల్లో ఉండి కూడా, ఏ రూపము కాని వారు.' అని వేదాలు చెబుతున్నాయి. ఇదిలోకోక్తికాదు. సూర్యుని కంటే వెలుగు వేరుగా కనిపించినా, వేరుకానట్లుగానే మీరు కూడా ప్రపంచానికి వేరుగా కన్పించినా వేరుగా లేరు. మీరు వేరుగా ఉంటారు, కలసి కూడా వుంటారు. మీ లీలలు మీకు తప్ప ఎవ్వరికీ తెలియవు.

ప్రభూ! ఈ వానరులందరు కృతార్థులయి, సాదరంగా మీ శ్రీముఖమును దర్శిస్తున్నారు. హరీ! దేవతల శరీరాలు, జీవనాలు

ఎందుకూ పనికిరానివి. మీ భక్తిని మరచిపోయి సంసారంలోపడి వున్నారు.

దీనదయాళా! ఇప్పుడు దయఉంచి, మా ఈ భేదబుద్ధిని మార్చండి. మేము వ్యతిరేకమైన పనులు చేస్తున్నాము. దుఃఖాలను సుఖాలనుకొని సుఖపడుతున్నామనుకుంటున్నాము.

మీరు దుష్టులను నాశనం చేసేవారు, భూమికి అలంకారులు, మీ చరణకమలాలకు శివపార్వతులు సేవలు చేస్తున్నారు. మహారాజా! మీ చరణకమలాలయందు, నాకు కరుణదాయకమైన ప్రేమ వుండేటు విధంగా వరదానం చేయండి." అంటూ ప్రేమతో పులకితుడై బ్రహ్మ స్తుతించాడు. శోభాసాగరుడయిన శ్రీరామదర్శనం చేసుకుంటూ కూడా ఆయన కళ్ళకు తృప్తి కలుగలేదు.

ఆ సమయంలో దశరథుడు అక్కడకు వచ్చి, పుత్రులనుచూచు కొన్నాడు. ఆయన కళ్ళంట నీళ్ళొచ్చాయి. లక్ష్మణ సహితంగా ప్రభువు నమస్కరించాడు, తండ్రి ఆశీర్వదించాడు.

"నాన్నగారూ! మీ పుణ్యాలన్నింటి ప్రభావం వలన జయింప శక్యంకాని రాక్షసరావణుని జయించాను" అన్నాడు రాముడు. పుత్రుని మాటలు వినగానే ప్రేమ పెరిగింది, కళ్ళంట నీళ్ళొచ్చాయి, శరీరంలోని రోమాలు నిక్కబొడిచాయి.

శ్రీరాముడు మొదటి ప్రేమను అంచనా వేసికొని, తండ్రివైపు చూచి అయనకు దృఢమైన జ్ఞానాన్ని ప్రసాదించాడు.

"పార్వతీ! దశరథుడు భేదభక్తి యందు మనస్సును లగ్నం చేశాడు. అందుచేత మోక్షము ప్రాప్తించలేదు. సగుణబ్రహ్మను ఉపాసించే వారికి ముక్తి లభించదు. వారికి శ్రీరామచంద్రుడు తన భక్తిని ప్రసాదిస్తాడు. ప్రభువుకు మాటిమాటికి నమస్కరించి దశరథుడు ఆనందంగా దేవలోకానికి వెళ్ళిపోయాడు.

లక్ష్మణ జానకి సహితంగా సుశీలంగా వున్న కోసలరాజ్యాన్ని ప్రభువు చూచి సంతోషంగా ఉండడం దేవరాజు ఇంద్రుడు చూచి ఆయనను స్తుతించాడు.

అందానికి ఆలవాలమా, శరణాగతులకు శాంతి నిచ్చువాడా, అందమైన అంబులపొది, ధనస్సు బాణాలు ధరించిన పొడవైన భుజాలుగల శ్రీరామా! మీకు జయముగుగాక·

ఖరదూషణులకు శత్రువా! రాక్షససమూహాన్ని మట్టు పెట్టిన రామా! మీకు జయముగుగాక. నాథా! మీరు, ఈ దుష్టుని చంపారు. దాంతో దేవతలు దిక్కుగలవారైనారు,

భూమి భారాన్ని తగ్గించేరామా! మీకు జయముగుగాక. మీ మహిమ ఉదారమైనదీ, అపారమైనది" రావణుని శత్రువా! మీకు జయముగుగాక. మీరు రాక్షసుల నెంతో వ్యాకులపెట్టారు.

లంకాపతి రావణునకు తన బలమంటే గర్వము. అతను దేవతలను, గంధర్వులను తన వశం చేసుకున్నాడు. మునులు, సిద్ధులు, పక్షులు, మనుష్యులు, నాగులందరిని బాధించాడు.

అతనికి ఇతరులతో వైరము పెట్టుకోవడం సరదా. దానికి తగిన ఫలమనుభవించాడా దుష్టుడు. దీనదయాళా! కమలముల్లాంటి కన్నులు గలవాడా! విను. నాతో సమానుడెవ్వడు లేడని నాకు గర్వంగా ఉండేది. ఇప్పుడు, ప్రభూ! మీ పాదకమలాలను దర్శించుకొన్న తరువాత దుఃఖాన్ని కలిగించు గర్వము దూరమయిపోయింది.

మిమ్ము కొందరు నిర్గుణ బ్రహ్మయని, కొందరు నిరాకారుడవని అంటున్నారు. వేదాలూ అలాగె చెబుతున్నాయి. కాని మీ సగుణ రూపమే అనుకూలంగా ఉంటుంది నాకు.

శ్రీరామా! సీతాలక్ష్మణులతో సహా నా హృదయంలో నివసిం

చండి. నన్ను మీ దాసునిగా భావించి మీ భక్తిని నాకు ప్రసాదిం చండి.

లక్ష్మీనివాసా! మీరు శరణాగతుల దుఃఖాలను దూరం చేసి, సుఖాలను కలిగించేవారు. సుఖనిధీ! నేను మీకు నమస్కరిస్తున్నాను మీరు అనేకమంది కామదేవులతో సమానమైన శోభకలవారు, దేవత లకు ఆనందాన్ని కలిగించి, ద్వంద్వాలను దూరంచేసేవారు. మనుష్య శరీరం దాల్చి, అమిత బలశాలులైన బ్రహ్మ, శివుల ద్వారా సేవలం దుకునేవారు. రామా! నేను మీకు నమస్కారం చేస్తున్నాను.

కృపాళూ! ఇప్పుడు దయచేసి నా వైపు చూచి, నన్నేమి చేయ మంటారో చెప్పండి."ఇంద్రుని ఈ ప్రియమైన మాటలు విని దీనద యాళుడైన శ్రీరామచంద్రుడు-"దేవరాజ ఇంద్రా! రాక్షసుల ద్వారా చచ్చిపోయిన మా ఎలుగుబంట్లు, వానరులు యుద్ధభూమిలో పడివు న్నారు. నా ప్రయోజనం కొరకు వీరు ప్రాణాలర్పించారు. ఇంద్రా! వీరందరిని బ్రతికించు.

కాగభుశుండి అంటున్నాడు-"గరుడా! విను, ప్రభువు అన్న ఈ మాట చాలా రహస్యమయినది. జ్ఞానులయిన మునులు మాత్రమే ఈ మాటలను అర్థం చేసికోగల్గుతారు ప్రభువు మూడు లోకాలను చంపిబ్రతికించగలడు. ఇక్కడ కేవలము ఇంద్రుని గొప్పతనాన్ని చూపుతున్నాడు."

ఇంద్రుడు అమృతాన్ని కురిపించి వానరులను, ఎలుగుబంట్లను బ్రతికించాడు, వారు సంతోషంగా లేచిప్రభువు వద్ద కెళ్ళారు. అమృత వర్షము రెండు సేనల మీదా కురిసింది. ఎలుగుబంట్లు, వానరులు లేచారు, రాక్షసులు బ్రతుకలేదు. ఎందుకంటే వారి మనస్సులు రామ రూపాలయిపోయాయి. అంచేత వారు సంసారబంధనాల నుండి ముక్తు లయిపోయారు. కాని వానరులు, ఎలుగుబంట్లు దేవతల అంశలు,

అందువలన వారందరు శ్రీరాముని కోరికతో బ్రతికారు,

శ్రీరామచంద్రుడు రాక్షసులను సంసార బంధనాల నుండి విముక్తులను జేశాడు. ఆయనతో సమానంగా దీనులకు సుఖాన్ని కలిగించే వారెవరున్నారు? నీచుడు, మహాపాపి, మహాకామీ రావణుడు, శ్రేష్ఠులైన మునులు కూడా పొందలేని ఉత్తమగతిని పొందాడు. దేవతలందరు పూలవర్షం కురిపించి అందమైన విమానాల్లో ఎక్కి వెళ్ళారు. అప్పుడు మంచి సమయమని తెలిసికొని శివుడు వచ్చి, ప్రేమతో రెండు చేతులు జోడించి కమలాల్లాంటి కళ్ళల్లో ప్రేమాశ్రువులు నింపుకొని, పులకిత శరీరుడై, గద్గద వాక్కులతో స్తుతించాడు.

"రఘుకులంలో ప్రధానుడా! అందమైన నీ చేతుల్లో ధనస్సు బాణాలు ధరించి నన్ను రక్షించండి, మీరు మోహరూపమైన దట్టమైన మేఘాల సమూహానికి వాయురూపులు, సంసార రూపమైన వనానికి అగ్ని లాంటివారు, దేవతలకు ఆనందాన్ని కలిగించేవారు,

సగుణ, నిర్గుణ, గుణాలకునిధీ! భ్రమరూపమైన అంధకారాన్ని రూపుమాపేయడానికి బలమైన సూర్యుడవు; కామ, క్రోధ, మదరూపమైన ఏనుగులకు సింహరూపమైన మీరు, ఈ భక్తుని హృదయంలో ఎల్లప్పుడు నివసించండి.

విషయవాసనల సమూహ రూపమైన కమలాలను ఎండజేయు ప్రబలమైన పొగమంచుమీరు. మీరు చాలా ఉదారులు, మనస్సుకు అంతు చిక్కనివారు. మీరు సంసారసాగరాన్ని చిలుకుట కొరకు మందరాచలము, మీరు మా భయాన్ని పోగొట్టి, ఈ దుస్తరమైన సంసారాన్నుండి దాటించండి.

దీనబంధూ! శ్యామలశరీరా! కమలనయనా! శరణాగతుల దుఃఖాలను దూరం చేయురామా! మీరు సీతాలక్ష్మణుల సహితంగా నా హృదయంలో నివసించండి. మీరు మునులకు ఆనందాన్నిచ్చేవారు,

భూమండలానికి అలంకారులు. తులసీదాసంటున్నాడు- "ప్రభువు భయాలను దూరం చేసేవాడు" నాథా! అయోధ్యాపట్టణంలో మీకు రాజ్యాభిషేకం జరుగునప్పుడు, మీ ఉత్తమలీలలను చూడ్డానికి నేను వస్తాను." అన్నాడు శివుడు.

శివుడు వినయంగా స్తుతించి వెళ్ళగానే విభీషణుడు ప్రభువు వద్దకు వచ్చి, పాదాలయందు తలనుంచి కోమలమైన వాక్కులతో- "ధనుర్ధారీ, ప్రభూ! నా మనవి వినండి. మీరు కుటుంబము, సైన్య సమేతంగా రావణుని చంపి, మీ నిర్మలమైన కీర్తిని మూడు లోకాల్లో వ్యాపింపజేశారు. దీనుడను, మలినుడను, బుద్ధిలేనివాడను, రాక్షస జాతివాడను అయిన నా యందు అమిత దయ చూపారు.

స్వామీ! ఇప్పుడు మీ దాసుని ఇంటిని పవిత్రం చేయండి, వెళ్ళి స్నానం చేయండి. దాంతో యుద్ధబడలిక తీరిపోతుంది. ధన, సంపత్తి సంపదలు చూచి ఆనందంగా వానరులకు పంచండి.

నాథా! మీరు అన్ని విధాలా నన్ను మీ దాసునిగా చేసుకోండి. నన్ను మీతో పాటు అయోధ్యకు తీసుకెళ్ళండి" అన్నాడు.

విభీషణుని కోమలమైన మాటలు విని దీనదయాళుడయిన ప్రభువు రెండు కళ్ళంట నీళ్ళొచ్చాయి.

"నీ ధనము, ఇళ్ళు, వాకిళ్ళు మొదలైనవన్నీ నావే, అని నీవన్నమాట నిజమే. కాని నిజము చెప్తున్నాను. నాకు, భరతుని పరిస్థితి తలచుకొన్నప్పుడు ఒక్కొక్క కల్పంలాగా గడచిపోతున్నది. ఆయన తాపస వేషంలో బక్కచిక్కిన శరీరంతో ఎల్లప్పుడు నన్నే తలచుకుంటున్నాడు. సఖా! నేను అతన్ని తొందరలో చూచు ఉపాయ మాలోచించమని నిన్ను కోరుతున్నాను.

నేను అనుకొన్న సమయానికి వెళ్ళకపోతే, తమ్ముని ప్రాణాలతో చూడలేను," అంటూ భరతుని ప్రేమను తలచుకుంటూ శ్రీరాము

చంద్రుడు పులకించి-"నీవు కల్పం వరకు రాజ్యం చెయ్యి. మనస్సు లో నన్ను తలచుకొంటూ ఉండు. నీవు నా వద్దకు చేరుకుంటావు అనా స్థానము భక్తులందరు ఉండే స్థలం." మరల శ్రీరామచంద్రు డన్నాడు.

శ్రీరాముని మాటలు విని విభీషణుడు సంతోషించి కృపానిధి పాదాలు పట్టుకున్నాడు. వానరులు, ఎలుగుబంట్లు, సంతోషించి, ప్రభువు పాదాలు పట్టుకొని నిర్మలమైన గుణాలను గానం చేస్తున్నారు.

విభీషణుడు భవనంలోకి వెళ్ళాడు. అక్కడ మణులు, వస్త్రా లతో విమానాన్ని నింపారు. ఆ పుష్పక విమానాన్ని తెచ్చి స్వామి రామచంద్రుని ముందుంచాడు. అప్పుడు కృపానిధి అయిన భగవా నుడు—

"సఖా, విభీషణా! ఈ విమానం మీదనే కూచుని ఆకాశంలోకి వెళ్ళి వస్త్రాభూషణాలు కురిపించు"అన్నాడు. ఆజ్ఞను పొంది విభీష ణుడు ఆకాశంలోకివెళ్ళి మణులు. వస్త్రాలను వర్షంలాగా కురిపించాడు.

వాటిలో ఎవరికి నచ్చినవి, వారు తీసుకున్నారు. వానరులు మణులను నోట్లో పెట్టుకొని ఊస్తున్నారు. సీతాలక్ష్మణుల సమేతంగా శ్రీరాముడు నవ్వుకుంటున్నాడు. ఎందుకంటే శ్రీరాముడు చాలా వి లాసప్రియుడు

శ్రీరామచంద్రుని మునిజనులు ధ్యానించి కూడా పొందలేక పోతున్నారు. వేదాలు "నేతి, నేతి" అంటున్నాయి. అలాంటి శ్రీరామచంద్రుడు వానరులతో అనేక రకాల వినోదాలు చేస్తు న్నాడు.

"పార్వతీ. యోగము, జపము, ధ్యానము, తపస్సు, అనేక యజ్ఞాలు' వ్రతాలు, నియమాలు చేసినా, శ్రీరామునియందు నిష్క పటమైన ప్రేమ లేకపోవడంచేత, మునులయందు, దేవతలయందు

శ్రీరామునకు దయ తొందరగా ఏర్పడడంలేదు.

ఎలుగుబంట్లు. వానరులు వస్త్రాభూషణాలు పొంది, వాటిని ధరించి శ్రీరామచంద్రుని వద్దకు వెళ్ళారు. ప్రభువు కోసలాధీశుడు, రంగుల రంగుల వస్త్రాలను ధరించిన వానరులను చూచి, మాటి మాటికి నవ్వుతున్నాడు. శ్రీరాముడు అందరివైపు కృపాదృష్టితో చూచి- "మీ అండతోనే నేను రావణుని చంపి విభీషణుని రాజును చేశాను. ఇప్పుడిక మీరందరు మీమీ ఇండ్లకు పొండి. నన్ను తలచుకొంటూ వుండండి. ఎవరిని చూచి భయపడవద్దు" అన్నాడు.

శ్రీరామచంద్రుని మాటలు వినగానే ప్రేమలో మునిగిపోయి, చేతులు జోడించి ఆదరంగా- "ప్రభూ! మీరు చెప్పిన విషయాలన్నీ మీ శోభకు తగినట్లున్నాయి. కాని ఈ మాటలు విన్నాక మాకు మోహం ఏర్పడుతున్నది. మీరు మమ్మ దీనులుగా తలంచి మాకు ఎంతో ఉపకారం చేసి, మమ్ముద్ధరించారు. రఘునాథా! మీరు మూడు లోకాలకూ స్వాములు.

ప్రభూ! మీ మాటలు విని మేము సిగ్గుతో కుమిలి చస్తు న్నాము. దోమలెక్కడైనా గరుడునకు మేలు చేయగల్గుతాయా?" అంటూ శ్రీరాముని మాటలకు వానరులు, ఎలుగుబంట్లు ప్రేమలో మునిగిపోయారు.

ప్రభువు ఆజ్ఞ ప్రకారము వానరులు, ఎలుగుబంట్లందరు శ్రీరాముని స్వరూపాన్ని మనస్సులో ఉంచుకొని అనేకరకాలుగా ప్రార్థిస్తూ సంతోష, దుఃఖాలతో ఇండ్లకు వెళ్ళిపోయారు.

జాంబవంతుడు, సుగ్రీవుడు, నీల, నలులు, అంగద హను మంతునితో సహా, బలవంతులైన సేనాపతులందరు ప్రేమకు వశులై ఏమీ అనలేకపోతున్నారు. కాని కళ్ళల్లో నీళ్ళు పెట్టుకొని, అందరు కన్నార్పకుండా శ్రీరామచంద్రునివైపు చూస్తున్నారు.

శ్రీరాముడు వారి అధిక భక్తిని చూచి, అందరిని విమానం మీద కూచో బెట్టుకుని, మనస్సులోనే బ్రాహ్మణుల పాదాలకు తలవంచి నమస్కరించి, ఉత్తర దిక్కువైపుకు విమానాన్ని నడిపించారు.

విమానం వెళ్ళుచున్నప్పుడు చాలా పెద్ద శబ్దమయింది. అందరు శ్రీరామచంద్రునకు జయము పలికారు. విమానంలో, చాలా ఎత్తయిన అందమైన సింహాసనమొకటుంది. దానిమీద సీతతో సహా శ్రీరామచంద్రుడు కూచున్నాడు.

శ్రీరామునితోవున్న సీత, సుమేరుపర్వతం మీద సున్న మేఘాలతోపాటు వున్న మెరుపులాగా, శోభాయమానంగా వుంది. విమానం వేగంగా వెళ్తూవుంది. దేవతలు సంతోషంగా దానిమీద పూలవర్షం కురిపిస్తున్నారు.

చాలా సుఖాన్ని కలిగించే శీతల, మంద పవనాలు వీస్తున్నాయి. సముద్రము, సరోవరాలు, నదులలోని నీరు నిర్మలమయి పోయింది. నాల్గు వైపుల మంచి శకునాలవుతున్నాయి. అందరి మనస్సులు సంతోషంగా వున్నాయి. ఆకాశం, దిక్కులు పరిశుద్ధంగా వున్నాయి.

"సీతా! యుద్ధభూమిని చూడు. ఇక్కడ లక్ష్మణుడు మేఘనాథుని చంపాడు. ఇక్కడ హనుమంతుడు, అంగదుడు చంపిన పెద్ద పెద్ద రాక్షసులు చచ్చిపడివున్నారు. దేవతలను, మునులను దుఃఖపెట్టిన కుంభకర్ణుడు, రావణుడు ఇక్కడ చంపబడ్డారు.

చూడు, నేను ఇక్కడ సేతువు నిర్మింపజేశాను. సుఖాలకు నిధి అయిన శివుని ప్రతిష్టించాను" అని రాముడు చెప్తూ సీతతో సహా శివునకు నమస్కరించాడు.

39)

కృపాసింధు రాముడు వనాల్లో విశ్రాంతి తీసికొన్న చోట్ల న్నింటిని సీతకు చూపాడు. విమానం తొందరగా దండకవనం చేరుకుంది. అగస్త్యుడు మొదలైన మునీశ్వరులు అక్కడనే వుంటు న్నారు. వారి ఆశ్రమాలన్నింటిలోకి శ్రీరామచంద్రుడు వెళ్ళాడు.

మునులందరు ఆశీర్వదించిన తరువాత జగదీశ్వరుడు చిత్ర కూట పర్వతం వద్దకు వచ్చాడు. అక్కడి ఋషులను సంతుష్ట పర చాడు. అక్కడ నుండి విమానం వేగంగా వెళ్ళిపోయింది.

కలియుగ పాపాలను దూరంచేసే, అందమైన యమునా నదిని సీతకు శ్రీరాముడు చూపాడు. తరువాత గంగను చూపి- "గంగకు సమస్కరించమని" చెప్పాడు.

తీర్థరాజు ప్రయాగను చూడమన్నాడు. దానిని దర్శించగానే పాపాలన్నీ పారిపోతాయి. తరువాత మహాపవిత్రమైన త్రివేణి దర్శనం చేసికోమన్నాడు. అది శోకాలను దూరం చేసేది, దేవ లోకానికి మెట్లు" అని చెప్పాడు. తరువాత "మూడు రకాల తాపా లను, సంసారికి రోగాలను పోగొట్టే అయోధ్యను చూడ"మన్నాడు. ఇలా చెప్పకుంటూ సీతతో సహా శ్రీరాముడు అయోధ్యకు ప్రయాణ మయ్యాడు. కళ్ళంట నీళ్లెట్టుకొని, పులకిత శరీరుడై, శ్రీరాముడు సంతోషిస్తూ వున్నాడు.

మరల త్రివేణి వద్దకు వచ్చి, వానరులతో సహా ప్రభువు సంతోషంగా స్నానంచేసి, విప్రులకు దానాలు చేశాడు.

తరువాత ప్రభువు హనుమంతునకు "నీవు బ్రహ్మచారిగా మారి అయోధ్యకు వెళ్ళి, భరతునకు మా క్షేమాలు తెలిపి, ఆయన సమా చారాలు తెలిసికొని రమ్మ" అని పంపాడు.

అప్పుడు భగవానుడు భరద్వాజ మహర్షి వద్దకు వెళ్ళాడు. ముని అనేక రకాల పూజలుచేసి, స్తుతించి ఆశీర్వదించాడు. రెండు

చేతులు జోడించి ముని పాదాలకు నమస్కరించి శ్రీరామచంద్రుడు విమానాన్నెక్కి వెళ్లాడు. అక్కడ నిషాదుడు, ప్రభువు వచ్చాడని వినగానే "నావ ఎక్కడ?" అని ప్రజలను పిలిచాడు.

గంగను దాటి విమానం వచ్చింది. ప్రభువు ఆజ్ఞను పొంది క్రిందికి దిగింది. అప్పుడు సీత గంగకు అనేక రకాల పూజలు చేసి, ఆమె పాదాల మీద పడింది. సంతోషంగా గంగ- "సుందరీ! నీ ముత్తయిదువ తనం శాశ్వతంగా నిలిచి వుండుగాక" అంది.

నిషాదరాజు, ప్రభువు వచ్చాడని తెలియగానే ఆనందంలో మునిగి, ప్రభువు వద్దకు వచ్చి, సీతా సహితంగా ప్రభువును చూచి భూమిమీద పడిపోయాడు. ఆయనకు శరీర స్మృతి లేదు. శ్రీరామ చంద్రుడు అతని ప్రేమను చూచి సంతోషంగా లేపి కౌగలించుకుని క్షేమసమాచారాలు అడిగాడు. అపుడు వినయంగా- "బ్రహ్మ, శివుడు మీ పాద కమలాలను సేవిస్తున్నారు. అటువంటి మీ పాదా లను దర్శించుకొన్న తరువాత క్షేమంగాక మరేముంటుంది? శ్రీరామచంద్రా! మీకు నమస్కారం చేస్తున్నాను.

అటవిక కులస్థుడైన నిషాదుని ప్రభువు అన్ని విధాల భర తునితో సమానంగా కౌగలించుకున్నాడు.

తులసీదాసు అంటున్నాడు - "మందబుద్ధినయిన నేను భగ వంతుని మోహవశమయి మరచిపోయాను. రావణుని శత్రువయిన ఈయన చరిత్ర, శ్రీరామచంద్రుని పాదకమలాలయందు ఎల్లపుడు ప్రేమను స్థిరంగా వుంచేటటువంటిది. పెద్దకోర్కెలు మొదలైన దోషాలను పోగొట్టేది, జ్ఞానాన్ని ప్రసాదించేది. దేవతలు, సిద్ధులు, మునులు ఈయన చరిత్రను ఆనందంగా గానం చేస్తున్నారు.

శ్రీరామచంద్రుని యుద్ధ విజయ సందర్భాలను విన్న వారికి భగవంతుడు విజయజ్ఞానాన్ని, ఐశ్వర్యాలను ప్రసాదిస్తాడు.

మనసా! ఈ కలికాలం పాపాలకు పుట్ట. ఇందులో శ్రీ రఘునాధుని నామాన్ని జపించడం తప్ప మరొక మార్గంలేదు. బాగా ఆలోచించు, ఎల్లప్పుడు రామనామ జపాన్ని మానకు ...

లంకా కాండము సమాప్తం

# 7. ఉత్తర కాండ-మంగళాచరణం

## 35

నెమలి కంఠంతో సమానమైన నీలవర్ణకాంతి గలవాడు, దేవతలలో శ్రేష్ఠుడు, బ్రాహ్మణుల పాదకమలాల గుర్తులతో అందంగా వున్నవాడు, శోభతో పరిపూర్ణుడయినవాడు, పీతాంబరము ధరించినవాడు, కమల నేత్రుడు, ఎల్లప్పుడు సంతోష ముఖంతో ఉండువాడు, చేతుల్లో బాణాలు, ధనస్సు ఉంచుకొనేవాడు, వానరసమూహంతో కూడియుండేవాడు, లక్ష్మణునితో సేవలందుకొనువాడు,అయిన జానకీపతి, రఘుకుల శ్రేష్ఠుడు పుష్పక విమానము మీద కూచున్న శ్రీరామచంద్రునకు నేను (తులసీదాసు) నమస్కరిస్తున్నాను.

బ్రహ్మ, శివులకు కోసలపతి శ్రీరామచంద్రుని పాదకమలాలు యిష్టం. వారు ఆయన పాదాలకు నమస్కరిస్తూ వుంటారు. కోమలమైన సీత చరణ కమలాలంటే వారికి ప్రేమ, ఆమె చేతుల్లో ధ్యానంచేసే భక్త జనుల మనస్సుల రూపమైన తుమ్మెదలు నివసిస్తూ వుంటాయి.

తామరపూలు, చంద్రుడు, శంఖం లాంటి అందమైన ఎర్రని శరీరం గలవాడు, కోరిన ప్రకారము సిద్ధులు ప్రసాదించేదాత, దయగలవాడు, అందమైనవాడు, కమలనయనుడు,కామదేవుని భస్మంచేసిన

వాడు, పార్వతికి భర్త అయిన శ్రీ శంకరునకు నేను (తులసీదాసు) నమస్కారం చేస్తున్నాను.

శ్రీరామచంద్రుడు వనవాసం పూర్తి కావడానికి ఒక రోజుమిగిలి వుంది. పట్టణంలోని వారు చాలా ఆదుర్దాగా వున్నారు. రామచంద్రుని వియోగంలో, ఎక్కడ కూచున్న వారక్కడ, ఆలోచనల్లో పడి పోయారు.

మంచి శకునాలవుతున్నాయి. అందరు సంతోషంగా వున్నారు. నగరం నలువైపుల శోభాయమానంగా వుంది. ఈ మూడువిషయాలు ప్రభువు వస్తున్నట్లుగా సూచిస్తున్నాయా, అన్నట్లుగా వున్నాయి.

సీతా,లక్ష్మణుల సహితంగా శ్రీరాముడు వస్తున్నట్లు, ఆ సమాచారాన్ని ఎవరో చెప్పబోతున్నట్లుగా, కౌసల్య మొదలైన తల్లుల మనస్సులలో ఆనందంగా వుంది.

భరతుని కుడికన్ను, కుడి భుజము మాటిమాటికి అదురుతున్నాయి. శుభశకునాలే అనుకొని భరతుడు చాలా సంతోషంతో-"ఒక రోజు గడువుంది" అనుకోగానే ఆయనకు చాలా బాధ కలిగింది. "ఏ కారణం చేత రఘురాముడు రాలేదు? నన్ను దుష్టుడనని భావించి నన్ను మరచిపోయాడా? ఆహా! లక్ష్మణుడు అదృష్టవంతుడు. ఆయన రామచంద్రుని పాదకమలాల యందే ప్రేమను స్థిరంగా నిలుపుకొని వున్నాడు. ఆయనకు దూరంగా ఎన్నడూలేడు. నన్ను, ప్రభువు కపటి, దుర్మార్గుడు అని భావించియే వెంట తీసికొని వెళ్ళలేదు.

నా చేష్టలు తెలిసికొంటే, కోట్ల కల్పాల వరకు నా ముఖం ప్రభువు చూడకూడదు. కాని ప్రభువు తన సేవకుల దోషాలను పట్టించుకోడు. దీనబంధువయిన ప్రభువు చాలా మంచి స్వభావం కలవాడు. ఇందుచేత, ప్రభువు తప్పకుండా నన్ను కలుస్తాడను, గట్టి నమ్మకము నాకుంది. శకునాలు చాలా బాగున్నాయి. గడవుదాటిన తరువాత

కూడా నేను బ్రతికియుంటే, ప్రపంచంలో నాకంటే నీచుడెవడుంటాడు?" అనుకున్నాడు భరతుడు.

శ్రీరామచంద్రుని వియోగరూప సముద్రంలో భరతుని మనస్సు మునిగిపోతూ వుంది. ఇంతలో హనుమంతుడు, బ్రాహ్మణరూపంలో, నీటిలో మునిగిపోయే వానికి నావలభించినట్లుగా, వచ్చాడు.

భరతుడు దర్భాసనం మీద కూచుని వున్నాడు. తల జడలు కట్టివుంది. శరీరం బక్కచిక్కివుంది. "రామ,రామ, రఘునాథా" అని జపిస్తున్నాడు. కమలాల్లాంటి కళ్ళవెంట కన్నీళ్ళొస్తున్నాయి. అతన్ని చూడగానే హనుమంతుడు చాలా సంతోషించాడు. దేహం పులకరించింది, కళ్ళంట నీళ్ళొచ్చాయి. మనస్సులో అనేక రకాల సుఖాలను పొంది, అమృతంతో సమానమైన పలుకులు పలికాడు-

"మీరు ప్రభువు వియోగంలో రాత్రింబవళ్ళు చింతిస్తూ కృశించిపోయారు. ఆయన గుణగణాలను వర్ణిస్తున్నారు, ఆ ప్రభువు, సజ్జనులను సుఖపెట్టేవాడు, దేవతలను, మునులను రక్షించేవాడు, క్షేమంగా వస్తున్నాడు. ఆయనతో పాటు సీతాలక్ష్మణులు వస్తున్నారు" అని చెప్పాడు హనుమంతుడు.

ఈ మాటలు వినగానే భరతుని దుఃఖాలన్నీ, దప్పికగొన్న వానికి అమృతం లభించినట్లుగా, దూరమయిపోయాయి.

"సోదరా! నీవెవరవు? ఎక్కడనుండి వచ్చావు? నీవు చాలా ప్రియమైన విషయాలు వినిపించావు" అన్నాడు భరతుడు.

కృపానిధీ! వినండి. పవన పుత్రుడను మాది వానరజాతి నా పేరు హనుమంతుడు. నేను దీనబంధు శ్రీరామచంద్రుని దాసుడను." అన్నాడు హనుమంతుడు.

ఈ మాటలు వినగానే సాదరంగా వాటేసుకున్నాడు భరతుడు, ప్రేమ మనస్సులో యిమడడం లేదు. కళ్ళంట నీళ్ళ పరుగులు తీశా

యి. ఒళ్ళు పులకరించిపోయింది."

"హనుమా! నీ దర్శనంతో దుఃఖాలన్నీ దూరమయిపోయాయి. ఇవాళ నామ నా ప్రియుడైన శ్రీరాముడు కలసినట్లుగానే వుంది." అంటూ భరతుడు మాటిమాటికి క్షేమాలడిగాడు. తరువాత-"సోదరా! ఈ సమయంలో నీ కేమి ఇవ్వగలను? ప్రపంచంలో ఈ సందేశం కంటే మించినది మరొకటి లేదు. సోదరా! నేను నీ ఋణం తీర్చుకో లేను. ఇప్పుడు నాకు శ్రీరామచంద్రుని చరిత్రను వినిపించు"అన్నాడు భరతుడు.

భరతుని పాదాలయందు తలయుంచి, హనుమంతుడు, రామ చంద్రుని కథంతా చెప్పాడు.

"హనుమా! దయాళువయిన శ్రీరామచంద్రుడు నన్ను తన దాసునిగా భావించి తలచుకుంటాడా? అన్నాడు భరతుడు.

భరతుని దీనవచనాలు విని హనుమంతుడు పులకితుడై ఆయన పాదాలమీదపడి "శ్రీరామచంద్రుడు చరాచరాలకు స్వామి భరతుని గుణగుణాలను ఆ స్వామి తన నోటితో స్వయంగా వర్ణిస్తూ వున్నాడు. అలాంటి భరతుడు ఇంత వినయంగా, పవిత్రంగా ఎందుకు మాట్లాడడు? గుణసాగరుడు కాకుండా ఎలా వుంటాడు?" అనుకొని "భరతా! మీరు శ్రీరామునకు ప్రాణాలకంటే ప్రియులు. నేను చెప్పేమాట సత్యము" అనగానే భరతుడు విని మాటిమాటికి కౌగలించుకుంటూ సంతోషం పట్టలేకపోతున్నాడు.

హనుమంతుడు భరతుని పాదాలకు నమస్కరించి వెంటనే శ్రీరాముని వద్దకు వెళ్ళి కుశలమంతా చెప్పాడు. అపుడు సంతో షించి ప్రభువు విమానం మీద ఎక్కి వెళ్ళాడు.

భరతుడు సంతోషంగా అయోధ్యలోకి వచ్చి సమాచార మంతా గురుదేవునకు వినిపించి, రాజభవనంలోకి, రామచంద్రుడు

క్షేమంగా నగరంలోకి ప్రవేశిస్తున్నాడని కబురు పంపాడు.

సమాచారం వినగానే తల్లులందరు పరుగెత్తుకొచ్చారు. భరతుడు ప్రభువు కుశలాన్ని తెలియ పరచాడు. అయోధ్య ప్రజలు శ్రీరామచంద్రుడు వస్తున్నాడని వినగానే సంతోషంగా పరుగులు తీశారు. పెరుగు, పాలు, గోరోచనం, పండ్లు, పూలు, శుభానికి మూలమైన తులసీదళాలు మొదలైనవి, బంగారు పళ్లాల్లో బాగా నింపుకొని గజ గామినులు, ముత్తయిదువ స్త్రీలు పాటలు పాడుతూ వచ్చారు.

వారందరు వున్నపాటునలేచి పరుగులు తీస్తున్నారు. పిల్లలను, ముసలివారిని ఎవ్వరూ వెంటబెట్టుకు రావడంలేదు. "మీరు దయాళువైన శ్రీరామచంద్రుని చూచారా?" అని ఒండొరులు అడుగుతూ వున్నారు.

అయోధ్యా పట్టణము, ప్రభువు వస్తున్నట్లు తెలిసికొని, శోభలకు నిలయమై పోయింది. సరయూ నదిలోని నీళ్ళు ఎంతో నిర్మలమై పోయాయి. మూడు రకాల శీతల. మంద సుగంధిత వాయువులు వీస్తున్నాయి.

గురు వసిష్ఠుడు, కుటుంబ సభ్యులు, శత్రుఘ్నుడు, బ్రాహ్మణుల సమూహంతోపాటు భరతుడు మనస్సులో ఎంతో ప్రేమను నింపుకొని కృపానిధి శ్రీరాముని వద్దకు వెళ్ళాడు.

అనేకమంది స్త్రీలు మేడలమీద ఎక్కి ఆకాశంలోని విమానాన్ని చూచి సంతోషించి తియ్యని స్వరాలతో అందమైన మంగళ గీతాలు పాడుతున్నారు.

శ్రీరామచంద్రుడను పూర్ణచంద్రుని చూచి, అయోధ్యా రూపమైన సముద్రం సంతోషంతో కోలాహలం చేస్తూ పొంగిపోతున్నది. స్త్రీలు దాని తరంగాలలాగా వున్నారు.

ఈ వైపు సూర్యవంశ రూపకమలానికి సూర్యుడైన శ్రీరామ చంద్రుడు వానరులకు నగరాన్ని చూపుతూ– "సుగ్రీవా! అంగద, విభీషణా! ఇది పవిత్రమైన అయోధ్యా పట్టణము. అందమైనస్థానము· అందరు వైకుంఠాన్ని గొప్పగా చెబుతుంటారు. వేదపురాణాల్లో ప్రసిద్ధమైనది, ప్రపంచానికి తెలుసు· కాని అది కూడా నాకు అయోధ్యతో సమానంగా ప్రియము కాదు, ఈ సంగతి చాలా మందికి తెలియదు.

ఈ అందమైన పట్టణంలో నేను పుట్టాను· దీనికి ఉత్తరంగా నిర్మలమైన సరయూ నది ప్రవహిస్తున్నది. అందులో స్నానంచేస్తే పరిశ్రమలేకుండానే ప్రజలు నా వద్దకు వచ్చి నివసిస్తారు.

ఇక్కడ వుండేవారు నాకు చాలా యిష్టులు. ఈ అయోధ్యా పట్టణము నేనున్న చోటుకు తీసుకువెళ్ళే సుఖాలరాశి" అన్నాడు.

ప్రభువు మాటలు విని వానరులందరు సంతోషించారు. స్వయంగా శ్రీరామచంద్రుడు తన నోటితో పొగడిన అయోధ్యా పట్టణం ధన్యురాలు.

కృపాసింధు శ్రీరామచంద్రుడు ప్రజలందరు రావడం చూచాడు. ఆయన ఆజ్ఞతో విమానము నగరము దగ్గర భూమిమీద దిగింది. ప్రభువు పుష్పక విమానం నుండి దిగి-"ఇక నీవు కుబేరుని వద్దకు వెళ్ళు" అన్నాడు. అది ఆయన ఆజ్ఞతో స్వామివద్దకు వెళ్తున్న సంతోషంతో, ప్రభువును వదలి వెళ్తున్న దుఃఖంతో వెళ్ళింది.

భరతునితోపాటు శ్రీరాముని వియోగంలో అందరు చిక్కిపోయారు. ప్రభువు మునులలో శ్రేష్ఠులైన వాసుదేవ, వసిష్ఠులను చూడగానే ధనస్సు, బాణాలను క్రింద వుంచాడు. లక్ష్మణుని సహితంగా వెళ్ళి గురువుగారి పాదాలు పట్టుకున్నాడు. ఇద్దరి శరీరాల

రోమాలు నిక్కబొడిచాయి. మునులు కుశల సమాచారాలు అడిగారు. శ్రీరామచంద్రుడు "మీ దయవల్లనే మేము కుశలంగా వున్నా"మన్నాడు,

తరువాత ధర్మధురంధరుడయిన శ్రీరామచంద్రుడు బ్రాహ్మణులందరిని కలసి వారికి తలవంచి నమస్కారం చేశాడు. దేవతలు, మునులు, శంకరుడు, బ్రహ్మ నమస్కరించే శ్రీరాముని పాదాలు పట్టుకొన్నాడు భరతుడు.

భరతుడు సాష్టాంగ నమస్కారంచేస్తూ భూమిమీద పడ్డవాడు అలాగే పడివున్నాడు. ఎవరులేపినా లేవడంలేదు. అప్పుడు కృపాసింధు శ్రీరామచంద్రుడు బలవంతాన లేపి, అతన్ని తన హృదయానికి హత్తుకున్నాడు. ఆయన చామనచాయ శరీరంలో వున్నాడు. రోమాలు నిక్కబొడిచాయి కొత్త కమలాల్లాగా నేత్రాల్లో కన్నీళ్లు కారసాగాయి.

మూడు లోకాలకు నాథుడయిన ప్రభువు చాలా ప్రేమతో భరతుని కౌగలించుకున్నాడు. ప్రభువు సోదరునితో కలిసే సమయంలోని శోభను కవినయినా నేను చెప్పలేను. ప్రేమ, శృంగార రసాలు శరీరాలు ధరించి పరస్పరం కలుస్తూ, విశేషమైన శోభను పొందుతున్నాయా అన్నట్లుగా వుంది.

దయానిధి అయిన శ్రీరాముడు భరతుని కుశల ప్రశ్నలు వేశాడు. కాని ఆనందమెక్కువయినందున భరతుని నోటినుండి చకచకా మాటలు పెగలి రావడంలేదు.

"పార్వతీ! విను. భరతుని సుఖం మనస్సు, మాటలతో చెప్పనలవి గానిది. ఆ సుఖాన్ని అనుభవించినవారే, ఆ సుఖాన్ని గురించి చెప్పగలుగుతారు." అన్నాడు శివుడు. భరతుడు- "కోసల నాథా! మీరు నేను దుఃఖంతో వున్నానని దాసునకు దర్శనం

యిచ్చారు. అందువలన అంతా కుశలమే. కృపానిధీ! మీరు వియోగరూపంలోని సముద్రంలో మునకలు వేస్తున్న నా చేతులు పట్టుకొని నన్ను రక్షించారు" అన్నాడు.

శ్రీరామచంద్రుడు సంతోషంగా శత్రుఘ్నుని హృదయానికి హత్తుకొని కౌగలించుకున్నాడు. తరువాత భరతుడు, లక్ష్మణుడు ప్రేమతో కలుసుకున్నారు. తరువాత శత్రుఘ్నుడు లక్ష్మణుని కలసుకున్నాడు. వియోగ దుఃఖము దూరమయిపోయింది. మరల శత్రుఘ్నుని సహితంగా భరతుడు సీత పాదాలవద్ద తలవుంచి ఎంతో సుఖాన్ని పొందాడు.

ప్రభువు దర్శనంతో అందరూ సంతోషించారు. వియోగ దుఃఖాలన్నీ దూరమయిపోయాయి. ప్రజలు ప్రేమ ఎక్కువై వ్యాకులంగా వుండడంచూచి ఖరునిశత్రువు కృపాళువు ఒక విలాసం చేశాడు.

ఆ సమయంలో శ్రీరామచంద్రుడు లెక్కలేనన్ని రూపాలు చూపి, అందరితో కలిశాడు. దయాదృష్టితో శ్రీరామచంద్రుడు స్త్రీ పురుషులందరివైపు చూచి వారి శోకాలను దూరం చేశాడు.

క్షణంలో భగవంతుడు అందరిని కలిశాడు. పార్వతీ! ఈ రహస్యమెవ్వరికి తెలియదు. ఈ విధంగా అందరిని సుఖపెట్టి, శీల, గుణాలకు నిధి అయిన శ్రీరామచంద్రుడు ముందుకెళ్ళాడు. కౌసల్యాది తల్లులు, అపుడే ఈనిన ఆవులు దూడలకొరకు ఆత్రంగా చూచినట్లుగా రాముని కోసం చూస్తున్నారు.

సాయంకాల సమయంలో నగరంవైపు పొదుగులలోని పాలు కారుస్తూ, ఆవులు అరుస్తూ పరుగెత్తుకు వస్తున్నాయి. ప్రభువు ఎంతో ప్రేమతో తల్లులందరిని కలసి మధురవచనాలు చెప్పాడు. వియోగం వలన ఏర్పడిన ఆపదలన్నీ దూరమయిపోయాయి. తల్లులందరు

ఎంతో సుఖాన్ని పొందారు.

శ్రీరామచంద్రుని పాదాలయందు ప్రేమవున్నవాడని తెలిసిన తన పుత్రుడు లక్ష్మణుని సుమిత్ర కలసింది. శ్రీరాముని కలుస్తూ కైకేయి మనస్సులో సందేహించింది.

లక్ష్మణుడు తల్లులందరిని కలసి, ఆశీర్వాదాలు పొంది సంతోషించాడు. కైకేయిని మాటిమాటికి కలిశాడు. కాని ఆమె మనస్సులోని బాధ తగ్గలేదు.

సీత అత్తలను కలసి, వారి పాదాలను పట్టుకొని ఎంతో సంతోషించింది. అత్తలందరు కుశల సమాచారాలడిగి, "నీవు ఎల్లప్పుడు సౌభాగ్యవతిగా వుండు" అని ఆశీర్వదించారు.

తల్లులందరు శ్రీరామచంద్రుని ముఖారవిందాన్ని చూచి శుభసమయమని గ్రహించి కళ్ళంట వచ్చు నీళ్ళను ఆపుతున్నారు. బంగారు పళ్ళేలతో హారతి యిచ్చి మాటిమాటికి ప్రభువు శరీరాన్ని చూస్తున్నారు.

వారు రకరకాలుగా దిష్టులు తీసి హృదయాలను తృప్తి పరచుకుంటున్నారు. కౌసల్య మాటిమాటికి దయాసాగరుడు, రణధీరుడయిన శ్రీరాముని చూస్తున్నది. మాటిమాటికి ఆమె "ఈయన లంకాపతి రావణుని ఎలా చంపాడు? నా యిద్దరు బిడ్డలు చాలా సున్నితమైనవారు, రాక్షస యోధులు, ఎంతో బలవంతులు, వారిని వీరు ఎలా చంపారు?" అని ఆలోచిస్తున్నది.

సీతాలక్ష్మణ సహితంగా ప్రభువును శ్రీరామచంద్రుని తల్లి చూస్తున్నది. ఆమె మనస్సు పరమానందంలో మునిగిపోయింది. ఆమె శరీరం మాటిమాటికి పులకించిపోతున్నది.

లంకాపతి విభీషణుడు, సుగ్రీవుడు, నీలుడు, జాంబవంతుడు, అంగదుడు, హనుమంతుడు మొదలైన ఉత్తమ స్వభావులైన

వీరులు, బలవంతులైన వానరులందరు అందమైన మనుష్య రూపాలు ధరించారు. వారందరు ఆదరంగా బాలా ప్రేమతో భరతుని ప్రేమ వ్రతాన్ని వర్ణిస్తున్నారు, నగర ప్రజల ప్రభువు పాదాలయందు ప్రేమను చూచి వారిని పొగడుతున్నారు.

శ్రీరామచంద్రుడు సఖులందరిని పిలిచి "మునుల పాదాలకు నమస్కరించండి. ఈయన మనకు పూజ్యులైన కులగురువు వసిష్ఠ మహర్షి, ఈయన దయవల్లనే రాక్షసులు యుద్ధంలో చనిపోయారు" అని చెప్పాడు.

తరువాత గురువుతో ""మునీశ్వరా! వీరందరు నా సఖులు. యుద్ధరూపమైన సముద్రంలో నాకు ఓడలలాగా ఉపయోగపడ్డారు. నా మేలుకొరకు వారెంతో నష్టకష్టాలు పడ్డారు. నాకు వీరు భరతుని కంటే ప్రియులు" అన్నాడు శ్రీరామచంద్రుడు.

ప్రభువు మాటలు విని అందరు ప్రేమతో పరవశించిపోయారు. క్షణక్షణం వారికి క్రొత్త సుఖాలు అనుభవంలోకి వచ్చాయి.

తరువాత ఆ సఖులు కౌసల్య పాదాలవద్ద తలలు వంచారు. కౌసల్య సంతోషంగా వారిని ఆశీర్వదించి-"మీరు నాకు రఘు నాథునితో సమానమైనవారు" అంది.

శ్రీరాముడు రాజభవనానికి వెళ్ళాడు, పూలవర్షంతో ఆకాశం నిండి పోయింది. నగరంలోని స్త్రీ పురుషుల గుంపులు మేడలమీద ఎక్కి [illegible] న్నారు.

అనేక రకాల బంగారు పాత్రలు అలంకరించి అందరు తమ తమ ద్వారాల వద్ద వుంచారు. అందరు శుభం కొరకు తోరణాలు, జండాలు కట్టారు.

వీధులన్నీ సుగంధ జలాలతో చల్లబడ్డాయి. ఏనుగు దంతాల నగిషీలు ఏర్పరచి రహదారులను అనేక రకాలుగా అలంకరించారు,

ఆనందంగా అనేక వాయిద్యాలు వాయిస్తున్నారు.

అక్కడక్కడ స్త్రీలు దిష్టు దిగదుడుస్తున్నారు. మనస్సులో ఆనందంగా ఆశీర్వదిస్తున్నారు. బంగారు పళ్ళాల్లో హారతులు ఇచ్చి స్త్రీలు మనోహరమైన గీతాలు గానం చేస్తున్నారు.

ఆ రఘువంశ రూపమైన కమలవనానికి సూర్యుడు దుఃఖాలను దూరము చేయువాడైన శ్రీరామచంద్రునకు హారతులు యిస్తున్నారు. అయోధ్య అందం, సంపదలు, ఆనందాలను వేదాలు; శేషుడు, సరస్వతి వర్ణించగల్గుతారు. కాని ఈయన చరిత్రను చూచి వారు చిత్తయిపోతారు. "పార్వతీ! అలాంటపుడు ఆయన గుణాలను మనుష్యులెలా వర్ణించగల్గుతారు? స్త్రీల రూపమైన తెల్లకలువలు అయోధ్య రూపమైన సరోవరంలో వియోగరూపమైన సూర్యుడస్తమించినందున శ్రీరామచంద్ర రూపమైన చంద్రుని చూచి వికసించాయి.

అనేక విధాలైన శుభశకునాలవుతున్నాయి. ఆకాశంలో బాకాలు మ్రోగుతున్నాయి, నగరంలోని స్త్రీ, పురుషులందరు రాముని రాకకి సంతోషించి ఆయన రాజభవనానికి వెళ్ళారు.

మహాదేవుడంటున్నాడు– "పార్వతీ! తల్లి కైకేయి సిగ్గుతో కుమిలిపోతూ వుందని తెలిసికొన్న ప్రభువు మొట్టమొదటగా ఆమె భవనంలోకే వెళ్ళి, ఆమెకు నచ్చచెప్పి సుఖం కలిగించాడు. తరువాత ప్రభువు తన భవనానికి వెళ్ళాడు.

కృపాసింధు రామచంద్రుడు తన భవనంలోకి వెళ్లినపుడు నగరంలోని స్త్రీ పురుషులందరు సుఖమనుభవించారు. గురువసిష్ఠుడు బ్రాహ్మణులను పిలిపించి–"ఈ రోజు శుభఘడియ, సుఖాన్ని కలిగించేది బ్రాహ్మణులయిన మీరందరు, శ్రీరామచంద్రుడు సింహాసనంమీద కూర్చోడానికి ఆనందంగా ఆజ్ఞ ఇవ్వండి, ముని మాటలు వినగానే బ్రాహ్మణులకు చాలా తృప్తి కలిగి, అనేకమంది బ్రాహ్మ

ఋలు- "శ్రీరాముని అభిషేకము ప్రపంచాన్ని ఆనందపరవేది, మునీశ్వరా! మీరు ఆలశ్యము చేయకండి. శ్రీరామునికి రాజ్యాభిషేకం చేయండి" అన్నారు.

అప్పుడు ముని సుమంతునితో చెప్పాడు. ఆయన సంతోషంగా వెళ్లాడు. అనేక రథాలను, ఏనుగులను, గుర్రాలను సిద్ధం చేశాడు, కొన్ని చోట్లకు దూతలను పంపి మంగళ ద్రవ్యాలను తెప్పించినాడు.

అయోధ్యను చాలా బాగా అలంకరించారు. దేవతలు పుష్ప వర్షం కురిపించారు. "మీరు వెళ్ళి మొదట మా స్నేహితులను స్నానం చేయించండి" అని శ్రీరామచంద్రుడు సేవకులను పిలిచి ఆజ్ఞాపించాడు.

శ్రీరామచంద్రుని ఆజ్ఞప్రకారము సేవకులు ఎవరి పనులకు వాళ్ళు పరుగెత్తుకుంటూ వెళ్ళి సుగ్రీవుడు మొదలైన సఖులను స్నానాలు చేయించారు. శ్రీరాముడు భరతుని పిలిచి, తన చేతులతో ఆయన జడలను చక్కచేశాడు, ఆ తరువాత శ్రీరామచంద్రుడు ముగ్గురు తమ్ములను స్నానం చేయించాడు. భరతుని అదృష్టాన్ని, ప్రభువు కోమలత్వాన్ని వర్ణించాలంటే అర్బుదాల శేషుల వల్లకూడా కాదు.

శ్రీరామచంద్రుడు తన జడలను విప్పి, గురువుగారి ఆజ్ఞ ప్రకారము స్నానంచేసి, అలంకరించుకున్నాడు. ఆయన శరీరాంగాల శోభను చూచి కోట్ల మన్మదులు సిగ్గు పడ్డారు.

అత్తలు ఆదరంగా సీతను స్నానం చేయించారు. ఆమెకు ఒంటి నిండా భూషణాలు తొడిగారు.

శ్రీరామునకు ఎడమభాగాన లక్ష్మీరూపంలో వున్న, గుణనిధి జానకి వెలిగిపోతున్నది. ఆమెను చూచి తల్లులందరు తమ జన్మలు సఫలమయినాయని సంతోషించారు.

కాగభుశుండి అంది–"గరుడా! విను, ఆ సమయంలో బ్రహ్మ, శివుడు, మునుల సమూహం, దేవతలందరు విమానం మీద ఎక్కి ఆనందనిధి ప్రభు దర్శనం చేసికోవాలని వచ్చారు.

ప్రభువును చూచి ముని మనస్సులో ప్రేమనిండిపోయింది, ఆయన వెంటనే దివ్యమైన సింహాసనం తెప్పించాడు. దాని తేజస్సు సూర్యుని తేజస్సులాగా వుంది. శ్రీరామచంద్రుడు బ్రాహ్మణులకు నమస్కరించి దానిమీద కూచున్నాడు.

శ్రీరాముడు జానకి సహితంగా సింహాసనం మీద కూచోవడం చూచి మునులు చాలా సంతోషించారు. ఆ సమయంలో బ్రాహ్మణులు వేదమంత్రాలు చదివారు, ఆకాశంలో దేవతలు, మునులు జయ జయ కారాలు పలికారు.

బ్రాహ్మణులు రాజ్యాభిషేకం చేయడానికి అజ్ఞ యిచ్చారు. మొదట వసిష్ఠ ముని రాజ్యాభిషేకం చేశాడు. పుత్రుడు రాజసింహాసనం మీద కూచోవడం చూచిన తల్లులు చాలా సంతోషించి, ఆయనకు మాటి మాటికి హారతులిచ్చారు. మూడు లోకాలకు నాథుడైన శ్రీరాముని సింహాసనం మీద చూచిన దేవతలు వాయిద్యాలు వాయించారు.

బ్రాహ్మణులకు అనేక రకాల దానాలు యిచ్చారు. యాచకు లందరిని ఏ కొరతలు లేకుండా తృప్తి పరచారు. ఆకాశంలో ఎన్నో వాయిద్యాలు మ్రోగుతున్నాయి. గంధర్వులు, కిన్నరులు పాడుతు న్నారు. అప్సరలు నాట్యాలు చేస్తున్నారు. దేవతలు పరమానం దాన్ని పొందారు. భరతుడు మొదలైన తమ్ములు, విభీషణుడు, అంగ దుడు, హనుమంతుడు మొదలైన వారు గొడుగులు, విసనకర్రలు, పంఖాలు, కత్తులు, ఢాళ్ళు, శక్తులు మొదలైనవి పట్టుకొని శోభాయ మానంగా ఉన్నారు.

సీతతోసహా సూర్యవంశ భూషణుడు, శ్రీరామచంద్రుడు అనేక

మంది కామదేవుల అందాన్ని మించి శోభిస్తున్నాడు. క్రొత్తగా జలము నింపుకొని వున్న మేఘంలాగా వామనఛాయ శరీరం మీద పీతాంబరము దేవతల మనస్సులను కూడా ఆకట్టుకొంటూ వుంది. కిరీటము, భుజకీర్తులు, విచిత్రమైన ఎన్నో ఆభరణాలు ఒళ్ళంతా అలంకరించి ఉన్నాయి. కమలాల్లాంటి కళ్ళు, వెడల్పైన రొమ్ము, పొడవైనచేతులు ఇలాంటి వాని దర్శనం చేసికున్న వారు ధన్యులు.

"పక్షిరాజా! ఆ శోభను, ఆ సమాజాన్ని, ఆ సుఖాలను గురించి చెప్పడం నా చేతకాదు. సరస్వతీ, వేదాలు, శేషుడు ఎల్లప్పుడు వాటిని వర్ణిస్తూనే వున్నారు. ఆ రసానందం శివుడే ఎరుగును."

దేవతలందరు వేరువేరుగా స్తుతించి, తమతమ లోకాలకు వెళ్ళిపోయారు. అప్పుడు నాలుగు వేదాలు భట్రాజుల వేషలతో శ్రీరాముడున్న చోటుకు వచ్చాయి. సర్వజ్ఞుడైన ప్రభువు వాటిని గుర్తించి,ఆదరించాడు. ఈ రహస్యమెవ్వరికీ తెలియదు. వేదాలు గుణాలను గానం చేస్తున్నాయి.

సగుణ, నిర్గుణ రూపుడవు, అనుపమ సౌందర్యంతో కూడిన వాడవు, రాజులలో శ్రేష్ఠుడవయిన రామా! మీకు జయమగుగాక. మీరు రావణుడు మొదలైన బలవంతులను, దుష్టరాక్షసులను మీ భుజబలంతో చంపారు. మీరు మానవావతారమెత్తి సంసార భారాన్ని తగ్గించి, అన్నిటికంటే మించిన బాధలను దూరం చేశారు. శరణాగతపాలకా! మీకు –జయమగుగాక. మేము శక్తి సహితంగా మీకు నమస్కరిస్తున్నాము.

హరీ! మీ కఠినమాయావశులైన దేవతలు, అసురులు,నాగులు, మనుష్యులు, జడచేతనాలు అన్ని సంసారమార్గంలో పడి కర్మ, గుణాలతో నిండి రాత్రింబవళ్ళు పుడుతూ, చస్తూ ఉన్నారు. నాథా! మీరు

దయ చూపిన వారు మాత్రము మూడు రకాల దుఃఖాలనుండి తప్పిం చుకోగలిగారు. సంసారసంబంధమైన, జననమరణ దుఃఖాలను దూరం చేయడంలో సమర్థుడవయిన శ్రీరామచంద్రా! మీరు మమ్మ రక్షిం చండి, మేము మీకు నమస్కారం చేస్తున్నాం.

ఓ, హరి, భగవంతుడా! ప్రాణులు తమ జ్ఞానాభిమానంతో విర్ర వీగుతూ సంసారం నుండి దూరం అపుటకు వీలుకలిగించే మీయందు భక్తిని ఆదరించకపోవడం చేత, దేవతలకు కూడా అసాధ్యమైన పద వులు పొంది కూడా తలక్రిందులుగా క్రిందపడిపోతున్నారు. మీయందు విశ్వాసముంచి, ఆశలన్నింటిని వదలి, మీ దాసులయిన వారు, కేవల ము మీ పేరును మాత్రము జపించి, ఏ పరిశ్రమ లేకుండానే భవ సాగర బాధలనుండి విముక్తులయి పోతున్నారు. నాధా! అలాంటి మిమ్మ మేము తలచుకుంటున్నాము.

మీ చరణాలను, శివుడు, బ్రహ్మ పూజిస్తున్నారు. మీ పాద ధూళి తగులగానే గౌతమ ఋషి భార్య అహల్య మనిషయి, ముక్తిని పొందింది. మీ చరణముల గోళ్ళ నుండి, మునుల ద్వారా, మూడు లోకాలను పవిత్ర పరచు గంగానది పుట్టింది. మీ పాదాల యందు ధ్వజము, వజ్రము, అంకుశము,కమలము మొదలైన గుర్తులున్నాయి. వనాల్లో తిరిగే సమయంలో మీ కాళ్ళల్లో ముళ్ళు గుచ్చుకున్న గుం టలు వున్నాయి. రామా! రమాపతీ! ఆ రెండు పాదకమలాలకు మేము భజనలు, పూజలు చేస్తున్నాము.

మీరు సంసారరూపమైన వృక్షము. దాని వ్రేళ్ళు జడము, కన పడని మాయ. అది అనాది. దానికి ఆరు ప్రమానులు, ఇరవై అయిదు కొమ్మలు అనేకమైన ఆకులు; పూలు. దానికి రెండు రకాలైన చేదు, తీపి ఫలాలున్నాయి. దానిమీద. దానినే ఆశ్రయించుకొని వున్న ఒక తీగె వుంది. దాని నుండి ప్రతిరోజు క్రొత్త ఆకులు, పూలు బయటకు

వస్తూ వున్నాయి. వీటన్నింటికి మూలమైన మీకు నమస్కారం చేస్తు న్నాము.

శ్రీరామచంద్రా! "బ్రహ్మకు పుట్టుక లేదు, అనుభవం ద్వారా తెలిసికోడానికి వీలున్నవారు, మనస్సుకు అంతుచిక్కనివాడు, అతన్ని గురించి ధ్యానం మాత్రం చేయడానికి వీలుంది" అంటున్నారు కొందరు. నాథా! మాకు మీ సగుణ కీర్తినే దయచేయండి. దానినే మేము పూజించుకొని, గానం చేసికుంటాము, పాడుకుంటాము. దేవా! మన సా, వాచా, కర్మణా వికారాలను వదిలేసి, మీ పాదాల యందు మాకు ప్రేమ ఉండు మార్గము చూపించు.

అందరిని చూస్తూ వేదాలు, శ్రీరామచంద్రుని స్తుతించి, కన బడకుండా బ్రహ్మలోకానికి వెళ్ళిపోయాయి.

గరుడా! విను. శ్రీరాముడున్న చోటుకు శివుడు వచ్చి, పులకిత శరీరుడై గద్గద స్వరంతో స్తుతిస్తున్నాడు.

లక్ష్మీకాంతా! రామా! మీకు జయమగుగాక. మీరు సంసా రంలోని పాపాలను దూరంచేసేవారు, భయంతో వ్యాకుల పడేవారికి రక్షకులు. నన్ను రక్షించండి. మీరు పది తలలు, ఇరవై భుజాలు గల రావణుని చంపి భూమిమీదనున్న పెద్దరోగాన్ని నయం చేశారు. కష్టాలన్నీ తొలగించారు. రాక్షసరూపమైన భవనాలు, మీ బాణరూపాలైన ప్రచండమైన అగ్నిజ్వాలలతో మండి బూడిదయి పోయాయి.

మీరు భూమండలానికి ఎంతో అందమైన ఆభూషణం. మీరు శ్రేష్ఠమైన ధనస్సు, బాణాలు, అంబులపొది దగ్గరుంచుకు న్నారు. మదము, మోహము, మమతా రూపమైన చీకటి రాత్రి అంధ కారాన్ని దూరం చేయడానికి, మీరు గొప్ప వెలుగుతో కూడిన సూర్యులు. కామదేవరూపుడైన వేటగాడు, లేళ్ళ హృదయాల్లోని

చెడ్డభోగాల రూపమైన బాణాలతో కొట్టి వాటిని పడగొట్టేశాడు. నాథా! విషయరూపమైన వనంలో తప్పిపోతున్నవారిని అదుపుతో వుంచి, ఆ అనాథలను రక్షించండి.

ప్రజలు అనేక రోగాలతో, వియోగాలతో బాధలుపడుతున్నారు. మీ పాదాలను ఆదరించకపోవడం వల్లనే ఇలాంటి ఫలితాలు తటస్థిస్తూ వున్నాయి. మీ చరణారవిందాలయందు ప్రేమ వుంచని వారు సంసారసాగరంలో పడి కొట్టుకులాడుతున్నారు. మీ పాద కమలాలను ప్రేమించనివారు, ప్రతిరోజూ అతి దీనులుగాను, దుఃఖాలతో కాలం గడుపుతున్నారు. మీ కథను ఆశ్రయించుకొని జీవించేవారిని భక్తులు, భగవానుడు కూడా ఎల్లప్పుడు ప్రేమగా చూచుకుంటూ వుంటారు.

ఎల్లప్పుడు నియమపూర్వకంగాను, ప్రేమతోను, పరిశుద్ధమైన హృదయంతోను, మీ చరణారవిందులను సేవించేవారు· మానావ మానాలను సమంగా చూచుకుంటూ వుంటారు. వారికి రాగాలు, రోగాలు, లోభం, గర్వం, మదం వుండవు. వారికి సంపదలున్నా, లేకపోయినా ఒకే భావంతో వుంటారు. అందుచేతనే మునులు బాధ్య తంతా మీ మీద పెట్టి ఉదాసీనంగా వుంటారు. వారి పనంతా ఎల్లప్పుడు మీ సేవకులుగా వుండి, మీ సేవలు, భజనలు చేయడం మాత్రమే. ఇలా చేసిన భక్తులందరు సుఖంగా భూమిమీద కాల క్షేపం చేస్తున్నారు·

ఇలాంటి మునిజనుల మనస్సుల రూపమైన కమలాలకు తుమ్మెదలాంటివాడా! మహారణధీరా! జయింపశక్యంకాని రఘువీరా! నేను మీ నామాన్ని జపించి, నమస్కరిస్తున్నాను. మీరు సంసార రూపమైన రోగానికి మహా ఔషధానివి. అభిమానానికి శత్రువవు. మీరు గుణ, శీల, కృపకు ముఖ్యస్థానులు. నేను మీకు ఎల్లప్పుడు

నమస్కరిస్తున్నాను. రఘునందనా! మీరు చావు, పుట్టుకలు, సుఖ దుఃఖాలు, రాగద్వేషాలు అను ఘోరమైన జంటలను నాశనం చేయండి. మహీపాలా! దీనులమైన మా వైపు కూడా చూడండి.

శ్రీరంగా! లక్ష్మీపతీ! మీ చరణారవిందాలయందు నాకు నిశ్చలమైన ప్రేమ వుండు వరాన్ని కోరుకుంటున్నాను."

శ్రీరామచంద్రుని గుణాలను వర్ణించి శివుడు ఆనందంగా కైలాసానికి వెళ్ళిపోయాడు. ప్రభువు వానరులకు అన్ని విధాల సుఖమిచ్చు మార్గం చూపాడు.

గరుడా! విను. ఈ కథ పవిత్రము చేసేది. ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, ఆధిదైవిక తాపాలయిన మూడు తాపాలను, భవభయాన్ని నాశనము చేసేది. మహారాజు శ్రీరామచంద్రుని మంగళకరమైన రాజ్యాభిషేక కథను వినగానే మనుష్యునకు వైరాగ్య, జ్ఞానాలు ప్రాప్తిస్తాయి.

మనస్సులో కొన్ని కోర్కెలు పెట్టుకొని ఈ కథను విన్న, గానం చేసిన మనుష్యులు అనేక రకాల సుఖసంపదలు పొందగల్గుతారు. వారు సంసారంలో దేవతలకు కూడా అసాధ్యమయిన సుఖభోగాలనుభవించి వైకుంఠానికి చేరుకుంటారు.

జీవన్ముక్తులు, జ్ఞానులు, కాములు ఈ కథను క్రమంగా వింటే వారుకూడా భక్తి, సంపదలు పొందగల్గుతారు. గరుడా! భయ, దుఃఖాలను దూరంచేసే ఈ కథను నా బుద్ధిని బట్టి వర్ణించాను. వైరాగ్యం, జ్ఞానం, భక్తిని గట్టిపరచు ఈ కథ మోహరూపమైన నదిని దాటడానికి అనుకూలమైన నావలాంటిది. నిత్యము ఎన్నో శుభాలు అయోధ్యా పట్టణంలో జరుగుతూ వుంటాయి. అన్ని జాతుల వారు ఆనందంగా ఇక్కడ వుంటున్నారు.

శివుడు, దేవతలు, మునులు, బ్రహ్మ ప్రతిరోజు శ్రీరామ

చంద్రుని పాదాలయందు ప్రేమ వుంచుతున్నారు, ఆ శ్రీరామ చంద్రుని పాదాలయందు ప్రజలందరికి ప్రేమ వుంది. బిచ్చ గాండ్లకు అనేక రకాల వస్త్రాలు ధరింప జేశారు, బ్రాహ్మణులు అనేక దానాలు పొందారు.

వానరులందరు బ్రహ్మానందంలో మునిగి వున్నారు, ప్రభు పాదాలయందు అందరికి ప్రేమ వుంది. రాత్రింబవళ్ళు గడచి పోవడం ఎవరికీ తెలియడంలేదు. మాటల్లోనే ఆరునెలలు గడిచి పోయాయి.

అందరు తమ తమ కుటుంబాలను మరచిపోయారు. కలలో కూడా ఎవ్వరికి తమ యిండ్లు జ్ఞాపకం లేవు. అప్పుడు శ్రీరామ చంద్రుడు సఖులందరిని పిలిచాడు. అందరు వచ్చి తలలు వంచి నమస్కరించారు.

శ్రీరామచంద్రుడు అందరిని ఎంతో ప్రేమతో తన వద్ద కూచోబెట్టుకుని-"మీరందరు నాకు చాలా సేవలు చేసారు. ఆ సేవ లను మీ ముందు ఎలా చెప్పగలను? మీరు నా పని కొరకు ఇళ్ళ, వాకిళ్ళ, సుఖాలన్నీ వదిలేశారు. మీరందరు నాకు ప్రియాతి ప్రియులు. తమ్ములు. రాజ్యము, సంపదలు, జానకి, ఈ శరీరం, ఇళ్ళ, పరివారము, మిత్రులు అయిన వారందరు మీకు సాటివచ్చు వారు కారు, నేను అబద్ధాలు చెప్పడంలేదు. ఇది నా శపథము సేవకులందరికి ప్రియముగానే వుండడమనేది నీతి. అయినా నాకు మాత్రము దాసులంటే ప్రత్యేకమైన ప్రేమ వుంటుంది.

సఖులారా! ఇక మీరందరు మీ ఇళ్ళకు వెళ్ళండి. అక్కడ దృఢమైన నియమంతో నన్ను భజిస్తూ వుండండి. నన్ను ఎల్లప్పడు సర్వవ్యాపకుడనని, అందరికి మేలు చేయువాడనని అనుకుంటూ ఎక్కువ ప్రేమ నాయందు వుంచండి" అన్నాడు.

ప్రభువు మాటలు విని అందరు ప్రేమలో నిమగ్నులై పోయారు. "మేము ఎవరు? ఎక్కడున్నాము?" అను జ్ఞాపకశక్తి కూడా తగ్గిపోయింది. చేతులు జోడించి, ఎదురుగా వున్న శ్రీరామ చంద్రుని కన్నార్పకుండా చూస్తూనే వుండిపోయారు. అతి ప్రేమ చేత బదులు చెప్పలేకపోయారు.

ప్రభువు వారి మిక్కుట ప్రేమను చూచి, వారికి అనేక రకాల జ్ఞానాన్ని విశేషంగా ఉపదేశించాడు. వారు ప్రభువు ముందు ఏమీ మాట్లాడలేకపోయారు. మాటిమాటికి పాదాలవైపు చూస్తున్నారు. అప్పుడు ప్రభువు రంగు రంగుల, విలక్షణమైన ఆభూషణాలు, వస్త్రాలు తెప్పించాడు. మొదట సుగ్రీవునకు భరతుడు తన చేతులతో వస్త్రభూషణాలు ధరింపజేశాడు.

ప్రభువు ఆజ్ఞ ప్రకారము లక్ష్మణుడు విభీషణునకు ఆ భూషణాలు అలంకరించాడు. రఘునాథునకు ఆ అలంకారాలు నచ్చాయి. అంగదుడు కూచుని యున్నాడు. తన స్థానం నుండి తొలగలేదు. అతని ప్రేమను చూచి ప్రభువు అతన్ని పిలిచాడు. జాంబవంత, నీల మొదలైన వారందరికి ప్రభువు వస్త్రాభూషణాలు అలంకరింపజేశాడు. వారందరు శ్రీరామచంద్రుని స్వరూపాన్ని తమతమ హృదయాల్లో ఉంచుకొని, పాదపద్మాలకు తలలు వంచి నమస్కరించి వెళ్ళారు.

అప్పుడు అంగదుడు లేచి, తలవంచి, కళ్ళంట నీళ్ళు పెట్టుకొని చేతులు జోడించి వినయంగా, ప్రేమరసంలో ముంచిన మాటలు మాట్లాడాడా, అన్నట్లుగా అన్నాడు-

"సర్వజ్ఞా! దయాసాగరా! దీనులయందు దయచూపువాడా! శరణాగత రక్షకా! నాథా! చనిపోయేటప్పుడు నా తండ్రి వాలి నన్ను మీ ఒడిలోనే ఉంచిపోయాడు. ప్రభూ! మీరు మీ అశరణ శరణ యశస్సులను విచారించి, నన్ను వదలి వేయకండి, నాకు గురువు,

తండ్రి, తల్లి అందరూ మీరే, మీ పాదకమలాలను వదలి నేనెక్కడికి పోయేది?

మహారాజా! ప్రభువును వదలి ఇంటిలో నా కేమి పని వుంటుంది? మీరే చెప్పండి. నేను బాలకుడను. బుద్ధి, జ్ఞానం, బలం నాలో తక్కువ. నన్ను దీనునిగా తలచి మీ పాదాల వద్ద ఉండనివ్వండి. నేను ఇంట్లో చిన్న పెద్ద సేవలన్నీ చేస్తాను. మీ పాదాలను చూచుకుంటూ, భవసాగరాన్ని దాటిపోతాను."

అంటూ అంగదుడు ప్రభువు పాదాలమీద పడి- ఇక నన్ను ఇంటికి వెళ్ళమని అనకండి."

అంగదుని వినయ వచనాలు విని దయాసాగరుడైన భగవానుడు అతన్ని లేపి హృదయానికి హత్తుకొన్నాడు. ప్రభువు కళ్ళల్లో ఆనంద బాష్పాలు జలజలరాలాయి. ప్రభువు తన మెడలో నున్న మాలను, వస్త్రాలను. ఆ భూషణాలను అంగదునకు ధరింపచేసి, అనేక రకాలుగా తెలియజెప్పి సెలవిచ్చి పంపించాడు.

భక్తుని చేష్టలను తలచుకొని భరతుడు, శత్రుఘ్న లక్ష్మణ సహితంగా ఆయనను సాగనంపి రావడానికి వెళ్ళారు. అంగదుని హృదయంలో తక్కువ ప్రేమలేదు. ఆయన తిరిగి తిరిగి ప్రభువువైపు చూస్తున్నాడు. మాటిమాటికి నమస్కారాలు చేస్తున్నాడు. శ్రీరామచంద్రుడు నన్ను తన వద్ద ఉండి పొమ్మని అంటే బాగుండునని మనస్సులో అనుకుంటున్నాడు. ఆయన రామచంద్రుని చూడ్డం, మాట్లాడడం, నవ్వుతూ వుండడం తలచుకొని, మరలా ఆ స్థితి లభించితే బాగుండని ఆలోచిస్తున్నాడు, కాని ప్రభువు పరిస్థితి చూచి, అనేకమైన మంచి మాటలు చెప్పి, తన హృదయంలో భగవంతుని పాదకమలాలను దాచుకుని ఆయన వెళ్ళిపోయాడు. ఆదరంగా వానరులందరిని పంపించి భరతుడు, సోదరులతో సహా తిరిగి వచ్చాడు.

అప్పుడు హనుమంతుడు సుగ్రీవుని కాళ్ళు పట్టుకొని అనేకరకాల వినయాలతో-"దేవా! కొన్ని రోజులు శ్రీరఘునాథుని పాదసేవలుచేసి, తరువాత వచ్చి మీ పాదాలకు సేవలు చేస్తాను." అన్నాడు.

"హనుమా! నీవు పుణ్యాలరాశివి. ఇప్పుడువెళ్ళి కృపానిధి రామచంద్రుని సేవలు చెయ్యి"అంటూ సుగ్రీవుడు వెంటనే వెళ్ళిపోయాడు.

"నేను నీకు చేతులెత్తి నమస్కరిస్తున్నాను. ప్రభువుకు నా నమస్కారాలు చెప్పి, మాటిమాటికి ప్రభువుకు నన్ను జ్ఞాపకం చేస్తూ ఉండు" అని అంగదుడు వెళ్ళిపోయాడు.

హనుమంతుడు తిరిగివచ్చి, అంగదుని ప్రేమను గురించి చెప్పాడు, అది విని ప్రభువు ప్రేమలో మగ్నుడైపోయాడు.

కాగభుశుండి అంటున్నాడు-"గరుడా! శ్రీరాముని మనస్సు వజ్రం కంటే కూడా కఠినమైనది, పూలకంటే అధిక సున్నితమైనది. ఇక చెప్పు, ఆయన ఎవరికి అర్థమవుతాడు?"

దయాసాగరుడయిన శ్రీరామచంద్రుడు నిషాదరాజును పిలచి, కానుకలుగా ఆ భూషణాలు,వస్త్రాలు ఇచ్చి-"ఇక నీవు ఇంటికి వెళ్ళు, నన్ను తలచుకొంటూ వుండు. మనసా, వాచా,కర్మణా ధర్మంప్రకారం నడచుకో.

నీవు నాకు సఖుడవు,భరతునితో సమానమైన సోదరుడవు. అయోధ్యకు ఎల్లప్పుడు వస్తూపోతూ వుండు" అన్నాడు. ఈ మాటలు వినగానే నిషాదరాజుకు చాలా సంతోషమనిపించింది. కళ్ళంట భళభళ నీళ్ళొచ్చాయి. ప్రభువు పాదాలమీదపడి, ప్రభువు పాదపద్మాలను హృదయంలో వుంచుకొని ఇంటికి వచ్చి, కుటుంబీకులకు ప్రభువు స్వభావాన్ని తెలియ పరచాడు శ్రీరామచంద్రుని ఈ చరిత్రను విని అయోధ్యా ప్రజలు మాటిమాటికి, సుఖాలరాశి శ్రీరామచంద్రుడు

ధన్యుడంటున్నారు.

శ్రీరామచంద్రుడు సింహాసనం మీద ఎక్కగానే మూడు లోకాల్లోని వారు సంతోషించారు. వారి దుఃఖాలన్నీ దూరమయిపోయాయి. ఎవరికి ఎవరితో వైరం లేదు. శ్రీరామచంద్రుని దయ వలన అందరి మనస్సులలోని వైషమ్యాలు దూరమయిపోయాయి.

అందరు వర్ణాశ్రమ ధర్మం ప్రకారం వేద మార్గాన నడచుకుంటున్నారు. సుఖ సంతోషాలకు లోటు లేదు. వారికి ఏ విధమైన బాధలు, భయాలు, రోగాలు లేవు.

రామరాజ్యంలో ఎవరికి ఆదిదైవిక, ఆది భౌతిక, ఆధ్యాత్మిక తాపాలు లేవు. అందరు కలసి మెలసి ప్రేమగా బ్రతుకుతున్నారు. వేదాల్లో చెప్పినట్లుగా నీతి, నియమ, ధర్మాలను పాటిస్తున్నారు.

ప్రపంచంలో ధర్మం, నాలుగు పాదాల, పరిపూర్ణరీతిలో వుంది. పాపాలు చేసేవారు లేనే లేరు. స్త్రీ పురుషులందరు శ్రీరాముని భక్తిలో నిమగ్నులై వుంటున్నారు. అందరు ముక్తికి అధికారులై వున్నారు.

అకాలంలో మృత్యువులు లేవు బాధలు లేవు. అందరు ఆరోగ్యంగా వున్నారు. కళకళలాడుతున్నారు. దరిద్రులు, దీనులు, దుఃఖితులు, అజ్ఞానులు, శుభలక్షణాలు లేనివారు, లేరు.

అందరు ధర్మపరులు, పుణ్యాత్ములు, నేర్పరులు, గుణవంతులు. పండితులు, జ్ఞానులు, కృతజ్ఞులు, కపటము, దుర్మార్గములు ఎవ్వరిలోనూ లేవు,

గరుడా! ప్రపంచంలో, రామరాజ్యంలో కాలాన్ని, కర్మను, గుణాలను బట్టి ఎవరికి, ఎప్పుడు దుఃఖాలు కలుగడం లేదు. దుఃఖాలను బంధనాలలో ఎవ్వరూ చిక్కుకోవడం లేదు.

అయోధ్యా మహారాజు శ్రీరామచంద్రుడు ఏడు సముద్రాలు చుట్టుకొని వున్న భూమికి ఒకే ఒక రాజు. ఆయన రోమరోమాన అనేక లోకాలున్నాయి. ఆయన అధికారాన్ని, మహిమను వర్ణించడం తేలిక కాదు. ఆయన అధికారాన్ని, మహిమను కించపరచడమే అవుతుంది. ఆయన అధికారాన్ని ఆయన మాత్రమే ఎరుగు. కాని,గరుడా! ఈయన మహిమను తెలిసికున్నవారు, ఆయన చరిత్రను తలచుకొననిదే ఉండ లేరు." ఈ రామ చరిత్రలో ప్రేమ వుండడమే, ఆయనను తెలిసికొన్న దానికి ఫలితమని" ఇంద్రియాలను అదుపులో పెట్టుకోగల్గిన మహా మునులంటున్నారు. రామరాజ్యంలోని సుఖసంపదలను గురించి శేష, సరస్వతులే వర్ణించలేరు.

ఆయన రాజ్యంలో స్త్రీ పురుషులందరు ఉదారులు, పరోప కారులు. అందరు బ్రాహ్మణుల పాదసేవకులు. అందరు ఏకపత్నీ వ్రతులు. స్త్రీలు కూడా మనసా, వాచా, కర్మలతో తమ భర్తల మేలు ను కోరేవారు.

శ్రీరాముని రాజ్యంలో దండన కేవలం సన్న్యాసుల మునుల ఆధీనంలో వుండేది. 'జయము' అను శబ్దప్రయోగము కేవలం మన స్సును జయించడానికి మాత్రమే చేస్తున్నారు. రామరాజ్యంలో'జయ' మనే శబ్దానికి మరొక అర్థం లేదు.

వనాల్లో వృక్షాలు ఎల్లప్పుడూ పూస్తూ కాస్తూ, వున్నాయి. ఏనుగులు, సింహాలు వైరాలు వదలి, ఒక రేవులో నీళ్ళు త్రాగు తున్నాయి. ఒకే చోట నివసిస్తున్నాయి. పశుపక్షులు స్వాభావిక వైరాలు మరచిపోయి, కలసి మెలసి ప్రేమగా బ్రతుకుతున్నాయి.

అనేక రకాల పశుపక్షుల గుంపులు కూస్తూ, అరుస్తూ శబ్దాలు చేస్తూ వనాల్లో నిర్భయంగా తిరుగుతూన్నాయి. శీతల, మంద, సుగంధిత వాయువులు వీస్తున్నాయి. తుమ్మెదలు పూలరసాన్ని త్రాగి

ఝుంకారము చేస్తున్నాయి. తీగెలు, వృక్షాలు కోరగానే మధువును కారుస్తున్నాయి. గోవులు తృప్తిగా పాలిస్తున్నాయి. భూమి ఎల్లప్పుడు పంటపైరులతో పచ్చగా కళకళలాడుతూ వుంది. ఆ సమయంలో, కృతయుగంలోని విషయాలన్నీ త్రేతాయుగంలోకి ప్రవేశించాయా అన్నట్లుంది.

ప్రపంచానికి ఆత్మ అయిన భగవంతుని ప్రపంచానికి రాజని అనుకొన్న పర్వతాలు అనేక రకాల మణుల గనులను తెచ్చి ముందుంచాయి. నదులన్నింటిలో చల్లని, నిర్మలమైన, రుచికరమైన సుఖాన్ని కలిగించే తియ్యని నీళ్ళు ప్రవహిస్తున్నాయి.

సముద్రము తన హద్దయిన చెలియలి కట్టను దాటడంలేదు. అవి అలల ద్వారా తమ గట్టు మీద రత్నాలు పడేస్తున్నాయి. వాటిని మనుష్యులు తెచ్చుకుంటున్నారు. చెరువులన్నీ కమలాలతో నిండి వున్నాయి. పది దిక్కులు చాలా సుఖసంతోషాలతో శోభిల్లుతున్నాయి.

శ్రీరామచంద్రుని రాజ్యంలో చంద్రుడు అమృతంతో సమానమైన కిరణాలతో భూమిని నిండుగా వుంచుతున్నాడు. అవసరమున్నంత వరకే సూర్యుడు వేడిగా వుంటున్నాడు. మేఘాలు కోరినప్పుడల్లా వర్షాలు కురిపిస్తున్నాయి.

రామచంద్రప్రభువు ఎన్నో అశ్వమేధ యాగాలు చేశాడు. బ్రాహ్మణులకు లెక్కలేనన్ని దానాలు చేశాడు. శ్రీరాముడు వేద మర్యాదలను పాటించాడు. ధర్మాన్ని తప్పలేదు. సత్త్వ, రజ, స్తమో గుణాలను దగ్గరకు రానివ్వలేదు. ఇంద్రునిలాగా ఆయనకన్ని భాగాలు చెందుతూ వున్నాయి.

సీత, అందాలగని, శీలవంతురాలు. వినయశీలి, ఎల్లప్పుడు భర్త చరణ కమలాలకు సేవలు చేస్తున్నది.

భవనాల్లో ఎంతో మంది దాస, దాసీలున్నారు. వారంతరు సేవలు చేయడంలో బాగా ఆరితేరినవారే. అయినా సీత తన చేతుల్తో ఇంటిలోని చాకిరీ చేస్తున్నది. శ్రీరాముని ఆజ్ఞ ప్రకారం నడుచుకొంటున్నది.

కృపాసింధు శ్రీరామునకు సుఖంగా వుండే పనులన్నీ సీత చేస్తూ వుంది. ఆమె సేవలు చేయు పద్ధతి బాగా నేర్చుకుంది. ఆమె ఇంటిలో కౌసల్య మొదలైన అత్తలకు సేవలు చేస్తున్నది, మద, అహంకారాలు ఆమెలో ఏ కోశానాలేవు.

"పార్వతీ! జగదాంబ అయిన సీత బ్రహ్మ మొదలైన దేవతల ద్వారా వందనాలందుకుంటూ ఎల్లప్పుడు ఆనందంగా వుంటున్నది.

ఆమె కృపా కటాక్షాన్ని దేవతలు కోరుకుంటున్నారు· కాని, వారి వైపు కన్నెత్తి కూడా చూడడంలేదు. ఆ లక్ష్మియే, ఆ సీతయే తన మహామహిమాన్వితమైన స్వభావాన్ని వదలి శ్రీరామచంద్రుని చరణాలయందున్న ప్రేమను వదలడంలేదు.

సోదరులందరు అనుకూలంగా ఉండి ఆయనకు సేవలు చేస్తున్నారు. శ్రీరాముని చరణాలయందు వారికెంతో ప్రేమ వుంది. కృపాళువు అయిన ప్రభువు ఎప్పుడు, ఏమి ఆజ్ఞ యిస్తాడా, అని వారు శ్రీరామచంద్రుని ముఖ కమలంవైపు కన్నార్పకుండా చూస్తున్నారు.

శ్రీరామచంద్రునకు కూడా తన సోదరులంటే అమితమైన ప్రేమ. వారికి అనేక రకాల నీతులు నేర్పుతున్నారు. నగరంలోని ప్రజలు సంతోషంగా వున్నారు. అందరు దేవతలకు కూడా సాధ్యం కాని సుఖాలను అనుభవిస్తున్నారు.

వారు రాత్రింబవళ్ళు బ్రహ్మకు మ్రొక్కుకుంటున్నారు· శ్రీరామచంద్రుని పాదాలయందు ప్రేమను కోరుకుంటున్నారు. సీతకు ఇద్దరు చక్కని బిడ్డలు లవకుశలు పుట్టారు. వారి కీర్తిని వేద

పురాణాలు గానం చేశాయి.

వారిద్దరు విజయులు వినయ శీలురు, గుణాలకు నిధులు, చాలా అందంగా వుంటారు. వారిని చూస్తే శ్రీహరి నోట్లో నుండి ఊడిపడ్డారా అన్నట్లుంటారు. సోదరులకు కూడా ఇద్దరిద్దరు పుత్రులు కలిగారు. వారందరు రూపవంతులు, శీలవంతులు.

శ్రీరామచంద్రుడు బుద్ధికి, జ్ఞానానికి, వాక్కుకు, ఇంద్రియాలకు అందనివాడు. ఆయనకు పుట్టుకలు లేవు, మనస్సు, మాయ, గుణాలకు కూడా అలవికాని వాడు. ఆయనే సచ్చిదానంద ప్రభువయి, ఉదార బుద్ధితో మనుష్య జన్మనెత్తి అనేక లీలలు చేస్తున్నాడు.

శ్రీరామచంద్రుడు ఉదయాన్నే సరయూ నదిలో స్నానం చేసి, సభలో బ్రాహ్మణుల, సజ్జనులతో కలసి కూర్చుంటాడు. వసిష్ఠుడు వేదపురాణాల్లోని కథలను చెబుతుంటాడు. ప్రభువుకు తెలియని విషయాలేమీ లేకున్నా, ఆయనకూడా వింటుంటాడు.

ఆయన సోదరులతో కలసి భోంచేస్తుంటాడు. వారిని చూచి తల్లులందరు సంతోషిస్తున్నారు. భరత, శత్రుఘ్నులిద్దరు సోదరులు హనుమంతునితో పాటు తోటలోకి వెళ్ళి అక్కడ కూచుని శ్రీరాముని గుణాలను గురించిన కథలను అడుగుతున్నారు. హనుమంతుడు తన బుద్ధినుపయోగించి, భక్తిలో మునిగి చెపుతుంటాడు. ఇద్దరన్నదమ్ములు శ్రీరాముని నిర్మలమైన గుణాలను వింటూ చాలా సుఖాలను అనుభవిస్తూ మాటిమాటికీ అడిగి చెప్పించుకుంటారు.

అందరి ఇండ్లల్లో పురాణాల్లోని పవిత్రమైన రామచరిత్రలను, కథలను అనేక రకాలుగా చెప్పుకుంటున్నారు. స్త్రీ పురుషులందరు శ్రీరామచంద్రుని గుణాలను గానం చేస్తున్నారు. దాంతో రాత్రింబవళ్ళు గడచిపోతున్నట్లుకూడా వారికి తెలియడంలేదు.

ప్రభువు శ్రీరామచంద్రుడు రాజయి అయోధ్యలో నివసిస్తున్నప్పటి నుంచి అక్కడి ప్రజల సుఖసంపదలను వర్ణించడానికి వేల శేషులకు కూడా సాధ్యంకాదు.

నారద, సనక సనందనాది మొదలైన మునీశ్వరులు కోసల రాజు శ్రీరామచంద్రుని దర్శనం కోసం అయోధ్యకు వచ్చి, ఆ దివ్యమైన నగరాన్ని చూచి వైరాగ్యాన్ని మరచిపోతున్నారు. విలువైన బంగారు, మణులతో పొదిగిన మేడలు, వాటిల్లో అనేక రంగుల్లో, రత్నాలతో వెలిగిపోతున్నాయి. పట్టణానికి నలువైపుల అందమైన ప్రహరీలు కట్టబడి వున్నాయి. వాటిమీద బురుజులు రంగురంగులతో తీర్చి కట్టారు. వాటిని చూస్తుంటే నవగ్రహాలు సైన్యంగా ఏర్పడి అమరావతికి వచ్చి చుట్టుకున్నట్లున్నాయి. భూమి మీద అనేక రకాల రంగుల్లో రత్నాల తివాసీలు పరచి వున్నాయి. వాటిని చూడగానే శ్రేష్ఠులైన మునుల మనస్సులు కూడా నాట్యాలు చేస్తున్నాయి.

స్వచ్ఛమైన భవనాలు ఆకాశాన్ని అంటుతున్నాయి. వాటి కలశాలు చంద్ర సూర్యుల కాంతులనుకూడా మించిపోయినవా, అన్నట్లున్నాయి. భవనాల్లో అనేకమైన మణులతో పొదిగిన కిటికీలు కళకళలాడుతున్నాయి. ఇండ్లల్లో మణుల దీపాలు చూడముచ్చటగా వున్నాయి. పగడాలతో ఏర్పరచిన గడపలు మెరిసిపోతున్నాయి. స్తంభాలు మణులతో చెక్కబడి వున్నాయి. మరకతమణులతో, పన్నగాలతో బంగారు గోడలను బ్రహ్మ కట్టాడా అన్నట్లున్నాయి. భవనాలు అందంగాను, పొడవు, వెడల్పు, మనోహరంగాను వున్నాయి. వాటి వరండాలు స్ఫటిక మణులతో ఏర్పరచివున్నాయి. ప్రతి ద్వారం వద్ద బంగారు తలుపులు వున్నాయి. వాటిలో ఎన్నో వజ్రాలు పొదగి వున్నాయి.

ఇంటింటా మనోహరమైన చిత్రశాలలు, వాటిలో శ్రీరామ చంద్రుని చరిత్రలు, చాలా చక్కగా అమర్చి వున్నాయి. వాటిని చూస్తే అవి మునుల మనస్సులను కూడా చంచలపరుస్తున్నాయా అన్నట్లున్నాయి.

పూలతోటలను ప్రజలందరు అనేక రకాల ప్రయత్నాలతో తయారు చేసి వుంచారు. వాటిల్లో అందమైన తీగలు ఎల్లప్పుడు వసంత ఋతువులాగా పూస్తున్నాయి. వాటిమీద తుమ్మెదలు ధ్వనులు చేస్తున్నాయి· మూడు రకాల గాలులు వీస్తున్నాయి. బాలకులు పెంచిన అనేక రకాల పక్షులు తియ్యని పలుకులు పలుకుతూ, ఎగురుతూ వుంటే చూడ ముచ్చటగా వున్నాయి.

నెమళ్ళు, హంసలు బెగ్గురు పక్షులు, పావురాలు, భవనాల మీద కూచుని చాలా అందంగా వున్నాయి. ఆ పక్షులు, అక్కడక్కడ మణులతో తమ నీడలు చూచుకొని అనేకరకాల పలుకులు పలుకుతూ, నాట్యాలు చేస్తున్నాయి.

"రామ, రఘునాథ, భక్త జనపాలకా' అని బాలకులు చిలుకలకు, మైనాలకు నేర్పుతున్నారు. రాజద్వారాలు అన్ని విధాల అందంగా ఉన్నాయి. వీధులు, వీధి కూడలులు శోభాయమానంగా ఉన్నాయి. అక్కడ వస్తువులన్నీ ఉచితంగా లభిస్తున్నాయి. లక్ష్మీపతి శ్రీరాముడున్న చోట సంపదలను ఎంతని చెప్పగలము? కుబేరుల్లాగా వ్యాపారస్థులు, కూచునివున్నారు. అక్కడ స్త్రీలు, పురుషులు, బాలకులు,ముసలివాండ్లు అందరు మంచి నడవడిక గలవారు,సుఖులు అందగాళ్ళు.

పట్టణానికి ఉత్తరంగా నిర్మలమైన నీళ్ళు గల లోతైన సరయూనది ప్రవహిస్తున్నది. అందమైన రేవులు ఏర్పరచి ఉన్నాయి. అంచులలో బురదన్న మాటేలేదు.

కొంచెందూరాన రేవులున్నాయి, అక్కడ ఏనుగులు, గుర్రాలు గుంపులు గుంపులుగా నీళ్ళుత్రాగుతున్నాయి. నీళ్ళు తెచ్చుకోడానికి చాలా అందమైన రేవులు ఆడవాళ్ళకు ఏర్పరచి ఉన్నాయి. అక్కడ పురుషులు స్నానాలు చేయరు.

రాజఘాటు లన్నివిధాలా అందంగా ఉన్నాయి. అక్కడ నాలుగు వర్ణాలవారు స్నానాలు చేస్తున్నారు. అన్నిరేవుల వద్ద దేవ తల మందిరాలు, వాటికి నలువైపులా చక్కని తోటలున్నాయి.

నది ఒడ్డున, అక్కడక్కడ విరక్తులు, జ్ఞానులు, మునులు, సన్న్యాసులు నివసిస్తున్నారు. ఆ మునులందరు ఏర్పరచుకున్న అంద మైన తులసిచెట్లు శోభాయమానంగా ఉన్నాయి.

నగరం వెలుపల కూడా అందాలు చిందుతూన్నాయి. పట్టణా న్ని చూడగానే పాపాలన్నీ పోతున్నాయి. అక్కడ వనాలు, ఉపవనా లు, చిన్న బావులు, చెరువులు కళకళలాడుతున్నాయి. వాటికి ఏర్ప రచిన రత్నాలతో పొదిగిన మెట్లుమెరసిపోతున్నాయి. వాటిల్లోని నిర్మల మైన జలాలను చూచి దేవతలు, మునులు కూడా మోహితులయి పోతున్నారు. చెరువుల్లో అనేక రకాల కమలాలు వికసిస్తున్నాయి. రకరకాల పక్షులు కూస్తున్నాయి· తుమ్మెదలు ఝుంకారం చేస్తు న్నాయి. అందమైన ఆ తోటల్లో కోయిలలు మొదలైన పక్షులు, అందమైన వాటి పలుకులతో బాటసారులను పిలుస్తున్నాయా అన్నట్లుగా వుంది.

భగవంతుడైన శ్రీరామచంద్రుడున్న నగరాన్ని ఎవరు వర్ణించగలరు? అణిమాది సిద్ధులు, సుఖసంపదలు పట్టణంలో అల రారుతున్నవి.

మనుష్యులు, అక్కడక్కడ కూచుని శ్రీరాముని గుణాలను

గానం చేస్తున్నారు. "శరణాగత రక్షకుడు, శీల, శోభ, రూప, గుణా లకు నిధి అయిన శ్రీరాముని భజనలు చేయండ"ని నేర్పుతున్నారు.

"కమలనేత్రుడు, శ్యామల శరీరుడైన ప్రభువును సేవించండి. కంటికి రెప్పల్లాగా తన భక్తులను కాపాడు శ్రీరాముని భజించండి. అందమైన ధనస్సు, బాణాలు, అంబులపొది ధరించిన, భక్తుల రూపంలోని కమలాలకు సూర్యుడు, రణధీరుడయిన శ్రీరాముని భజించండి.

కాలరూపమైన సర్పాల కొరకు గరుడుని సమానమైన శ్రీరా మునికి అన్ని కోర్కెలు, మమతలు వదలి నమస్కరించండి. లోభ, మోహరూపాలైన లేళ్ళ సమూహం కొరకు వేటగాడు, మన్మధుని రూపమైన ఏనుగులతో సమానమైవాడు, భక్తులకు సుఖాలనందించు శ్రీరాముని భజించండి,

సందేహ, దుఃఖరూపాలైన అంధకారాన్ని పోగొట్టే సూర్యుని లాంటి, రాక్షస రూపమయిన దట్టమయిన వనాన్ని భస్మం చేయ డానికి అగ్నిలాంటి శ్రీరాముని భజించండి. జానకీ సహితంగా శ్రీరామచంద్రుని, భవభయాలను దూరంచేసే వానిని ఎందుకు భజించరు?

అనేక రకాల కోర్కెల రూపాలయిన దోమల కొరకు మంచు లాంటివాడు సదా ఒకే విధంగా వుండేవాడు, పుట్టుక, నాశనం లేని వాడు అయిన శ్రీరామచంద్రుని భజించండి. మునులకు ఆనందాన్ని ప్రసాదించేవాడు, భూభారాన్ని తగ్గించేవాడు, తులసీదాసుకు స్వామి, ఉదారుడయిన శ్రీరాముని భజించండి" అని అయోధ్య నగర వాసులు అనేక రకాలుగా శ్రీరాముని గుణాలను గానం చేస్తున్నారు.

కాగభుశుండి అంటున్నాడు—"గరుడా! శ్రీరామచంద్ర ప్రతాప రూపమైన, అతి ప్రబలమైన సూర్యోదయమయినప్పటి నుండి, మూడు

లోకాల్లో వెలుగు వ్యాపించింది. కాని దీనివలన కొందరికి ఎన్నో సుఖాలు మరి కొందరికి ఎన్నో దుఃఖాలు లంకించుకొన్నాయి. దుఃఖాలు కలిగినవారిని వివరిస్తున్నాను.

మొదట అవిద్యా రూపమయిన రాత్రి నష్ట పోయింది. పాప రూపాలైన గుడ్లగూబలు ఎక్కడివక్కడ దాక్కున్నాయి. కామ, క్రోధ రూపాలయిన కుముదాలు వాడిపోయాయి. ఈర్ష్య, అభిమానం, మోహం, మదరూపాలైన కళలు ఏ దొంగకు నచ్చడంలేదు.

ధర్మరూపమయిన చెరువుల్లో, జ్ఞానవిజ్ఞాన రూపాలైన అనేక రకాల కమలాలు వికసించాయి. సుఖ, సంతోష, వైరాగ్యం, వివేక రూపాలైన చక్రవాకాల శోకాలు దూరమయి పోయాయి. ఈ శ్రీరామ చంద్రరూపమయిన సూర్యుని ప్రకాశం పడిన మనుష్యునిలో వెలుగులు మిక్కుటమయిపోతున్నాయి. దోషాలునాశనమయిపోతున్నాయి.

ఒకసారి శ్రీరామచంద్రుడు సోదరులతోసహా, ప్రియ హనుమంతుని వెంటబెట్టుకొని, అందమయిన తోటలు చూడ్డానికి వెళ్ళాడు. అక్కడ వృక్షాలన్నీ పూచి, క్రొత్త ఆకులు తొడుక్కొని వున్నాయి. శుభసమయం అనుకొని అక్కడకు చాలా తేజోవంతులు, గుణవంతులు, శీలవంతులు, బ్రహ్మానందంలో మునిగి యుండే సనకాది మునులు వచ్చారు. చూడ్డానికి వారు బాలకులేగాని, వారు అతి ప్రాచీనులు. వారిని చూస్తుంటే నాలుగువేదాలు శరీరాలు ధరించి వచ్చాయా అన్నట్లున్నారు. వారు సమదర్శులు, భేదాలులేని వారు. వారి వస్త్రాలు దిక్కులు, శ్రీరామచరిత్రకు సంబంధించి కథలు చెప్పే చోటుకు వెళ్ళి ఆ కథలను వినడం ఒక్కటే వారి వ్యసనం.

"భవానీ! జ్ఞాని, మునీశ్వరులున్న చోటుకు, సనకాది మునులు వెళ్ళారు. శ్రేష్ఠులైన ఆ మునులు శ్రీరామ కథలెన్నో వర్ణించారు. అవి జ్ఞానాన్ని పెంచడంలో, అగ్నిని పెంచడానికి ఆజ్యంలాగా

సమర్ధమైనవి.

శ్రీరామచంద్రుడు సనకాది మునులు రావడం చూచి సంతోషంగా నమస్కారంచేసి, కుశల క్షేమాలడిగి, కూచోడానికి తన పీతాంబరము పరచాడు. ముగ్గురు సోదరులు హనుమంతునితో సహా నమస్కారాలు చేశారు. శ్రీరామచంద్రుని అమితమైన శోభను చూచి మునుల మనస్సులు సంతోషంతో పులకించాయి. ఆయనను చూడటంలోనే నిమగ్నులయి పోయారు.

వారు శ్యామ సుందరుని, కమల నేత్రుని, అందాలకు నిధి, భవబంధనాల నుండి దూరం చేయు ప్రభువు రూపాన్ని అలాగే కన్నార్పకుండా చూస్తున్నారు. ప్రభువుకు రెండు చేతులు జోడించి తలలు వంచుతున్నారు.

వారి పరిస్థితులను చూచి శ్రీరామచంద్రుని కళ్ళంట నీళ్ళొచ్చాయి. శరీరం పులకించిపోయింది. ప్రభువు వారి చేతులు పట్టుకొని మునులను కూచోబెట్టి అతి మనోహరంగా– "మునీశ్వరులారా! ఈ రోజు నేను ధన్యుడనయిపోయాను. మీ దర్శనం వలన పాపాలన్నీ పటాపంచలై పోయాయి. మంచివారితో కలయిక అదృష్టముంటేగాని లభించదు. ఏ శ్రమ చేయకుండానే చావుపుట్టుకల జంజాటం లేకుండా పోతుంది.

భక్తుల కలయిక మోక్షానికి, కాముకుల కలయిక చావుపుట్టుకలకు మార్గమవుతుంది. మహాభక్తులు, కవులు, పండితులు, వేదాలు' పురాణాలు, సద్గ్రంధాలు అలాగే చెబుతున్నాయి."

ప్రభువు వచనాలు విని నలుగురు మునులు సంతోషించి, పులకిత శరీరంతో–"భగవానుడా! మీరు అనంతులు. వికారాలు, దోషాలులేనివారు. మీ రూపాలు అనేకం. అద్వితీయులు, దయాసాగరులు, నిర్గుణులు. మీకు జయము కల్గుగాక, గుణసాగరా! మీర్ధు

సుఖాలకు నిధులు, పరమచతురులు. మీకు జయం కల్గుగాక. లక్ష్మీ పతీ! మీకు జయమగుగాక. భూమిని భరించువాడా! సాటిలేని, పుట్టుకలేని, అనాది, శోభానిధీ! మీకు జయమగుగాక.

మీరు జ్ఞాననిధులు, సజ్జనహితులు, ఇతరుల గౌరవం పెంచే వారు. మీ పవిత్రమైన కీర్తిని పురాణాలు, వేదాలు గానం చేస్తు న్నాయి. మీరు తత్త్వాలను ఎరుగున్న కృతజ్ఞులు, అజ్ఞానాన్ని దూరం చేసేవారు. మీకు అనేకమైన పేర్లున్నాయి. అయినా మీరు నామా లకు, మాయలకు అందనివారు.

సర్వరూపాలు మీ రూపాలే. మీరంతటా వ్యాపించివున్నారు. అందరి హృదయాల్లో నివసించి వున్నారు. అందుచేత ఎల్లప్పుడు మీరు మమ్మ కనిపెట్టి వుండండి. మీరు ద్వంద్వ, ఆపదల,సంసార బంధాలను త్రెంచి వేయండి. రామా! మీరు మా హృదయాల్లో నివసించి కామము, మదాన్ని నాశనం చేయండి.

పరమానంద స్వరూపా! కృపానిధీ! మనస్సులోని కోర్కెలను పూర్తి చేసే శ్రీరామా! మీరు మాకు మీ అచలమైన ప్రేమను, భక్తిని ప్రసాదించండి.

రఘురామా! మీరు మాకు మీ అతిపవిత్రమైన దేహ, దైవ భౌతిక సంబంధమైన తాపాలను, సంసార బాధలను నాశనం చేపే భక్తిని దయ చేయండి, శరణాగతుల కోర్కెలను పూర్తి చేసే కామ ధేనువా! కల్పవృక్ష రూపంలోనున్న ప్రభువా! మీరు సంతోషంగా మాకు ఈ వరమివ్వండి.

శ్రీరామచంద్రా! మీరు సంసారరూప సముద్రాన్ని ఎండ గట్టడానికి అగస్త్య ఋషితో సమానులు. మీరు సేవలకు సులభంగా సుఖాలనందిస్తారు. మా మానసికమైన దుఃఖాలను దూరం చేయండి దీనబంధూ! మాకు సమదృష్టిని ఇవ్వండి.

మీరు ఆశ, భయ, ఈర్ష్యలనుండి దూరం చేసేవారు. వినయం, ఆలోచన, వైరాగ్యాలు వ్యాపింప చేసేవారు. రాజ శిరోమణీ! భూమికి అలంకారమా! శ్రీరామా! సంసారరూపమయిన నదికి నౌకరూపమయిన మీ భక్తిని మాకు ప్రసాదించండి.

మునుల మనస్సురూపాలైన మానసరోవరహంసా! మీ చరణాలను బ్రహ్మ, మహాదేవులు కొలుస్తుంటారు. మీరు రఘువంశానికి పతాకములాంటివారు. వేదాల మర్యాదలకు రక్షకులు. కాల, కర్మ, స్వభావ, గుణాలను రక్షించేవారు. మీరు దోషాలన్నింటిని పోగొట్టేవారు. మూడు లోకాలకు ఆ భూషణమైన మీరు తులసీదాసుకు స్వాములు" అంటూ ప్రేమ సహితంగా తలలు వంచి, మాటిమాటికి స్తుతిస్తూ తాము కోరినట్లుగా వరాలు పొంది సనకాది మునులు బ్రహ్మలోకానికి వెళ్ళారు.

సనకాదులు వెళ్ళిన తరువాత ముగ్గురు సోదరులు శ్రీరాముని పాదాల యందు తలలుంచారు. వారు ప్రభువును ఏదో అడుగడానికి సంకోచిస్తూ, హనుమంతుని వైపు చూస్తున్నారు.

వారు ప్రభువు శ్రీ ముఖాన్నుండి ఏవో వినాలని అనుకుంటున్నారు. ఆయన నోటిమాటలు వింటే అన్ని భ్రమలు దూరమయిపోతాయని వారి విశ్వాసము. అంతటా నివసించు ప్రభువు,విషయమంతా తెలిసికొని-"హనుమా! ఏమిటి సంగతి?" అన్నాడు.

హనుమంతుడు చేతులు జోడించి-"దీనదయాళూ! ప్రభూ! భరతుడు మిమ్మేదో అడుగాలనుకుంటున్నాడు. కాని మిమ్మడగడానికి జంకుతున్నాడు" అన్నాడు.

"హనుమా! నీవు నా స్వభావాన్ని బాగా ఎరుగుదువు. భరతుని నా మధ్య ఎన్నడూ ఏ రకమైన పొరపొచ్చాలులేవు" అన్నాడు ప్రభువు.

ప్రభువు మాటలు వినగానే భరతుడు ప్రభువు పాదాలు పట్టి

కాని-"శరణాగతుల దుఃఖాలను దూరం చేసే ప్రభువా! నాకు కలలో కూడా సందేహాలు, దుఃఖాలు, మోహాలు లేనేలేవు. కృపాసాగరా! ఇవన్నీ కేవలం. మీ దయకు సంబంధించిన ఫల స్వరూపాలే.

దయానిధీ! నేను మీ సేవకుడను, మీరు ఆ సేవకుని సుఖ పెట్టే దాతలు. అందువలన ఒక అవిధేయతచూపబోతున్నాను. భక్తుల మహిమను అనేక విధాలుగా వేదాలు, పురాణాలు గానం చేశాయి. మీరు కూడా మీ ముఖారవిందంతో వాటిని మెచ్చుకున్నారు. వాటి మీద మీకు ప్రేమ కూడా ఎక్కువగానే వుంది. స్వామీ! నేను వాటి లక్షణాలను వినాలనుకుంటున్నాను. మీరు గుణాల్లో జ్ఞానాల్లో నిపుణులు,

శరణాగత వత్సలా! మీరు భక్తులు, భక్తులు కాని వారిని వేరు వేరుగా తెలియజెప్పండి"అన్నాడు.

"సోదరా! విను. భక్తుల లక్షణాలు లెక్కకు మించిఉంటాయి. అవన్నీ వేదాలలో, పురాణాల్లో చెప్పి వున్నాయి. భక్తులకు, భక్తుల కాని వారి సంబంధం, చందనపు చెట్టు, గొడ్డలిలాంటిది. గొడ్డలి చందనపు చెట్టును నరుకుతుంది. చందనం తన గుణాలను దాని కందించి సువాసన కలిగిస్తుంది. ఈ గుణం ఉన్నందువల్లనే చందనం దేవతల తలల మీద ఎక్కి కూచుంటున్నది. జగత్తుకు ప్రియమైన దయిపోయింది. గొడ్డలి ముఖాన్ని నిప్పులో కాల్చి సమ్మెటతో కొట్టు తారు. దానికా దండన తప్పదు.

సజ్జనులు కామవాసనలకు దూరంగా ఉంటారు. వారు శీల, గుణ సంపన్నులు, వారు ఇతరుల దుఃఖాలను చూచి దుఃఖపడుతారు. ఇతరుల సుఖాలను చూచి సుఖాన్ని పొందుతారు. వారందరిని సమ దృష్టితో చూస్తారు. వారికి శత్రువులనే వారుండరు. వారు మదాన్ని వదలి విరక్తులయి, ఆశ, క్రోధ, ఆనంద భయాలను వదిలేస్తారు.

వారి మనస్సులు సున్నితంగా ఉంటాయి. వారు దీనులయందు
దయ కలిగి వుంటారు. మనసా, వాచా, కర్మణా భక్తులుగా ఉంటా
రు. అందరిని గౌరవిస్తారు, కాని వారు గౌరవాలను కోరరు. అలాంటి
భక్తులు నాకు నా ప్రాణాలతో సమానులు.

వారు కోర్కెలకు దూరంగా వుండి, కేవలం నా నామాన్నే
జపిస్తూ వుంటారు. శాంతి, వైరాగ్యం, వినయం, సంతోషం వారిలో
తిష్టవేసికొని ఉంటాయి, వారు శీతలంగాను,సరళంగాను ఉంటారు.
అందరితో స్నేహంగా ఉంటారు. ధర్మాలను సృష్టించే బ్రాహ్మణుల
పాదాల యందు ప్రేమను చూపుతుంటారు.

సోదరా! ఇలాంటి లక్షణాలున్న వారందరు నిజమైన భక్తు
లనుకో! వారు శమ, దమ, నియమ, నీతిని వదలరు. ఎన్నడు తమ
నోటితో కఠినమైన పలుకులు పలుకరు.

వారికి నిందాస్తుతులు సమానము. వారికి నా పాదాలయందు
ఎక్కడ లేని ప్రేమ. వారు గుణాలకు నిధులు, సుఖాలకు నిధులు,
ఆ భక్తులు నాకు ప్రాణాలతో సమానమైన ప్రియులు.

ఇప్పుడిక భక్తులు కాని వారి స్వభావాలు విను. వారితో పొర
పాటున కూడా కలసిమెలసి ఉండకూడదు. వారి సాంగత్యము ఎల్ల
ప్పుడు దుఃఖాలను కొని తెచ్చి పెట్టేది. పుల్లావు. పల్లావు సంబంధము
వలన పుల్లావును పల్లావు పాడు చేసినట్లుగా వుంటుంది వారి
సాంగత్యం.

దుష్టులకు మనస్సులో చాలా ఉడుకుబోతుతనముంటుంది.
వారు ఎల్లప్పుడు ఇతరుల సంపదలను చూచి ఈర్ష్యపడుతుంటారు.
ఇతరులకు చెడుజరిగితే తమకు సంపదలు లభించినట్లుగా,ఆనందిస్తారు.

వారు కామ, క్రోధ, లోభ,మదంతో మునిగిఉంటారు వారిలో
దయ అణుమాత్రం కూడా వుండదు. కపటులు, దుర్మార్గులుగా వుం

టారు. వారి మనస్సులెప్పుడూ చెడు వైపే చూస్తుంటాయి.

వారి బ్రతుకులు,అబద్ధాలు చెప్పడం, అబద్ధాలు వినడం,అబద్ధాలనే తినడం, అబద్ధాలు కక్కడాలతోనే, గడచిపోతుంటాయి. నెమళ్ళు తియ్యని స్వరాలతో కూస్తున్నట్లుగా, వారు తియ్యగా మాట్లాడుతుంటారు. కాని హృదయం విషంతో నిండి వుంటుంది. వారి విషాలతో పాములు కూడా చస్తాయి, వీరు పాములను కూడా తినగలిగే విషంతో వుంటారు.

వారు ఇతరులకు ద్రోహం చేస్తుంటారు. ఇతరుల స్త్రీలను,ధనాన్ని, ఇతరులను నిందించడం యందు ఆసక్తి చూపుతారు. వారు నీచులు, పాపులు, మానవ రూపంలో వున్న రాక్షసులు,

దురాశ వారు కప్పుకొనే దుప్పటి, లోభం వారు పండుకునే ప్రక్క; వారు పశువుల్లాగా ఆహార, నిద్రా మైధునాల చింతల్లో వుంటారు. యమలోక భయం కూడా వారి కుండదు. ఇతరుల గొప్పతనాన్ని వింటే వారికి సన్నిపాత జ్వరము వచ్చినప్పుడు వచ్చినంత అలుపు, సలుపు వస్తుంది. ఎవరికైనా ఆపదలు వస్తే, వారికి రాజపదవి లభించినంత ఆనందం కల్గుతుంది. వారు తమ స్వార్థం తప్ప ఏమీ చూడరు. కుటుంబానికి విరోధులయిపోతారు. మోసగాండ్లు, కపటులు, కాములు, క్రోధులు అయిపోతారు.

తల్లి, తండ్రి, గురు, బ్రాహ్మణులెవ్వరిని ఒప్పుకోరు. వారు నష్టమై పోవడం కాక యితరులను నష్ట పెడుతుంటారు. మోహంలో పడి ఇతరులకు ద్రోహం చేస్తారు. వారికి సజ్జనుల సాంగత్యము, భగవంతుని కథలు అక్కర్లేదు.

వారిలో అవగుణాలు అంతులేనన్ని ఉంటాయి. మందబుద్ధులు, కాముకులు. వేదాలను నిందిస్తారు, ఇతరుల సంపదలను కాజేయాలని

చూస్తుంటారు. వారు ప్రత్యేకంగా బ్రాహ్మణులను,ఇతరులను ద్వేషిం
చడం మాత్రం మానరు. హృదయంలో ద్వేషాన్ని, ఈర్ష్యని,దాచు
కొని, పైకి మంచి వేషాలు వేసికొని వుంటారు. ఇలాంటి నీచులు,పెద్ద
వారు కృత, త్రేతాయుగాల్లో ఉండరు. ద్వాపర యుగంలో కొద్దిగా
ఉంటారు. కలియుగంలో మాత్రము గుంపులు గుంపులుగా, మిక్కు
టంగా వుంటారు.

సోదరా! ఇతరుల మేలును కోరులాంటి ధర్మము, ఇతరులను
కష్టపెట్టేటంత నీచమూ మరొకటి ఉండదు. సోదరా! పురాణాల్లో,
వేదాల్లో ఉండే నిర్ణయాలన్నీ నేను నీకు చెప్పాను. ఇదంతా పండి
తులకు తెలుసు.

మానవ జన్మమెత్తి. ఇతరులను బాధలు పెట్టేవారు జగత్తులో
చాలా కష్టాలనుభవిస్తారు. స్వార్థపరులై. మోహంలో పడి పాపాలు
చేసే మనుష్యులు పరలోకంలో నష్టపోతారు.

సోదరా! నేను దుష్టులకు యమునిలాంటి వాడను, వారి కర్మ
లను బట్టి మంచి చెడు ఫలాలను నిర్ణయిస్తాను. ఈ విషయం తెలిసిన
వారు; సంసారం దుఃఖమయమని గ్రహించి నన్ను భజిస్తూ వుంటా
రు. అందుకనే వారు శుభా శుభఫలాలనిచ్చే కర్మలను వదలి, దేవత
లకు,మునులకు,మనుష్యులకు ప్రభువునైన నన్ను కొలుచుకుంటూ వుం
టారు. భక్తులు, భక్తులు కాని వారి లక్షణాలను నేను నీకు చెప్తాను.
ఈ విషయాలను తెలిసికొన్న మునులు, సంసార రూపమైన బంధ
నాల్లో, చావు పుట్టుకల, ఉచ్చుల్లో చిక్కుకొనడంలేదు.

సోదరా! ఇంకా విను, మాయద్వారా ఏర్పడిన గుణదోషాలు
చాలా ఉన్నాయి. ఎవరి గుణదోషాలను పట్టించుకోకపోవడం చాలా
పెద్ద గుణం. వాటిని చూడడం, తలచడం అజ్ఞానం, అవివేకం"
అన్నాడు శ్రీరామచంద్రుడు.

ప్రభువు శ్రీముఖాన్నుండి విన్న మాటలతో భరతుడు మొదలైన సోదరులు ఎంతో సంతోషించారు. వారి హృదయాల్లో ప్రేమ పొంగులు వారుతున్నది. వారు మాటమాటకి ఎంతో వినయం చూపుతున్నారు. హనుమంతుని హృదయంలో కూడా సంతోషానికంతు లేదు.

## 33

ఆ తరువాత శ్రీరామచంద్రుడు తన భవనానికి వెళ్ళాడు. ఆయన ఈ విధంగా ప్రతిరోజు ఏవో క్రొత్తక్రొత్తలీలలు చేస్తున్నారు. నారదముని తడవతడవకు వచ్చి శ్రీరాముని పవిత్రమైన చరిత్రలు గానం చేస్తూన్నాడు. మునులు ప్రతిరోజు క్రొత్త క్రొత్త లీలలు చూచి వెళుతున్నారు. కథలన్నీ బ్రహ్మలోకానికి వెళ్ళి చెబుతున్నారు. అవివిని బ్రహ్మ ఆనందించి– "పుత్రా! మాటిమాటికి శ్రీరాముని గుణాలను గానం చెయ్యి" అంటున్నాడు నారదునితో.

సనకాది మునులు బ్రహ్మ నిష్ఠులయినా, వారు కూడా నారదుని పొగడి, ఆయన గానాలను ఆదరంగా వింటున్నారు. జీవన్ముక్తులు, బ్రహ్మ పరాయణులైన సనకాదులలాంటివారే, బ్రహ్మ ధ్యానాన్ని వదలి శ్రీరాముని చరిత్రలు వింటున్నారంటే, అలాంటి శ్రీహరి కథలయందు ప్రేమ వుంచని వారి హృదయాలను రాతి బండలను కోవల సివస్తుంది.

ఒకసారి శ్రీరామచంద్రుడు గురువును, బ్రాహ్మణులను, నగరవాసులను పిలిపించాడు. వారందరు కూచున్న తరువాత, భయాలను పోగొట్టే ప్రభువు—"మెల్లని స్వరంతో నా చెప్పబోవు మాటలు వినండి. నేనేదో కోర్కెలు పెట్టుకొని ఈ మాటలు చెప్పబోవడం లేదు. ఇందులో, అధికారం లేదు. నా మాటలు విని, మీకు తోచినట్లుగా మీరు

చేయండి.

నా ఆజ్ఞను పాటించిన వారు నా సేవకులు, నాకు యిష్టులు. నేను అనైతిక విషయాలు చెప్తే, భయపడకుండా నన్నక్కడే ఆపి వేయండి.

"ఎంతో అదృష్టం చేత, దేవతలకు కూడా సాధ్యపడని మనుష్య శరీరాలు లభిస్తూ వుంటాయని గ్రంథాలు చెబుతున్నాయి. ఈ జన్మ సాధనాలు చేసికోడానికి, మోక్షప్రాప్తికి వీలైనటువంటిది. దీన్ని పొంది కూడా, పరలోకాన్ని చక్కబెట్టుకోలేని వాడు, తప్పకుండా పర లోకంలో దుఃఖాలనుభవిస్తాడు. కాలాన్ని, కర్మలను, ఈశ్వరుని అబద్ధపు దూషణలకు జతచేసి తలబాదుకొని పశ్చాత్తాపపడుతుంటాడు.

సోదరులారా! ఈ శరీరానికి ప్రయోజనము కామకోర్కెలు' భోగవిలాసాలు కాదు. స్వర్గభోగాలు కూడా గొప్పవేమీ కావు. చివరకు అవి కూడా దుఃఖాలకు కారణాలవుతాయి. అందువలన, మానవ శరీరాన్ని కామకోర్కెల వలల్లో చిక్కించిన మనుష్యులు మూర్ఖులు. వారు అమృతానికి బదులుగావిషాన్ని కోరుకుంటున్నారు. వారు పరుస వేదిని వదలి గురిగింజలను తీసుకుంటున్నారు. వారిని ఎవ్వరూ ఎప్పుడూ మంచివారనరు. ఈ శాశ్వతమైన ప్రాణులు ఇలాంటి నికృష్టమైన పనులు చేసి, అశాశ్వతప్రాణులయిపోయి ఎనభైనాలుగు లక్షల యోనుల్లో పుడుతూ, చస్తూ వున్నారు. మాయలో చిక్కుకొని పోయి చావు పుట్టుకలు తప్పనిస్థితి ఏర్పరచుకుంటున్నారు. ఎప్పుడో దయ దలచి, కారణం లేకుండానే ప్రేమించే పరమాత్మ వారికి మనుష్య దేహాన్నిస్తున్నాడు, అందాకావారు అండజ, స్వేదజ, జరాయుజ' ఉద్భిజా లను చక్రంలో పడి తన్నుకొంటూ ఉంటారు.

భవసాగరాన్నుండి తరించిపోవడానికి మనుష్యుని శరీరం ఓడతో సమానమైనది. నా దయ అనుకూలమైనగాలి. సద్గురువు ఈ

గట్టి నావను నడిపేవాడు. ఈ విధంగా ఈ ప్రాణి అసాధ్యమైన సాధ
నాలు సుళువుగా పొందగలిగాడు.

ఇలాంటి సాధనాలు పొంది కూడా, భవసాగరాన్ని దాటలేని
మనిషి మందబుద్ధి,కృతఘ్నుడు అయి ఆత్మహత్య చేసుకొనే స్థితిదాకా
వస్తాడు.

పరలోకంలో, ఈ లోకంలో కూడా సుఖంగా జీవించాలను
కుంటే, నా మాటలు విని,వాటిని మనస్సులో పదిలంగా వుంచుకోండి.
పౌరులారా, పురాణాలు, వేదాలు నా యందు భక్తి ఉంచడాన్ని
తేలికని, సుఖదాయకమైన మార్గమని చెప్పాయి.

జ్ఞానం అంతు తెలియనిది. దానిని పొందాలంటే అనేక
ఆటంకాలెదురౌతుంటాయి. దానిని సాధించడంకూడా కష్టం.
అందులో మనస్సు కొరకు ఏ ఆధారమూలేదు. ఏదో ఒక రకంగా,
ఎన్నో కష్టాలు పడి ఆ జ్ఞానాన్ని పొందినా, అతనిలో భక్తి లేకపోతే
ఆ జ్ఞానం నాకు నచ్చదు. భక్తి స్వతంత్రమైనది. అది అన్ని సుఖా
లకు నిధి. కాని మంచి వారి స్నేహం చేయకుండా అది లభించదు.
సజ్జనులు, భక్తులు ఎంతో పుణ్యం చేసికొంటేనేగాని తటస్థ పడరు.
సజ్జనుల సాంగత్యమే చావుపుట్టుకలను లేకుండా చేయగల్గుతుంది.

ప్రపంచంలో ఒకే ఒక పుణ్యముంది, మరొకటి లేనే లేదు.
అది మనసా, వాచా, కర్మణా బ్రాహ్మణుల పాదాలకు పూజలు
చేయడం. ఇంకొక రహస్య మతముంది. దాన్ని కూడా నేను చేతులు
జోడించి మీకు వినిపిస్తున్నాను. శివుని పూజించకుండా వుండే మనిషి
నా యందు భక్తి చూపడానికి పనికిరాడు.

చెప్పండి, భక్తి మార్గంలో ఏమి కష్టముందో? ఇందులో
యోగాలు, యజ్ఞాలు, జపతపాలు, ఉపవాసాలు ఏమీ లేవు. స్వభా
వం సరళంగాను, మనస్సులో కల్మషం లేకుండాను, దొరికిన దాంతో

తృప్తిపడుతూను వుంటేచాలు.

నా భక్తుడనని చెప్పుకుంటూ, ఇతరులయందు ఆశ పెట్టుకొని వుంటే ఆ మనిషి నమ్మకము ఎలాంటిది? ఎక్కువగా చెప్పనక్కర్లేదు. నేను ఈ మంచి ఆచరణలున్న వారిని వదలను. వారి వశుడనై వుంటాను.

ఎవరితోను వైరము, తగాదాలు పెట్టుకోకూడదు. ఎవరియందు ఆశలు పెంచుకోకూడదు. ఎవ్వరిని చూచి భయపడనవసరం లేదు. అలాంటి వానికి ఎటు చూచినా సుఖాలే కనిపిస్తుంటాయి. ఫలాభిలాష లేకుండా పని ప్రారంభించినవానికి, తన, మన, పరాయి అను భావాలు లేనివానికి, భక్తి తప్ప మరేదీ జ్ఞప్తికి రానివానికి, మానావమానాలు, క్రోధములేనివానికి, జ్ఞానవంతునకు, భక్తుల, సజ్జనుల సాంగత్యమందు ప్రేమగలవానికి, సాంసారిక సుఖాలను, స్వర్గాన్ని, మోక్షాన్ని గడ్డిపోచతో సమానంగా చూచే వానికి, భక్తియందు పట్టుదల వున్నవానికి, ఇతర మతాలను నిందించనివానికి, కుతర్కాలను వదలినవానికి, నా గుణసమూహాలను, నా నామాలను వదలనివానికి, మమత, మదము, అజ్ఞానము లేనివానికి, లోకంలో కావలసినవి ఇంకేమీ మిగిలి వుంటాయి? ఇపుడు నేను చెప్పిన లక్షణాలన్నీ వుండే మనిషి నా రూపుడు, నా గుణాలవాడే కాని అన్యుడు కాడు. నా మాటలు మీకు అర్థమయి వుంటాయను నమ్మకము నాకుంది. ఎందు కంటే నా మాటలు అర్థం చేసికోలేనివారు, అర్థం చేసికోవాలను ఆసక్తి లేనివారు నా యెదుటకు రానేరారు. నా మాటలను విని, ఆ ప్రకారం ఎంతో కొంత అయినా ఆచరించు వారు నాకు ప్రియులు. వారే కొన్నాళ్ళకు నా లాంటివారయిపోయి, నా వద్దకు చేరుకుంటారు" అన్నాడు శ్రీరామచంద్రుడు.

శ్రీరామ చంద్రుని అమృతంతో సమానమైన మాటలు విన

గానే అందరు ఆయన పాదాలు పట్టుకొని-"కృపానిధీ! మీరు మాకు తల్లి, తండ్రి, గురువు బంధువులు, సోదరులు, ప్రాణాలకంటే ప్రియులు.

రామా! శరణాగతవత్సలా! మా శరీరాలు, సంపదలు, ఇళ్ళు ఇలాంటి మేలు చేకూర్చేవన్నీ మీరే. మీరు తప్ప మాకు యిలాంటి ఉపదేశాలిచ్చే వారెక్కడా లభించరు. తల్లిదండ్రులు బిడ్డల మేలును కోరి ఉపదేశాలిచ్చినా, మంచిమాటలు చెప్పినా వారూ స్వార్థులే.

రాక్షసుల శత్రువా! కేవలము మీరూ, మీ సేవకులే, ఏ ప్రయోజనమాసించకుండా ప్రపంచానికి ఉపకారాలు చేస్తున్నారు. జగత్తులోని వారందరు స్వార్థానికి మిత్రులు. పరమార్థమనేది కలలో కూడా కనిపించలేదు" అన్నారు.

ప్రేమతో కూడిన అందరి మాటలు విని శ్రీరామచంద్రుడు మనస్సులో ఆనందించాడు. అందరు ప్రభువు ఆజ్ఞ ప్రకారం ప్రభువు యొక్క చక్కని ఉపదేశాలను తలచుకుంటూ తమ తమ యిండ్లకు వెళ్ళిపోయారు.

"ఉమా! అయోధ్యా వాసులైన స్త్రీ పురుషులందరు పుణ్యాత్ములు. వారికి స్వయంగా బ్రహ్మ, సచ్చిదానందుడు, శ్రీరాముడు రాజయాడు.

ఒకసారి వసిష్ఠముని సుఖధాముడైన శ్రీరాముడున్న చోటకు వచ్చాడు. శ్రీరాముడు ఆయనను చక్కగా ఆదరించి, ఆయన పాదాలను కడగి, ఆయన పాదామృతాన్ని పుచ్చుకొన్నాడు.

ముని చేతులు జోడించి - "దయాసాగరా! శ్రీరామా! నా ప్రార్థన వినండి. మీరు మనుష్యులకు తగినట్లుగా ఆచరించడం చూచిన తరువాత నాకు ఎంతో భ్రమ కలుగుతూ వుంది.

భగవంతుడా! మీ మహిమ అంతు తెలియనిది. దానిని

వేదాలు కూడా తెలిసికోలేవు. అటువంటపుడు నేనెలా చెప్పగలను? పురోహిత కర్మ చాలా నీచమైనది. వేద, పురాణ, స్మృతులు దీనిని నిందించాయి. నేను పురోహితునిగా వుండనని అన్నప్పుడు బ్రహ్మ- "పుత్రా! ఈ కర్మవలన నీకు లాభం కల్గుతుంది. స్వయంగా పర బ్రహ్మ, పరమాత్ముడు మనిషయి పుట్టి, రఘుకుల భూషణ రాజపుత్రాడు" అన్నాడు. ఆ సమయంలో "యోగ, తప, జపాలు, దానాలు, మీ కొరకు చేస్తున్నారు చాలామంది. పురోహితునిగా వుంటే ఆ యోగము నాకు పడుతుందను నమ్మకంతోనూ, ఇంతకంటే మించిన ధర్మం మరొకటి లేదనుకొని సమ్మతించాను,

జప, తప, నియమ, యోగ, వ్రత, స్వధర్మాలు వేదాల నుండి పుట్టాయి. అందులోనుండి పుట్టిన అనేక రకాల శుభకర్మలు, జ్ఞానం, దయ, సంయమ, తీర్థస్థానాలు మొదలైనవాటిని కూడా ధర్మాలని వేదాలు, సజ్జనులు చెప్పారు. నేను అనేక శాస్త్రాలను, వేద పురాణాలను చదివాను, విన్నాను. అందువలన మీ చరణారవిందాల యందు ప్రేమ వుంచడమే సాధనాలన్నింటిలో ఉత్తమ సాధనమని తెలిసికోగలిగాను. ఇప్పుడీ వృత్తిని నేను నీచవృత్తిగా భావించడం లేదు.

మురికితో మురికిని పోగొట్టితే మురికిపోదు. నీళ్ళను చిలికితే నెయ్యిరాదు. ప్రభూ! ప్రేమ పూర్ణమైన భక్తి రూపజలం లేకుండా హృదయంలోని మురికిపోదు.

మీ చరణకమలాలయందు ప్రేమ వున్నవాడే సర్వజ్ఞుడు, తత్త్వజ్ఞాని, వేదాంతి, పండితుడు, గుణవంతుడు, పూర్తి విజ్ఞాన వంతుడు, అతడే చతురుడు, అన్ని లక్షణాలున్నవాడు.

శ్రీరామచంద్రా! నేనొక వరదానం కోరుకుంటున్నాను. దయ చేసి ఇవ్వండి. మీ చరణకమలాల యందు, నేను ఎన్ని జన్మ

లెత్తినా, ప్రేమతగ్గకుండా వుండు వరం యివ్వండి" అని శ్రీరాము నితో చెప్పి వసిష్ఠుడు ఇంటికి వెళ్ళిపోయాడు. ఆయన మాటలు దయా సాగరుడయిన శ్రీరామునకెంతో నచ్చాయి.

## 34

హనుమంతుని, భరతుని, ఇతరులను వెంటబెట్టుకొని శ్రీరామచంద్రుడు పట్టణం వెలుపలకు వెళ్ళాడు. అక్కడకు వెళ్ళిన తరువాత యేనుగులను, రథాలను, గుర్రాలను తెప్పించి, వాటిని చూచి దయతో ప్రభువు పొగడి, ఉచిత రీతిలో కోరిన వారికి కోరిన వస్తువులిచ్చాడు.

ప్రపంచంలోని శ్రమలన్నింటిని దూరం చేసే శ్రీరాముడు, శ్రమతో చల్లని ఉద్యానవనంలోకి వెళ్ళాడు. భరతుడు అక్కడ తన వస్త్రాన్ని పరచాడు. ప్రభువు దానిమీద కూచున్నాడు. అందరు ఆయనకు సేవలు చేస్తున్నారు. అపుడు హనుమంతుడు పులకిత శరీరంతో కళ్ళంట నీళ్ళు పెట్టుకొని విసనకర్రతో గాలి వీస్తున్నాడు. హనుమంతునితో సమానమైన అదృష్టవంతు లెవరున్నారు? శ్రీరామచంద్రుని చరణాలయందు అంత ప్రేమున్న వాడెవ్వరులేరు.

"పార్వతీ! హనుమంతుని ప్రేమ, సేవలను ప్రభువు మాటి మాటికి తన నోటితో పొగడాడు".

ఆ సమయానికే చేతిలో వీణతో నారదమహాముని వచ్చి శ్రీరామచంద్రుని చక్కని, క్రొత్త కీర్తనలు గానం చేస్తున్నాడు.

"దయతో, శోకాన్ని పోగొట్టే కమలనయనా! నా వైపుకూడా కొంచెం చూడండి. హరే! మీరు నీలకమలాల్లాంటి శ్యామవర్ణులు,

కామదేవుని శత్రువు శివుని హృదయంలోని మకరందాన్ని త్రాగే తుమ్మెదలు.

మీరు రాక్షస సైన్య బలాన్ని నాశనం చేసినవారు. మునులకు, సజ్జనులకు ఆనందాన్ని కలిగించేవారు. పాపాలను దూరం చేసేవారు. బ్రాహ్మణ రూపమైన పొలానికి, మీరు మేఘాల్లాంటివారు. శరణన్న వారికి శరణులు. దీనజనులకు మీ ఆశ్రయంలోస్థానాన్నిచ్చే వారు· మీ బాహుబలంతో భూ భారాన్ని తగ్గించేవారు, ఖరదూషణ త్రిశిరారులను చంపడంలో ప్రవీణులు. మీకు రావణుని శత్రువులు, సుఖరూపులు, రాజులలో శ్రేష్ఠులు. దశరథకులరూపమైన కలువలకు, చంద్రులయిన మీకు జయము కల్గుగాక.

మీ ఘనమైన కీర్తి పురాణాల్లో, వేదశాస్త్రాల్లో వర్ణించబడి వుంది. దేవతలు, మునులు, సజ్జనులు, భక్తులు వాటిని గానం చేస్తున్నారు. మీరు కరుణానిధులు,మదాన్ని. మాత్సర్యాన్ని దూరం చేసేవారు. అన్ని విధాలా నిపుణులు, అయోధ్యకు అలంకారులు, మీ నామము కలియుగ పాపాలను మధించి, మమతలను రూపుమాపేది. తులసీదాసునికి ప్రభువా! శరణాగతుడనయిన నన్ను రక్షించు"

నారదుడు శ్రీరామచంద్రుని గుణాలను, ప్రేమగా వర్ణించి శోభాసాగరుడైన ప్రభువును తన హృదయంలో ఉంచుకొని బ్రహ్మ లోకానికి వెళ్ళిపోయాడు.

"పార్వతీ! ఈ మనోహరమైన రామకథ, నా బుద్ధిని బట్టి పూర్తిగా చెప్పాను. శ్రీరాముని చరిత్ర అంతుతేలనిది. దానిని వేదాలు, సరస్వతి కూడా, తెలిసికోలేరు.

శ్రీరాముడు అనంతుడు,అలాగే ఆయన గుణాలు కూడా అనంతాలు ఆయన జన్మ, కర్మలు, నామాలు కూడా అనంతాలు. జలబిందువులను, భూమిమీదనున్న మట్టి కణాలను లెక్కపెట్టవచ్చునేమో కాని

శ్రీరాముని చరిత్రను వర్ణించడం వలన ఆ కథ పూర్తి కాదు.

ఈ పవిత్రమైన రామకథ, హరి పాదాల వద్దకు తీసుకెళ్తుంది, దీనిని వింటే స్థిరమైన భక్తి లభిస్తుంది. ఉమా! కాగభుశుండి గరుడనకు చెప్పిన కథ, నేను నీకు చెప్పాను.

నేను రాముని గుణాలు కొద్దిగా చెప్పాను. ఇప్పుడు, భవానీ! ఏమి వినిపించాలో, చెప్పు"అన్నాడు శివుడు.

పవిత్రమైన రామకథను విని పార్వతి చాలా సంతోషించి,చాలా వినయంగా, సున్నితమైన మాటలతో-"ప్రభూ! నేను ధన్యురాలను. సంసారభయాన్ని దూరం చేసే శ్రీరాముని గుణాలు, చరిత్ర విన్నాను. కృపానిధీ! మీ దయ వలన నేను కృతార్థురాలనయినాను. నా మోహమంతా పోయింది. ప్రభూ! సచ్చిదానందుడు,ఘనుడయిన శ్రీరామచంద్రుని ప్రతాపం నేను తెలుసుకున్నాను.

నాథా! ధీరబుద్ధీ! మీ ముఖ రూపమైన చంద్రుడు, రామ కథా రూపమైన అమృతాన్ని కురిపిస్తున్నాడు. చెవుల రంధ్రాల నుండి దానిని త్రాగినా నా మనస్సుకు తృప్తి కలుగలేదు.

శ్రీరామచంద్రుని చరిత్రను విని తృప్తి పడిన వారిని, వారు శ్రీరామ కథనుండి సొంతము రసాన్ని పొందలేదని అనుకోవాలి. జీవన్ముక్తులయిన, మహామునులు, ఎల్లప్పుడు మనస్సును లగ్నం చేసి భగవంతుని గుణాలను వింటూ వుంటారు.

భవసాగరాన్ని దాటిపోదలచిన ప్రాణులకు, శ్రీరాముని కథ దృఢమైన నావలాంటిది. కాముకులకు కూడా ఈ శ్రీహరి కథ, గుణాలు చెవులకు సుఖాన్ని కలిగించి, మనస్సుకు విశ్రాంతి నిస్తాయి.

శ్రీరామచంద్రుని చరిత్ర నచ్చని చెవులు ఎవరి కుంటాయి? శ్రీరామచంద్రుని కథ నచ్చని వారు ప్రాణాల్లు లేనివారు,ఆత్మహత్యా సదృశులు,

నాథా! మీరు రామచరిత మానసాన్ని గానం చేశారు. దానిని విని, నేను చాలా సుఖాన్ని పొందాను. ఈ కథను కాగభుశుండి గరుడునకు చెప్పిందని మీరు చెప్పారు. వైరాగ్యంలోను,జ్ఞాన విజ్ఞానాల్లోను ఆరితేరి, శ్రీరామచంద్రుని పాదాల యందు ఎంతో ప్రేమవున్న కాగభుశుండిది కాకి శరీరం. రాముని భక్తి కూడా దానికి లభించింది. ఇక్కడ నాకు చాలా సందేహంగా వుంది.

శివదేవా! వేలమంది పురుషులలో ఎవరో ఒకరు మాత్రమే ధర్మవ్రతాన్ని పాటించగలిగేవారుంటారు. కోట్ల ధర్మశీలురలలో కామ కోర్కెలను త్యజించే. వైరాగులు ఎక్కడో ఒకరుంటారు. కోట్లవిరక్తులలో ఎవరో ఒకరు మాత్రమే పూర్ణజ్ఞానులుంటారు, కోట్ల జ్ఞానుల్లో ఎక్కడో ఒకరు జీవన్ముక్తులుంటారు, జగత్తులో ఎక్కడో ఒకరు నిక్కచ్చయిన భక్తులు ప్రత్యేకంగా ఉంటారు.

వేల జీవన్ముక్తులలో కూడా సుఖనిధులు, బ్రహ్మలో లీనమయ్యేవారు, జ్ఞానులయిన పురుషులుండడం అసాధ్యం. ధైర్యధీరులు, విరక్తులు, జ్ఞానులు, జీవన్ముక్తులు, బ్రహ్మలీనులు. వీరందరు ఒకరిని మించిన వారు మరొకరు"అని వేదాల్లో చెప్పివుంది.

దేవోత్తమా! వీరిలో కూడా మద, మాయలకు లోబడకుండా, రామభక్తిలో ప్రేమవుంచువారు వుండడం కష్టం. అలాంటి హరి భక్తిని కాగభుశుండి ఎలా పొందగల్గింది. విశ్వనాథా! ఆ విషయం నాకు కొంచెం వివరంగా వివరించండి.

నాథా! శ్రీరామభక్తురాలు, జ్ఞాననిధి, గుణాల నిలయం, స్థిర బుద్ధిగల ప్రాణి అయిన కాగభుశుండి కాకి రూపం ఎందుకు పొందింది?

కృపాళూ! శ్రీరామచంద్రుని, ఈ పవిత్రమైన కథను ఆయన చరిత్రను కాకి ఎలా విన్నది? ఈ విషయం చెప్పండి.

మన్మధుని శత్రువా! ఈ కథను మీరెలా విన్నారో, అదికూడా చెప్పండి. నాకు వినాలని కుతూహలంగా వుంది.

గరుడుడు మహాజ్ఞాని, గుణవంతుడైన హరి సేవకుడు; ఆయన సమీపంలో వుండేవాడు. మరి ఏ కారణం చేత ఆయన మునుల సమూజాన్ని వదలి కాకి దగ్గరకు వెళ్ళి ప్రభువు కధ విన్నాడు? కాగభుశుండి, గరుడ గల సంవాదం, ఏ కారణం చేత జరిగిందో చెప్పండి."

పార్వతి వేసిన సున్నితమైన, చక్కని ప్రశ్నలను విని శివుడు సంతోషించి, ఆదరంగా-"పార్వతీ! నీవు ధన్యురాలవు. నీ బుద్ధి నిర్మలమైనది. శ్రీరాముని పాదాలయందు కూడా నీకెంతో ప్రేమవుంది. అన్ని భ్రమలు దూరమయిపోయే ఆ కథను చెప్తాను, విను. ప్రభువు పాదాలయందు నమ్మకమున్న మనుష్యులు ప్రయత్నమేమీ లేకుండానే సంసార సాగరాన్ని అవలీలగా దాటిపోగల్గుతారు. ఇలాంటి ప్రశ్నలనే కాగభుశుండి గరుడుని వద్దకు వెళ్ళి అడిగింది. పార్వతీ! అదంతా ఆదరంగా చెప్తాను. నీవు మనస్సు నిర్మలంగా ఉంచుకొని విను.

సుముఖీ! సంసారాన్నుండి తరింపజేసే ఈ కథను నేనువిన్నది విన్నట్లుగా చెప్తాను, విను. మొదట దక్షుని యింట నీవు పుట్టావు. అప్పుడు నీ పేరు సతి. దక్ష యజ్ఞ సమయాన నీకు అవమానం జరిగింది. అప్పుడు నీవు అతి కోపంతో నీ ప్రాణాలను వదిలేశావు. నా గణాలు యజ్ఞాన్ని నాశనంచేశాయి. ఈ విషయమంతా నీకు తెలుసు.

ప్రియురాలా! నీ వియోగ బాధ నాకు భరించరానిదైంది. నేను విరక్తుడనై అందమైన వనాలు, పర్వతాలు, నదులు, చెరువులను కుతూహలంతో చూస్తూ తిరిగాను. సుమేరు పర్వతానికి ఉత్తరంగా ఒక మనోహరమైన నీల పర్వతముంది. దానిమీద బంగారు శిఖరము లున్నాయి. వాటితో సుండి నాలుగందమైన శిఖరాలు నాకు బాగా నచ్చాయి. ఆ శిఖరాలమీద ఒక్కొక్క మర్రిచెట్టు, రాగిచెట్టు. జువ్వి

చెట్టు, మామిడిచెట్టు విశాలంగా ఉన్నాయి. పర్వతంపైన ఒక మనో హరమైన చెరువు అందంగా వుంది. దాని మణులతో పొదిగిన మెట్లను చూచి నా మనస్సు ఆకర్షితమైపోయింది.

దానిలోని నీళ్ళు చల్లగాను, నిర్మలంగాను, తియ్యగాను వు న్నాయి. దానిలో అనేక రకాల కమలాలు వికసించి వున్నాయి. హం సలు మధురంగా శబ్దాలు చేస్తున్నాయి. తుమ్మెదలు అందంగా ఝుమ్మంటున్నాయి.

# 35

ఆ పర్వతం మీద కాగభుశుండి అను పక్షి నివసిస్తున్నది. కల్పాంతంలో కూడా దానికి నాశనముండదు. మాయకు సంబంధిం చిన అనేక గుణాలు, దోషాలు, మోహాలు, కామాలు మొదలైన చెడ్డ ఆలోచనలు ప్రపంచంలో అల్లుకుపోతున్నాయి. ఆ చెడ్డ ఆలోచనలు ఆ పర్వతం దాపుకు పోలేక పోతున్నాయి. ఆ కాకి అక్కడ వుండి శ్రీ హరి ధ్యానం ఎలా చేస్తుండేదో,చెప్తాను ప్రేమతో విను.

అది రావిచెట్టు క్రింద ధ్యానం చేస్తున్నది, జువ్విచెట్టు క్రింద జపయజ్ఞాలు చేస్తున్నది. మామిడి చెట్టునీడన మానసిక పూజ చేస్తు న్నది. హరి భజన తప్ప దానికి వేరే పనేమీలేదు.

మర్రిచెట్టుక్రింద శ్రీహరి కథా ప్రసంగాలు చెపుతున్నది. చాలా పక్షులు అక్కడకు వచ్చి కథలు వింటున్నాయి. శ్రీరాముని చరిత్ర లోని అనేక విషయాలను అది ప్రేమతోను, ఆదరంగాను గానం చేస్తున్నది· ఎల్లప్పుడు ఆ చెరువులోనే వుండు తెలివిగల హంసలు ఆ. కథను వింటున్నాయి. నేను అక్కడకు వెళ్ళి చూచాను. ఆ దృశ్యము నాకెంతో ఆనందాన్ని కలిగించింది.

నేను హంసరూపం దాల్చి కొంచెంసేపు అక్కడున్నాను.

ధ్యానంగా శ్రీరామచంద్రుని చరిత్రను విని మరల కైలాసానికి తిరిగి వచ్చాను.

పార్వతీ! కాగభుశుండి వద్దకు నేను వెళ్ళినప్పటి కథంతా నీకు ఇంతకు ముందే చెప్పాను. ఇపుడు, గరుడుడు కాగభుశుండి వద్దకు వెళ్ళిన కథను చెప్తాను విను.

శ్రీరామచంద్రుడు యుద్ధలీలలు చేస్తున్నాడు. ఆ లీలలను తలచుకుంటే నాకు సిగ్గువేస్తున్నది. ఎందుకంటే, మేఘనాథుని చేతుల్లోని నాగపాశంలో ప్రభువు స్వయంగా బంధితుడైనాడు. అప్పుడు నారద ముని గరుడుని పంపాడు.

నాగపాశాన్ని త్రుంచేసి గరుడుడు ఇంటికి తిరిగి రాగానే చాలా బాధపడ్డాడు. ప్రభువు బంధనాలను తలచుకొని గరుడుడు మనస్సులో అనేక విధాలా ఆలోచించాడు.

"సర్వవ్యాపకుడు, వికారాలులేనివాడు, వాక్కులకు స్వామి, మాయా మోహాలకు లొంగని పరమేశ్వరుడు జగత్తులోఅవతారమెత్తి నట్లు నేను విన్నాను. కాని ఆ అవతార ప్రభావాన్ని రవ్వంతయినా చూడలేదు. మనుష్యుల సంసార బంధనాలు, ఆయన నామాన్ని జపించినంత మాత్రాన, పటాపంచలయిపోతున్నాయి. అటువంటి శ్రీరాముని నీచుడైన రాక్షసుడు నాగపాశంతో బంధించాడు".

గరుడుడు తన మనస్సుకు అనేక రకాలుగా నచ్చజెప్పుకుంది. కాని ఏమీ అర్థం కాలేదు. హృదయంలో భ్రమ మరీ ఎక్కువైంది. ఆ దుఃఖంతో మనస్సులో చాలా బాధపడుతూ, తర్కాన్ని పెంచు కొని, గరుడుడు నీ మాదిరిగానే మోహవశమయిపోయింది.

చివరకు వ్యాకులంతో నారదుని వద్దకెళ్ళి, తనకున్న సందే హాన్ని ఆయనకు చెప్పింది. దాని మాటలు విన్న నారదునకు చాలా దయ కలిగి–"గరుడా! విను, రాముని మాయ చాలా బలవత్తర

మైంది. ఆ మాయ జ్ఞానవంతుల, మనస్సులను కూడా గందరగోళ పరచి, బలవంతంగా విశేషమోహంలోకి లాగి వేస్తుంది. అది నన్ను కూడా అనేక సార్లు నాట్యం చేయించింది. గరుడా! ఆ మాయయే నిన్ను తన వలలో వేసికొంది. నీ హృదయంలో చాలా పెద్ద మోహ మేర్పడింది.

గరుడా! ఇది తెలియ జెప్పినంత మాత్రాన వెంటనే తొలగి పోదు. అందువలన పక్షిరాజా! బ్రహ్మ దగ్గరకు వెళ్ళు. బ్రహ్మ ఆజ్ఞ ప్రకారం నడచుకో" అన్నాడు నారదుడు.

నారదుడు ఈ విధంగా శ్రీరామచంద్రుని గుణాలను గానం చేస్తూ మాటిమాటికి హరిమాయ బలాన్ని వర్ణిస్తూ వెళ్ళాడు.

గరుడుడు బ్రహ్మ వద్దకు వెళ్ళి ఆయనకు కూడా తన సందే హాన్ని తెలియపరచింది. దాని మాటలు విని బ్రహ్మ శ్రీరామునకు తలవంచి. ఆయన ప్రతాపాన్ని తెలిసికొనగానే, ఆయన మనస్సులో ప్రేమ పెరిగిపోయింది.

కవులు, పండితులు, జ్ఞానులందరు మాయాధీసులని శ్రీహరి మాయ చాలా బలవత్తరమైనదని, తనను కూడా అనేకసార్లు నాటక మాడించిందని, ఈ సంపూర్ణ చరాచర ప్రపంచాన్ని తానే సృష్టిం చినా, తాను మాయ ద్వారా మోహితుడవుతున్నానని, అలాంటి పరిస్థితులలో పక్షిరాజు మోహంలో పడడం ఆశ్చర్యకరమేమీలేదని మనస్సులో అనుకొంటూ బ్రహ్మ-"గరుడా! నీవు శంకరుని వద్దకు వెళ్ళు. ఎక్కడా ఎవరిని ఏమీ అడుగవద్దు. అక్కడే నీ సందేహాలు దూరమయిపోతాయి" అన్నాడు.

గరుడుడు చాలా ఆదుర్దాగా నా వద్దకు వచ్చి తన సందేహ ఆను తెలిపాడు. గరుడుని వినయ పూర్వకమైన మాటలు విని ప్రేమతో-"గరుడా! నీవు నన్ను త్రోవలో కలసికొన్నావు. ఇక్కడ

నీకెలా తెలియపరచగలను? చాలాకాలం వరకు మంచివారితో కలసి వుంటే నీ సంశయము దూరమయిపోతుంది. అక్కడ హరి కథలను మునులు అనేక విధాలుగా గానం చేస్తుంటారు. వాటిని శ్రద్ధగా వినాలి. ఆ కథల, ఆది, మధ్య, అంతాల్లో ఆయనను గురించి వివరంగా వుంటుంది.

సోదరా! ప్రతిరోజు హరికథ చెప్పే చోటుకు నిన్ను పంపుతున్నాను. వెళ్ళి విను. కథ వినగానే నీ సంశయం దూరమయిపోతుంది. శ్రీరాముని పాదాలయందు ప్రేమ గట్టి పడిపోతుంది.

మంచివారి కలయికలేనిచోట హరికథ వుండదు, కథను వినకపోతే మోహం వదలిపోదు. మోహం దూరం కాకపోతే శ్రీరామచంద్రుని పాదాలయందు ప్రేమ నిలుకడగా వుండదు.

ప్రేమలేని యోగ, తప, జ్ఞాన, వైరాగ్యాల వలన శ్రీరాముడు లభించడు.

ఉత్తర దిక్కున నీలపర్వతముంది. అక్కడ ఎంతో శీలవంతురాలైన కాగభుశుండి వుంది, అక్కడికు వెళ్ళు. అది రామ భక్తి మార్గంలో చాలా నేర్పరి, గుణవంతురాలు, చాలా ప్రాచీనమైనది, అది రామ కథను ఎల్లప్పుడు చెబుతూ వుంటుంది. ఆ కథను అనేక రకాలైన శ్రేష్ఠమైన పక్షులు ఆదరంగా వింటూ వుంటాయి. అక్కడకు వెళ్ళి శ్రీరామచంద్రుని గుణాలు విను. వాటిని వింటే మోహంతో ఏర్పడిన నీ దుఃఖం దూరమైపోతుంది" అని నేను గరుడునితో చెప్పాను. అది సంతోషంగా నా పాదాలకు నమస్కరించి వెళ్ళింది.

పార్వతీ! రఘునాధుని దయవలన నేను అన్ని రహస్యాలు తెలిసికున్నాను. ఆయన ఎన్నడు అభిమాన పడలేదు. అందువలన నేను గరుడునకు తెలియ జెప్పలేదు. పక్షి, పక్షి భాషనే తెలిసి

కొంటుంది. అందు వలన దానిని మాట్లాడకుండా ఆపలేదు,

పార్వతీ! ప్రభువు మాయ చాలా బలవత్తరమైనది. అది ఎంత జ్ఞానవంతుడనయినా మోహపెడుతుంది. జ్ఞానుల, భక్తులలో శ్రేష్ఠురాలు, త్రిలోక నాథుని వాహనమయిన గరుడునికూడా మాయ మోహితురాలిని చేసింది.

# 36

మాయ శివుని, బ్రహ్మను కూడా మోహితులను చేస్తున్నపుడు, ఇక ఇతరుల సంగతి చెప్పేదేముంది? ఇది తెలియడంచేతనే మునులు మాయకు స్వామి అయిన ప్రభువును భజిస్తున్నారు.

గరుడుడు బుద్ధిమంతుడు, భక్తుడు అయిన కాగభుశుండి వున్న చోటుకు వెళ్ళాడు. ఆ పర్వతాన్ని చూడగానే గరుడునకు ఎంతో సంతోషం కలిగింది. మాయామోహం వలన ఏర్పడిన దుఃఖం దూరమయిపోయింది.

చెరువులో స్నానంచేసి, శ్రేష్ఠమైన ఆ జలాన్ని పానంచేసి, మనస్సులో సంతోషించి వటవృక్షం క్రిందకు వెళ్ళింది. ముసలి పక్షులెన్నో శ్రీరాముని చక్కని కథను వినడానికి అక్కడకు వచ్చాయి. కాగభుశుండి కథ ప్రారంభించబోతున్నది. అదే సమయంలో గరుడపక్షి అక్కడకు వచ్చింది. పక్షులరాజు గరుడుడు రావడం చూచి కాగభుశుండి సభలోని వారంతా సంతోషించారు.

గరుడుని చాలా బాగా ఆదరించి, కుశలములడిగి, కూచోడానికి ఆసనమిచ్చి, ప్రేమగా పూజించి, భుషుండి-"పక్షిరాజా! మీ దర్శనంవల్ల నేను కృతార్థురాలనయిపోయాను. మీఆజ్ఞప్రకారం ఏమి చేయమంటే, అది చేస్తాను. మీరేమి పనిమీద ఇక్కడకువచ్చారు?" అంది.

"మీరు ఎప్పుడు కృతార్థరూపులే. శివుడు ఆదరంగా, తన శ్రీముఖంతో మిమ్ము పొగడియున్నాడు

సోదరా! నేను వచ్చిన పనులన్నీ, మీ దర్శనంతోనే పూర్తయిపోయాయి. మీ ఈ అతి పవిత్రమైన ఆశ్రమాన్ని చూచిన తరువాత మోహ, సంశయ, భ్రమలన్నీ తొలగిపోతూన్నాయి.

సోదరా! అతి సుఖాన్ని కలిగించేది, దుఃఖాలను దూరం చేసేది అయిన శ్రీరాముని కథను ఆదరంగా వినిపించమని నేను మిమ్ము ప్రార్థిస్తున్నాను."

గరుడుని వినయ పూర్వకమైన మాటలు వినగానే కాగభుశుండి మనస్సులో చాలా సంతోషించింది. అది శ్రీరామచంద్రుని గుణాల కథను చెప్పనారంభించింది.

"భవానీ! ఆ పక్షి మొదట చాలా ప్రేమతో రామచరిత మానసరూపమైన సరోవర రూపకాన్ని చెప్పింది. మరల నారదుని అపారమైన మోహము, రావణుని అవతార విషయాన్ని చెప్పింది. ఆ తరువాత ప్రభువు అవతారమెత్తుటకు కారణమయిన కథను వర్ణించింది. మరల మనస్సుంచి రాముని బాల్య చరిత్రను చెప్పింది. తరువాత విశ్వామిత్రునిరాక, శ్రీరాముని వివాహ కథలు చెప్పింది.

ఆ తరువాత శ్రీరాముని రాజ్యాభిషేక విషయము, మరల దశరథుని ఆజ్ఞప్రకారం రాజ్యాభిషేకమాగిపోవడం, నగరవాసుల విరహము, శ్రీరామలక్ష్మణుల సంవాదము, శ్రీరాముని అరణ్యవాసము, నిషాదుని ప్రేమ, గంగను దాటడం, తీర్థరాజైన ప్రయాగ వాసము, వాల్మీకిని ప్రభువు కలిసికోవడం, చిత్రకూటంలో భగవానుడుండడం, మంత్రి పట్టణానికి తిరిగి రావడం, రాజుగారి మరణం, భరతుడు తిరిగి రావడం, ఆయన ప్రేమవర్ణన, రాజుగారి అంత్యక్రియలు, నగరవాసులతో కలసి భరతుడు రాముని వద్దకు వెళ్ళడం,

రాముడు ఆయనకు నచ్చచెప్పడం, పావుకోళ్ళు తీసికొని నగరానికి భరతుడు తిరిగి రావడం, భరతుడు వున్న రీతి, ఇంద్రుని కుమారుని చిలిపి చేష్టలు, మొదలైన రామాయణ కథంతా చెప్పింది.

భవానీ! నేను నీకు చెప్పిన కథంతా కాగభుశండి గరుడునితో చెప్పింది. రామకథంతా విని గరుడుడు మనస్సులో చాలా ఆనంద పడి—"కాగభుషండీ! మీ ద్వారా శ్రీరాముని చరిత్రంతా విని, నా సందేహ, భ్రమలు దూరమయిపోయాయి. మీ దయ వలన నాకు శ్రీరాముని పాదాలయందు ప్రేమ అధికమైంది. రణక్షేత్రంలో ప్రభువు నాగపాశ బంధితులయినపుడు నాకు చాలాఆశ్చర్యం వేసింది' సచ్చిదానందుడయిన శ్రీరాముడు ఎందుకు వ్యాకులుడయినాడు? దీనికి కారణమేమిటి?

ఆయన సాధారణ మనుష్యునిలాగ ప్రవర్తించే సరికి నాకు చాలా సందేహం కలిగింది. ఆ భ్రమే యిప్పుడు నాకు మేలు చేసి నట్లుగా భావిస్తున్నాను. ఎందుకంటే, ఈ వంకతో దయానిధి భగ వంతుడు నా యందు దయ చూపాడు.

ఎండవలన వ్యాకులపడే వ్యక్తి, చెట్టు నీడ లభించగానే సుఖ మనుభవిస్తాడు. నాకేగాని మోహము కలిగి యుండకపోతే, నేను మిమ్మెలా కలసికొని వుండేదాన్ని? ఇంత చక్కని కథ ఎలా విన గలిగేదాన్ని? శ్రీరామచంద్రుని దయ వున్నవారికి నిజమైన భక్తులు లభిస్తుంటారు అని శాస్త్రాలు, వేదాలు, పురాణాలు చెప్పాయి. ఆ పద్ధతిలోనే మీరు గానం చేశారు. శ్రీరాముని దయవల్లనే మీ దర్శనం లభించి, నా సందేహం దూరమయింది" అంది గరుడుడు.

పక్షిరాజు గరుడుని వినయము, ప్రేమతోకూడిన మాటలు విని కాగభుశండి చాలా సంతోషించింది. శరీరం పులకించిపోయింది. ప్రేమాసంధాలు పెరిగాయి,

పార్వతీ! బుద్ధిమంతులు, శీలవంతులు, పవిత్రులు కథ వినా లను కుతూహలం కలవారు, శ్రీహరిభక్త శ్రోతలను చూచి సజ్జనులు ప్రభువు రహస్యాలను కూడా వెల్లడి చేస్తుంటారు

గరుడునియందు ప్రేమగల కాగభుశుండి మరల-"సఖా! మీరు నాకన్నివిధాలా పూజ్యులు, శ్రీరామచంద్రుని కృపకు పాత్రులు. మీకు సందేహము, మోహము, మాయ ఏమీలేవు. మీరు నాయందు దయచూపారు. పక్షిరాజా! మోహము వంకతో మిమ్మ నా వద్దకు పంపి శ్రీరామచంద్రుడు నా విలువను పెంచాడు.

పక్షులస్వామీ! మీరు మోహమని చెప్తున్నారు. అందులో ఆశ్చర్యమేమీ లేదు. నారదుడు, మహాదేవుడు, బ్రహ్మ, సనకాది మునీశ్వరులు ఆత్మజ్ఞానానికి జ్ఞానులు. వారిలో ఎవరిని మోహం గ్రుడ్డివారిని చేయలేదు? మన్మథుడు నాట్యమాడించని వ్యక్తి ప్రపం చంలో ఎవడున్నారు? తృష్ణ ఎవరిని తప్పుదారులు పట్టించకుండా వుంది? క్రోధం ఎవరి హృదయాన్ని మండించలేదు. ఈ ప్రపం చంలో లోభం తన వైపులాక్కొనని తాపసుడు, శూరవీరుడు, పండితుడు, గుణవంతుడు ఎవరైనా వున్నారా?

లక్ష్మి మదమెక్కించి వంకరనడకలు నడిపించని దెవరిని? అధికారం ఎవరిని చెవిటివారిని చేయకుండా వుంది? సుందర స్త్రీ మోహంలో పడని వారెవరు? ఆమె నయన బాణాలకు ఎవరు తట్టుకో గలిగారు? రజ, స్తమోగుణాల వలన ఎవరికి సన్నిపాత జ్వరం రాలేదు? మద మాత్సర్యాలు వ్యాకులపరచందెవరిని? యౌవన జ్వరం ఎవరిని రెచ్చగొట్టలేదు? మమత ఎవరి కీర్తిని నాశనం చెయ్యలేదు? మత్సరము ఎవరిని కళంకితులను చేయలేదు? శోక రూపమైన గాలి ఎవరిని తల్లక్రిందులు చేయకుండా వుంది? చింతా రూపమైన పాము ఎవరిని కరువలేదు? ప్రపంచంలో మాయ వలలో

పడనివారెవరున్నారు? పుత్రులు, ధనము, వంశము, లోకప్రతిష్ఠ అనే కోర్కెలు ఎవరి బుద్ధిని భ్రష్టము చేయకుండా వున్నాయి? వీటి ప్రభావం చాలా గొప్పది. మహాదేవుడు, బ్రహ్మలే దీనిని చూచి వణికి పోతుంటే, మిగతావారు ఎంత?

మాయారూపమైన ప్రబల సైన్యం ప్రపంచంలో వ్యాపించి వుంది. దాని సేనాపతులు కామ, క్రోధ, మోహము మొదలైనవి. దంభము, దుర్మార్గము, కపటము దాని యోధులు.

ఈ మాయయే శ్రీరామచంద్రుని దాసి. బాగా ఆలోచిస్తే మిథ్య అయినప్పటికీ, శ్రీరాముని దయలేనిది, ఈ మాయ వదలి పోదు.

పక్షిరాజా! గరుడా! శ్రీరాముని నిజ కథను నాకు తెలిసినంత వరకు చెప్తాను, శ్రీరామచంద్రుడు మానవరూపం దాల్చినప్పుడల్లా భక్తుల కొరకు అనేకమైన లీలను చేస్తున్నప్పుడు, నేను అయోధ్యకు వెళ్లి ఆయన బాలలీలలు చూచి సంతోషిస్తూంటాను."

ప్రభువు నాతో బాలలీలలు చేస్తుండేవాడు. నేను ఎన్నో రకాలుగా నా మనస్సును అదుపులో పెట్టుకో ప్రయత్నించేదాన్ని. కాని మనస్సుకు శాంతి లభించేదికాదు.

ప్రభువు చరిత్రను ఆయన అధికారాన్ని తెలిసికోగానే నా బుద్ధి పనిచేయకుండా పోయేది. నేను "దీనరక్షకా! నన్ను రక్షించండి" అంటూ భూమిమీద పడిపోయాను. నోటమాటరాలేదు. నేను ప్రేమలో వ్యాకులంగా వుండడం చూచి తన మాయా ప్రభావాన్ని ఆపి, ఆయన కరకమలాలను నా తలమీద పెట్టి, నా సంపూర్ణ దుఃఖాన్ని దూరం చేశాడు.

సేవకులకు సుఖానిచ్చే శ్రీరామచంద్రుడు నా మోహాన్ని పోగొట్టాడు. ప్రభువు భక్తవత్సలత చూచి నా హృదయంలో అతిప్రేమ

ఏర్పడింది. నేను కళ్ళంట నీళ్ళు పెట్టుకొని, పులకిత శరీరంతో, చేతులు జోడించి వినయంగా భక్తిని ప్రసాదించమని కోరాను. ప్రేమ సహితమైన నా మాటలను విని శ్రీరామచంద్రుడు–

"కాగభుశుండీ! నీవు నన్ను అతి సంతోషంగా ఉండడంచూచి ఏదో ప్రసాదించమని కోరుతున్నావు. అణిమా మొదలైన ఎనిమిది సిద్ధులు నవనిధులు, అన్నిసుఖాలకు నిధులయిన మోక్షము మొదలైన జ్ఞానము,వివేకము వైరాగ్యము, విజ్ఞానము, మునులకు కూడా అసాధ్యమయిన అనేక గుణాలు, ఈనాడు నీకు అన్నీ యిస్తాను. నీకేమి కావాలో కోరుకో" అన్నాడు.

"స్వామి మాటలు విని నేను అతి ప్రేమలో నిమగ్నమయి, ప్రభువు నాకు సంపూర్ణ సుఖాలు కలిగించడానికి యిష్టపడ్డారు, కాని తన భక్తిని ప్రసాదిస్తానని అనలేదు, భక్తిలేని గుణాలన్నీ, ఉప్పు లేని కూరల్లాగా, నిస్సారమైనవి. పక్షిరాజా! భజనలేని సుఖమెందుకు పయోగిస్తుంది?" అని ఆలోచించి–"ప్రభూ! మీరు నేనంటే ఇష్టముండి వరాలిచ్చారు. నేను నా మనస్సులో వున్న వరాన్నడుగుతున్నాను. మీ నిష్కామ భక్తిని వేదాలు, పురాణాలు గానం చేస్తున్నాయి, భక్తుల కల్ప వృక్షమా! ఆ భక్తిని నా కివ్వండి."అని అడిగాను.

రఘువంశస్వామి "అలాగే"అంటూ, అతి చక్కని మాటలు పలికాడు–"కాగభుశుండీ! నీవు చాలా తెలివిగల దానవు. ఇలాంటి వరము నీవడుగక మరెవరడుగుతారు? నీవు అన్ని సుఖాలకు నిధి అయిన భక్తిని కోరావు. ప్రపంచంలో నీ వంటి అదృష్టవంతులు మరెవ్వరూ లేరు. నీ చాతుర్యం చూచి నేను విస్తుపోయాను. పక్షీ! నా దయ వలన నీ హృదయంలో మంచి గుణాలన్నీ చేరిపోతాయి. నా భక్తి, జ్ఞానం, విజ్ఞానం, వైరాగ్యం, యోగం, చరిత్రలు, వాటి రహస్యాలు, భేదాలు, నీవు నా దయవలన తెలిసికోగల్గుతావు. నీకు సాధించు

కష్టమేమీ వుండదు. ఇక నీకు మాయ వలన ఏ బాధలూ వుండవు. నన్ను నీవు అనాది, పుట్టుకలేని వానినని, నిర్గుణుడను, దివ్యగుణాల గనినని, బ్రహ్మనని అని తెలిసికో.

కాగభుశుండీ! నాకు నా భక్తులు ఎల్లప్పుడు ఇష్టులు. అది తెలిసికొని మనసా, వాచా, కర్మణా నా పాదాల యందు నిశ్చలమైన ప్రేమనుంచు.

ఇప్పుడు నా సత్య, సహజమైన, వేదాల్లో వర్ణించబడిన పవిత్రమైన మాటలు విను, నేను నీకు, నా అంతర్యం వినిపిస్తాను. దానిని మనస్సులో నుంచుకొని అన్నింటిని వదలి నన్ను భజించు.

ఈ ప్రపంచము నా మాయ వలన ఉత్పన్నమయింది. రకరకాల చరాచర జీవులను నేను ఉత్పన్నం చేశాను. జీవులన్నీ నాకు ప్రియమైనవే, కాని మనుష్యులు నాకు అందరికంటే, అన్నిటికంటే మరీయిష్టులు.

ఆ మనుష్యులలో కూడా బ్రాహ్మణులు, బ్రాహ్మణులలో కూడా వేదాలు తెలిసిన వారు, వారి కంటే కూడా వేదాలలో చెప్పినట్లు నడచు కునేవారు, వారిలో కూడా విరక్తులు నాకు ప్రియులు. విరక్తులలో కూడా, జ్ఞానులకంటే నాకు విజ్ఞానులు అధిక ప్రియులు. విజ్ఞానుల కంటే కూడా నాకు నా సేవకులు ప్రియులు. వారికి నేను తప్ప మరొకగతి లేదు. నాకు భక్తులతో సమానమైన ప్రియమైనవారు లేరు.

భక్తి లేని బ్రహ్మ అయినా నాకు అన్ని జీవులతో సమానంగానే యిష్టుడు. కాని భక్తిగలవారు, అతినీచులయినా, నాకు నా ప్రాణాలతో సమానులైనవారే అది నా పద్ధతి.

పవిత్రులు, శీలవంతులు, బుద్ధిమంతులయిన సేవకులు ఎవరికి యిష్టులు కారు? వేదాలు, పురాణాల నీతి కూడా ఇదే. కాగభుశుండీ! జాగ్రత్తగా విను-

ఒక తండ్రికి అనేకమంది పుత్రులు వేరువేరు గుణాలవారు, వేరువేరు శీలవంతులు, ఆచరణతేడాల వారుంటారు. వారిలో విద్వాంసులు తాపసులు,జ్ఞానులు,ధనికులు,యోధులు,ధ్యానులు వుంటారు. కాని తండ్రి ప్రేమ అందరి యందు సమానంగానే వుంటుంది. కాని వారిలో మనసా, వాచా, కర్మణా తండ్రి యందు భక్తి వున్నవాడు,కలలో కూడా మరొక ధర్మాన్ని ఎరుగని వాడు, తండ్రికి తన ప్రాణాలతో సమానమైన వాడవుతాడు. అతడు మూర్ఖుడైనా సరే, అతనికే ముందు స్థానముంటుంది. అలాగే దేవతలు, మనుష్యులు, రాక్షసులు సహితము నా ద్వారానే పుట్టారు. నా దయ అందరికీ సమానంగానే వుంటుంది. కాని మదము, మాయలను వదలి నన్ను మనసారా భజించే పురుషుడు, నపుంసకుడు స్త్రీ, చరాచర జీవులెవరైనా సరే, అన్ని విధాలా కపటాలు వదలి నన్ను భజించువాడే నా కత్యంత ముఖ్యులు.

పక్షిరాజా! నిజమైన నిష్కామ భక్తుడు నా ప్రాణాలతో సమానమైనవాడు గనుక, అన్ని ఆశలు, అండలు వదలి నన్ను భజించు. నిన్ను కాలము ఏమీ చేయలేదు. ఎల్లప్పుడు నా ధ్యానము, భజన చేస్తూ వుండు"అన్నాడు. ప్రభువు మాటలు నాకు తృప్తినివ్వలేదు, అయినా మనస్సులో చాలా సంతోషంగా వుంది.

ఆ సంతోష, సుఖాలను మనస్సుకు, చెవులకు మాత్రమేతెలుసు. నాలుక ఏమీ చెప్పలేదు. ప్రభువు అందం నేత్రాలకు మాత్రమే తెలుసు. వాటికి నాలుకలేదు, అవి ఎలా చెప్పగల్గుతాయి?

అనేక రకాలుగా నాకు తెలియజెప్పి, సుఖాన్నిచ్చి ప్రభువు మరల ఆ బాల చేష్టలే చేస్తున్నాడు. కన్నీళ్ళతో తల్లి వైపు చూచి, ఆకలి అవుతున్నట్లుగా చూస్తున్నాడు.

ఆ స్థితిని చూచి తల్లి వెంటనే పరుగెత్తి, మంచిమాటలు చెప్పి

శ్రీరామచంద్రుని హృదయానికి హత్తుకొని, ఒడిలో కూచోబెట్టుకొని, రఘునాథుని చరిత్రను గానం చేస్తూ పాలు త్రాగిస్తున్నది.

నేను అయోధ్యలో కొన్నాళ్ళు ఉన్నాను.మనోహరమైన బాల లీలలు చూస్తున్నాను. శ్రీరాముని దయవలన భక్తివరం పొంది ప్రభువు పాదకమలాలకు నమస్కరించి నా ఆశ్రమానికి వచ్చాను.

శ్రీరామచంద్రుడు నన్ను తన వస్తువుగా స్వీకరించిన తరువాత మాయనన్నేమీ చేయలేకపోయింది. హరి మాయ నన్నెలా నాట్యం చేయించిందో, ఆ రహస్యకథంతా నీకు చెప్పాను.

పక్షిరాజా! ఇప్పుడు నా అనుభవం చెప్తున్నాను. హరి భజన చేయకుండా కష్టాలు దూరంకావు. గరుడా విను! శ్రీరాముని దయలే కుండా, శ్రీరాముని మహిమను తెలిసికోలేము.

అధికారం తెలియనిది, నమ్మకం కుదురదు. నమ్మకం కుదుర నిది ప్రేమ ఏర్పడదు. ప్రేమ లేకుండా భక్తి నిలువదు. పక్షిరాజ గరుడా! నీళ్ళ నునుపు మీద నిలువవు గదా?

గురువు లేకుండా జ్ఞానం, జ్ఞానం లేకుండా వైరాగ్యం సాధ్యమ వుతుందా? శ్రీహరి భక్తి లేకుండా సుఖము లభించదని వేదాలు,పురా ణాలు చెబుతూనే వున్నాయి.

సోదరా! ఏ మనిషయినా సహజ సంతోషం లేకుండా సుఖము పొందగల్గుతాడా? కోట్ల ఉపాయాలు చేసినా నీళ్ళ లేకుండా నావ నడు స్తుందా?

తృప్తిలేనంత వరకు కోర్కెలు తగ్గవు. కోర్కెలున్నంతకాలం కలలో కూడా సుఖముండదు. శ్రీరాముని భజించనిది కోర్కెలు తగ్గ వు, భూమి లేకుండా చెట్లు ఎలా వుండగల్గుతాయి?

తత్త్వజ్ఞానం లేకుండా సమత్వ బుద్ధి ఏర్పడదు. ఆకాశం లేకుం డా ఖాళీ భాగమున్నట్లు కనిపించదు. శ్రద్ధ లేకుండా దయాధర్మాలుం

డవు. జలం లేకుండా ప్రపంచంలో రసముండదు. పండితుల సేవలు చేయకుండా శీలవంతులు కాలేరు. తులసీదాసూ! తేజస్సు లేకుండా రూపముంటుందా?

ఆత్మ జ్ఞానం లేకుండా, మనస్సు స్థిరంగా వుండగల్గుతుందా? గాలి లేకుండా స్పర్శ ఉంటుందా? నమ్మకం లేకుండా సిద్ధి ప్రాప్తిస్తుందా? ప్రభు భజన లేకుండా సంసారరూపమైన భయము పోతుందా?

విశ్వాసం లేకుండా భక్తి ఉండదు. భక్తి లేకుండా శ్రీరాముని దయఉండదు. శ్రీరాముని కృపలేకుండా జీవుడు కలలో కూడా శాంతిని పొందలేడు.

ధీరబుద్ధీ! ఇలా ఆలోచించి కుతర్కాలు, సందేహాలను వదలి కరుణానిధి, సుఖాలనిచ్చే శ్రీరామచంద్రుని భజించు.

స్వామి! ప్రభుప్రతాపాన్ని నేను నా బుద్ధి ననుసరించిగానం చేశాను. ఇదంతా నేను నా కళ్ళారా చూచినది చూచినట్లు చెప్పాను.

శ్రీరాముని మహిమ, నామము, రూపము, గుణాల కథ అనంతమైనది. మునులు వారి బుద్ధిని బట్టి హరి గుణాలను గానంచేస్తున్నారు. వేదాలు, శేషుడు, మహాదేవుడు కూడా ఆ కథ అంతుతేల్చుకో లేక పోయారు.

మీతో మొదలుకొని, దోమల వరకున్న జీవులు ఆకాశంలోకి ఎగురుతున్నాయి. కాని దాని అంతు తెలియడం లేదు. ఇదే విధంగా శ్రీరాముని మహిమ అంతు తెలియనిది,దానిలోతు ఎవరైనా తెలిసికో గలిగారా?

శ్రీరామచంద్రుడు మన్మథునితో సమానమైన దేహ సౌందర్యం గలవాడు, కోట్లదుర్గలతో సమానమైన శత్రువుల నాశకుడు. అరబ్బుల ఇంద్రులతో సమానమైన ఐశ్వర్యం కలవాడు. అరబ్బు ఆకాశాలంత విస్తారం కలవాడు.

ఆయన అరబ్బుల గాలుల కంటే మహా బలవంతుడు, అరబ్బుల సూర్యుల కంటే ప్రకాశవంతుడు, అరబ్బుల చంద్రులతో సమానమైన చల్లని వాడు, ప్రపంచ దుఃఖాలను నాశనం చేసేవాడు. శ్రీరామచంద్రుడు అరబ్బుల యములలాగా చాలా కఠినుడు, అంతు తెలియని వాడు, అరబ్బు ధూమకేతులతో సమానమైన బలవంతుడు.

అరబ్బు పాతాళాలతో సమానమైన లోతైనవాడు. అరబ్బుల యములతో సమానమైన భయంకరుడు. కోట్ల తీర్థస్థానాలతో సమానంగా పవిత్రం చేసేవాడు. ప్రభువు నామము పాతక సమూహాలను నాశనం చేసేది.

శ్రీరఘునాధుడు కోట్ల హిమాలయ పర్వతాలతో సమానంగా స్థిరమైనవాడు, అరబ్బు సముద్రాలతో సమానమైన గంభీరుడు. అరబ్బుల కామధేనువులతో సమానమైన కోర్కెలను తీర్చువాడు.

ప్రభువులో, కోట్ల సరస్వతులతో సమానమైన చాతుర్యం, అరబ్బు బ్రహ్మలతో సమానమైన సృష్టించే నైపుణ్యముంది. ఆయన అరబ్బు విష్ణువులలాగా రక్షకుడు, అరబ్బు రుద్రులతో సమానమైన సంహారకర్త.

ఆయన కోట్ల కుబేరులతో సమానమయిన ధనవంతుడు, కోట్ల మాయలతో సమానమయిన మాయగాడు, బరువు లేపడంలో కోట్ల శేషనాగులతో సమానుడు. ఆ జగదీశ్వరునకు హద్దులు, ఉపమలులేవు.

శ్రీరామునితో సమానమయినవాడు శ్రీరాముడే. అరబ్బుల మిణుగురు పురుగులను సూర్యునితో సమానమంటే, సూర్యుని గొప్పతనం తగ్గిపోతుంది. ఇదే విధంగా తమతమ బుద్ధిని పట్టి మునీశ్వరులు శ్రీహరిని గానం చేస్తున్నారు. ప్రభువు భావాలను ప్రేమించేవాడు, దయాళువు, ప్రేమను విని తృప్తి పడుతాడు.

శ్రీరామచంద్రుడు అపారమయిన గుణాల సాగరుడు, అలాంటి

వాని లోతును తెలిసికోవ..ం తేలికా? నేను భక్తుల సాంగత్యంలో వుండి విన్న మాటలే నీతో చెప్పాను. సుఖనిధి, కరుణాసాగరుడు, ప్రేమ భావవశుడు. మమత, అహంకార, మానాలను వదలి ఎల్లప్పుడు సీతాపతి రాఘవేంద్రుని భజనచేయాలి."

కాగభుశుండి చెప్పిన మనోహరమయిన మాటలు విని గరుడుడు సంతోషించి తన రెక్కలు విప్పార్చి, శ్రీరాముని ప్రతాపాన్ని హృదయంలో దాచుకుంది. దాని కళ్ళవెంట నీళ్ళొచ్చాయి. మనస్సు ఎంతో తృప్తిపడింది.

అనాది బ్రహ్మను మనిషి అనుకొన్నానే, అని గరుడుడు తాను ఇంతకు ముందు అనుకున్నందుకు చాలా పశ్చాత్తాపపడి, కాగభుశుండి పాదాలకు తలవంచి నమస్కరించి, దానిని రామునితో సమానురాలని భావించి ప్రేమ పెంచుకుంది.

గురువు లేకుండా ఎవ్వరు సంసారసాగరాన్నుండి ఒడ్డుకు చేరుకోలేరు. వారు శివులయినా, బ్రహ్మలయినా అంతే, అనుకొని– "సోదరా! నన్ను సందేహ రూపమయిన సర్పము కాటువేసింది. అక్కడకు తర్కరూపమయిన చాలా రకాల దుఃఖాలు కలిగించే అలలు వస్తుండేవి. భక్తులకు సుఖాలనిచ్చే రఘునాధుని కృప వలన నా మోహము నన్ను వదలిపోయింది. నేను శ్రీరామచంద్రుని రహస్యాన్ని తెలిసికొన్నాను" అంది కాగభుశుండి.

కాగభుశుండిని అనేక రకాలుగా పొగడి, తలవంచి నమస్కరించి, చేతులు జోడించి గరుడుడు ప్రేమ, వినయాలతో– "ప్రభూ! నేను తెలియనిదానినై మిమ్మడుగుతున్నాను. దయాసింధూ! నన్ను మీ దాసునిగా తలంచి, ఆదరంగా నేనడుగు ప్రశ్నలకు సమాధానమివ్వండి–

ఋషులు అంతా తెలిసినవారు, తత్త్వజ్ఞానులు, మోహానికి

దూరులు, బుద్ధిమంతులు, శీలవంతులు. ఆచరణశీలురు, జ్ఞానులు, విరాగులు, విజ్ఞాననిధులు. శ్రీరామచంద్రునికి ప్రియమైన భక్తులు. మీరు ఈ కాకి దేహాన్ని ఎందుకు స్వీకరించారు? సోదరా! వివరంగా చెప్పండి. ఈ చక్కని రామచరిత మానసం మీకెక్కడ లభించింది? చెప్పండి.

మహాప్రళయంలో కూడా మీకు నాశనముండదని, శంకరుడు అసత్యం చెప్పడు. ఇది కూడా నాకు సందేహంగా వుంది. చరాచర జీవులు, నాగులు, మనుష్యులు, దేవతలు మొదలైనవారందరు ఈ ప్రపంచంలో కాలానికి బలయిపోయేవారే. అసంఖ్యామైన బ్రహ్మాండాలను నాశనం చేసే కాలం ఎల్లప్పుడూ వుండేదే.

ఈ భయంకర కాలము నీ జోలికి ఎందుకు రాలేక పోతున్నది? ఇది జ్ఞానప్రభావమా? యోగప్రభావమా? ప్రభూ! మీ ఆశ్రమంలోకి రాగానే నా మోహము, భ్రమలు పారిపోయాయి. ఇందుకు కారణమేమిటి? ఇదంతా ప్రేమతో చెప్పండి" అంది.

"ఉమా! గరుడుని మాటలు విని కాగభుశుండి చాలా సంతోషించి, ఎంతో ప్రేమతో-"గరుడా! నీ బుద్ధి ధన్యమైనది. నీ ప్రశ్నలు నాకు బాగా నచ్చాయి. నీ ప్రేమతో కూడిన చక్కని ప్రశ్నలను వినేటప్పటికి నాకు నా అనేక జన్మల విషయాలు జ్ఞప్తికి వచ్చాయి. సోదరా! నా కథ వివరంగా చెప్తాను, జాగ్రత్తగా విను.

జప, తప, యజ్ఞ, శమ, దమ, ఇంద్రియ నిగ్రహ, వ్రత, దాన, వైరాగ్య, యోగ, విజ్ఞానాలు మొదలైన వాటి ఫలాలన్నీ శ్రీరామచంద్రుని పాదాలయందు ప్రేమవుంటేనే సమకూర్తాయి. అలా కాకుంటే ఎన్ని చేసినా ఏమీ ప్రయోజనముండదు.

ఈ శరీరంతోనే నాకు శ్రీరాముని భక్తి ప్రాప్తించింది. అందు చేత ఈ శరీరమంటే నాకు ప్రేమ ఎక్కువ, స్వార్థమున్న వాట

న్నింటిని అందరు ప్రేమిస్తూనే వుంటారు.

పక్షిరాజా! గరుడా! తన మేలుగా దలంచి మహానీచునినైనా ప్రేమతో చూడాలని వేదమతాన్ననుసరించి సజ్జనులు చెప్తున్నారు. రేషన్ పట్టుపురుగుద్వారా ఏర్పడుతుంది. ఆ పట్టుద్వారా చక్కని, అందమైన బట్టలు తయారవుతున్నాయి. అందు చేతనే ఆ అపవిత్ర మైన పురుగును కూడా అందరు తమ ప్రాణాలతో సమానంగా చూచు కుంటున్నారు.

మనసా, వాచా, కర్మణా శ్రీరాముని పాదాలయందు ప్రేమ వుండడం జీవుని నిజమైన స్వార్థం. శరీరాన్ని పొందిన వారందరు శ్రీరాముని భజనలు చేసినపుడే ఆ శరీరాలు పవిత్రమైనవి, అంద మైనవి అవుతాయి.

రాముని కాదనిన వారి దేహాలు బ్రహ్మదేహంతో సమానమైన దైనా చతురకవులు, విద్వాంసులు ఆ దేహాలను గొప్పవని అనరు. స్వామీ! ఈ శరీరం ద్వారానే, శ్రీరాముని యందు భక్తి నాకు కుది రింది. ఇందుచేతనే ఈ శరీరమంటే నాకు చాలా యిష్టమని చెప్తు న్నాను.

నా యిష్టప్రకారము, నేను చచ్చినా, నేనీ కాకి శరీరాన్ని వద లను. ఎందుకంటే, శరీరం లేకుండా భజనలు చేయడం కుదరదని వేదాల్లో చెప్పివుంది. మొదట నన్నుకూడా మోహం బాధలుపెట్టింది. శ్రీరామునకు దూరంగా వున్నంతకాలం నాకు సుఖంగా నిద్రపట్టి ఎరుగను. అనేక జన్మలెత్తిన నేను అనేక విధాలైన యోగ, జప,తప యజ్ఞ, దానాలు మొదలైన కర్మలు చేశాను. పక్షిరాజా! నేను జన్మిం చని యోనులు లేవు. ఇపుడు నేను నా మొదటి పుట్టుకను గురించి చెప్తాను, విను. ఆ కథవింటే ప్రభువు పాదాలయందు ప్రేమ ఏర్పడి, బాధలన్నీ తొలగిపోతాయి.

# 37

గరుడా! మొదటి కల్పంలో, మొదటి కలియుగం పాపాలకు మూలమైనది. స్త్రీ పురుషులందరు అధర్మాలు చేస్తూ, వేదాలను వ్యతిరేకించారు. ఆ కలియుగంలోనే, నేను అయోధ్య నగరానికి వెళ్ళి శూద్రి యోనిలో పుట్టాను. నేను మనసా, వాచా, కర్మణా శివుని భక్తురాలను. కాని అన్యదేవతలను నిందించే అభిమానినైనాను. ధన మదం ఎక్కువగా వుండేది. ఎక్కువగా వాగుతూ వుండేదాన్ని. నా బుద్ధి తీక్ష్ణమైనది. నేను చాలా దుర్మార్గురాలను. నేను ఉండడం రాముని రాజధానిలోనేకాని, నేనాయన మహిమను ఎరుగనేఎరుగను.

ఎవరైనా సరే, ఏ జన్మలోనైనా అయోధ్య పట్టణంలో నివసిస్తే, తప్పకుండా శ్రీరామచంద్రుని భక్తులయిపోతారని వేదాలు, శాస్త్రాలు, పురాణాలు చెబుతున్నట్లు నేను తెలుసుకున్నాను.

శ్రీరామచంద్రుడు ధనస్సు, బాణాలు చేతిలోకి తీసికొని హృదయంలో నివసించగానే, అయోధ్యా పట్టణప్రభావము, ఆ ప్రాణికి తెలిసిపోతుంది. గరుడా! ఆ కలియుగంలోని పాపాలు అన్ని ధర్మాలను మింగేశాయి. సద్గ్రంథాలన్నీ మటుమాయమైపోయాయి, మూర్ఖులు తమ బుద్ధిని ఉపయోగించి అనేక చెడు మార్గాలు పట్టారు.

ప్రజలందరు మోహానికి దాసులైపోయారు. లోభం మంచిపనులను మింగేసింది. జ్ఞానివి, హరివాహనమైన గరుడా! ఇపుడిక కలియుగ ధర్మాలు కొన్ని చెప్తాను విను.

కలియుగంలో వర్ణ, ధర్మాలను నాలుగు ఆశ్రమాలు వుండవు. స్త్రీ, పురుషులంతరు వేదసంప్రదాయానికివ్యతిరేకులవుతారు. బ్రాహ్మణులు వేదాలను అమ్ముతారు. పాలకులే ప్రజలను తింటుంటారు. వేదాలు చెప్పినట్లెవ్వరు నడచుకోరు. ఎవరికి నచ్చిన మార్గము, వారి

దయిపోతుంది. బజాయిలు కొట్టేవారు పండితులుగా చలామణి అవుతుంటారు. అబద్ధాలాడేవారిని, మోసాలు చేసేవారిని అందరు ఆదరిస్తుంటారు.

ఇతరుల సొమ్మును కాజేసినవాడు తెలివిగలవాడు. ఎక్కువ దుర్మార్గాలు చేసేవాడు పెద్దమనిషి. అబద్ధాలాడడం, అక్రమాలు చేయడం చేతనయినవాడే కలియుగంలో గుణవంతుడు.

ఆచార భ్రష్టుడు, వేదమార్గాన్ని కాదన్నవాడే కలియుగంలో ప్రసిద్ధమైయిన జ్ఞాని, విరాగి. పెద్ద పెద్ద గోళ్ళు, పొడవైన జుట్టున్నవారు తాపసులు.

అమంగళ వేషాలు వేసికొనేవారు, అమంగళ భూషణాలు ధరించేవారు, అన్ని తిండ్లు తినేవారు. అంతా ఒకటే అనేవారు కలియుగంలో యోగులు, పూజ్యులు.

పరాయివారికి కీడు కల్గించేవారికి గౌరవము, ఆదరము ఎక్కువగా లభిస్తాయి. మనసా వాచా, కర్మణా అబద్ధాలాడువారే వక్తలు.

స్వామీ! పురుషులందరు స్త్రీల వశులై వుంటారు. నటుడు కోతిని ఆడిస్తే, ఆడినట్లు, మగవారు ఆడుతుంటారు. బ్రాహ్మణులకు శూద్రులు జ్ఞానోపదేశాలు చేస్తారు. యజ్ఞోపవీతాలు భుజాలమీద వేసికొని భ్రష్టదానాలు పుచ్చుకుంటూ వుంటారు. బ్రాహ్మణులు.

అందరు కామ, క్రోధ, మోహాల్లో చిక్కుకుపోతారు. దేవతలకు, బ్రాహ్మణులకు, వేదాలకు, భక్తులకు వ్యతిరేకులవుతారు. గుణవంతుడైన అందమయిన భర్తను వదలి దురదృష్టవంతురాండ్రయిన స్త్రీలు పరపురుషులయందు ప్రేమలు చూపుతుంటారు, ముత్తయిదువలు సైతం మెళ్ళో తాళి వగైరాలు లేకుండా ముండమోపుల్లాగా వుండాలని ఉబలాటపడుతుంటారు. కాని విధవలు మాత్రము తమ

శృంగారాలను వదలరు.

గురుశిష్యుల సంబంధం గ్రుడ్డి, చెవిటివారి సంబంధంలాగా వుంటుంది. ఒక్క శిష్యుడు గురోపదేశం వినడు. ఒక్క గురువు వద్ద నిలుకడగా శిష్యుడుండడు.

శిష్యునివద్ద ధనం పుచ్చుకొని, అతనికి చదువుచెప్పని గురువు ఘోరనరకంతో పడిపోతాడు. తల్లిదండ్రులు తమ బిడ్డలకు పొట్టలు నింపుకొనడానికి వీలున్న చదువు చెప్పించి అదే మంచిదని ఉపదేశా లిస్తుంటారు.

స్త్రీ పురుషులందరూ వేదాంతం చెప్తుంటారు. కాని వారు స్వార్థ కారణంగాడబ్బుకొరకు, ఎంత డబ్బు దొరికినా చాలనుకొని, స్త్రీలను, బ్రాహ్మణులను, గురువులను, అమాయకులను చంపడానికి వెనుకాడ రు. మేము మీకంటే తక్కువ వారము కామని శూద్రులు బ్రాహ్మణు లతో వాదోపవాదాలు చేస్తూంటారు. బ్రహ్మను ఎరిగున్న వాళ్ళంతా శ్రేష్ఠమైన బ్రాహ్మణులే అని, వృత్తుల కారణంగా కులాలొచ్చాయని వితండవాదన చేస్తుంటారు.

పరాయి స్త్రీని కోరేవారు, కపటంలో నేర్పరులు, మోహ, ద్వేష, మమతల్లో చిక్కుకొని వున్న మనుష్యులే వేదాంత వేత్తలయి పోతుంటారు. నేను కలియుగంలో యిలాంటి చరిత్ర చూచాను.

స్వయంగా భ్రష్టులయిపోవడమేగాక, మంచి మార్గాన వెళ్ళు వారిని కూడా చెడగొడుతుంటారు. తర్కాలతో వేదాలను నిందిస్తుం టారు. అలాంటి వారు కల్పాల వరకు ఒక్కొక్క నరకంలో వుం టారు.

తెలివికలవారయిన కుమ్మర్లు, చండాలురు, కిరాతులు,బోయలు చెంచులు, గమండ్లు మొదలైన తక్కువ వర్ణాలవారు స్త్రీ చనిపో యిన తరువాత, ఇంటిలోని సంపదలు నష్టమైపోయిన తరువాత తల

లు గుండ్లు చేయించుకొని సన్న్యాసులయిపోతారు. వారు బ్రాహ్మణుల చేత తమ పాదాలకు పూజలు చేయించుకుంటారు. తమచేతుల్తోతాము రెండు లోకాలను పాడుచేసుకుంటూ వుంటారు. బ్రాహ్మణులు, మూర్ఖులు, లోభులు, కాముకులు, ఆచారహీనులు, నీచజాతి వ్యభిచార స్త్రీలకు స్వాములవుతూ వుంటారు.

కలియుగంలో అందరు వర్ణసంకరులై, మర్యాద, గౌరవమూ లేకుండా జీవిస్తుంటారు, వారు పాపాలు చేసి, వాటికి ఫలితంగా దుఃఖాలు,భయాలు,రోగాలు, శోకాలు,వియోగాలు పొందుతూ వుంటారు.

వేదాలు ఒప్పుకొన్న, వైరాగ్య. జ్ఞానాలతో కూడిన శ్రీహరి భక్తి మార్గాన్నొదిలి మనుష్యుడు, మోహవశుడై నడచి, అజ్ఞానుడై అనేక క్రొత్తమార్గాలను కల్పించుకొంటూ వుంటారు.

సన్న్యాసులు చాలా ధనం సంపాదించి ఇళ్ళు, వాకిళ్ళు ఏర్పరచుకొని రాజభోగాలు అనుభవిస్తారు. వైరాగ్యం వారిలో రవ్వంత కూడా వుండదు. వారిలో కోర్కెలు ఎక్కువైపోతాయి. తాపసులు ధనవంతులవడం వలన, గృహస్థులు దరిద్రులు అయిపోతుంటారు. సోదరా! కలియుగ విలాసం భలే పసందుగా వుంటుంది.

పురుషుడు కులపతిని, పతివ్రతను ఇంటినుండి వెళ్ళగొట్టి, పోరంబోకునో, దాసీనో ఇంట్లో పెట్టుకొని కాపురం చేస్తుంటాడు. పెండ్లయ్యే వరకే పుత్రులు తల్లిదండ్రులను కనిపెట్టి వుంటారు. భార్యరాగానే తల్లిదండ్రులు శత్రువులయిపోతారు. పాలకులు ధర్మాన్ని వదలి పాపాలు చేస్తుంటాడు. వారు ప్రతిరోజు ప్రజలకు ఏదోఒక దండన యిచ్చి ఏడిపిస్తుంటారు.

నీచజాతి వాడయినా,ధనవంతుడు కులీనుడనిపించుకుంటుంటాడు. బ్రాహ్మణులకు జంధెము గుర్తు మాత్రమే మిగిలి వుంటుంది. బిట్ట

లు లేనివాడు తాపసి అయిపోతాడు. పురాణాలను, వేదాలను ఒప్పు కోనివారే కలియుగంలో హరిభక్తులు, నిజమైన సాధువులు అనిపించు కుంటున్నారు.

కవులు చాలా మంది వున్నారు, కాని ఉదార పురుషులు కన బడడం లేదు. గుణాల్లో దోషాలు వెదకేవారు తప్ప, గుణవంతులు లేకుండా పోయారు. కలియుగంలో తరచుగా కరువులు వస్తున్నాయి. అన్నం లేక అందరు దుఃఖపడుతున్నారు.

పక్షిరాజా! గరుడా! కలియుగంలో మోసము, కపటము, దం భము, ద్వేషము, దుర్మార్గము, కామ, క్రోధము, లోభము, అహం కారము ప్రపంచం మొత్తంలో వ్యాపించిపోతున్నాయి.

మనుష్యులు జప, తప, వ్రత, యజ్ఞ, దానాలు తామసభావం తో చేస్తున్నారు. దేవతలు భూమిమీద జలవర్షం కురిపించడంలేదు, నాటిన విత్తనాలు మొలవడంలేదు.

స్త్రీలకు వెంట్రుకలే ఆభూషణాలు. వారికి ఆకలి ఎక్కువగా అ వుతుంది. వారికి తృప్తి వుండదు. ధనం లేకపోవడం, ఎక్కువ కో ర్కెలుండడం వలన వారు దుఃఖాలపాలవుతున్నారు. వారు మూర్ఖం గా సుఖాలు మాత్రం కోరుతారు. కాని ధర్మంగా నడచుకోరు. వారికి తెలివి తక్కువ, కఠకు ఎక్కువ. వారిలో మృన్నితంలేదు.

రోగాలతో మనుష్యులు బాధలు పడుతున్నారు. భోగాలతో సుఖం లభించదని వారు తెలుసుకోవడంలేదు. కారణం లేకుండానే అభిమానము, విరోధము ప్రారంభిస్తున్నారు. అయిదు, పది సంవత్స రాల వయస్సువారి కయినా, కల్పాంతాల వరకు వదలని గర్వముం టున్నది.

కలియుగం మనిషిని తికమకపరచింది. కుమార్తెను, సోదరిని కూడా లెక్కచేయడంలేదు. ఆలోచించడంలేదు. మనస్సులో సంతో

షం, ఆలోచన, శాంతులు లేవు. మంచిజాతివారు, చెడ్డజాతివారు బిచ్చగాండ్లయిపోయారు.

మనుష్యులు ఈర్ష్యాళువులు, కపటులు, కఠినులు, ఆశపోతు లు అయిపోతున్నారు. అందరు మానవులే అనుభావం పోయింది. అం దరు వియోగల, అధిక దుఃఖాలతో బాధలు పడుతున్నారు. వర్ణాశ్రమ ధర్మాలు అడుగంటి పోతున్నాయి.

ఇంద్రియాలను అదుపులో పెట్టుకోవడం, దానం, దయ, తె లివి ఎవ్వరిలోనూ లేవు. మూర్ఖత్వము, మోసము చాలా పెరిగి పో యింది. స్త్రీ పురుషులందరు తమ శరీర సౌందర్యాలను చూచుకుం టున్నారు. ఇతరులను నిందించేవారు ప్రపంచంలో ఎక్కువై పో యారు.

సర్పానికి శత్రువయిన గరుడా! కలియుగము పాపాలకు, దో షాలకు నిలయమయినా, పరిశ్రమ ఏమీ చేయకపోయినా భవసాగరం నుండి ఉద్ధరించబడడం అనే ఒక మంచి గుణము మాత్రముంది.

సత్యయుగము, త్రేతా, ద్వాపరయుగాల్లో పూజలు, యజ్ఞాలు, యోగాల వలన లభించు ముక్తి కలియుగంలో మనుష్యుడు కేవలం భగవంతుని నామస్మరణ చేస్తేచాలు, ముక్తి పొందగల్గుతున్నాడు.

కృతయుగంలో యోగులు, జ్ఞానులయి హరిని ధ్యానించి భవ సాగరాన్నుండి తరించిపోయారు. త్రేతాయుగంలో అనేక రకాల య జ్ఞాలు చేసి, కర్మల ఫలాలన్నీ భగవంతున కర్పణంచేసి తరించారు. ద్వాపర యుగంలో శ్రీరఘునాధుని పాదాలకు పూజలు చేసి మను ష్యులు తరించిపోతున్నారు, మరొక మార్గంలేదు. కలియుగంలోమను ష్యుడు కేవలం హరి గుణాలను గానంచేసి భవసాగరపు లోతును కనుక్కోగల్గుతున్నారు, తరించిపోతున్నారు.

కలియుగంతో యోగాలు, యజ్ఞాలు, జ్ఞానాలులేవు. రామ గుణ

గానము మాత్రమే, ఆధారము. అన్ని అండలను వదలి శ్రీరాముని భజించిన వారు, ప్రేమతో ఆయన గుణాలను గానం చేసిన, సంసారాన్నుండి తరించిపోతున్నారు. కలియుగంలో నామప్రతాపం ప్రత్యక్షంగా కనిపిస్తున్నది. కలియుగంలో మరొక సుగుణమున్నది, మనస్సుతో చేసిన పుణ్యం కూడా పనికి వస్తుంది, పాపమేమీ చేయదు.

కలియుగంతో సమానమైన యుగం మరొకటి లేదు. నమ్మకంతో శ్రీరామచంద్రుని చరిత్రను గానం చేసిన వారందరు ఏ కష్టాలు పడకుండానే, ఈ భవసాగరాన్నుండి తరించి పోతున్నారు.

ధర్మంలో నాలుగు పాదాలు ముఖ్యమైనవి. అందులో నుండి కలియుగంలో ఒక్కదానం చాలు పుణ్యానికి, ఏ విధమైన దానం చేసినా మేలే జరుగుతుంది.

అందరి హృదయాల్లో, శ్రీరాముని దయవల్ల యుగాల ధర్మాలన్నీ నిత్యము జరుగుతూనే వున్నాయి. పరిశుద్ధమైన సత్త్వగుణము, సమత, విజ్ఞానం, మనస్సు సంతోషంగా ఉండడం, సత్యయుగ ప్రభావమనుకో.

సత్త్వగుణ మెక్కువవుండి, రజో గుణం తక్కువ వుండి, కర్మల యందు ప్రేమయుండి, అన్ని విధాల సుఖాలుండి, ట్లయితే ఇది త్రేతా యుగ ధర్మం.

రజో గుణము అధికంగా వుండి సత్త్వగుణము తక్కువగావుండి, కొంత తమోగుణం కూడా వుండి, మనస్సులో ఆనంద, భయాలు వుండి వుంటే, అది ద్వాపరయుగ ధర్మం.

తమోగుణం అధికంగా వుండి, రజోగుణము తక్కువగావుండి, నాలుగువైపుల విరోధాలు వుండి, వుంటే, అది కలియుగ ప్రభావము. బుద్ధిమంతులు యుగధర్మాలను తెలిసికొని, అధర్మాన్ని వదలి ధర్మాల యందు ప్రేమను చూపుతారు.

శ్రీరాముని పాదాల యందు ప్రీతి వున్నవారిని, కాలము,ధర్మము ఏమీ చేయలేవు. పక్షిరాజా! నటుడు చేసిన భయంకరమయిన, కపటము, అతని మాయానటుని సేవకునకు అంటుకోదు.

శ్రీహరి మాయ ద్వారా చేసిన దోషాలు; భగవంతుని భజనలు చేయకుండా దూరమయిపోవు, అలా ఆలోచించి కామకోర్కెలను వదలి శ్రీరాముని భజించాలి.

పక్షిరాజా! ఆ కలియుగంలో చాలా సంవత్సరాల వరకు అయోధ్యలో వున్నాను. ఒక సారక్కడ కరువు వచ్చింది. అప్పుడు ఆ బాధలు పడలేక మరొక దేశానికి వెళ్ళిపోయాను.

గరుడా! దీనంతో దరిద్రంతో దుఃఖితురాలనై ఉజ్జయనీ వెళ్ళాను. కొన్నాళ్ళ తరువాత కొంచెము స్థిమితం చూచుకొని నేను అక్కడే శివుని పూజిస్తున్నాను. ఆక్కడ వేదాలు తెలిసిన బ్రాహ్మణుడొకరు, ఎల్లప్పుడు శివుని పూజలో నిమగ్నుడై ఉంటున్నాడు, ఆయనకు మరొక పనిలేదు. ఆయన పరమసాధువు, పరమార్థాన్ని ఎరిగినవాడు, శివుని ఉపాసకుడు, నేనాయన సేవను కపటభావంతో చేస్తున్నాను. బ్రాహ్మణుడు చాలా దయగలవాడు, నీతిమంతుడు. పైకి నన్ను వినయ శీలిగా భావించి, నన్ను పుత్రునితో సమానంగా చదువు చెప్పాడు.

ఆ శ్రేష్ఠబ్రాహ్మణుడు నాకు శివమంత్రాన్ని ఉపదేశించి. అనేక రకాల మంచి ఉపదేశాలిచ్చాడు. నేను శివాలయానికి వెళ్ళి శివమంత్రాన్ని జపిస్తున్నాను. నా హృదయంలో కపటము, అహంకారము మాత్రము పెరిగిపోయింది.

నేను దుష్టుడను, బుద్ధిలేని వానిని, నీచజాతి వాడనై మోహంలో పడిపోయి, బ్రాహ్మణ, శ్రీహరి భక్తులను చూడగానే మండిపడుతూ విష్ణువుకు ద్రోహం చేస్తూ వుండేదాన్ని.

గురుదేవుడు నా ఆ చరణలను చూచి దుఃఖపడుతూ, రోజునాకు

తెలియజెప్తూ వుండేవాడు. కాని, నాకు కోపము ఎక్కువవుతూ ఉం
డేది. గర్వపోతుకు మంచి విషయాలు తలకెక్కుతాయా?

ఒకసారి గురువుగారు నన్ను పిలచి, అనేకరకాల నీతులుచెప్పి, "పుత్రా! శ్రీరాముని పాదాల యందు తెంపులేని భక్తి వుండడమే, శివుని పూజకు ఫలితం. శివ, బ్రహ్మలు ఆయన పాదాలను ప్రేమిస్తుంటారు. వారికి ద్రోహం చేసి, నీవు సుఖపడాలనుకుంటున్నావా?" అంటూ గురువుగారు శివుని శ్రీహరి సేవకుడని చెప్పాడు. ఈ మాటలు విని, గరుడా! నా హృదయం మండిపోయింది. నేను అధమ జాతిలో పుట్టినా, కాస్త చదువు అబ్బేటప్పటికి,పాలుపోసి పెంచిన త్రాచుపాము నయిపోయాను.

నేను, అతి దురదృష్టవంతురాలను, బుద్ధితక్కువదానను.నీచురాలను, రాత్రింబవళ్ళు గురుద్రోహం చేస్తూనే వచ్చాను. అయినా దయగల గురువు కోపం తెచ్చుకోక,నాకు బుద్ధి చెప్పుతూనే వున్నాడు.

నీచుని ఎవరు గొప్పవాడిని చేయగల్గుతారు? మొట్టమొదటగా అతన్నే సర్వనాశనం చేస్తాడు. అగ్ని ద్వారా ఏర్పడినపొగ మేఘాలుగా ఏర్పడి దానినే లేకుండా చేయడం లేదా? మట్టి దిక్కూమొక్కూ లేకుండా పడివుంది గదాయని అందరు త్రొక్కుతూ వుంటారు. అది సహిస్తూనే వుంటుంది. కాని, గాలి ద్వారా లేచినప్పుడు రాజుగారి కిరీటం మీద, కళ్ళల్లో కూడా పడుతుంది.

సోదరా! దుష్టుని వద్ద ఎల్లప్పుడు ఉదాసీనంగా ఉండాలి. అతన్ని కుక్కనులాగా దూరంగానే వదలివేయాలి. నేను దుష్టురాలను, కపటిని, కుటిలాత్మురాలునయి నందున నాకు గురువుగారి మాటలు నచ్చలేదు.

నేనొకసారి శివాలయంలో శివుని మంత్రాలు జపిస్తున్నాను. ఆ సమయంలోనే గురువుగారు అక్కడికి వచ్చారు. నేను గర్వంతో లేచి

నిలబడి ఆయనకు నమస్కారం చేయలేదు. గురువు దయగలవారు. ఆయననన్నేమీ అనలేదు. ఆయన హృదయంలో కోపం లేదు. కాని గురువుగారికి నేను చేసిన అవమానమను మహాపాపాన్ని శివుడు సహించలేకపోయాడు.

అరే, దురదృష్టవంతుడా! దురమానీ! మీ గురువు హృదయంలో కోపం లేదు. ఆయన దయాళువు, ఆయన పూర్ణజ్ఞాని. అయినా, దుష్టుడా! నేను నీకు శాపమిస్తున్నాను. నీతికి విరుద్ధంగా ప్రవర్తిస్తే, నాకు నచ్చదు. నీచుడా! నేను నిన్ను శిక్షించకపోతే, వేదాల్లో నిర్ణయించిన మర్యాదకు లోటు వస్తుంది.

గురువుకు శత్రువయినవాడు, కోట్ల యుగాల వరకు నరకంలో పడి, తరువాత పశుపక్ష్యాదుల యోనులలో జన్మించి, పదివేల జన్మల వరకు దుఃఖాలను అనుభవిస్తాడు.

రే, పాపీ, నీచుడా! గురువును చూచిన తరువాత కూడా నీవు కొండ చిలువలాగా కూర్చొని వున్నావు. నీకు పాపబుద్ధి లంకించుకుంది. నీవు పాముయిపో. నీచుడా! నీవు అధమగతిని పొంది, పెద్ద వృక్షపు తొర్రలో నివసించు" అన్నమాటలు ఆ మందిరంలో ఆకాశవాణి వినిపించింది,

శివుని శాపం విని, నేను వణికిపోతూ ఉండడం చూచి గురువుగారు దుఃఖించి హాహాకారం చేశారు. నా అధోగతిని గమనించి, గురువుగారు శివుని ఎదురుగా నిలచి గద్గద వాక్కులతో స్తుతించాడు-

"పరమేశ్వరా! దిక్కులకు ఈశ్వరుడా! మోక్షస్వరూపా! వ్యాపకుడా, ప్రభూ! బ్రహ్మ. వేదస్వరూపా, నేను నీకు నమస్కరిస్తున్నాను." అంటూ రుద్రాష్టకాలు ఆ బ్రాహ్మణుడు చదివాడు. వీటిని భక్తితో చదివిన మనుష్యులు, శంకరుని కృపకు పాత్రులవుతారు.

సర్వజ్ఞుడైన శివుడు బ్రాహ్మణుని వినయము, ప్రేమ చూచాడు. మరల మందిరంలో, బ్రాహ్మణశ్రేష్ఠా! వరమడుగు." అని ఆకాశవాణి వినిపించింది.

"నాథా! ప్రభూ! మీరు నా యందు ప్రసన్నులయితే,నాయందు మీకు ప్రేమ వుంటే, నాకు మీ చరణాల యందు భక్తిని ప్రసాదించి మరొక వరం ఇవ్వండి.

మీ మాయా వశమయి ఈ జడజీవాలు ఎల్లప్పుడు పొరపాట్లు చేస్తున్నాయి. వాటి మీద క్రోధం తెచ్చుకోకండి. శంకరా! ఇప్పుడు దీని యందు కృపచూపండి. కొద్దిరోజుల్లో మీ శాప విమోచనం జరిగే విధం నిర్ణయించండి. దీనికి మేలు జరుగు మార్గమాలోచించండి."

ఇతరుల మేలును కోరుతున్న బ్రాహ్మణుని పలుకులు విని- "అలాగే, అగుగాక"అని ఆకాశవాణి పలికింది.

"ఇది చాలా పాపం చేసింది." నేను కోపంతో శాపమిచ్చాను. అయినా, నీ మంచి తనము చూచి, నేను దీనియందు ప్రత్యేక కృప చూపిస్తున్నాను. బ్రాహ్మణుడా! క్షమాశీలురు, పరోపకారులంటే నాకు ఖరుని శత్రువయిన శ్రీరామచంద్రునితో సమానులయిన ప్రియులు. నా శాపము వృథా కావడానికి వీల్లేదు. ఇది వేయి సంవత్సరాలు తప్ప కుండా జన్మలు ఎత్తవలసిందే. కాని, చావు పుట్టుకల బాధలు మాత్ర ము దీనికుండవు. ఏ జన్మలో కూడా దీని జ్ఞానము నష్టమైపోదు. శూద్రుడా! నా మాటలు విను.

శ్రీరాముని పట్టణమయిన అయోధ్యలో నీవు పుట్టావు. నా సేవలు చేస్తున్నావు, అందు చేత పట్టణ ప్రభావంతోను, నా దయ వలన, నీ హృదయంలో రామభక్తి ఎర్పడుతుంది,

ఇక అసలు సంగతి చెప్తున్నాను, విను. బ్రాహ్మణుల సేవయే భగవంతుని సంతోషపెట్తుంది, ఇకనెప్పుడు బ్రాహ్మణుని అవమానిం

చకు. భక్తులను భగవంతునితో సమానంగా చూచుకో, ఇంద్రుని వ జ్రము, నా త్రిశూలము, యముని దండము, శ్రీహరి కఠినచక్రము, చంపలేకపోతే చంపలేకపోవచ్చుగాని, ఎవరైనా బ్రాహ్మణ ద్రోహ రూపమైన అగ్నితో మాత్రము భస్మమయిపోవడం ఖాయం.

ఇలాంటి ఆలోచన మనస్సులో ఉంచుకొని వుంటే, నీవు సంసారంలో అసాధ్యమయిన విషయాన్ని చూడవు. నీకు అంతటా అడ్డు లేని చొరవ వుంటుందను వరము యిస్తున్నాను" అన్నాడు శివుడు.

మహాదేవుని పలుకులు విన్న గురువుగారు సంతోషించి "అలాగే" అని, నాకు తెలియజెప్పి, శివుని పాదాలను తన హృదయంలో ఉంచుకొని ఇంటికి వెళ్ళిపోయారు.

కాలప్రేరణతో నేను వింధ్యాచలానికి వెళ్ళి పాముయాను. మరల ఆ శరీరాన్ని వదలివేశాను. గరుడా! నేను నా శరీరాలను, మనుష్యుడు క్రొత్త వస్త్రాలను ధరించి, పాత వస్త్రాలను వదలినట్లుగా వదిలేస్తూ వచ్చాను. శివుడు వేదమర్యాదలను కాపాడాడు, నేనూ దుఃఖపడలేదు. ఈ విధంగా నేను శరీరాలు మార్చుకున్నా, జ్ఞానం మాత్రం మరవలేదు. పశు, పక్షి, దేవతల, మనుష్యుల రూపాలేవీనేను యెత్తినా, శ్రీరామచంద్రుని భజనలు మాత్రం వదలలేదు, గురువును అవమాన పరచానన్న బాధ నన్నొదలి పోలేదు. గురువుగారి కోమల, శీల స్వభావమును మరచిపోదామన్నా మరుపుకురాలేదు. చివరకు నేను, పురాణాల్లో, వేదాల్లో చెప్పిన బ్రాహ్మణ శరీరాన్ని పొందాను. అక్కడ నేను పిల్లలతో కలసి ఆడుకొంటూ, ఎల్లప్పుడు శ్రీరామ చంద్రుని లీలలు చూస్తూ వచ్చాను.

పెద్ద వాణ్ణయిన తరువాత తండ్రి నన్ను చదివించాడు. నేను తెలిసికొన్నాను, విన్నాను, ఆలోచించాను. కాని నాకు చదువు నచ్చలేదు, మనస్సులోని కోర్కెలన్నీ నన్నొదిలి పోయాయి, కేవలమ్ము

రాముని పాదాలయందు భక్తిమాత్రము మిగిలింది.

గరుడా! చెప్పు, కామధేనువును వదలి గాడిద సేవచేసే దుర దృష్టవంతులెవరైనా ఉంటారా? నాన్నగారు నన్ను చదివించి, చదివించి అలసిపోయారు. నాకు మాత్రము ప్రభుప్రేమలో నిమగ్నమయి వున్నందున చదువు వంటబట్టలేదు.

నా తల్లిదండ్రులు చనిపోయిన తరువాత, నేను ప్రజా రక్షకుడైన భగవంతుని భజనలు చేయడానికి వనానికి వెళ్ళాను. వనాల్లో వున్న మునీశ్వరుల వద్దకు వెళ్ళినపుడు, వారికి నమస్కారాలు చేస్తూ వచ్చాను. వారిని శ్రీరాముని గుణగాధలు చెప్పమని అడిగేవాడ్ని, వారు చెప్పేవారు. గరుడా! నేను సంతోషంగా వింటూ ఉండేవాడను ఈ విధంగా ప్రభువు గుణానుగానాలు వింటూ, తిరుగుతూ వస్తున్నాను. శివుని దయవలన నేనెక్కడకు పోయినా నాకు ఏ అడ్డంకులు ఎదురవలేదు. ధనము, పుత్రులు గౌరవము అను కోర్కెలు నన్నొదిలి పోయాయి. శ్రీరామచంద్రుని చరణారవిందాలను దర్శించుకోవాలని, నా జన్మ సఫలం చేసికోవాలను కోర్కె మాత్రమే మిగిలిపోయింది.

ఏ మునినడిగినా "ఈశ్వరుడు సర్వప్రాణులయందున్నా"డని చెప్తూ వచ్చారు. నిర్గుణమతము నాకిష్టంలేదు. సగుణబ్రహ్మయందు నా ప్రేమ పెరిగిపోతూ వచ్చింది.

గురువుగారి మాటలు జ్ఞప్తికి వచ్చి, నా మనస్సు శ్రీరాముని పాదాలయందు నిలచిపోయింది. నేను క్షణక్షణం ఎంతో ప్రేమతో శ్రీరఘునాధుని కీర్తిని గానం చేస్తూ వస్తూన్నాను.

సుమేరు పర్వత శిఖరం మీదనున్న వటవృక్షపు నీడలో మహఋషి కూచుని యున్నాడు. ఆయన్నుచూచి నేను ఆయన పాదాలయందు తలవంచి, చాలా దీనంగా—"కృపానిధీ! మీకు అంతా తెలును

సగుణబ్రహ్మయొక్క ఆరాధన పద్ధతి నాకు తెలియజెప్పండి" అని అడిగాను. అప్పుడు ఋషి శ్రీరామచంద్రుని గుణగాథలు కొన్ని ఆదరంగా వినిపించాడు మరల బ్రహ్మజ్ఞానంలో లీనమయియున్న ముని నన్ను ఉత్తమ అధికారిననుకొని, బ్రహ్మోపదేశమివ్వసాగాడు–

"బ్రహ్మకు పుట్టుకలేదు, నిర్గుణుడు, హృదయంలో వుండే స్వామి. ఆయన కళలకు అందనివాడు, కోరికలు లేనివాడు, నామాలు లేనివాడు, రూపాలు లేనివాడు, అనుభవం ద్వారా తెలిసికో వీలున్న వాడు, అఖండుడు, సాటిలేనివాడు, ఆయన మనస్సుకు,ఇంద్రియాలకు అందనివాడు,దోషాలు, నాశనం లేనివాడు, వికారాలు లేని అంతు తెలియని సుఖాలరాశి. నీవే ఆ బ్రహ్మవు. జలతరంగాలలాగా, నీలో, ఆయనలో తేడాలు లేవు అని వేదాలంటున్నాయి" అని ముని అనేక రకాలుగా నాకు తెలియజెప్పాడు. కాని నిర్గుణమతము నా మనస్సులోకి జొరబడలేదు. అప్పుడు నేను ముని పాదాలమీద తలవుంచి– "మునీశ్వరా! నాకు సుగుణబ్రహ్మ ఉపాసనను గురించి తెలియజెప్పండి. రామ భక్తి రూపమైన జలంలో నామనసు చేపతోసమానం, నేను ఆయనను వదలిపెట్టి ఎలా వుండగలను? మీరు దయచేసి, నేను నా నేత్రాలతో రఘునాథుని దర్శనం చేసికోటానికి వీలైన ఉపదేశం మాత్రమే ఇవ్వండి. అయోధ్యా పతిని కళ్ళారా చూచిన తరువాత, నిర్గుణబ్రహ్మ ఉపదేశాలు నేను వింటాను" అన్నాను.

ముని మాటిమాటికి సాటిలేని హరికథను చెప్తూ, సగుణమతాన్ని ఖండిస్తూ, నిర్గుణమతాన్ని సమర్థిస్తూ వచ్చాడు. నేను నిర్గుణ మతాన్ని ఖండించి, చాలా పట్టుదలతో, సగుణమతాన్ని సమర్థిస్తూ వచ్చాను నేను వాదవివాదాలు చేస్తున్నప్పుడు, మునికి కోపం వస్తున్నట్లు గ్రహించి "ప్రభూ! వినండి. ఎక్కువ అవమానపరచితే జ్ఞానులకు కూడా కోపమొస్తుంది. చందనపు కట్టెను రాపిడి పెట్టినపుడు,

దాని నుండి కూడా నిప్పు వస్తుంది. ఋషి కోపంతో మాటిమాటికి జ్ఞానాన్ని సమర్థిస్తున్నాడు. అప్పుడు నేను కూడా మనసులో అనేక రకాలుగా ఆలోచిస్తున్నాను.

ద్వైతబుద్ధి లేనివారికి కోపం ఎందుకు వస్తుంది? ద్వైతబుద్ధి అజ్ఞానం లేనిది ఏర్పడుతుందా? మాయకు వశమయిన జడజీవుడు, ఈశ్వరునితో సమానుడవుతాడా? అందరికీ మేలు చేయాలను కొనే వానికి ఎప్పుడైనా దుఃఖం కలుగుతుందా? పరశువేది ఉన్నవాడు దరిద్రుడెలా అవుతాడు? పరులను ద్రోహం చేసేవాడు నిర్భయంగా ఎలా ఉండగల్గుతాడు? కాముకుడు కళంక రహితుడు కాగల్గుతాడా?

బ్రాహ్మణునకు చెడు తలపెట్టినవాని వంశం నిలుస్తుందా? స్వరూపాలు గుర్తించగలిగిన కర్మలుంటాయా? చెడు స్నేహము చేసిన వానికి మంచి బుద్ధులబ్బుతాయా? పరాయిస్త్రీ పొందుగోరిన వానికి మంచిగతి ప్రాప్తిస్తుందా? పరమాత్మను తెలిసికొన్నవాడు, అసలు సంసారంలో వుండగల్గుతాడా? హరిని నిందించిన వాడెన్నడైనా సుఖ పడుతాడా? నీతి లేనివాని రాజ్యం నిలుస్తుందా? హరి గుణాలను గానం చేస్తే పాపాలుండగలవా? పుణ్యం లేకుండా పవిత్రమైన కీర్తి లభిస్తుందా? పాపం చేయకుండానే అపకీర్తి వస్తుందా? హరి భక్తితో సమానమైన ఇతర లాభముంటుందా? వేదాలు, భక్తులు, పురాణాలు ఆ హరిని గానం చేస్తున్నాయి గదా!

సోదరా! మనుష్య శరీరాన్ని పొంది కూడా, రాముని భజన చేయనంత నష్టం మరొకటుంటుందా! గరుడా! దయతో సమానమైన ధర్మం మరొకటుంటుందా?" చాడీలు,చెప్పడం కంటే పాపము మరొక టుంటుందా? అంటూ, నేను అనేక యుక్తులతో మనస్సులో ఆలోచి స్తున్నాను. ముని మాటలు సాదరంగా వినడంలేదు. నేను మాటి మాటికి సగుణ మతాన్ని సమర్థిస్తూ వచ్చేటప్పటికి, మునికి కోపంవచ్చి

"మూర్ఖుడా! నీకు తగిన శాస్త్రి చేస్తున్నాను. ఏవో చాలా కబుర్లు చెబుతున్నావు. నిజంచెప్పితే నమ్మకం లేదు,కాకిలాగా భయపడుతున్నావు. మూర్ఖా! నీ హృదయంలో చాలా పక్షపాతముంది. అందుచేత,ఇప్పుడే నీవు చండాల పక్షి, కాకివైపో" అన్నాడు. నేను ముని శాపాన్ని తల దాల్చాను. నాకు భయమూ వేయలేదు. దీనురాలినూ కాలేదు. నేను వెంటనే కాకి నయిపోయాను. మరల ముని కాళ్ళమీద పడి,రఘుకుల మణి శ్రీరామచంద్రుని తలచుకొంటూ ఆనందంగా ఎగిరిపోయాను."

"పార్వతీ! శ్రీరామచంద్రుని పాదాల యందు ప్రేమవున్న వారు, కామ, మద, క్రోధాలను వదలి, సంసారమంతటిని ప్రభుమయ మనుకుంటారు, అలాంటప్పుడు వారికి ఎవరు విరోధులుంటారు?వారు ఎవరికి విరోధులవుతారు?

కాగభుశుండి అంటున్నది-"పక్షిరాజా! గరుడా! ఇందులో ఋషి దోషమేమీలేదు. అందరి హృదయాలను ప్రేరేపించేవాడు రఘుకుల శిరోమణి శ్రీరాముడొకడున్నాడు. కృపాసింధు శ్రీరామచంద్రుడు ముని బుద్ధిని మార్చి నా ప్రేమను పరీక్షించాడు. ముని నాలోనైన ఓర్పును శ్రీరామచంద్రుని పాదాల యందు గల ప్రేమను చూచాడు.

ముని చాలా ఆశ్చర్యంగా మాటిమాటికి పశ్చాత్తాపపడి, నన్నాదరంగా పిలచి, అనేక విధాల నన్ను సంతోషపెట్టి, మరల నాకు శ్రీరామచంద్రుని ఒప్పగించాడు.

కృపానిధి అయిన ముని నాకు బాలరూపుడైన శ్రీరామచంద్రుని ధ్యానించడం నేర్పాడు. ఆ ధ్యానము నాకు చాలా నచ్చింది. దానిని నీకు ముందే తెలియజేశాను.

ముని నన్ను కొంచెం సేపు అక్కడవుంచి, రామ చరితమానసను వర్ణించి చెప్పారు. ఆదరంగా నాకు ముని ఆ కథను వినిపిస్తూ— "సోదరా! నే నీ రహస్యమైన, చక్కని 'రామచరిత మానస'ను శివుని

దయ వలన విన్నాను. నిన్ను శ్రీరాముని నిజమైన భక్తుడవని, నేను నమ్మాను. ఇందుచేతనే నేను ఆ చరిత్రంతా నీకు చెప్పాను.

సోదరా! శ్రీరామునియందు భక్తిలేని వారిముందు ఈకథను ఎన్నడూ చెప్పవద్దు. "అని ముని అనేకవిధాల తెలియజెప్పాడు. అప్పుడు నేను ప్రేమతో మునిపాదాలవద్ద తలవుంచాను. మునీశ్వరుడు తన కరకమలాలతో నా తల నిమిరి, ఆనందంగా ఆశీర్వదించి–" ఇప్పుడు నా ఆశీర్వాదంతో నీ హృదయంలో 'రామచరిత మానస' స్థిరంగా వుండిపోతుంది. నీవు ఎల్లప్పుడు శ్రీరామునికి, ప్రియతముడిగా, ఉత్తమ గుణాలకు నిధిగా, అహంకారం లేకుండా, ఇష్టమొచ్చినపుడు చనిపోవునట్లుగా, జ్ఞాన, వైరాగ్యాలకు నిధి, వయిపోతావు. ఇంకా నీవు శ్రీరాముని స్మరిస్తూ ఉండే ఆశ్రమానికి ఒక ఆమడ వరకు మాయచేరలేదు.

కాల, కర్మ, గుణ, దోష,స్వభావము మొదలైన వాటితో ఏర్పడు ఏ దుఃఖమూ నీ వద్దకు చేరలేదు. శ్రీరాముని రహస్యమైన కథలు, చరిత్రలలో, పురాణాల్లో ఉన్నవన్నీ,నీవు పరిశ్రమ లేకుండానే తెలిసికోగల్గుతావు, శ్రీరాముని పాదాల యందు నీ అనురాగము రోజు రోజుకు దృఢమైపోతుంది. నీవు కోరిన కోరికలు భగవంతుని దయ వలన పూర్తయిపోతుంటాయి" అన్నాడు.

ధీరబుద్ధి గల గరుడా! ముని ఆశీర్వాదం విని, జ్ఞానిమునీ! మీ మాటలు నిజమగుగాక! ఇది మనసా, వాచా, కర్మణా నా భక్తురాలే" నని, ఆకాశం నుండి గంభీరమైన బ్రహ్మ వాణి పలికింది.

ఆకాశవాణిని వినగానే నాకు సంతోషం కలిగింది. నేను ప్రేమలో మునిగిపోయాను. నా సందేహాలన్ని పోయాయి అప్పుడు ముని ఆజ్ఞను పొంది, ఆయన పాదపద్మాలయందు తలవంచి, నేను సంతోషంగా ఆశ్రమానికి వచ్చాను. ప్రభుపు దయవలన నేను దుర్లభమైన వరము పొందాను. పక్షిరాజా! ఇక్కడ నేను ఇరవై ఏడు కల్పాల నుండి ఉంటున్నాను.

నేనిక్కడ ఎల్లప్పుడు శ్రీరాముని గుణాలను గానం చేస్తున్నాను. తెలివిగల పక్షులు దానిని శ్రద్ధగా వింటున్నాయి. భక్తుల మేలుకొరకు శ్రీరామచంద్రుడు అయోధ్యలో శరీర ధారణ చేసినప్పుడల్లా నేను వెళ్ళి అయోధ్యలో ఉండి, బాలలీలలు చూచి సుఖపడుతున్నాను.

గరుడా! మరల శ్రీరాముని బాలరూపాన్ని నా హృదయంలో ఉంచుకొని ఆశ్రమానికి వస్తున్నాను. నేను కాకి దేహం పొందిన కథంతా నీకు చెప్పాను. నేను నీ ప్రశ్నలన్నింటికీ సమాధానాలిచ్చాను. శ్రీరాముని భక్తి మహిమ చాలా గొప్పది.

ఈ కాకి శరీరము నాకు ప్రియమైనది. దీనివల్లనే శ్రీరామచంద్రుని పాదాల యందు ప్రేమ ఏర్పడి, నా ప్రభువు దర్శనం చేసికో గలిగాను, సందేహాలన్నీ దూరమయిపోయాయి.

నేను భక్తితో నిశ్చలంగా వున్నందువ మహర్షి నన్ను శపించాడు. భజనప్రతాపం వల్లనే, నేను మునినుండి అసాధ్యమైన వరాన్ని పొందగలిగాను.

భక్తిని కావాలని వదలివేసి, కేవలం జ్ఞానం కొరకు పాటుపడు వ్యక్తులు, తన యింటి వద్ద నున్న కామధేనువును వదలివేసి, పాల కొరకు జిల్లేడు చెట్టును వెదకుచూ తిరుగు మూర్ఖుని లాంటివారు.

పక్షిరాజా! భగవంతుని భక్తిని వదలి, అన్య ఉపాయాలతో సుఖాలను కోరువారు, సంసారసాగరాన్ని, నావ లేకుండానే, తన మొండితనంతో ఈది దాటదలచిన మూర్ఖులు."

"భవానీ! భుశుండి మాటలు విని గరుడుడు ఆనందించి మధురమైన వాక్కులతో-"మీ దయ వలన నా హృదయంలోని సంశయము దుఃఖము, మోహము, భ్రమలు తొలగిపోయాయి.

నేను మీ దయవలన శ్రీరాముని పవిత్రమైన చరిత్రను విన్నా

సు, తృప్తిగా వుంది. ప్రభూ! నేను మిమ్ము ఒక విషయమడుగుతు న్నాను. కృపాసాగరా, తెలియజెప్పండి.

జ్ఞానంతో సమానమైన దుర్లభమైన విషయాలు మరేవి లేవని ఋషులు, భక్తులు, పురాణాలు అంటున్నాయి. కాని మీరు భక్తితో సమానంగా వానిని ఆదరించడంలేదు. జ్ఞానము, భక్తిలో తేడా ఏమి టి? ఆ విషయం నాకు తెలుపండి" అంది.

గరుడుని మాటలు వినిసంతోషించి భుశుండి ఆదరంగా-"జ్ఞానము, భక్తిలో ఏమీ భేదంలేదు. రెండు సంసార సంబంధమైన దుఃఖాలను దూరం చేస్తాయి. నీటిలో కొంచెం తేడా వుందని మునీశ్వరులంటు న్నారు. ఆ విషయాన్ని జాగ్రత్తగా విను.

జ్ఞానము, విరాగము, యోగము, ఇవన్నీ పురుషులు. పురుషుల ప్రతాపము అన్ని విధాల ప్రబలంగా వుంటుంది. స్త్రీలు సహజంగానే బలహీనులు, నిమ్మకు నీరెత్తి నట్లుంటారు.

విరక్తులు, ధైర్యం గలవారే స్త్రీలను వదలి వేయగల్గుతారు, కాముకులు, శ్రీరామచంద్రుని పాదాలకు వ్యతిరేకులైన వారు కారు. జ్ఞాన నిధులైన మునులు కూడా స్త్రీల చంద్రబింబంలాంటి ముఖాలను చూచి విధిలేక వారి వైపు మొగ్గుతున్నారు. గరుడా! శ్రీహరి మాయయే స్త్రీ రూపంలో వుంది.

నేనిక్కడ పక్షపాతమేమీ చూపడంలేదు. వేద,పురాణ,భక్తుల మాటలను మాత్రమే చెబుతున్నాను. గరుడా! స్త్రీ రూపాన్ని చూచి స్త్రీ మోహ పడదు, ఇది ప్రత్యేకమైన పద్ధతి.

గరుడా! మాయ, భక్తి రెండున్నూ స్త్రీ జాతికి సంబంధించిన వని అందరికీ తెలుసు. భక్తి శ్రీరాముని ప్రియురాలు. మాయపాపము, నాట్యం చేసేది మాత్రమే.

శ్రీరామచంద్రుడు భక్తికి అనుకూలుడు. అందువలన భక్తిని

చూచి మాయ భయపడుతూ వుంటుంది. అనుపమైన, ఉపాధులు లేని రామ భక్తి హృదయంలో అడ్డు లేకుండా వుండు వారిని చూస్తే మాయ సిగ్గుపడుతుంది. దాని అధికారము భక్తి వద్ద సాగదు. అది తెలిసికొనియే జ్ఞానులయిన మునులు, అన్ని గుణాలకు గని అయిన భక్తినే కోరుకొంటూ ఉంటారు.

శ్రీ రఘునాధుని, ఈ రహస్యాన్ని తొందరగా ఎవ్వరు తెలిసికోలేరు. శ్రీరాముని దయవలన తెలిసికొన్న వారికి కలలో కూడా మోహముండదు.

గరుడా! జ్ఞానము, భక్తిలోని భేదాన్ని ఇంకా చెప్తాను, విను. ఆ భేదాన్ని వింటే. శ్రీరామచంద్రుని పాదాలయందు ఎల్లప్పుడు అంతు లేని ప్రేమ ఏర్పడుతుంది.

సోదరా! ఆ అంతు తెలియని కథను విను. దీనిని అనుభవంతో తెలిసికోవలసిందే కాని, చెప్పడం సాధ్యంకాదు. జీవుడు ఈశ్వరుని అంశము. అది నాశనం లేనిది, చైతన్యుడు, నిర్మలమైనవాడు, సహజంగానే సుఖాలరాశి, ఆనందమయుడు.

స్వామి! ఆ జీవి మాయకు లోబడి చిలుకలు, కోతులల్లాగా ఉచ్చులో చిక్కుకుపోయాయి. ఇలాంటి మాయ, జీవులలో చిక్కుముడి ఏర్పరచింది. అది అసలుకు బూటకపుదైనా, దానిని వదలించుకోవడం, కష్టమైపోతున్నది. అప్పటినుండే ఈ జీవుడు సాంసారిక బంధనాల్లో చిక్కుకుపోయాడు. అందువలన అతనికి సుఖం లేకుండా పోయింది. వేదాలు, పురాణాలు అనేక ఉపాయాలు చూపాయి, కాని ఆ చిక్కుముడి విడివడకపోగా, ఇంకా బిగుసుకు పోతున్నది.

జీవుని హృదయంలో అజ్ఞాన రూపమైన అంధకారమే ప్రత్యేకంగా వ్యాపించిపోతున్నది. అంచేత ఆ ముడి అలాగే బిగుసుకుని వుంది,

శ్రీహరి కృపవలన సాత్త్వికశ్రద్ధా రూపమైన కామధేనువు,జీవుని హృదయంలో చోటు ఏర్పరచుకోవాలని జప,తప వ్రత,యమ,నియమ మొదలైన ఉత్తమ ధర్మాలను ఆచరించాలని వేదాల్లో చెప్పబడివుంది.

పక్షిరాజా! జ్ఞానమార్గము కత్తిమీది సాములాంటిది. దీనిమీద నుండి పడిపోవడానికి ఆలశ్యమక్కర్లేదు. కాని,ఏ అడ్డంకులు లేకుండా ఈ మార్గాన పోగలిగిన వారికి కైవల్యరూపమైన పరమ పదము తేలిక.

కైవల్య రూపమైన మోక్షము చాలా కష్టమని భక్తులు, పురాణాలు, వేదాలు, శాస్త్రాలు అంటున్నాయి. అయితే, ఆ మోక్షము శ్రీరాముని భజించడం వలన.కోరిక లేకపోయినా బలవంతంగా ప్రాప్తిస్తుంది.

కోట్ల ఉపాయాలు చేసినా, భూమి లేకుండా, నీళ్ళుండడానికి వీల్లేదు. అలాగే, గరుడా! హరిభక్తి లేకుండా మోక్షము లభించదు." అని తెలిసికొని బుద్ధిమంతులైన హరిభక్తులు ముక్తిని ఆదరించకుండా, భక్తి వైపే మొగుతున్నారు.

భక్తిగా వుంటే, పరిశ్రమలేకుండానే, సంసారానికి మూలమైన అవిద్య. తృప్తికొరకు భోంచేసినట్లుగా, నాశనమయి పోతుంది. కాని ఆ భోజనాన్ని జఠరాగ్ని తనంతట తానే జీర్ణించు కుంటుంది. ఇలాంటి తేలికయిన,సుఖాన్ని కలిగించే హరిభక్తి నచ్చని మూర్ఖులెవరుంటారు?

గరుడా! సేవక, సేవాభావాలు లేకుండా సంసారాన్నుండి తరించడం కష్టం. అందువలన శ్రీరాముని పాదకమలాలను భజించు కదిలే వాటిని కదలకుండాను, కదలని వాటిని కదిలే వాటిగాను చేసే సామర్థ్యమున్న శ్రీరామచంద్రుని భజించు, వారు ధన్యులు.

నేను జ్ఞాన సిద్ధాంతాన్ని నీకు తెలియజెప్పాను. మణిరూపమైన భక్తి యొక్క గొప్పతనాన్ని విను,

రామభక్తి రూపమైన అందమైన చింతామణి వున్న హృదయాలు, రాత్రింబవళ్ళు వెలిగిపోతుంటాయి. దానికి దీపము, ఒత్తి, నెయ్యి, ఏమీ అక్కరలేదు. మోహరూపమైన దరిద్రము దాని వద్దకు రాదు, లోభరూపమైన గాలి దానిని ఆర్పలేదు.

అ విద్యారూపమైన కటికి చీకటి లేకుండా పోతుంది. మదరూపమైన పురుగులన్నీ ఓడిమాడిపోతాయి. కామము మొదలైన దుష్టులు, భక్తుల దగ్గరకు రాలేవు.

దానికి విషము, అమృతము, శత్రువులు, మిత్రులు సమానమైపోతారు. ఆ మణి లేకుండా ఎవ్వరూ సుఖపడలేరు. అందరికి వచ్చే రోగాలు వారికి రావు.

రామభక్తి రూపమైన మణి, హృదయంలో ఉన్నవారికి కలలో కూడా దుఃఖాలుండవు. ప్రపంచంలో, భక్తిరూపమైన మణి కొరకు ప్రయత్నాలు చేసేవారు తెలివిగలవారు, నేర్పరులు.

ఆ మణి ప్రపంచంలో అంతటా వుంది, కాని శ్రీరామచంద్రుని దయలేనిది అది అందరికీ లభించదు. దానిని పొందడానికి ఉపాయాలు చాలా ఉన్నాయి, కాని దురదృష్టవంతులు వాటిని కాలదన్నుకుంటున్నారు.

వేదాలు, పురాణాలు, పర్వతాలు, శ్రీరాముని కథలు,వాటిలోని లోయలు. భక్తులు వాటి రహస్యాలు తెలిసినవారు,చక్కని బుద్ధిగుద్దలి, (త్రవ్వకోల), జ్ఞానవైరాగ్యాలు రెండునేత్రాలు. ప్రేమతో వెదకే మనిషికి, సుఖాలన్నింటికి నిధి అయిన, ఆ భక్తిరూపమైన మణి లభిస్తుంది. ప్రభూ! శ్రీరాముని మించిన వాడు రామభక్తుడని నా నమ్మకము.

శ్రీరామచంద్రుడు సముద్రమయితే, ధీరులైన సజ్జనులు మేఘాలు, శ్రీహరి చందన వృక్షమయితే,భక్తులు గాలులు. అందలి ఫలము చక్కని భక్తి. దానిని భక్తులు తప్ప ఎవ్వరు పొందలేరు. గరుడా!

అలా అనుకొని మంచి సాంగత్యంలో ఉండేవారికి రామభక్తి ఎప్పుడూ తేలికగానే వుంటుంది.

బ్రహ్మ సముద్రము, జ్ఞానము మందరాచలము, భక్తులు దేవతలు, ఆ భక్తులు సముద్రాన్ని మధించి కథారూపమైన అమృతాన్ని బయటకు రప్పిస్తారు. అందులో నుండి భక్తి రూపమైన మాధుర్యం కురుస్తుంది.

గరుడా! ఆలోచించి చూడు. వైరాగ్యరూపమైన డాలు, జ్ఞానరూపమైన కత్తితో, లోభ, మోహరూపమైన శత్రువులను చంపి విజయాన్ని పొందేదే భక్తి" అందిభుశుండి.

"కృపాళూ! మీకు నా యందు ప్రేమవుంటే, నన్ను మీ సేవకునిగా భావించి, నా ఏడు ప్రశ్నలకు సమాధానాలివ్వండి వివరంగా.

మొదట, అన్నిటి కంటే దుర్లభమైన శరీర మేదో చెప్పండి. అన్నింటి కంటే పెద్ద దుఃఖము, సుఖము ఏది? ఇదంతా క్లుప్తంగా చెప్పండి.

మీరు భక్తులు, భక్తులు కాని వారిని గురించి ఎరుగుదురు. వారి సహజ స్వభావాలను వర్ణించండి. కృపాళూ! వేదాల్లో చెప్పిన మహా పుణ్యము, ఘోరపాపము ఏదో, చెప్పండి. తరువాత మానస రోగాలను గురించి చెప్పండి. మీ కన్నీ తెలుసు. నా మీద మీకు చాలా ప్రేమ వుంది." అంది గరుడుడు.

"సోదరా! అతి ఆదరంగాను, ప్రేమతోను విను, ఆ నీతిని క్లుప్తంగా చెప్తాను.

## 39

మనుష్యుని శరీరంతో సమానమైనశరీరం లేదు. ఆ శరీరం కావాలని చరాచర జీవాలన్నీ కోరుతున్నాయి. ఈ మనుష్యశరీరమే నర

క్రము, స్వర్గము, ముక్తికి మెట్లు. జ్ఞాన, వైరాగ్య, భక్తి, సుఖాలనిచ్చేది. ఇలాంటి శరీరాన్ని పొంది కూడా, హరిభజన చేయని మనుష్యుడు. కోర్కెల యందు ప్రేమవున్నవాడు మహామూర్ఖుడు. వీరు చేతిలో వున్న పరసువేదిని పారవేసి, గాజు ముక్కను అందుకు బదులుగా తీసుకొనే రకం.

ప్రపంచంలో దరిద్రాన్ని మించిన దుఃఖం, భక్తులతో కలిసినప్పుడు కలుగు సుఖంతో సమానమైన సుఖం మరొకటి లేదు. గరుడా! మనసా, వాచా, కర్మణా పరోపకారం చేయడం భక్తుల సహజ స్వభావము.

భక్తులు ఇతరుల సుఖం కొరకు దుఃఖాలు అనుభవిస్తూ ఉంటారు. భక్తులు కాని వారు ఇతరులకు దుఃఖాలు కలిగించాలని చూస్తుంటారు. దయగల భక్తులు భూర్జ వృక్షంలాగా ఇతరుల మేలు కొరకు ఎన్నో ఆపదలను సహిస్తూ ఉంటారు. కాని దుష్టులు జనుపనారలాగా ఇతరులను బంధిస్తారు. భక్తులు తమ చర్మమును ఒలిపించి, ఆపదలు సహించి చచ్చిపోతారు. దుష్టులు పాములు. చుంచుఎలుకల్లాగా, అకారణంగానే హాని కలిగిస్తూ వుంటారు.

వారు ఇతరుల సంపదలను పాడుచేసి, వారు కూడా పాడయిపోతూ ఉంటారు. వీరు వడగండ్లలాంటి వారు. అవి పొలాలనుపాడుచేసి, కరగిపోతూ ఉంటాయి. దుర్జనులు, ప్రసిద్ధమైన అధర్మగ్రహమయిన కేతువులాగా జగత్తును కష్ట పెట్టడానికే, పుడుతుంటారు.

సూర్య, చంద్రులుదయించటం ప్రపంచానికి సుఖం కలిగించడానికయినట్లుగా, భక్తుల పుట్టుకలు సుఖ ప్రదాలవుతాయి. అహింసను వేదాలు శ్రేష్ఠధర్మమన్నాయి, ఇతరులను నిందించడంతో సమానమైన పాపం మరొకటి లేదు.

శంకరుని, గురువును నిందించినవాడు కప్పయిపోతాడు, అతను

వేల సంవత్సరాల వరకు ఆ కప్ప శరీరంతోనే వుంటాడు. బ్రాహ్మ ణుని నిందించినవాడు అనేక నరకాలను అనుభవించి, కాకి శరీరాన్ని ధరించి జన్మలెత్తుతూ ఉంటాడు.

వేదనిందకులు, గర్వపోతులు రౌరవనరకాన్ని అనుభవిస్తారు. భక్తులను నిందించిన వారు గూడ్లగూబలవుతారు. వారి కి జ్ఞానరూప మైన సూర్యుడు అస్తమించిన తరువాత, మోహ రూపమైన రాత్రి ప్రియంగా వుంటుంది. పరులను నిందించినవారు గబ్బిలాలై పుడ తారు.

సోదరా! ఇప్పుడిక మానస రోగాలు విను. వాటివల్లనే ప్రజ లకు ఎక్కువ బాధ. మోహము సమస్త రోగాలకు మూలము. దీని ద్వారా అనేకరోగాలు పుట్టుకొస్తుంటాయి. కామము వాతము, అత్యంత లోభము శ్లేష్మము, క్రోధము పిత్తము, ప్రతిరోజు దీని వలన గుండె ల్లో మంటగా వుంటుంది. ఈ మూటిని ప్రేమిస్తే దుఃఖాన్ని కలిగించే సన్నిపాత జ్వరమయిపోతుంది.

విషయాల యందు కోరికలుండడం అనేకమైన శూలలు, పోట్లు' వాటి పేర్లు ఎవరికి తెలుసు? మమత తామరచీడ. ఈర్ష్య దురద' ఆనందము గవదబిళ్ళల రోగం.

ఇతరుల సుఖాలను చూచి కళ్ళల్లో నిప్పులు పోసికోవడం క్షయ, దుష్టత్వము, చెడ్డతనము కుష్టురోగము, అహంకారము బాలా దుఃఖ పెట్టే సంధిరోగము. దౌష్ట్యము, కపటము, మదము, మానములు సుఖ రోగాలు. తృష్ణ, భయంకరమైన జలోదర రోగము, భార్య. బిడ్డలు. ధనాశ బలమైన గుండెజబ్బు. మత్సరము, అవివేకము రెండు జ్వరాలు. ఇలా ఎన్నో రోగాలున్నాయి ఎన్నని చెప్పను.

ఒక రోగంతోనే మనుష్యులు చచ్చిపోతున్నారు. ఇవి మరీ అసాధ్యమైన రోగాలు. ఇవి ఎల్లప్పుడు జీవులను వేధిస్తూ వుంటాయి, మరి శాంతి ఎక్కడ?

గరుడా! నియమ, ధర్మ, ఆచార, తపస్సు, జ్ఞానము, యజ్ఞము, జపము, తపము, దానము మొదలైన ఔషధాలు కోట్లున్నాయి. కాని ఆ మందులతో ఈ రోగాలు నయం కావు. వీటికి చికిత్స వేరే వుంది.

ఈ రకంగా ప్రపంచంలో అన్నిప్రాణులు రోగాలతోనేబాధలు పడుతున్నాయి. దుఃఖము, సుఖము, భయము, ప్రేమ, వియోగాల వలన దుఃఖపడుతూ ఉంటారు. నేను మానస రోగాలు చాలాతక్కువ గానే చెప్పాను. ఈ రోగాలు ఉండడం అందరికీ ఉన్నాయి. కానీ ఈ రోగాలను కొద్దిమంది మాత్రమే తెలసికోగల్గుతున్నారు. తెలిసి కుంటే మాత్రము, ఈ పాపాలు తగ్గవచ్చు, కావి ఆ మనుష్యులను బాధలు పెట్టే రోగాలు నష్టపోవడంలేదు.విషయ రూపమైన అపథ్యం వలన ఈ రోగాలు మునుల హృదయాల్లోకి కూడా చేరుకుంటున్నాయి. ఆ స్థితిలో మనుష్యుల లెక్కేమిటి?

శ్రీరాముని దయవలన ఈ రోగాలు నయమైపోవడానికి వీలుంది. అయితే సద్గుణరూపమైన వైద్యుని యందు నమ్మకముండాలి, కోర్కెలు లేకుండా పోవాలి, జాగ్రత్తగా ప్రవర్తించాలి.

రామభక్తి సంజీవని మూలిక. శ్రద్ధా పూర్ణమైన బుద్ధియే అను పానము, ఈ విధంగా చెడు రోగాలు తగ్గితే తగ్గ వచ్చునేమో కాని, లేకపోతే కోట్ల ప్రయత్నాలు చేసినా వాటికి మరొక చికిత్స పనికి రాదు.

మిత్రమా! హృదయంలో వైరాగ్య బుద్ధి పెరిగి, మంచి బుద్ధి రూపమయిన ఆకలి రోజురోజుకు పెరుగుతూ, కోర్కెల ఆశల బలం తగ్గినప్పుడు, మనస్సుకు ఏ రోగము లేదని అనుకోవాలి. పరిశుద్ధమైన జ్ఞాన రూపమయిన జలంతో మనుష్యుడు స్నానం చేసినప్పుడు, మన స్సులోకి రామభక్తి జొరబడుతుంది.

గరుడా! శ్రీరామచంద్రుని పాదాల యందు ప్రేమ ఉండాలని, బ్రహ్మ, శుకదేవుడు, సనకాదిమునులు, నారదాదులు, బ్రహ్మజ్ఞానులలో శ్రేష్ఠులైన మునులు అంటున్నారు.

శ్రీరాముని భక్తిలేనిది, సుఖముండనే వుండదని వేదాలు,పురాణాలు, అన్ని గ్రంథాలు చెబుతున్నాయి. తాబేలు వీపు మీద వెంట్రుకులు మొలవవచ్చు, గొడ్రాలు బిడ్డ ఎవరినో చంపవచ్చు, ఆకాశంలో రకరకాల పూలు పూయవచ్చు, కాని శ్రీహరి శత్రువునకు సుఖమనే మాట ఉండనే ఉండదు.

ఎండమావులలోని నీళ్ళ త్రాగితే దాహము తీరవచ్చు,కుందేలు తలమీద కొమ్ములు మొలవవచ్చు,చీకటి సూర్యుని వెలుగును పోగొట్టవచ్చు, మంచులో అగ్ని పుట్టవచ్చు, కాని శ్రీరామునికి వ్యతిరేకిఅయిన వాడెవడూ సుఖాన్ని పొందలేడు.

నీళ్ళను చిలికితే వెన్న రావచ్చు, ఇసుక నుండి నూనె తీయవచ్చు, కాని శ్రీహరి భజన చేయకుండా భవసాగరాన్ని దాటిపోవడం సాధ్యం కాదను విషయము నిశ్చయమయినది.

ప్రభువు దోమను బ్రహ్మ, బ్రహ్మను దోమకంటే నీచమయిన జంతువును చేయగలడు, అని ఆలోచించి, సందేహాన్ని వదలి తెలివి గల వారు శ్రీరామునే భజిస్తూ ఉంటారు.

నేను నీతో ఉన్నమాట చెబుతున్నాను. నేను చెప్పేది అబద్ధం కాదు. హరి భజన చేసిన వారు తప్పకుండా అపారమయిన సంసార బంధము నుండి తరించిపోతారు.

సఖా! నేను శ్రీహరి చరిత్ర లనేకం, నాకు తెలిసినంత వరకు క్లుప్తంగా, కొంత విస్తారంగా చెప్పాను. గరుడా! కామ విషయాలన్నీ వదిలేసి, రామునే భజించాలనేది వేదాలు చెప్తున్నాయి.

ప్రభువు శ్రీరాముని వదలి ఎవరిని భజించాలి? పూజించాలి?

నాలాంటి మూర్ఖునిమీద ఆయనకు తప్పమరెవ్వరికి ప్రేమపుంటుంది? మీరు విజ్ఞాన నిధులు. మీకు మోహం లేదు. మీరు నా యందు చాలా దయ ఉంచారు.

శుకదేవునకు, సనకాది ఋషులకు, మహాదేవునకు ప్రియమయిన రామకథను వినిపించమని నీవు నన్నడిగావు. ప్రపంచంలో క్షణమైనా, ఘడియ అయినా మంచి వారితో కలయిక జరుగడం అసాధ్యం.

గరుడా! నీవు మనస్సులో ఆలోచించుకో. నేను శ్రీరాముని భజన చేయడానికి అర్హురాలునా? నేను పక్షులలో అధమురాలను, అన్ని విధాలా నేను అపవిత్రురాలను. అయినా ప్రభువు నన్ను కూడా సంసారాన్ని పవిత్రం చేయు వారి లెక్కలో వేశాడు.

నేను అన్ని విధాలా నీచురాలినయినా, ఈనాడు నేను ధన్యురాలు నయిపోయాను. శ్రీరామచంద్రుడు నన్ను తన సేవకురాలిగా భావించి, భక్తుల సాంగత్యాన్ని సమకూర్చాడు.

ప్రియసఖా! నాకు తెలిసినదంతా చెప్పాను, ఏమీ దాచలేదు. శ్రీరామచంద్రుని చరిత్ర రూపమయిన లోతైన సముద్రపు అంతు ఎవరైనా కనుక్కోగలరా?"

శ్రీరాముని అనేక గుణగణాలను తలచుకొని కాగభుశుండి మాటి మాటికి ఆనందించింది. ఆయన మహిమను, అంతులేని బలాన్ని, అధికారాన్ని వేదాలు 'నేతి నేతి' అని గానం చేశాయి.

మహాదేవుడు, బ్రహ్మ రఘునాథుని పాదసేవ చేస్తున్నారు. ఆ శ్రీరామునకే నా యందు దయ ఏర్పడడం ఆయన గొప్పతనాన్ని చాటి చెబుతుంది. ఇలాంటి స్వభావం ఎక్కడా వినలేదు. కనలేదు. రామునితో సమానమని ఎవరిని అనుకునేది?

సాధకులు, సిద్ధులు, జీవన్ముక్తులు, ఉదాసీనులు, కవులు, విద్వాంసులు, తత్త్వజ్ఞానులు, సన్న్యాసులు, యోగులు, తాపసులు,

జ్ఞానులు, ధర్మాత్ములు,పండితులు,విజ్ఞానులు కూడా శ్రీరాముని సేవలు చేయనిది తరించలేరు. అలాంటి రామునకు నేను మాటిమాటికి నమస్కరిస్తున్నాను. నా లాంటి పాపికి శరణిచ్చిన శ్రీరామునకు నమస్కరిస్తున్నాను.

కృపాళువయిన ప్రభువు నామము సంసార రోగాలకు మందు. మూడు తాపాలను పోగొట్టుతుంది. ఆ ప్రభువు నా యందు ఎల్లప్పుడు సంతోషంగా వుండి, అనుకూలపడుగాక!

కాగభుశుండి యొక్క శుభవచనాలు విని. శ్రీరామచంద్రుని పాదాల యందు ఆమె కున్న ప్రేమను గమనించి సందేహామునువదలి గరుడుడు-"నేను రామభక్తితో కూడివున్న మీ పలుకులు విని కృతకృత్యుడనయ్యాను. శ్రీరాముని పాదాల యందు నాకు ప్రత్యేకప్రీతి ఏర్పడి, మాయనుండి సంక్రమించిన ఆ పద తొలగిపోయింది.

మోహరూపమయిన సముద్రంలో మునిగిపోతున్న నాకు నావ వయావు. నీవు నాకుఎంతో సుఖాన్ని కలిగించావు. నేను నీకు ప్రత్యుపకారము ఏమి చేయాలో తెలియడం లేదు. నేను మాటిమాటికి నీ పాదాలకు వందనాలు చేస్తున్నాను.

సోదరా! నీవు పూర్ణకామివి. శ్రీరామచంద్రుని ప్రేమవున్న దానవు. నీ లాంటి అదృష్టవంతులు మరొకరు లేరు. భక్తులు,వృక్షాలు నదులు, పర్వతాలు చేసే సహాయాలన్నీ ఇతరుల మేలు కొరకే జరుగుతూంటాయి.

భక్తుల హృదయాలు వెన్నలాగా వుంటాయని కవులు వ్రాస్తుంటారు. కాని, వారు యింకా వివరించలేకపోతున్నారు. ఎందుకంటే వెన్న వేడి తగులగానే కరగిపోతుంది. పవిత్రమైన భక్తులు ఇతరుల దుఃఖాలను చూడగానే నీరుగారి పోతారు.

నా జీవితము, జన్మ సఫలమయాయి. నీ దయ వలన సందేహాలన్నీ దూరమయిపోయాయి అంది,

"పార్వతీ! నన్ను ఎల్లప్పుడు మీ సేవకునిగా భావించండని, పక్షిశ్రేష్ఠుడైన గరుడుడు మాటిమాటికి అంటూ, కాగభుశుండి పాదాల యందు ప్రేమ వుంచి, తలవంచి, ధీరబుద్ధి గల గరుడుడు,శ్రీరాముని హృదయంలో దాచుకొని వైకుంఠానికి వెళ్ళిపోయింది.

పార్వతీ! భక్త పరులతో కలసినప్పుడు ప్రాప్తించు లాభంతో సాటి అయినది, మరొక లాభము ఉండదు. కాని ఇదయినా ప్రభువు దయలేనిది ప్రాప్తించదని వేద శాస్త్ర పురాణాలు చెప్తున్నాయి. నేను ఈ పరమ పవిత్రమైన చరిత్రను చెప్పాను. దీనిని వినగానే సంసార బంధనాలు తొలగిపోతాయి. దీనులైన భక్తులకు కల్పవృక్షంతో సమానమయిన దయాసాగరుడు, శ్రీరామచంద్రుని పాదాలయందు ప్రేమ పుట్టుకొస్తుంది.

ఈ రామకథను చెవులారా, మనస్సుంచి విన్నవారి, మనసాం వాచా, కర్మణా చేసిన పాపాలు నష్టమైపోతాయి. తీర్థయాత్రలు, మొదలైన సాధనాలు. యోగాలు, వైరాగ్య, జ్ఞానచాతుర్యాలు, అనేక కర్మలు, ధర్మాలు, వ్రతాలు. దానాలు, అనేక సంయమాలు, నియమాలు, యజ్ఞాలు, జపతపాలు, జీవులమీద దయ, బ్రాహ్మణ, గురువుల సేవ, విద్య, వినయము, గొప్పతనము, భవానీ! వేదాల్లో చెప్పిన సాధనాలన్నింటి ఫలము శ్రీహరి భక్తియే. వేదాల్లో గానం చేసిన ఈ రామభక్తిని, శ్రీరాముని కృపతో ఎక్కడో ఎవరో ఒక్కరు పొందగలుగుతారు.

ఈ కథను నమ్మకముంచి ఎల్లప్పుడు వినేవారు ఏ పరిశ్రమ చేయకుండానే మునులకు కూడా అసాధ్యమగు హరిభక్తిని పొందుతారు. రాముని పాదాల యందు మనస్సు లగ్నం చేయగల వారే సర్వజ్ఞులు, గుణవంతులు, జ్ఞానులు, భూమికి అలంకారాలు, పండితులు, దాతలు, ధర్మాత్ములు, కులరక్షకులు,

కపటములు మాని శ్రీరామచంద్రుని భజించువారే నీతి నిపుణులు, పరమచాతుర్యం గలవారు, వేద సిద్ధాంతాలను ఎరిగి వున్నవారు, కవులు, పండితులు, రణధీరులు.

పతివ్రతా ధర్మాన్ని పాటించు స్త్రీ, గంగానది వున్న దేశము ధన్యమైనవి. నీతి ప్రకారము నడచుకొను రాజ్యము ధన్యమైనది. ధర్మాన్ని తప్పని బ్రాహ్మణుడు ధన్యుడు. దానమే తన జీవిత లక్ష్యమనుకునేవాడు ధన్యుడు. పుణ్యం చేయాలనుకొను బుద్ధియే పరిపక్వమైనది, ధన్యమయినది. మంచివారి కలయిక సమయము ధన్యమయినది. అఖండమయిన బ్రాహ్మణ భక్తి ఉన్నవారు ధన్యులు.

ఉమా! రఘువీరుని యందు అనన్య భక్తి వున్న వంశము జగత్తు పూజించదగింది, పరమపవిత్రమయినది, ధన్యమయినది.

నాకు తెలసినంత వరకీ కథను చెప్పాను. మొదట ఈ కథను చెప్పకుండా దాచి వుంచిన మాట నిజము. నీ మనస్సులో అధికప్రేమ వున్నట్లు గ్రహించిన తరువాతనే శ్రీరాముని కథ చెప్పాను.

మూర్ఖులు, మొండివారు, హరిచరిత్రలను మనసారా వినదలచనివారు, ఈ కథను వినకూడదు. లోభికి, క్రోధికి, కాముకునకు, చరాచరాల స్వామిని పూజించనివారికి, ఈ కథను వినిపించకూడదు. ఇంద్రునితో సమానుడైన రాజయినా, బ్రాహ్మణద్రోహులకు ఈ కథను వినిపించకూడదు. సజ్జనుల సాంగత్యమంటే ప్రేమవున్నవారే. రామకథను వినడానికి యోగ్యులు.

గురువుల పాదాల యందు ప్రేమవున్నవారు, నీతివున్నవారు బ్రాహ్మణుల సేవలు చేసేవారు మాత్రమే ఈ కథను వినుట కర్హులు. శ్రీరఘునాథునికి ప్రియులయిన వారికే ఈ కథ సుఖాలనిస్తుంది.

శ్రీరామచంద్రుని పాదాలయందు ప్రేమ లభించాలన్నా, మోక్షం కావాలన్నా, ఈ కథారూపమైన అమృతాన్ని ప్రేమతో కామరూప

మైన దోనెలలో పోసికొని త్రాగాలి.

పార్వతీ! కలియుగ పాపాలను, మనస్సు యొక్క మాలిన్యాన్ని పోగొట్టే రామకథను వర్ణించాను. రామకథ సంసార రూపమైన రోగాలకు సంజీవని, అని వేదాలు, పండితులు చెప్పారు. ఇందులో ఏడు సోపానాలున్నాయి, అవే శ్రీరామభక్తికి మార్గాలు. ప్రభువుకు ఎవరి మీద దయ వుంటుందో. వారే ఈ మార్గంలో అడుగుపెట్టగల్గుతారు. కపటము వదలి ఈ కథను గానం చేసినవారు తమ మనస్సులో ఉన్న కోర్కెలను పూర్తి చేసికోగల్గుతారు. ఈ కథను చెప్పిన వారు విన్న వారు, పాటించినవారు, సంసారాన్ని గోవుపాదాన్ని దాటినట్లుగా దాటిపోగల్గుతారు.

ఈ కథంతా పార్వతి హృదయాన్ని ఆకట్టుకుంది. అప్పుడామె అందమయిన వాక్కులతో-"స్వామీ! మీ దయ వలన నా సందేహాలన్ని దూరమయిపోయి, రామచంద్రుని పాదాలయందు ప్రేమ స్థిర పడిపోయింది. ఈశ్వరా! మీ కృప వల్ల ఇప్పుడు కృతార్థురాలునయి నాను. మనస్సులో శ్రీరామచంద్రుని యందు భక్తి దృఢపడిపోయింది, దుఃఖాలన్నీ దూరమయిపోయాయి." అంది పార్వతి.

శివపార్వతుల సంవాదము సుఖాలను కలిగించేది, దుఃఖాలను పారద్రోలేది. రాముని కృప వలన, ఈ పవిత్ర పరమచక్కని చరిత్ర నేను నా బుద్ధిని బట్టి గానం చేశాను.

ఈ కలియుగంలో, యోగ, జప, వ్రత, పూజలు మొదలైన సాధనాలేమీలేవు. అంచేత రాముని స్మరించడం,రాముని గుణాలను గానం చేయటం, రాముని గుణాలను ఎల్లప్పుడు వినడమే చేయాలి.

పతితులను ఉద్ధరించడమే, ప్రభువు ప్రతిజ్ఞయని, కవులు, వేదాలు, భక్తులు, పురాణాలు చెబుతున్నాయి. మనసా! పాడు పనులు వదలి ఆ ప్రభువునే భజించు. శ్రీరాముని భజనచేసి ముక్తి పొందని

వారెవ్వరున్నారు?

శ్రీరాముని భజించి, వేశ్యలు, అజామిళుడు, వ్యాధుడు, గ్రద్ధ, సర్పము, పాతెపురుగు, గజేంద్రుడు మొదలైన ఎంతో మంది పాపులు తరించిపోయారు. భిల్లులు, యవనులు, కిరాతులు. కోయలు, చెంచులు మొదలైన మహాపాపులు కూడా, ఒక్కసారి ఆయన నామాన్ని ఉచ్ఛరించి పవిత్రులయిపోయారు. ఆ శ్రీరామునకు నేను నమస్కరిస్తున్నాను.

రఘుకుల భూషణుడైన శ్రీరామచంద్రుని ఈ నిర్మల చరిత్రను చెప్పిన వారు, విన్నవారు, పాడినవారు, ఏ పరిశ్రమ చేయకుండానే, కలియుగ పాపాలను, మనస్సులోని దోషాల కల్మషాలను కడిగేసుకొని రాముని సాన్నిధ్యానికి చేరుకుంటారు. అయిదారు చౌపాయీలను మంచివని నిర్ణయించుకొని హృదయంలో దాచుకున్న వారి, పంచేంద్రియాల ద్వారా పుట్టుకొచ్చిన, అవిద్యను శ్రీరామచంద్రుడు దూరం చేస్తాడు.

శ్రీరామచంద్రుడొక్కడే, అందమయినవాడు, కృపానిధి, అనాథుల యందు ప్రేమనుంచువాడు. కారణం లేకుండా, శ్రీరామునితో సమానంగా సుఖపెట్టేవారు, మోక్షాన్ని ప్రసాదించేవారు ఎవరున్నారు? ఆయన కొంచెం దయతోనే ఏమీ తెలియని, తులసీదాసునయిన నేను కూడా ఎంతో సుఖాన్ని పొందాను. ఇలా శ్రీరామ ప్రభువుతో సమానమయిన వారెవ్వరు లేరు.

రఘువీరా! నాతో సమానమయిన దీనుడు, మీతో సమానమైన దీనరక్షకుడు మరెక్కడ ఉంటారు?" అని ఆలోచించి, రఘువంశమణీ! మీరు సంసారంలోని భయంకరమైన బాధలను తొలగించండి.

కాముకునకు స్త్రీ, లోభికి ధనము ప్రియమయినట్లుగా, రఘునాథా! రామచంద్రా! మీరు నాకు ఎల్లప్పుడు ప్రియులుగా ఉందురు గాక.

మొదట అంతు తెలియని రామాయణాన్ని శ్రేష్ఠకవి,భగవంతుడయిన శంకరుడు రాముని పాద పద్మాల యందు, ఎల్లప్పుడు భక్తి ప్రాప్తించడానికి రచించాడు. ఆ రామచరితమానసాన్ని, రాముని నామంలో లీనమైపోయిన తులసీదాసు, తన హృదయంలోని అంధకారాన్ని పోగొట్టుకోడానికి, మానసరూపంలో తన ప్రాంతపు ప్రజల భాషయిన అవధిభాషలోకి చేతనయినంత వరకు మలచాడు.

ఈ రామచరిత మానసము పుణ్యరూపము, పాపాలను పోగొట్టేది, ఎల్లప్పుడు శుభాలను కలిగించేది. విజ్ఞానము, భక్తి దాయకము, మాయా, మోహ, కల్మషాలను కడిగేసేది, ఇది పరమ నిర్మలమైన ప్రేమ రూపమయిన జలంతో నిండియున్న శుభరూపము, ఈ మానస సరోవరంలో భక్తితో నిండిన మనస్సులో స్నానం చేసినవారు, సంసార రూపము ప్రచండమయిన సూర్యుని తీక్ష్ణమయిన కిరణాల వలన మాడిపోరు.

ఉత్తర కాండ సమాప్తం

# 8. లవకుశ కాండము

## మంగళాచరణము

సాహసంలో ప్రసిద్ధుడు, కోమల శరీరుడు, పరమ ఉదారుడు, రఘువంశానికి పతాక రూపుడు, వినయానికి సాగరుడు,ఎడమభాగంలో సీత నట్టిపెట్టుకొని వెలిగిపోతున్న శ్రీరామచంద్రునకు నేను నమస్కారం చేస్తున్నాను.

నీల కమలాల్లాంటి అందమైన కళ్ళవాడు, తన ముఖార విం దము యొక్క కాంతితో చంద్రుని కూడా సిగ్గుపరచేవాడు, పూలతో సమానమైన కోమలమయిన, కాంతిగల అంగాలు కలవాడు,అశ్వమేధ యాగాలు చేసేవారిలో మేటి అయిన శ్రీరామచంద్రునకు నేను నమ స్కారం చేస్తున్నాను.

రఘురాముని పవిత్రకథను విని గరుడుడు సంతోషపడి రెండు చేతులు జోడించి–"కృపానిధీ, విను. ఇప్పుడు నా హృదయం దేవనది గంగలాగా పవిత్రమయిపోయింది. స్వామీ! మీ చరణ కమలాల యందు,నాకున్న ప్రేమజన్మజన్మాంతరాల్లో కూడాస్థిరంగా ఉండుగాక

ప్రభూ! మీ గుణాలన్నింటిని విన్న తరువాత నా మనస్సులో వున్న కోర్కెలన్నీ పూర్తయిపోయాయి కాకిశ్రేష్ఠా! కాగభుశుండీ! మీ దయవలన నా హృదయంలో, ఇప్పుడు ప్రభువు గుణాల కథ స్థిరంగా వుండిపోయింది, నా మనస్సులో సంతోషంగా కూడా ఉంది. అయితే నదులన్నీ కలసినప్పటికి సముద్రము నిండనట్లుగా, ఈ కథతో నాకు పూర్తి తృప్తి కలుగలేదు. పశు, పక్షి, స్థావర, జంగమ, చరా చర జీవులున్నారు. వాటి వర్ణన సాధ్యం కాదు.

అయోధ్యలో సుఖంగా జీవిస్తున్న వారినందరిని శ్రీరాముడు సాదరంగా తన వెంట బెట్టుకొని అయోధ్యను వదలి బొందితో స్వర్గా నికి వెళ్ళాడన్న మాట నాకు కొరుకుడు పడడంలేదు. సందేహంగా వుంది.

నాథా! నేను మిమ్ము తండ్రిలాగా భావించి అతిగా ప్రవర్తిస్తు న్నాను. ఏ విధంగా రాముడు అశ్వమేధ యజ్ఞం చేశాడో, తెలియ జెప్పండి." అన్న గరుడుని కంఠము గద్గదమయిపోయింది. శరీరం పులకించిపోయింది.

ఈ మాటలు విని ధైర్యము గల కాగభుశుండి సంతోషంగా-

"గరుడా! శ్రీరామచంద్రుని దయవలన నీ హృదయంలో సంశయము శోకము, మోహము, భ్రమలు ఏమీ లేకుండాపోయాయి. పక్షిరాజా! నీవు అనేకరకాలుగా ధన్యురాలవు. నీవు నా యందు కూడా కృప ఉంచావు.

నాధా! నీ రసభరితమయిన మాటలు నాకు బాగా నచ్చాయి. పక్షిరాజా! మీ హృదయంలోని ప్రేమనుచూచి ఎన్నో అపశకునాలు దూరమయిపోతున్నాయి. ఇప్పుడు మీరు అయోధ్యారాజయినశ్రీరామ చంద్రుని రహస్యమును అనుపమమైన చరిత్రను వినండి.

ఆయనకు పుట్టుకలేదు, అయన ఒకడేతప్ప మరొక రాయన లాంటి వారులేరు. ఆయనకు నాశనంలేదు, కలియుగ పాపాలతో, సాంసారిక భవబంధనాలతో ఆయనకు సంబంధం లేదు.

గరుడా! శ్రీరామచంద్రుడు పదకొండువేల సంవత్సరాలుండి లీలలు చూపాడు, చేశాడు. ఆ కథంతా, ప్రపంచానికి మేలు కలిగించే దను ఉద్దేశ్యంతో చెప్తున్నాను విను.

బ్రహ్మ మాటల ప్రకారం కరుణాసాగరుడు మానవ రూపమెత్తి ఉంటూన్నాడు. సీతారాములను చూచి కోట్ల కామదేవులు సిగ్గుపడు తున్నారు.

ఒకసారి తమ్ములను, మంత్రిని,ప్రజలు మొదలైన వారినిపిలచి చాలా ఆదరంగా శ్రీరాముడు గురువుగారి ఇంటికి వచ్చాడు. మకరం లో, సూర్యపర్వమని తెలిసికొని అందరు గురువు వద్ద సెలవు తీసి కొని, వారి పాదాలకు నమస్కరించి. కాశీక్షేత్రము ధర్మమయ మయిందనితెలిసి, అనేక వాహనాలతో బయలుదేరారు. వారి వెంట చతురంగ సైన్యం కూడా వుంది.

మధ్యలో విశ్రాంతి తీసికొని వారు కాశీ వెళ్ళారు. అందరు పట్ట ణానికి ఆదరంగా నమస్కరించారు. గంగకు నమస్కారం చేసి,

అమిత సుఖాలను పొందారు.

కృపాసింధు, సుఖనిధి అయిన ప్రభువుబ్రాహ్మణులను, పండితులను,యతి, సన్న్యాసులను పూజించి, దానాలుచేశాడు. వాటిని వర్ణించతరంకాదు. ఆ దానాలను చూచిన కుబేరుడు, ఇంద్రుడు కూడా సిగ్గుతో తలలు వంచుకున్నారు. ఈ విధంగా ప్రభువు అక్కడ చాలా రోజులుండి, మునులను సుఖపెట్టి, నగరానికి వచ్చారు.

## 40

అయోధ్యలో ఎప్పుడూ క్రొత్తక్రొత్త ఆనందాలే. శ్రీరాముడు ప్రతినిత్యము దానాలు చేస్తున్నాడు. గరుడా! ప్రజలు వేద, పురాణాలు వింటూ కాలం గడుపుతున్నారు. ఎవ్వరికి ఇతరధర్మాలను గురించి తెలియనే తెలియదు. అయోధ్యా ప్రజలందరు సంతోషంగా ఉన్నారు.

"నేను ఇక్కడ కేవలము పదకొండు వేల సంవత్సరాలే వుండవలసి వుంది". అని ఉదారుడయిన శ్రీరామచంద్రుడు ఆలోచించి,ఒక అశ్వమేధ యాగాన్ని చేస్తే, దానిని గానం చేసి ప్రజలు భవసాగరాన్నుండి తరించిపోతారు, వెంటనే నా స్థానానికి నేను వెళ్ళవచ్చు, బ్రహ్మమాటలను త్రోసివేయకుండా ఉంటానికి వీలుంటుంది. ఉదయమే వెళ్ళగురువుగారి భవనంలో, ఆయనఆజ్ఞప్రకారం నియమంగా యజ్ఞం చేద్దాం" అనుకొని అనేక విలక్షమైన సాంసారిక శోకాలు, దుఃఖాలు దూరం చేసే లీలలు చేశాడు,

రామరాజ్యం కావటాన భూమిమీదున్న పాపాలన్నీ దూరమైపోయాయి. మునులంతరు ఎంతో ప్రేమగా. అడవుల్లో నిర్భయంగా తిరుగుతూ వున్నారు.

గరుడా! భూమి,వనాలు ఎంతో శోభాయమానంగా వున్నాయి.

పశుపక్షులు ఒకే చోట తిరుగుతున్నాయి. శ్రీరాముని రాజ్యంలో వైర మన్నది కనిపించడంలేదు, వినిపించడంలేదు, అందరు కలసి మెలసి అతి ప్రేమగా వుంటున్నారు.

శ్రీరాముని పెత్తనాన్ని అనేక గ్రంథాలు. స్మృతుల సమూహాలు కూడా గానం చేయలేవు. సరస్వతి, బ్రహ్మ, శివుడు, కోట్ల శేష నాగులు, కవులు, పండితులందరు కలసికూడా రామరాజ్యంలోని గుణాలను గానం చేయలేరు. కాటుక కొండను సిరావేసి, సముద్రాన్ని సిరాబుడ్డి చేసి, కల్పవృక్షంతో కలాన్ని ఏర్పరచి, ఏడు ద్వీపాలను కాగితము చేసి, సరస్వతి, బ్రహ్మ, హరి, శివుడు మొదలైనవారు వేల కల్పాల వరకు వ్రాసినా, రామరాజ్యంలోని లీలలను దాటిపోలేరు, వ్రాయలేరు. పక్షిరాజా! గరుడా! ముందు చరిత్ర ఎలాంటిదో చెప్తా విను.

సోదరులందరు రామసభకు చేరుకున్నారు. అక్కడకు ఒక బ్రాహ్మణుడు ఏడుస్తూ, మొత్తుకుంటూ వచ్చాడు. "సూర్యవంశం ఉండగానే ప్రపంచమను నది సముద్రంలో మునిగిపోయింది. రఘువు, దిలీపుడు, శివుడు, సగరుడు మొదలైన వారెందరో అయోధ్యకురాజులయారు. కాని, తండ్రి జీవించి వుండగా పుత్రుని ప్రాణాలు వదలడం ఎన్నడూ జరుగలేదు" అన్నాడు పెద్దగా కేకలు పెడ్తూ.

అంతర్యామి ప్రభువు ఈ మాటలు తన చెవులారా విని, నర లీలలు చూపవలసిందిగాన, కృపానిధియైన శ్రీరామచంద్రుడు, ఆ సమయాన "ఏ కారణం వలన బ్రాహ్మణ పుత్రుడు చనిపోయాడు" అని చింతించి, బ్రాహ్మణుని దుఃఖాన్ని చూచి వ్యాకులపడ్డాడు.

ప్రభువు చింతాగ్రస్థుడయి వుండడం చూచి ఆకాశవాణి-"శారంగధారీ! మీ రాజ్యంలో వింధ్యాచల పర్వతమువద్దనున్న దట్టమైన వనంలో శూద్రుడొకడు తపస్సు చేస్తున్నాడు. ఆ కారణంచేత ఈ

బ్రాహ్మణ పుత్రుడు మరణించాడ"ని చెప్పింది.

బ్రాహ్మణుని పుత్రుడు మరణించాడని విన్న ప్రభువు వెంటనే రథాన్ని సిద్ధం చేసికొని, ఎదురుగా వున్న అందమైన రెండు పర్వతాలను చూచి సంతోషించాడు. తరువాత క్రోధంతో ఒక బాణాన్ని వదలాడు. అది ఆ శూద్రుని తలను తీసికొని దేవలోకానికి వెళ్ళిపోయింది. ప్రభువు అతను దుఃఖపడుతూ వుండడం చూచి అతనికి మంచి భక్తిని ప్రసాదించి, స్వయంగా అక్కడ తీర్థవ్రతం చేశాడు.

ఆ సమయంలోనే ఆ బ్రాహ్మణుని చచ్చిపోయిన పుత్రుడు సంతోషంగాలేచి కూచున్నాడు. భక్తుల భయాలను దూరంచేసేవాడు, సుఖాలను ప్రసాదించేవాడు అయిన ప్రభువు అయోధ్యకు వచ్చాడు.

శ్రీరామచంద్రుడు లేచి సంధ్యావందనం చేసికొని, భక్తులకు సుఖాలనందించు శివునికి పూజలు చేశాడు. భోజనమయిన తరువాత ప్రభువు నిద్రించాడు. మిగతా వారందరు తమ తమ స్థానాలకు వెళ్ళారు.

నాలుగు ఘడియల పగలుందనగా సభ చేరుకొంది. శ్రీరాముడు వచ్చాడు. ప్రభువు సోదరులతో కలసి పురాణాలు విన్నాడు, దానాలిచ్చాడు.

అందరు మరల సంధ్యావందనాలు చేసికొని, ప్రభువు ఆజ్ఞ ప్రకారము తమ తమ ఇండ్లకు వెళ్ళిపోయారు. ప్రతిరోజు అనేకమంది దూతలు అయోధ్యకు సంధ్యాసమయంలో వచ్చి ప్రభువుకు సమాచారాలన్నీ అందిస్తున్నారు. దూతలందరి మాటలు ప్రభువు విన్నాడు.

"పార్వతీ! ఆ దూతల్లోని ఒక దూత ఏదో చెప్పాడు. శ్రీరాముడు ఆదరంగా అతన్ని అడిగాడు, అతను వెంటనే చెప్పలేక పోయాడు. తరువాత ధైర్యం తెచ్చుకొని–"ఒక చాకలి తనభార్యను తిట్టి

వ్యంగ్యంగా మాట్లాడుతున్నాడు" అన్నాడు. దూత చెప్పిన మాట లన్నీ విని, మనస్సులో వుంచుకున్నాడు శ్రీరామచంద్రుడు. రాత్రి కలలో కూడా ఈ విషయమే వచ్చి చాలా దుఃఖపడ్డాడు.

"ఒక యుగము రాజ్యం చేస్తూ గడిచిపోయింది. ఇప్పుడింకా వెయ్యి సంవత్సరాల వరకు తండ్రి రాజ్యాన్ని భోగించవచ్చు.సీతను వనానికిపంపుదాం. దాంతో వేదమార్గాన నడచినట్లవుతుంది,ధర్మాన్ని తప్పని వాడనవుతాను" అనుకొని, "జానకీ! నీవు నీ ప్రతిబింబా న్ని భూమిమీద వదలి, నీ పవిత్రమైన చోటుకు వెళ్ళిపో" అన్నాడు. ప్రభువు పాదాలకు నమస్కరించి, సీత ఆకాశానికి వెళ్ళింది. ఈ విష యం చరాచర ప్రాణులలో ఎవ్వరికీ తెలియదు.

శ్రీరాముడు ఆ నీడతో "నీ యిష్టమొచ్చిన వరం కోరుకో" అన్నాడు."నాథా! మీతోపాటు వున్న మునిజనుల అందమైన చోటును వదలి, నేను ఇంటికి వచ్చాను. అది నా మనస్సులో చాలా సంకో చంగా వుంది" అంది సీత.

ప్రభువు ఆమెకు మునుల స్త్రీలు ధరించు ఆభూషణాలు, వస్త్రాలు ఆమె యిష్టప్రకారము ధరింపజేసి- "ఉదయము నీ మనస్సు లోని కోరిక నెరవేరుతుంది" అన్నాడు.

ఉదయం జగత్పతి, లక్ష్మీనివాసంలో శ్రీరామచంద్రుడు మేల్కొన్నాడు. యాచకులు ప్రభువు యొక్క కమలాల్లాంటి ప్రకాశం గల ముఖాన్ని చూచి సంతోషించి. గానం చేస్తున్నారు.

భరతుడు, లక్ష్మణుడు, శత్రుఘ్నుడు ప్రభువున్న చోటుకు వచ్చారు. నేలమీద తలలుంచి నమస్కారాలు చేశారు. కాని శ్రీరామ చంద్రుడు ఏమీ మాట్లాడలేదు.

శ్రీరామచంద్రుని కళ తప్పిన, శంకిత శరీరాన్ని, మలినపు రంగును చూచిన ముగ్గురు సోదరులు గడగడ వణకిపోతూ వున్నారు.

రఘువీరుని లీలలు అర్థం కావడంలేదు.

శ్రీరామచంద్రుడు నిట్టూర్పు విడుస్తూ, సమయం అనుకూలంగా లేదని తెలిసికొని, మనోహరమైన రహస్య విషయాలు చెప్పాడు- "సోదరులారా! నా మాటలు మనస్సులో నుంచుకొని జానకిని వనానికి తీసుకు వెళ్ళండి".

ప్రభువు అకస్మాత్తుగా ఇలా అన్న మాటలు విన్నవారందరు బిత్తరపోయారు. శరీరాలు మండిపోతున్నాయి. హృదయంలో దాహ మెక్కువయింది. ప్రభువు నిజంగా అంటున్నారా? నవ్వులాటకంటున్నారా? అను సందేహంలో వున్నారు.

భరతుడు మొదలైన సోదరులందరు వ్యాకులంగా వున్నారు. ఎవరి నోటినుండి మాటలు వెలువడడంలేదు. అప్పుడు రెండు చేతులు జోడించి, కళ్ళంట నీళ్ళుపెట్టుకొని శత్రుఘ్నుడు- "ప్రభూ! మీ మాటలు విన్న తరువాత హృదయం చాలా వ్యాకులంగా వుంది. సీత జగత్తుకు తల్లి అని లోకమంతటికీ తెలుసు. మీరు జగత్తుకు తండ్రి, అంతర్యామి, సచ్చిదానందాలకు నిధులు. ఏ కారణం చేత జానకిని త్యజిస్తున్నారు? ఆమె మనసా, వాచా, కర్మణా మీ పాదాలయందు ప్రేమ వున్న ఇల్లాలు. సర్వజ్ఞా! ఆమె గర్భిణి అని విన్నాము. మీరీ మాటలు కోపంతో అంటున్నారా? నవ్వులాటకు అంటున్నారా? సత్యంగా అంటున్నారా?" అడిగాడు.

ఈ మాటలు విన్న శ్రీరాముని కళ్ళంట నీళ్ళు గిరగిర తిరిగాయి. ఆయన ప్రియమైన మాటలతో తమ్ములకు నచ్చచెప్తూ- "నా అజ్ఞను పాటించకపోతే, నా ప్రాణాలు శరీరంలో వుండవు.

ఈశ్వరుని యిష్టము, కాలము బలవత్తరమైనది. సోదరులారా! మీకు అన్ని విధాలా మేలే జరుగుతుంది. తమ్ముడా! నా మాటలను కాదనకు, జానకిని వనానికి తీసుకెళ్ళు" అన్నాడు.

శ్రీరామచంద్రుని కఠోరమైన పలుకులు విని భరతుడు రెండు చేతులు జోడించి-"అగ్రగజా! నా బుద్ధి అల్పమైనది, మీరు మాకుసర్వ జ్ఞులు. నా విజ్ఞప్తి వినండి.

సూర్యవంశం ప్రపంచంలో ప్రసిద్ధమైంది. దశరథుడు మనకు తండ్రి, కౌసల్య తల్లి. మూడు లోకాలకు స్వామి మీరని ప్రపంచా నికి తెలుసు. వేద, పురాణాలు మీ కీర్తిని గానం చేస్తున్నాయి.

ఆ సీతతల్లి మీకు ఎదురుగావున్న సత్యశక్తి. వేదాలు, శేషుడు కూడా ఆమెను గురించి వర్ణించలేరు. ఆ సీత అందాలరాశి. అమంగ ళాలను దూరంచేసి మంగళాలను ప్రసాదించేది. ఆమె నీడతో సమా నంగా నయినా పతివ్రత ధర్మాన్ని పాటించమంటే ప్రజలు సంసార భయంతో వెనుకాడుతున్నారు. కృపాళూ! చేప నీళ్ళు లేకుండా జీవిం చగలదా? మేఘాలు లేకుండా పొలము పండుతుందా? అలాగేమీరు లేకుండా సీత ఒక్క క్షణం జీవించి ఉండగలదా?" అన్నాడు.

కరుణామయుడు, ప్రేమతో నిండిన భరతుని మాటలు విని- "భరతా! నీవు చక్కని మాటలు చెప్పావు. అయినా రాజెప్పుడు నీతి తో ధనాన్ని। ధర్మాన్ని రక్షించాలి. ఆలోచనా చింతలను వదలి నీతి కరమైన మాటలు మాట్లాడుతూ, పవిత్రమైన కర్మలు చేస్తూ భూమిని పాలించాలి" అని శ్రీరామచంద్రుడు దూత చెప్పిన మాటలు భరతు నితో చెప్పి-"కులానికి పెద్ద కళం"మొచ్చింది. సూర్యవంశంలో అనేక రాజులు వచ్చారు, పోయారు. వారు ఒకరికి మించి మరొకరు జ్ఞానులు. రఘుమహారాజు, దిలీపుడు, స్వాయంభువమనువు, సగ రుడు, భగీరథుడు మొదలైనవారి కీర్తులను వేదాలు కూడా గానం చేశాయి. దశరథమహారాజు సంగతి ప్రపంచానికి బాగా తెలుసు. ఆయన ప్రాణాల మీదికి వచ్చినా ప్రతిజ్ఞను తప్పలేదు. అటువంటి

కులం మనది. ఏ కొంచెం కళంకం విన్నాక కూడా బ్రతికుంటే వారు అధములు" అన్నాడు శ్రీరాముడు.

"భయాలన్నింటిని పారద్రోలే సర్వజ్ఞా! సీతమ్మకు కళంక మేమీలేదు. బ్రహ్మ, హరి, శివుడు మొదలైన దేవతలు సీతాదేవి అగ్నిలోనుండి వచ్చాక పరిశుద్ధమైనబంగారంతో సమానమైనదని పొగడారు. సురులు, నరులు, మునులు, ఈమె చరిత్రను తలచుకొని, కలలో కూడా మరో మాట అనేవారు లేరు. సీతామాతను కళంకిత అను మూర్ఖులు తప్పకుండా కోట్ల రౌరవ నరకాలలో నివసించి,వంద కల్పాలవరకు రోగాలతో బాధలు పడుతారు" అన్నాడు.

శ్రీరాముని పట్టుదల చూచి భరతుడు లక్ష్మణుని వెంట వెళ్ళిపోయాడు.

"లక్ష్మణా! పట్టుదల, చింత వదలి విను. ప్రపంచం ఏమనినా యిప్పుడు, సీతను వనానికి పంపకుండా వుండడానికి వీల్లేదు. నీవు నా ఆజ్ఞను పాటించక ఏవో సమాధానాలతో కాలక్షేపం చేయవద్దు.అలా చేశావంటే, నేను యిక యిక్కడ వుండను. నీవు నీ జీవితమంతా శోకంతో పశ్చాత్తాపపడతావు. జానకిని వెంటనే రథంమీద తీసుకెళ్ళి గంగా నదిపద్ద వదలి తిరిగిరా.

లక్ష్మణా! సీతను జాగ్రత్తగా దట్టమైన వనంలో ఎవ్వరు లేకుండా చూచి వదలిపెట్టిరా. ఉదాసీనంతో నా మాటలను మెత్తగా వ్యతిరేకించవద్దు" అన్నాడు రాముడు. లక్ష్మణుడు తనకిక తప్పదని మనస్సులో అనుకుంటూ వెళ్ళిపోయాడు.

అందమైన రథంలో సీతను కూచోబెట్టి, వస్త్రాలు, భోజన సామాగ్రి ఉంచాడు. శ్రీరాముని ప్రాణప్రియ అయిన సీత సంతోషంగా వెళ్లింది.

సీత లక్ష్మణుని వ్యాకులత, ఆయన ముఖంలో కళలేకపోవడం

చూచి. మణిలేని పాములాగా, గాబరాపడిపోయింది. ఆమె హృదయం
లోని బాధను చెప్పలేక పోతున్నది.

గంగానది ఒడ్డున అందమైన రథం నుండి దిగి, దట్టమైన అడవి చూచి, భయపడి, రహస్యం కొంత తెలిసికొని సీత-"మరదీ! ఇక్కడ మునుల ఆశ్రమాలు కనిపించడంలేదు. ఇక్కడ పక్షులు, లేళ్లు, సింహాలు, ఏనుగులు, పులులు, తోడేళ్ళు, నక్కలు అక్కటంగా ఉన్నాయి. ఒక్క ముని అయినా వస్తున్నట్లు, పోతున్నట్లు కనిపించడం లేదు. సోదరా! నా ప్రాణాలు పోతున్నాయి" అంది.

సీత వ్యాకులంగా ఉండడం చూచి, లక్ష్మణుడు మనస్సులో-"బ్రహ్మ ఎంత పనిచేశాడు" అనుకున్నాడు.

సీత రథంలోనే మూర్ఛపోయింది. ఆమె భూమిమీద పడకుండా లక్ష్మణుడు జాగ్రత్తపడ్డాడు. సీత వ్యాకులంగా ఉండడం చూచి "ఇప్పుడు ప్రాణాలు పోయేటట్లున్నాయి" అనుకుంటూ ఆమె ప్రాణాలు పోయిన తరువాత నేను బ్రతికుండి ప్రయోజనమేమిటని, తాను చావడానికి సిద్ధమయ్యాడు. లక్ష్మణుని ప్రాణరహితునిగా చూచి, ఆకాశవాణి-"లక్ష్మణా! నీవు సీతను వదలి వెళ్లిపో. అదృష్టవంతురాలయిన సీత బ్రతికి వుంటుంది" అని అంది.

ఆకాశవాణిని విని లక్ష్మణుడు ధైర్యంచేసి, చేతులు జోడించి, సీత చుట్టూ తిరిగాడు, రథాన్ని తీసికొని, సీత పాదాలకు నమస్కరించి, దుఃఖంగా పట్టణానికి తిరిగి వచ్చాడు.

జానకి మూర్ఛనుండి తేరుకొని నలువైపుల చూచింది. ఆమెకు రథము, గుర్రాలు, లక్ష్మణుడు ఎక్కడా కనిపించలేదు. "నా ప్రాణాలు మొదట దుఃఖాలనుభవించాయి. అందు వలన దుఃఖాలనుభవించడం వాటికలవాటయి ఇప్పుడు కూడా నన్నొదలి వెళ్ళడంలేదు" అనుకుంది.

సీత వనంలో ఎంతో విలపిస్తూ వుంది. అదే సమయంలో వాల్మీకి ముని తిరుగుతూ అటువచ్చాడు. సీత మునిని గుర్తించి తాను వనానికి వచ్చిన సమాచారమంతా చెప్పింది.

"మునీశ్వరా! నేను జనక మహారాజు కూతుర్ని, శ్రీరామచంద్రుని భార్యను" అని లోకమంతటికి తెలుసు. నేను ఎందుకు వదలి పెట్టబడ్డానో నాకు స్వయంగా తెలియదు. బ్రహ్మ చేష్టలు చాలా విచిత్రంగా వుంటాయి. మరది లక్ష్మణుడు నన్నిక్కడ దిగబెట్టి వెళ్లిపోయాడు. కాని, మునీశ్వరా! నేను దీనికి కారణమేమిటో ఎరుగను" అంది.

"పుత్రీ! ఇపుడు నీకేమీ చింతలేదు. చివరకు శ్రీరామచంద్రుడు నిన్ను కలుస్తాడు" అంటూ సాదరంగా సీతను పర్ణకుటీరానికి తీసుకొచ్చి, స్నానాదికాలు ముగించుకుని ఆమె చెప్పిన మాటలన్నీ విన్నాడు.

ముని ఆమెకు అనేక రకాలుగా ధైర్యం చెప్పాడు. గంగలో సీత స్నానం చేసింది. శ్రీరాముని స్మరించి, ఆయన మూర్తిని హృదయంలో ఉంచుకుంది. ముని ఆశీర్వదించి ఫలాలు యిచ్చాడు.

ముని అనేక కథలు చెప్పాడు. సీతతోపాటు పక్షులన్ని వింటున్నాయి. అటు, అనేక రకాల దుఃఖాలు మనసులో పదిల పరచుకొని లక్ష్మణుడు అయోధ్యకు తిరిగి వచ్చాడు.

లక్ష్మణుడు సీతను వదలి వ్యాకులంగా తన భవనానికి వెళ్ళి, సీతకు దారుణమైన దుఃఖాన్ని కలిగించిన విషయాలన్నీ తల్లితో చెప్పాడు, మణి లేని సర్పము వ్యాకులపడినట్లుగా, ఆయన తల్లి లక్ష్మణుని మాటలు విని మూర్ఛపోయింది. "ఈ దుఃఖాన్ని ఎలా సహించాలి?" అని అందరు దుఃఖిస్తూ అంటున్నారు.

అంతా గోలగా వుంది. ఆ గోల విని లక్ష్మణుని తీసికొని

శ్రీరామచంద్రుడు తన భవనానికి వెళ్ళి, తన సహజ రీతిలో తల్లులకు నచ్చజెప్పాడు. అప్పుడు వారి హృదయాలు శాంతించాయి. తల్లులు కోరిన వరాలన్నీ, శ్రీరామచంద్రుడు వారి కిచ్చాడు. అప్పుడు వారు యోగాగ్నితో శుద్ధ పరచుకొని తమ శరీరాలను త్యజించారు. శ్రీరామ, భరత, లక్ష్మణ, శత్రుఘ్నులు చాలా దుఃఖించారు.

గురువు, వేదాల్లో చెప్పినట్లుగా. నియమ పూర్వకంగా అన్ని కర్మలు శ్రీరామునితో చేయించాడు. కోట్ల రకాల దానాలు చేశాడు. ఈ విషయాలను వర్ణించగల కవి ఎవరైనా ఉన్నారా?

ఒకసారి, మంత్రి, సోదరులతో కలసి శ్రీరాముడు గురువుగారింటికి వెళ్ళి, భూమి మీద తలనుంచి నమస్కరించి, శ్రేష్ఠమైన ఆశీర్వాదము పొంది, కూచుని– "గురువుగారూ! మీ దయ వలన నేను అనేక ఉత్తమోత్తమ యజ్ఞాలు చేశాను. ప్రభూ! నగర వాసులందరు ఒక అశ్వమేధ యజ్ఞాన్ని చూడాలని ఎదురు చూస్తున్నారు. మహర్షి! మీరు చెప్పినట్లు చేస్తాను" అన్నాడు.

శ్రీరాముని ప్రేమతో కూడిన మాటలు విని ముని సంతోషంగా –"మీరు ఇలాంటి మంచి మాటలు ఎందుకు చెప్పరు? మీరు చాలా వినయశీలురని లోకానికి తెలుసు. బ్రహ్మ మీ కోరికను పూర్తి చేయుగాక." అని, "భరతా! లెమ్ము అశ్వమేధానికి సిద్ధం చెయ్యి" అన్నాడు.

ముని మాటలు విన్న భరతుడు, శత్రుఘ్నుడు, లక్ష్మణుడు· మంత్రి సంతోషంగా ఇంట్లకు వెళ్ళారు. సేవకులను. ప్రజలను, మంత్రులను ఆదరంగా పిలచి–"వీధులు, నగరము, ఇళ్ళు, ద్వారాలను బాగుచేసి, మండపాలు ఏర్పరచండి" అని చెప్పారు.

గురువుగారితో కలసి శ్రీరామచంద్రుడు, అయోధ్యకు వచ్చి అక్కడి అలంకారాలు చూచి, చాలా సంతోషించాడు. ఆయన వెంటనే జనకపురికి దూతలను పంపాడు, దేశదేశాల రాజులకు కబుర్లు చేశాడు.

జాంబవంత, సుగ్రీవ, విభీషణ. నల, నీల, ద్వివిద, మొదలైన ముఖ్యులందరిని పిలిపించాడు. వరుణ, కుబేర, ఇంద్ర. యమ, కాల మొదలైన వారందరు శ్రీరామచంద్రుడున్న చోటుకు వచ్చారు.

అందమైన, దేవాంగనలు విమానాల మీద ఎక్కి కోయిల కంఠాలను కూడా మరపించే విధంగా గానాలు చేస్తున్నారు. మునుల సమూహాలెన్నో వచ్చాయి. వారందరికీ శ్రీరామచంద్రుడు చక్కని వసతులు ఏర్పాటు చేయించాడు.

చంద్రుడు, సూర్యుడు, హరి, మహాదేవుడు, బ్రహ్మ సనకాది మునులు మొదలైన పరమ పవిత్రులు, దేవతలు కూడా వచ్చారు. విశ్వామిత్రునితో పాటు, తమ యిష్టప్రకారము సంచరించు మునులు వచ్చారు.

తరువాత పారాశర, భృగు, అంగిరస, నారద, వ్యాస, అగస్త్య, దేవతల సహితంగా పులస్త్య మొదలైన మునులందరు కలసి వచ్చారు.

వచ్చిన వారందరు అనేక రకాలుగా అలంకరించిన అక్కడి ఏర్పాట్లలను చూచి చాలా సంతోషించారు. జనకుని పట్టణానికి వెళ్ళిన దూతలను చూచి జనకపుర వాసులందరు చాలా ఆనందించారు.

"అయోధ్య నుండి కబురు వచ్చింద'ని దూతలు ద్వార సమాచారము పంపారు. అకస్మాత్తుగా విన్న జనకుడు ఆనందంలో లేచి పరుగున వచ్చాడు. ఆయన శరీరము, మనస్సు పులకితమయిపోయాయి. కళ్ళంట నీళ్ళు వచ్చాయి.

రాజు ద్వారం వద్దకు వచ్చి, దూతలను చూచి సంతోషించి– "శ్రీరాముని, ఆయన సోదరుల క్షేమాలు తెలుపండి." అన్నాడు. వారు గద్గద కంఠంతో ఏమీ చెప్పలేక పోయారు.

ఆ సమయంలో రాజుగారి ప్రేమను గురించి ధైర్యవంతుడు

కూడా చెప్పలేదు. తులసీదాసు అంటున్నాడు-"ఆ సమయంలో ఆనందం వలన గంభీర జయజయ ధ్వానాలు చేశారు.

రాజు ఆదరంగా దూతలను పిలచి, ఎన్నో మర్యాదలతో గౌరవించాడు. తరువాత రాజు గురువుగారి యింటికి వెళ్ళి, కథంతా వినిపించాడు. శతానందునకు చాలా సంతోషం కలిగి-"రాజా! పదండి వెళ్ళి యజ్ఞం చూద్దాం. మీ మొత్తం సైన్యాన్ని సిద్ధ పరచండి." అన్నాడు.

వినయంగా రాజు భవనంలోకి వెళ్లి సేవకులందరిని ఆదరంగా పిలిచి-"చతురంగ సైన్యాన్ని సిద్ధం చేయండి" అని అందరికి తెలియపరచి ప్రాసాదానికి వెళ్ళాడు.

ఆయన దూతలు తెచ్చిన వార్తనుఅందరికి చదివి వినిపించాడు. ఆనందం పట్టలేక రాణివాసమంతా బ్రాహ్మణులను పిలిపించి ఎన్నో దానాలు చేసింది.

పత్రిక చదివేటప్పుడు వారి మనస్సులలోని సంతోషానికి హద్దులు లేవు. దూతలను పిలచి,వారు నవ్వి-"నగరంలో, గ్రామాల్లో, ఇండ్లల్లో శుభకార్యాలు ప్రారంభించండి, రకరకాల వాయిద్యాలు వాయించండి"

జనకమహారాజు మునులను తీసుకుని ఎన్నో మంగళ వాయిద్యాలు వాయింపజేస్తూ వెళ్ళాడు. రెండవరోజు, మూడవ ఝామున అయోధ్యాపురి దగ్గరకు చేరారు.

శ్రీరామచంద్రుడు సంతోషంగా నగరం బయట పవిత్రమైన సరయూనది ఒడ్డున వారికి బసలు ఏర్పాటు చేయించాడు, తరువాత సోదరులకు రాజ సమూహాన్ని ఒప్పగించి శ్రీరాముడు నృపశ్రేష్ఠుడైన జనకమహారాజున్న చోటుకు వచ్చాడు. జనకమహారాజు కలిసిఅతనిని దగ్గర కూచోబెట్టుకుని గద్గద స్వరంతో మధుర వచనాలు పలికాడు.

శ్రీరామచంద్రుడు వినయంగా అన్ని సేవలుచేసి భరతుని మంత్రిని పిలిపించాడు. జనకమహారాజు సేవాభారాన్ని భరతునకు ఒప్పగించాడు. పక్షిరాజా! ఆయన హృదయంలో చాలా ఆనందంగా వుంది

తరువాత వచ్చి గురువుకు నమస్కరించి, కోరిన ఆశీర్వాదాలు పొందాడు. ప్రభువు దేవతలకూ, గురువులకు నమస్కారాలు చేసి, ఆశీర్వాదాలు పొంది ఆనందించాడు.

పదివేలమంది శ్రేష్ఠులైన మునులతోపాటు శ్రీరామచంద్రుడు యజ్ఞశాలకు వెళ్ళాడు. అపుడు వసిష్ఠుడు వినయంగా-"రామా! నా ఉద్దేశ్యం విను. వేదాలు సర్వధర్మాలను చెప్పాయి. భక్తులు, పురాణాలు, లోకంలో భార్యలేకుండా ఏ పని సఫలం కాదని అంటున్నాయి. అందుచేత ఇపుడు మిథిలేశకుమారి సీత కావాలి" అన్నాడు.

ముని మాటలు విని శ్రీరామచంద్రుడు క్షణకాలం ఆగి-''మునిరాజా! నా ప్రతిజ్ఞ యొక్క కీర్తిని తెలిసికొని, దయచేసి, కాగలిగిన పుణ్యమయిన పని ఏదో ఆలోచించి చేయండి" అన్నాడు.

ఇరువైపుల గురువులు, నారదుడు, సనకాదికమునులు-''అనాది పురుషా! బంగారు, మణులతో పొదిగిన పరమశీలవంతురాలైన సీత రూపాన్ని, ఒక బొమ్మలాగా తయారుచేయించండి దాని అంగప్రత్యంగాలను ఆ భూషణాలతో అలంకరించండి. అలా చేస్తే, ఆ ప్రతిమను చూచి కామదేవుడు కూడా సిగ్గు పడాలి. స్త్రీ పురుషులు చూచినప్పుడు వెంటనే గుర్తు పట్టలేనంత చాకచక్యంగా తయారు చేయించండి. సీత బొమ్మను చూచి అందరు ఆశ్చర్య పడాలి." అన్నాడు. "శ్రీరామచంద్రుడు తన లీలలు తాను చేశాడు. అవన్నీ వర్ణించాలంటే తులసీదాసు వల్లయే పనికాదు." అన్నాడు తులసీదాసు.

# 41

మాఘమాసపు చక్కని శిశిర ఋతువులో శ్రీరామచంద్రుడు యజ్ఞశాలలో కూచున్నాడు. అప్పుడు గురువు ఆకర్షవంతమైన పలుకులు పలికాడు-"వేదాల్లో చెప్పిన ప్రకారం గుర్రాన్ని తీసుకరా!" లక్ష్మణుడు గురువుగారి మాటలు విని చాలా సంతోషించి. మాటి మాటికి పాదకమలాలకు వందనాలు చేసి, చాలా ఆదరంగా గుర్రపు సాలకు వచ్చి, ఆ గుర్రానికి అనేక రకాల ఆభూషణాలతో అలంకరించాడు.

ఆ గుర్రము తెల్లగాను, చెవులు నల్లగాను వున్నాయి. అవి సూర్యదేవుని గుర్రాలను ఎగతాళి చేస్తున్నట్లుగాను, మన్మధుడు తన చేతులతో తయారు చేసినట్లుగాను వుంది. దాని మీద అందమైన రత్నములు పొదిగిన జీను వుంచబడింది. ఆ గుర్రాన్ని చూస్తుంటే, స్వయంగా సూర్యుడే బయలుదేరి వస్తున్నట్లుగా వుంది. తలమీద నెమలి పింఛము, మణులు పెట్టబడి వున్నాయి. వాటిని చూస్తుంటే, ఆకాశంలో నక్షత్రాలు వెలుగుతున్నాయా, అన్నట్లుగా వున్నాయి. దానితోపాటు ఎనిమిదివేల శ్రేష్ఠులైన వీరులను వెంటబెట్టుకొని, గుర్రాన్ని మధ్యలో చేర్చి, శ్రీరాముని వద్దకు తీసుకొచ్చాడు. శ్రీరామచంద్రుడు విశ్వవిజయం కొరకు గుర్రాన్ని పూజించి, విశ్వామిత్రుడు చెప్పినట్లు చేశాడు. అనేక రకాల దానాలుచేశాడు. దానిని అభిషేకించి ఒక పత్రము వ్రాశాడు.

కోసల దేశంలో శత్రువులను జయించగల ఒక వీరుడున్నాడు అతన్ని చూస్తే ఇంద్రుడు కూడా భయపడుతుంటాడు. "బలమున్నవాడెవరైనా సరే గుర్రాన్ని బంధించవచ్చు, లేదా దాసోహం" అని

వ్రాసి గుర్రం తలమీద కట్టాడు. ఇది విని అనేక మంది మునులు అక్కడకు వచ్చారు. శ్రీరాముడున్న చోటుకు మునిశ్రేష్ఠుడైన భృగు మొదలైన మునులందరు యాగానికి చూడటానికి వచ్చారు.

మునులందరు లవణాసురుని కథను చెప్పారు. ఇతను మును లకు చాలా దుఃఖాలు కలిగించాడు. వారి మాటలు విన్న శ్రీరాముని కళ్ళంట నీళ్ళొచ్చాయి. ఆయన తన అంబుల పొది తెప్పించాడు. భయంకరమైన, అమోఘమైన బాణాలు తీసి శత్రుఘ్నునకిచ్చి-"నా మంత్రం చదివి, దీనితో కొట్టి రాజులందరిని జయించు" అని విభీష ణుని పిలిచాడు. అతనొచ్చి ఆదరంగా నమస్కారం చేశాడు, రఘు కులమణి శ్రీరామచంద్రుడు అతన్ని లవణాసురుని అంతులేని చరి త్రను అడిగాడు.

విభీషణుడు రెండు చేతులు జోడించి-"ప్రభూ! మానవతి తల్లి ఒకటుంది. ఆమె పేరు కుంభనశి. ఆమెను రావణుడు మధురాక్షసున కిచ్చాడు. అతను ఎంతో వినయంగా ఆమెను స్వీకరించాడు. ఆమె పుత్రుడే లవణాసురుడు. అతను సాదరంగా శివుని సేవలు చేశాడు. కృపానిధీ! అతని కఠినమైన తపస్సును శివుడు మెచ్చుకొని అతనికి ఒక త్రిశూలాన్నిచ్చాడు.

ప్రభూ! ఆ త్రిశూల బలంతో అతను దేవతలు, మనుష్యుల నెవ్వరిని లెక్కచేయడు. అందరిని జయించి వశపరచుకున్నాడు. ఆ బలగర్వంతో అందరివెంట పడుతుంటాడు" అని చెప్పాడు.

అతని చరిత్రను విని శ్రీరామచంద్రుడు మనస్సులో నవ్వు కొని, శత్రుఘ్నునకు తల బలాన్నిచ్చి గౌరవించాడు, శత్రుఘ్నుడు చతురంగ సైన్యాన్ని, ఇద్దరు పుత్రులను వెంటబెట్టుకున్నాడు.

ప్రభువు మాటలు వినగానే మూడువేల బాకాలు ఒకేసారి మ్రోగాయి. ఏనుగులు గర్జించినందున భూమి క్రిందికి దిగబడిపోతు

న్నది. సూర్యుని రథాన్ని కూడా ఎగతాళి చేయగల పదివేల రథా లున్నాయి. శంఖాలు ఊదుకుంటూ సైన్యం బయలుదేరింది. ఆకా శంలో అనేక నగారాలు మ్రోగుతున్నాయి. యుద్ధయోధులతో కూడి యున్న కోసల సైన్యం లవణాసుర నగరాన్ని చుట్టుముట్టింది.

ఆ సమయంలో మరి అనేక నగారాలు మ్రోగాయి. వాటిని విన్న లవణాసురునకు చాలా గర్వం ఏర్పడింది. అతను యోధులనుసవాలు చేస్తూ, గర్జిస్తూ వచ్చి తన బలాన్ని చూచుకొని ఎంతో సంతోషిం చాడు.

యుద్ధనగారాల శబ్దాలువిని వీరులు పొంగిపోతున్నారు, ఇరు వైపుల అనేక వాయిద్యాలు మ్రోగుతున్నాయి. తమతమ స్వాము లకు జయం పలుకుతూ। తమకు జత దొరికినట్లు తెలిసికొని పట్టు దలతో యోధులు ఆనందంగా తలపడ్డారు.

లవణాసురుడు తన సైన్యం తికమకపడుతున్నట్లు గ్రహించి తన యిద్దరు పుత్రులయిన మాతంగ, కేతులను తీసుకొని ముందుకు సాగాడు.

బలశాలి అయిన శత్రుఘ్నుని పుత్రుడు సుబాహు మాతంగు నితో. ఇద్దరు యములు తలపడట్టుగా తలపడ్డాడు. యూపకేతు కూడా కేతును రెచ్చగొట్టి ఆనందంగా ఎదుర్కొన్నాడు, ఇద్దరు పోట్లాడుకుంటున్నారు. కాని ఎవరూ ఓటమిని ఒప్పుకోవడంలేదు.

యూపకేతు ఎంతో కోపంతో కేతును కొట్టి భూమిమీద పడే శాడు. ఇటు సుబాహు మాతంగుని కొట్టి అతని చేతులు, కాళ్ళు నరకి భూమిమీద పడేశాడు.

లవణాసురుడు మాయలుచేసి, అనేకమంది దేవతలనుసృష్టించి వారి చేతుల్లో అస్త్రశస్త్రాలను ఉంచాడు. వారు "పట్టుకోండి. పట్టు కోండి, చంపండి, చంపండి" అంటున్నారు. ఈ మాయను చూచి

శత్రుఘ్నుని యోధులు పోట్లాడడంమాని, ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయారు.

శత్రుఘ్నుడు ప్రభువు శ్రీరామచంద్రుని బాణాన్ని. శివుని స్మరించుకొని, ధనస్సు మీద ఉంచాడు. అది సూర్యుడు అంధకారాన్ని పోగొట్టినట్లుగానే ఏ మాయాదేవత యుద్ధంలో కనబడకుండా ఉండేట్లు చేసింది.

ఆ మాయాదేవతల గుంపు ఎక్కడా కనిపించకుండా పోగానే సుబాహుడు యమునిలాగా బయలుదేరిపోయి, లవణాసురుని ఎదురుగా నిలబడి, "రే, దుష్టుడా! ఇప్పుడు నీ త్రిశూలాన్ని సిద్ధం చేసుకో" అంటూ చాలా క్రోధంతో అతని రొమ్ములో గదతో కొట్టాడు. ఆ రాక్షసుడు ఆ అపారమైన తేజస్సును తట్టుకోలేక, మూర్ఛపోయి క్రింద పడిపోయాడు. కైటభుడను బలవంతుడైన రాక్షసుడు లవణాసురుడు మూర్ఛపోయినట్లు తెలియగానే, మండిపడి, త్రిశూలాన్ని తీసుకొని పరుగెత్తి యూపకేతుకేదురుగా వచ్చి, త్రిశూలంతో యూపకేతు రొమ్ములో గ్రుచ్చాడు, అతను కరుణాసాగరుని తలచుకొంటూ పడిపోయి, మూర్ఛితుడయ్యే సమయంలో "రఘుకులంలో శ్రేష్ఠుడవైన రామా!" అని పిలిచాడు.

సుబాహు, సోదరుడు మూర్ఛితుడయినట్లు చూడగానే అమిత కోపం వచ్చింది. అతను ఆపినా అగలేదు. క్రోధంతో అతను మూడు కోట్ల, భయంకరమైన బాణాలు ఒకేసారి వదలాడు.

ఆ రాక్షసుని వ్యాకుల పరచి రఘుకుల దీపకుడైన సుబాహుడు వెంటనే. తన సోదరుని వద్దకు వచ్చాడు. యూపకేతు శరీరంలో బాణాలు గ్రుచ్చుకొని వున్నాయి. అతనికి ఏ మాత్రము తెలివిలేదు, అతను మూర్ఛితుడై నేల మీద పడియున్నాడు.

సుబాహుడు శరీరంలో గ్రుచ్చుకొన్న బాణాలను లాగి బయట

పారవేసి, రామనామ మను శ్రేష్ఠమైన మందును అతని కిచ్చాడు. ఆ నామాన్ని వినగానే అతను సోదరునితో పాటులేచాడు. అతని అంగాలు బాగయిపోయాయి. అప్పుడు యూపకేతు నవ్వి ధనస్సు. బాణాలు చేతి లోకి తీసికున్నాడు.

కైటభ రాక్షసుడు మూర్ఛనుంచి తేరుకొని, యుద్ధము జరుగు చుండడం చూచి, తన సోదరుని సహాయంతో వచ్చాడు. గరుడా! ఆ దేవతల శత్రువంటే యముడు కూడా భయపడుతున్నాడు. అలాంటి తను కూడా ఓడిపోయాడు.

అతను వెళ్ళి తలవంచి, చేతులు జోడించి-"సోదరా! ఇవాళ యుద్ధంలో నా కోరిక నెరవేరింది. రావణుని శత్రువు, రాముని తమ్ముడు, శత్రుఘ్నుని పుత్రుడు బల శీలాల్లోనిధి. కోట్లమంది యోధు లను మనం యుద్ధంలో చంపాము. కాని రాజపుత్రులను చూచి మనము హృదయంలోనే ఓడిపోయాము. స్వామి, శత్రువుల బలాన్ని విని హృదయంలో బాధపడి మమ్ము పంపా"డన్నాడు.

అప్పుడు లవణాసురుడు-"నేను సైన్యమంతటిని యమునలో ముంచివేస్తాను. పుత్రులతో సహా శత్రుఘ్నుని చంపివేస్తాను" అన్నాడు.

యోధులు యుద్ధంలో కోపంతో తలపడ్డారు, పిరికివారు తప్పించు కొని పారిపోయారు. కత్తులు మ్రోగుతున్నాయి. యుద్ధంలో బలవం తులు, వీరులు మొండిగా ఉండిపోయారు.

గుర్రాలను, ఏనుగుల చతురంగ సైన్యాన్ని సిద్ధం వేసికొని నగారాలు మ్రోగించుకుంటూ, ఎంతో కోపంతో లవణాసురుడు యుద్ధ భూమిలోకి వచ్చాడు. శత్రుఘ్నుడు శ్రీరాముని పాదకమలాలను తలచుకొని భయంకరమైన బాణాలను వదలాడు. అవి తగులగానే ఆ రాక్షసుడు నేలమీద, వ్యాకులంతో, మతి లేకుండా పడిపోయాడు.

రాక్షసుని మరణం విన్న దేవతలందరు ఆకాశంలో విమానాల

మీద ఎక్కి వచ్చి, నగారాలు వాయించి, పూలు కురిపించి- "నాథా! ఇవాళ దుఃఖాలన్నీ దూరమైపోయాయి" అన్నారు,

అక్కడ శత్రుఘ్నుడు రెండు అందమైన నగరాలను ఎర్పరచి ఇద్దరు పుత్రులకు అక్కడి రాజ్యాన్ని ఇచ్చాడు. మధురానగరము పేరు. కీర్తిని ప్రపంచ మెరుగు. రెండవదయిన "విదిత' మహిమను వేదాలు గానం చేశాయి.

బల, బుద్ధిలో శ్రేష్ఠుడైన పెద్ద కుమారుడు సుబాహునకు మధురా రాజ్యాన్ని ఏర్పరచాడు. రెండవ పుత్రుడైన యూపకేతును, 'విదిత' నగరానికి రాజును చేశాడు. అది చాలా దూరంలో పశ్చిమంగావుంది.

పుత్రులను దీవించి నగారాలు మ్రోగించాడు. గుర్రము దక్షిణ దిక్కుకు వెళ్ళుతున్నట్లుగా తెలిసికొన్న శత్రుఘ్నుడు, మంత్రి పుత్రులను తన కుమారుల వద్ద వుంచి, సైన్యాన్ని వెంటబెట్టుకొని యమునా జలంలో దిగాడు. యమున పాదాలకు నమస్కరించి, సైన్యము, గుర్రంతో వెళ్ళింది. దేవతలు ఈ చతురంగిణి సైన్యాన్ని చూచి సంతోషంగా పూల వర్షం కురిపించింది,

## 42

సైన్యం మొత్తము, వాల్మీకి ఆశ్రమమున్న వనంలోకి గుర్రంతో సహా, చేరింది. అక్కడ సీత యిద్దరు పుత్రులున్నారు. చాలా బలవంతులు. వారి భుజబలం సూర్యునితో సమానంగా ప్రచండమయినది.

ఆ బలవంతులు వచ్చి, ఆ గుర్రాన్ని చూచారు. పత్రాన్ని చదివి గుర్రాన్ని బంధించారు. ఇద్దరుకుమారులు కూచుని వున్న చోటుకు ఒక వెయ్యిమంది సహాయకవీరులు వెళ్ళారు. గుర్రంను చెట్టు క్రింద కట్టివేసి నట్లుగా చూచి,పిల్లలుకదా అనుకుని అందరు కోపాన్ని ఆపుకొని-"ఆపుకొని-"పిల్లలారా! మీరు గుర్రాన్ని మాకిచ్చి ఇంటికి

వెళ్ళిపోండి. మీ తల్లిదండ్రులు ధన్యులు మిమ్ము కన్నందుకు" అన్నారు. అప్పుడా పిల్లలు– "సోదరులారా! యుద్ధంలోకి వెళ్ళి క్షత్రియ కులానికి కళంకము తెచ్చే బిచ్చమడుగుతున్నారు. క్షత్రియ కులానికి కళంకము తేవద్దు. వీరులు యుద్ధంలోనే శోభిల్లుతారు. మీరు బలహీనులైతే గుర్రాన్ని వదలి, మీ యిండ్లకుతిరిగిపొండి"అన్నారు.

ఇలాంటి కఠోరమయిన మాటలు విని యోధులు వారు బాలకులని తెలిసి కూడా పరుగులు తీశారు. అప్పుడు లవుడుఒక్కబాణంతోనే వారందరి శరీరాలు నుగ్గువేసి వేశాడు.

అప్పుడు శత్రుఘ్నుడు- "హంసల్లాంటి ముని బాలకులారా! మీరు క్రోధాన్ని వదలి గుర్రాన్ని ఇచ్చి వేస్తే. ప్రభువు శ్రీరాముడు మిమ్ము పూజించి తన జన్మను సఫలం చేసికొంటాడు." అన్నాడు.

ఈ మాటలు విని ఇద్దరు –"రాజా! మీ పేరేమిటి? ఏ నగరంలో వుంటున్నారు? సైన్యంతో అడవుల్లో ఎందుకు తిరుగుతున్నారు. మీరు గుర్రాన్నెందుకు వదలారు? ఈ పత్రమెందుకు సోదరా! మీలో పౌరుషము లేకపోతే ఈ గుర్రాన్ని, పత్రాన్ని వదలివెళ్ళండి" అన్నారు.

ఇంత తీక్షణమైన మాటలువిని శత్రుఘ్నుడు సిగ్గుపడి– "అస్త్రాలు పట్టుకొండి" అని నవ్వాడు

"బలవంతులమైన మమ్ము రెచ్చగొడుతున్నారు. ఎక్కడైనా. ఎప్పుడైనా సింహం చప్పట్లు కొట్టితే భయపడుతుందా?" అంటూ ధనస్సు, బాణాలు చేతిలోకి తీసికొని, ముని పాదాలను మనస్సునందుంచుకొని, రథాన్ని, సారధి, గుర్రాన్ని కొట్టారు. అంగాలన్నింటిలో కోట్ల బాణాలు గుచ్చుకొన్నాయి.

ఇద్దరు కుమారులు ఒక్కొక్క శూరుని యుద్ధంలో సవాలుచేసి కొట్టారు. క్రూరకర్ములైన పిరికి వారందరు పరుగెత్తి శ్రీరామున్ని

వద్దకు వెళ్ళారు! శ్రీరాముడు వారిని అడిగాడు. వారు శతృఘ్న గుణా లన్ని వర్ణించారు. రాముడప్పుడు "మీరందరు లక్ష్మణునితో పాటు వెళ్ళి, ముని బాలకులను బలవంతంగా బంధించండి. వారిని కొట్ట వద్దు. నగరంలోకి తీసుకురండి. ఎందుకంటే, ఋషిబాలకులను కొట్టడం ఉచితం కాదు" అన్నాడు.

లక్ష్మణునితో అపారమైన సైన్యము వెళ్ళింది. వెంటవే ఘోర మైన యుద్ధం జరిగిన చోటుకు వెళ్ళారు.

"ముని బాలకులారా! మీ ప్రాణాలు దక్కించుకొని ఇంటికి వెళ్ళండి. సూర్యవంశ దేవత, బ్రాహ్మణుల రక్షకుడైన శ్రీరాముని దది. బిడ్డలారా! ఇప్పుడింకా మీరు కళ్ళు కూడా బాగా తెరువని వయస్సులో వున్నారు వెళ్ళండి, ఇంకా ఉన్నారంటే నాకు కోపము పెరిగిపోతుంది." అన్నాడు లక్ష్మణుడు.

లక్ష్మణుని శ్రేష్ఠమయిన మాటలు విని వీరబాలకులిద్దరు నవ్వి- "మహారణ ధీరుడా! మీరు మీ తమ్ముని పరిస్థితిని చూచుకొని ఇంటికి వెళ్ళండి." అన్నారు.

"రే, మూర్ఖులారా! మీరు మీకు సహాయం చేసేవారిని పిలుచు కొచ్చుకోండి. కేవలం మిమ్ము కొట్టి నందు వలన ప్రయోజనం లేదు." అన్నాడు లక్ష్మణుడు.

ఈ మాటలు విని కుశుడు భయంకరమయిన బాణాన్ని ఎక్కుబెట్టాడు. భూమి కంపించిపోయింది, శేషుడు గాబరాపడ్డాడు.

గరుడా! బాణాలు బాణాలను నరికివేస్తున్నాయి. అనేక లీలలు జరుగుతున్నాయి. ఇద్దరు వీరులు మల్లయుద్ధం చేస్తున్నారు. సంతోషంగా పోట్లాడుతున్నారు, ఓటమిని ఒప్పుకోవడం లేదు."

లవుడు వజ్రంతో సమానమయిన ఒక గుద్దు లక్ష్మణుని గుద్దాడు. ఆయన వ్యాకులంతో మనస్సులో ఓటమిని ఒప్పుకున్నాడు. మరల

లక్ష్మణుడు శ్రీరాముని స్మరించి బాణంతో లవుని వ్యాకుల పరచి పడ గొట్టాడు. సీతను, ముని పాదాలను స్మరించి లవుడు మూర్ఛ నుండి తేరుకొని తొందరగా పరుగెత్తి, మేఘనాధుడు మొదలైన శత్రువులను చంపిన బాణాలను ఆ బాలకులు విరుగొట్టి భూమి మీద పడవేశారు.

లక్ష్మణుడు బలవంతులైన శత్రువులను చూచి చాలా వ్యాకుల పడటమే కాకుండా, ఆశ్చర్యపోయాడు కూడా, హృదయంలో సీత త్యాగం యొక్క శోకం మెండుగా వుంది. "ఏ విధంగా ప్రాణాలను వదలివేయాలి?" అని అతను ఆలోచిస్తున్నాడు

ఆ సమయంలో కుశుడు, ముని వాల్మీకి మంత్రము చదివి యిచ్చిన బాణాన్ని తీసుకున్నాడు. భూమి, ఆకాశం, పాతాళంలో ఆ బాణమును వదలితే ఏ జీవి బ్రతుకదు. అతను బాణాన్ని ఎక్కుపెట్టి లక్ష్మణుని హృదయంలో కొట్టాడు. ఆయన మూర్ఛపోయి నేలమీద పడిపోయాడు. అతనికి తెలివిలేదు. అప్పుడు సైన్యమంతా పారిపోయి అయోధ్యలోకి వచ్చి కేకలు పెట్టింది.

సైన్యము యుద్ధకథంతా వర్ణించింది. ఏ విధంగా వీర లక్ష్మణుడు భూమిమీద పడిపోయిందీ వివరిస్తూ "నాథా! వారు సైన్యమంతటిని ఏ విధంగా సంహరించింది మేము కళ్ళారా చూచాము" అన్నారు.

భరతుడు చేతులు జోడించి, అతి దుఃఖంతో –"బ్రహ్మ సీతా తల్లి త్యాగఫలాన్ని మనకు ప్రసాదించాడు" అన్నాడు.

"సోదరా! నీ హృదయము యుద్ధంనుండి ఓడిపోయిందా? యుద్ధమంటే నీకు భయమేస్తుందా? మదించిన ఏనుగులను, గుర్రాలను, రథాలను సిద్ధం చెయ్యి. నీవు యజ్ఞం వద్ద వుండు. నేను వెళ్ళి

చూస్తాను. ఆ బాలకులు రావణునితో సమానమైన దుఃఖకారకులుగా వున్నారు" అన్నాడు.

ఇలాంటి తీక్ష్ణమైన మాటలు విన్న భరతుడు సిగ్గుతో బాధ పడ్డాడు. శ్రీరామచంద్రుడు అనేక రకాలుగా ఆయనను గౌరవించి- "ముందు సఖులందరిని, హనుమంతుని, అంగద మొదలైన వారిని పిలువు. జాంబవంత, సుగ్రీవ, విభీషణ, ద్వివిద, మయంద, నీల మొదలైన కులభూషణులను వెంటబెట్టుకొనివెళ్ళి, శత్రువులను చంపి లేదా యుద్ధం నుండి పారద్రోలి, మీ యిద్దరు సోదరులను వెంట బెట్టుకొనిరా" అన్నాడు.

ఆ సమయంలో బలమైన సీత బిడ్డలిద్దరు యుద్ధభూమిలో కొచ్చారు. వారిని చూచి ఎలుగుబంట్లు, వానరులు భయపడ్డారు, అపుడు హనుమంతుడక్కడకు వచ్చాడు.

ఇద్దరు సోదరులు భయంకరమైన యుద్ధంచేసి వానరులను యుద్ధంలో జయించారు. బ్రహ్మ వ్యతిరేకి అయినాడని తలంచి భర తుడు యుదభూమిలోకి వచ్చాడు.

వానరులు, ఎలుగుబంట్లు వ్యాకులంగా ఉన్నారు. బాగా దెబ్బల వలన బాధపడుతున్నారు భరతుడు జాంబవంత, సుగ్రీవ, అంగద, హనుమంతు మొదలైన సహాయక వానరులను పిలిచి "మీరందరు కలసి విభీషణునునితో వెళ్ళి, ఆ యిద్దరు బాలకులను పట్టుకురండి" అన్నాడు.

"పార్వతీ! ఎలుగుబంట్లు, వానరులు వచ్చి ప్రోగయారు. వారు రాముని మహిమను తెలిసికోలేక పోయారు"

"అంగదా! నీ బలాన్ని లోకమంతా ఎరుగు. తండ్రిని చం పించి, తల్లిని మరొకరి యింట్లో వుంచి, లజ్జను అవలపెట్టి నీవు

వచ్చావు. దాని ఫలితం ఇవాళ యుద్ధంలో అనుభవించు, కళంకం మొత్తాన్ని పోగొట్టుకో" అన్నాడు కుశుడు.

ఈ మాటలు వినేసరికి అంగదునకు చెప్పలేనంత కోపం వచ్చి, ఒక కొండను తీసికొని వారిమీదకురికాడు. విశాలమైన పర్వతం వస్తూ వుండడం చూచిన కుశుడు, దానిని బాణంతో నరికి, నువ్వుగింజల్లాగా చేసివేశాడు. అంగదునకు అపారమైన గర్వమున్నట్లుగా నే ప్రభువు తగిన ఫలం చూపాడు.

కుశుడు అమిత కోపంతో గురిచూచి బాణం వేశాడు. అంగదు, నీలులను అ బాణం ఆకాశంలోకి ఎగురగొట్టేసింది. వారు మరల భూమి మీదకు పడుతూ ఉన్నప్పుడు చూడగానే మాటిమాటికి రెచ్చగొట్టి వారిని బాణాలతో కొట్టాడు.

వారు కాసేపు భూమిమీదపడుతున్నారు, కాసేపు ఆకాశంలోకి ఎగురుతూ-"ప్రభూ! మేము మీ శరణుజొచ్చాము. మాకు మా బలమంటే చాలా గర్వముంది. సంసారానికి స్వామీ! మేము మిమ్మ గుర్తించలేదు" అన్నారు. అప్పుడు కుశుడు అయిదు బాణాలు వదలి, ఇద్దరిని కొట్టి, దీనులని తెలిసికొని నవ్వివదలివేశాడు. జాంబవంతుడు హనుమంతుడు మొదలైనవారు వృక్షాలు, పర్వతాలు తీసుకొని పరుగెత్తారు.

లవుడు సుగ్రీవుడు మొదలైన సేనాపతులను కొట్టి పడగొట్టాడు. సేనంతా నాశనమయిపోవడం చూచిన భరతుడు లవుని రొమ్మున బాణం కొట్టాడు. లవుడు మూర్ఛవచ్చి పడిపోయాడు.

ఇది చూచిన కుశునకు ఎంతో కోపమువచ్చి, ధనస్సుమీద బాణమెక్కుపెట్టి, చెవి వరకులాగి, భరతుని హృదయంలో వంద బాణాలు కొట్టాడు. భరతుడు మూర్ఛపోయి యుద్ధంలో పడిపోయాడు. కుశుడు లవుని హృదయానికి హత్తించుకున్నాడు. గురువు,

తల్లిని తలచుకొంటూ ఇద్దరన్నదమ్ములు యుద్ధంలో గెలుస్తున్నారు.

నలుగురు దూతలు కబుర్లు తెచ్చారు. వారు భరతుని సైన్యమంతటిని చూచారు. వారు నెత్తుటేరులు చూచిభయపడ్డారు. అందులో గుర్రాలు, ఏనుగులు, రథాలు కొట్టుకుపోతున్నాయి.

దూతలు అయోధ్యకు తిరిగివచ్చి సమాచారమంతా చెప్పారు. దూతల మాటలు విన్న శ్రీరామునకు బాధ కలిగి, యజ్ఞాన్ని వదలి సైన్యాన్ని ఆయత్తపరచి, ఉదారుడైన శ్రీరాముడు కోపంతో అక్కడకు వెళ్ళాడు. అక్కడ సైన్యమంతా చచ్చిపడివుంది. అంతమైల ఆ ముని బాలకులకు తలవంచి, దగ్గరకు పిలిచి–"మీరు మీ తల్లిదండ్రుల పేర్లు చెప్పండి. మీ దేశం, మీ గ్రామం పేర్లుకూడాచెప్పండి మీరు పెద్ద యుద్ధాన్ని చేసి గెలిచారు" అన్నాడు.

"శస్త్రాలు పట్టుకొని, కథంతా చెప్పు. స్వర్గంలోకి వెళ్ళినపుడు అంతా తెలిసికో" అన్నారిద్దరు బాలకులు.

"మీ వంశము, పేర్లు తెలిసికోకుండా మీ అందమైన శరీరాల్లో నేను బాణాలు వేయను. నేను బాణాలతో మిమ్ము కొట్టను" అన్నాడు శ్రీరామచంద్రుడు.

"మా తల్లిపేరు సీత. ఆమె జనకుని పుత్రిక. మమ్మ వాల్మీకి పెంచాడు. మేము ఇప్పటికి తండ్రి వంశాన్ని ఎరుగము. రామా! మా పేర్లు లవకుశులు" అన్నారిద్దరు బాలకులు.

ఈ కథంతా విని శ్రీరామచంద్రుడు మనస్సులో ఆలోచించి–"వీరిని కొట్టడం ఉచితం కాదు" అనుకొని–

"మా సైనిక యోధులు వచ్చి, మీతో ఆనందంగా యుద్ధం చేస్తారు" అని రాముడని అంగద, నీల, జాంబవంత, సుగ్రీవ మొదలైన సేనాపతులను పిలిచాడు. అప్పుడు బలవంతుడైన లవుడు.

జాగ్రత్తపడి, ధనస్సు, బాణాలు తీసికొని పరుగెత్తి విభీషణునకు ఎదురుగా వచ్చి ఎంతో క్రోధంతో-"మూర్ఖుడా,విను నీవు సోదరునితో పోట్లాడి. భయపడి శత్రువునితో కలిశావు. నీ పెద్ద సోదరుడు తండ్రితో సమానుడు, అని పిలవి నీ యుద్ధభూమిలో నా ఎదుటకువచ్చి బడాయిలు కొట్టడానికి సిగ్గేయడంలేదా? నా కళ్ళ యెదుటనుండి వెళ్లిపో. లేకపోతే నీకు చావు దగ్గరకు వచ్చినట్లే" అన్నాడు.

లవుడు అన్న మాటలువిన్న విభీషణుడు మండిపడి చేతిలోకి గద తీసుకున్నాడు. లవుడు దాన్ని బాణంతో కొట్టి ముక్కలు ముక్కలు చేసేశాడు. విభీషణుడు పడిపోతూ, కోపం తెచ్చుకొని త్రిశూలం విసరికొట్టాడు. అది లవుని శరీరంలో మెరుపులాగా జొరబడింది.

ఇద్దరు సోదరులు త్రిశూలాన్నిలాగి క్రోధంతో బాణాలతో కొట్టారు, దాంతో జాంబవంతుడు, కపిరాజు సుగ్రీవుడు, నల, అంగద మొదలైన వారందరు విలపించారు.

వానరులు వృక్షాలు, పర్వతాలు తెచ్చివేస్తున్నారు. కుశలవులు బాణాలతో వాటిని దుమ్ముతో సమానంగా ఎగురగొట్టి వేస్తున్నారు. వారు తమ బాణాలతో వానరులను గాయపరచి, ఎవరికి తగిన బుద్ధి వారికి చెప్పారు.

లవుడు హృదయంలో గురిచూచుకొని బాణంతో కొట్టేటప్పటికి సుగ్రీవుడు ఏడు ఆమడల దూరాన పడిపోయాడు. అప్పుడు వానరులు, ఎలుగుబంట్లు పరుగెత్తారు. కుశుడు మల్లయుద్ధం చేశాడు. తన బలంతో కుశుడు జాంబవంతుని నేలమీద పడగొట్టాడు. రెండు చేతులు, కాళ్ళు కట్టి పడవేశాడు. తరువాత హనుమంతుని బంధించి గుర్రం వద్ద వుంచాడు. కుశుడు లవుని కాపలావుంచి స్వయంగా

రాముని వద్దకు వెళ్ళాడు.

రాముడు నిద్రబోతున్నాడు. అది చూచి కుశుడు సిగ్గుతో తిరిగి వచ్చాడు. వారు అందమైన వస్త్రాలు, ఆభూషణాలు గుర్రంమీద ఉంచి, హనుమంతుని వెంటబెట్టుకొని వెళ్ళారు.

హనుమంతుని, జాంబవంతుని అందమైన, శుభవస్త్ర అభూషణాలు, గుర్రాన్ని తీసికొని కుశుడు వెళ్ళాడు. సీత వద్దకు వచ్చి తల వంచాడు. ఇద్దరు బిడ్డలు కానుకలు చక్కగా ముందుంచారు. ఇద్దరు వానరులను గుర్తించి, ఆభూషణాలను చూచి సీత సంకోచించి భయపడింది. ఆ సమయంలో వాల్మీకి కూడా గాబరాతో వచ్చాడు. సీత లేచి ఆయనకు నమస్కరించింది.

హనుమంతుని, జాంబవంతుని బంధనాలను విప్పి వారికి అనేక రకాలుగా తెలియజెప్పి-" లక్ష్మణ. భరత, శత్రుఘ్నులందరిని యుద్ధంలో పడగొట్టారు" అంటూసీత-"బిడ్డలారా! మీరు కులానికి కళంకమొచ్చు పనిచేశారు. నన్ను బ్రహ్మ విధవను చేసివేశాడు. ఇపుడు శోకాన్ని వదలి చందనము, అగరువత్తులు తెండి. నేను నా భర్తతో భస్మమైపోతాను" అంది.

ముని జానకికి ధైర్యం చెప్పి, పుత్రులను వెంటబెట్టుకొని ఆదరంగా వెళ్ళియుద్ధంలో బాలకుల బాకచక్య చరిత్రను తెలిసికొని. సంతోషించాడు. శ్రీరాముని రథాన్ని, గుర్రాలను గుర్తించి ప్రభువు పాదాలమీద పడి-"కోసలనాథా! కూచోండి. మీ పుత్రులుదుఃఖంతో మీముందు నిలబడియున్నారు" అన్నాడు.

ముని కోమలమైన పలుకులు విని. సర్వుల భయాలను దూరం చేసే శ్రీరామచంద్రుడు నిద్రనుండి లేచి నవ్వుతూ కళ్ళు తెరచి మునిని కౌగలించాడు.

లక్ష్మణుడు సీతను వనానికి తీసుకొచ్చిన విధమును వివరిం

చాడు. మహాదేవుని. బ్రహ్మను, సూర్యుని సాక్షిగా పెట్టుకొని లవ కుశల కథంతా వర్ణించాడు.

శ్రీరాముడు పుత్రులిద్దరిని హృదయానికి హత్తుకొని కలిశాడు. దేవతలు అమృతాన్ని కురిపించి సైన్యం మొత్తాన్ని బ్రతికించారు. భరతుడు మొదలైన సోదరులందరు మేల్కొన్నారు. లక్ష్మణుడు తల్లి సీత వద్దకు వెళ్ళాడు

శ్రీరాముడు లక్ష్మణుని తన వద్దకు పిలిచి-"సోదరా! నీవు నా ఈ మంచి మాటలు విను. నా మాటల ప్రకారం నీవు సీత వద్దకు వెళ్ళి ప్రతిజ్ఞ చెయ్యి" అన్నాడు.

లక్ష్మణుడు వెళ్ళి సీత పాదాలవద్ద తలవుంచి క్షేమాలు విని పించి, ఆమెకు అనేక విధాలా తెలియజెప్పాడు. భగవంతుని ఇష్ట ప్రకారం సీత మనస్సులో కూడా అలాంటి ఉద్దేశ్యమే కలిగింది. శేషనాగుడు వచ్చి, వేయిపడగలు చూపి మణులతో పొదిగిన సింహా సనం మీద సీతను కూచోబెట్టి పాతాళలోకంలోకి కనబడకుండా వెళ్ళాడు. ఆ మహిమను ఎలా చెప్పాలి?

లక్ష్మణుడు నిలబడియే అన్ని లీలలు చూచాడు. ఆయన కళ్ళ నుండి కన్నీళ్ళు కారుతూ ఉన్నాయి. శ్రీరాముడు ఈ చరిత్రను విని మనస్సులో-"సీత నా ప్రవర్తనను తెలిసికొన్నది" అని చింతించాడు.

పుత్రులతో సహా శ్రీరాముడు అయోధ్యకు వచ్చి, ఆహ్వానిం చిన మునుల సమూహాన్ని పంపించారు. జనకుని పూజించి ఆయనను పంపారు. ఇద్దరి గురువులను పూజించి చరణోదకముపుచ్చుకున్నాడు.

ఈ విధంగా బాలాకాలము గడచిపోయి తన ఇంటికి రావడా నికి వీలు కుదిరింది. గడువు పూర్తయినదని తెలిసికొన్న బ్రహ్మ నారదమునితో-"శ్రీరాముడు తన భవనానికి రావాలనుకుంటున్నాడు యమధర్మరాజును పిలిచి చెప్పు" అన్నాడు.

యమధర్మరాజు వచ్చాడు. బ్రహ్మ చాలా గౌరవించి శ్రీరామచం ద్రుని హృదయంలో ఉంచుకొని వెళ్లాడు.

యమధర్మరాజు అందమైన, తేజోవంతమైన, యువకముని రూపం దాల్చి అయోధ్యలోకి వచ్చాడు. ఆయన నడుమునఅందమైన మృగచర్మము శోభాయమానంగా వుంది.

అయన వచ్చిన సంగతి లక్ష్మణుడు వెంటనే ప్రభువుకు చెప్పా డు. వినగానే రాముడొచ్చి, మునిని చూచి నమస్కరించి, కూచోమని అదరంగా చెప్పి ఆసనము చూపించి, అర్ఘ్యమిచ్చి అందమయిన ఆస నం మీద కూచోబెట్టాడు. అప్పుడు ముని–"సర్వజ్ఞా! కృపాళూ!సూర్య కుల స్వామీ! నేను ముని వేషంలో వచ్చాను. ఇక్కడ మనమిద్దరము మాత్రమే ఉండాలి. మూడవవాడు వింటే అతనునాశనమయిపోతాడు. స్వయంగా మహాదేవుడు, బ్రహ్మ, హరి అయినా నా మాటలు వింటే నేను వారినయినా శపిస్తాను"అన్నాడు.

అప్పుడు శ్రీరాముడు–"లక్ష్మణా! నీవు వెళ్ళిద్వారం వద్దకూచో ఎవరిని రానివ్వద్దు, మాట్లాడకూడదు. అప్పటికీ ఎవరైనా వస్తే తప్ప కుండా చచ్చిపోతారు. ఇది నిజమయిన విషయము"అన్నాడు.

తాపసి తియ్యని పలుకులు పలికాడు–"రఘునాథా! రక్షించు, రక్షించు. "అంటూ పరమ పావనమైన స్థానానికి వెళ్ళే చరిత్రనంతా చెప్పి, మరల తలవంచి నమస్కరించాడు.

పరమేశ్వరుని యిష్టము, కాలముతీరు బలవత్తరమయినవి. అదే సమయంలో దుర్వాసముని అక్కడకు వచ్చాడు. మునిని చూచి లక్ష్మ ణుడు ఎదురుగా వెళ్ళి కలిసికొని, ప్రేమతో మనవి చేశాడు.

"లక్ష్మణా! శ్రీరాముడెక్కడున్నాడు? నేనాయన వద్దకు వెళ్ళాలి. నీవు ఎదురు చెప్పావంటే నేను మీ ఇండ్లను, నగరాన్ని, రాజ్యాన్ని భస్మం చేసేస్తాను."అన్నాడు దుర్వాస ముని కోపంగా.

ముని వచనాలు విన్న లక్ష్మణుడు వణికిపోయాడు- "పార్వతీ! లక్ష్మణుడు తన మరణం సంగతి తెలిసి కూడా వెళ్ళి, రెండు చేతులు జోడించి ప్రభువుతో- "మహారాజా! దుర్వాసమునిరావాలనుకుంటు న్నాడు"అని చెప్పాడు లక్ష్మణుడు.

"సోదరా! నీవు చేయకూడని పొరపాటు చేశావు. కానున్నదికాక మానదు. కాలకర్మగతులు ఆగవు"అన్నాడు. గరుడా! ఇప్పుడిక ముందు కథ చెప్తాను, విను.

"మునిని వెంటనే ఆదరంగా తీసుకురా"అన్నాడు శ్రీరామచం ద్రుడు. లక్ష్మణుడు వెళ్ళి-"మునీ! మీరు తొందరగా దయచేయండి. శ్రీరఘునాథుడు రమ్మంటున్నాడు"అని చెప్పాడు.

చాలా తేజోవంతుడైన ముని వస్తున్నది చూచి, లేచి ఉచితా సనం చూపించి, నీళ్ళు తెచ్చి ఆదరంగా కాళ్ళు కడగి, మీ చరణా మృతాన్ని పానానికి, ఆజ్ఞయివ్వండి.'' తర్వాత నేనేమి చేయాలో ఆజ్ఞ యివ్వండి అన్నాడు. ముని- ''దయసాగరా! నేను వ్రత కార ణంగా, ఆకలితోఉన్నాను. ఆకలితో వస్తున్నాను" అన్నాడు.

శ్రీరామచంద్రుడు ముని మనస్సుకు నచ్చిన భోజనాలతోతృప్తి పరచి అనేక విధాల వినయం చూపాడు. సంతోషంగా ఆశీర్వదించి స్తుతించాడు. రాముడు మునిని సాగనంపి లక్ష్మణుని వైపుచూచి,శ్రీరా ముడు ఎంతో దుఃఖపడ్డాడు. ఆ సమయంలో భరతుడు మొదలైన సోదరులు, ప్రజలతో సహా వారిని చూడవచ్చారు.

అందరు పాదాలకు నమస్కరించి, రెండు చేతులు జోడించి నిల బడ్డారు. భగవంతుని ముఖం చూచి భయంతో వణకిపోతున్నారు. కమ లాల్లాంటి కళ్ళల్లోకన్నీళ్ళు నింపుకొని,దుఃఖంతో భరతునితో ప్రభువు "ఆదరంగా గురువుగారిని తొందరగా పిలుచుకురా" అన్నాడు. భర తుడు దుఃఖంతో తొంటరగా వెళ్ళి, సమాచారమంతా గురువుగారికి

చెప్పాడు గురువు విమానం మీద ఎక్కి వచ్చాడు.

గురు వసిష్ఠుడు వచ్చినట్లు తెలిసి శ్రీరాముడు, ఆయన సోద రులు లేచి గురువు పాదాల మీదపడ్డారు. కథంతా విని మునీశ్వరుడు, శ్రీహరి ఇప్పుడు శరీరాన్ని త్యజిస్తాడ'ని తెలిసికున్నాడు.

లక్ష్మణుడు ఆ మాటలు విని తన హృదయంలో– "రామచం ద్రుడు లేని జీవనం వృధా" అనుకొని గురువుగారి పాదాలను త్రాకి, సరయూనది ఒడ్డుకు చేరి, శుభాన్ని కలిగించే పవిత్రమైన నీళ్ళనుచూచి నడుము వరకు నీళ్ళ మధ్య నిలబడి అఖండ ధ్యానంలో మునిగిపో యాడు. యోగక్రియతో శ్రీరాముని ధ్యానించి తన బ్రహ్మాండాన్ని పగుల గొట్టాడు.

శ్రీరాముని నాల్గువభాగం అయిన లక్ష్మణుడు వెంటనే శ్రీరాము డున్న చోటుకు చేరుకున్నాడు. ఇది విని భరతుడు,శ్రీరాముడు. చాలా బాధ పడ్డారు, వారి సంతోషమంతా మటుమాయమయి పోయింది.

"నేను సోదరుని త్యజించలేదు. కాని సోదరుడు నన్ను త్యజిం చాడు. నేను ఇప్పుడు సోదరుని చూచు ప్రయత్నం చేస్తాను. భరతా! నీవు సుఖంగా రాజ్యం చెయ్యి" అన్నాడు. ఈ మాటలు వినగానే భర తుడు వ్యాకులంతో నేలమీద పడిపోయి-"నాథా! ఇప్పుడు ప్రాణాలు ఉంటవలచడం లేదు. ఎందుకంటే లక్ష్మణుడు లేకుండా ఇవి క్షణం కూడా ఉండలేవు" అన్నాడు.

"సోదరా, పద" అంటూ రామచంద్రుడు పుత్రులను పిలచి రాజ్యాభిషేకం చేసి, వారికి నీతులు నేర్పాడు.

అందరికి అన్ని విధాల ధైర్యమిచ్చి స్వయంగా సరయూనది ఒడ్డుకు వెళ్ళాడు. కుడివైపు భరతుడు,ఎడమవైపు శత్రుఘ్నుడున్నాడు. వెనుక నగర ప్రజలు, కుటుంబీకులు వెళ్ళారు.

విమానాల మీద ఎక్కి అందరు శ్రీరామచంద్రుని నివాసస్థానా

నికి వెళ్ళేటప్పుడు, అందరు ఐశ్వర్యాలతో ఇంద్రుని కూడా ఎగతాళి చేశారు. ఆకాశం నుండి పూలవర్షం కురిసింది, నియమంగా వేదాలు గానం చేశాయి.

వేదోచ్చారణ చేస్తూ, ఆనందించు భరతుని శ్రీరామచంద్రుడు నవ్వుతూ తనలో కలిపి వేసి కొన్నాడు. శత్రుఘ్నుడు నీళ్ళను తాకి పద్మరూపమయి శోభయమానంగా ఉన్నాడు. వానరులు మొదలైన వారు, ప్రభువు సఖులందరు తమతమ లోకాలకు వెళ్ళిపోయారు. సుగ్రీవుడు మాటిమాటికి భగవానుని పాదాలకు నమస్కరించి సూర్యలోకానికి వెళ్ళాడు.

దేవతల సహితంగా సూర్యకుల భూషణుడు శ్రీరామచంద్రుడు నీళ్ళల్లో నిలబడి బ్రహ్మను పిలచి-"నీవు ఒక్క నెల వరకు సరయూ నది ఒడ్డున నివసించి, నా పట్టణములోకి వచ్చిన ప్రాణులన్నింటిని అందమయిన విమానాల్లో ఎక్కించి పంపు, వారు నిర్వాణాన్ని పొంది నన్ను కలిసికొంటారు." అని పవిత్రమయిన మాటలు చెప్పాడు.

ప్రభువు ఇలా అన్ని విషయాలు చెప్పి. మేఘాల్లోని మెఱుపు కనబడకుండా పోయినట్లుగా, కనబడకుండా వెళ్ళాడు.

ఆకాశంలో దేవతలు జయ జయ ధ్వనాలు చేశారు. రామచంద్రుడు సంసారంలోని జీవులను వెంటబెట్టుకొని, తన స్థానానికి వెళ్ళిపోయాడు. ఈ కథను కృపానిధి అయిన మహాదేవుడు (శివుడు) ఆదరంగా శ్రీరాముని హృదయంలో ఉంచుకొని పార్వతితో చెప్పాడు.

"పార్వతీ! భక్త సమాజముతో కలిసిమెలసి వున్నప్పుడు కలుగు లాభంతో సమానమైన లాభం మరొకటి లేదు. అదయినా భగవంతుని కృపలేనిది ప్రాప్తించదని వేదాలు, పురాణాలు చెబుతున్నాయి.

ఈ కథను ప్రేమ, విశ్వాసాలతో, ఎల్లప్పుడు చదివిన, విన్న చెప్పిన మనుష్యునకు శ్రేష్ఠమయిన భగవంతుని భక్తి ప్రాప్తిస్తుంది మునులకు కూడా అసాధ్యమయిన ఆ భక్తి, శ్రద్ధ, విశ్వాసాలతో ఈ కథను విన్నవారికి, మరొక ప్రయత్నమేమీ చేయకుండానే లభిస్తుంది.

ఈ విధంగా కథనంతటిని విని, శ్రీరామచంద్రుని హృదయంలో నిలుపుకొని, భుశుండి పాదాల వద్ద తల వుంచి, నమస్కారం చేసి గరుడుడు వైకుంఠానికి వెళ్ళిపోయింది.

కలియుగంలో కల్మషాలన్నింటిని ధ్వంసం చేసే రామచరిత యొక్క ఎనిమిదవ సమాప్తం.

లవకుశ కాండము

తులసీరామాయణం సమాప్తం.

